శ్రీ

గణాధిపతయే నమః

శ్రీరామభద్రాయ కరుణాసముద్రాయ నమః

# రామాశ్వమేధము

## ప్రథమాశ్వాసము



రాజజ్జనకాత్మజా తనులతా♦శ్లేషాభిరామంబు, ద
త్తాస్ఫారానూనపయోధరస్తబక వి♦భ్రాజం, బమేయేప్సితా
సారం, బన్యదురాసదంబు, సుమన♦స్సంసేవ్యమైయొప్పు త
చ్ఛ్రీరామామరభూరుహంబు మది నే ♦ సేవింతు నశ్రాంతమున్.

చ॥ సదమలభక్తి మ్రొక్కెద, ని♦శాకరశేఖరసూతికి, న్నగజే
ద్వదనున కిద్ధ్రిజావసన♦పంకజమిత్రున కర్చకేప్సిత
ప్రదునకు, నాఖుయాయికిఁ బు♦రందర ముఖ్యసుపర్వ సంస్తవా
స్పదునకు, విఘ్నహర్తకును ♦ భక్తమహాకలుషప్రహర్తకున్. ౨

సీ॥ సురసంశ్రిత గరు♦త్కరి విభ్రితిమిర హ్రా, త్సమగాత్రి యే కంజ♦విమలనేత్రి
విలులిత సుమరస ♦ విచికిలకలవచః, కలనచే మించు నే ♦ కలభయాన
భవరమాధవ శచీ♦ధవముఖ్య విబుధసం, స్తవనీయచరిత యే♦భువనమాత
చామరాంచత్కర ♦ సౌరనారీవార, సంసేవ్యమాన యే ♦ చంద్రవదన

తే॥ ఆపృథుశ్రోణి, కలవాణి, ♦ యజునిరాణి, అబ్దనిభవేణి నాజిహ్వ ♦ నధివసించి
ఇక్షుమౌక్తిక ద్రాక్షాస♦దృక్షములగు, నుడులఁ బలికించుఁగాతఁ బ్రే♦ముడి దలిర్ప.

శా॥ ఏ సర్వజ్ఞుఁడు శంభు శంకరులటం ♦ చీడ్యాఖ్యల న్మీరె బల్
వాసిం జెందెను సర్వమంగళయనన్ ♦ భవ్యాఖ్య నేదేవి యె
ప్డా సంక్రందన ముఖ్యమౌళిమణిదీ♦వ్యత్పాదులన్ భక్తితో
నే సేవింతుఁ బురాణదంపతుల నా ♦ యిష్టార్థ సంసిద్ధికై. ౪

శా॥ నానారత్న విచిత్రపీఠిక నమూ♦నప్రేమ నాసీనులై
ఆనందంబునఁ జొక్కు చొండొరుల న♦ర్మాలాపముల్ పల్కుచున్
ధ్యానాసక్త సమస్తభక్తవరులన్ ♦ దన్పంగ నూహించు ల
క్ష్మీనారాయణు లిచ్చుఁగాత సకల♦శ్రేయంబు లెల్లప్పుడున్. ౫

తే॥ యజ్ఞభుగ్జేష్ఠుఁ డఖిల వి♦ద్యాధినాథుఁ, డమల మానీశ్వరపరీతుఁ ♦ డబ్జభవుఁడు
తామరసగర్భుఁ డా శారదా♦సనాథుఁ,డజుఁ డొసంగుత వాక్ప్రౌఢి♦మాతిశయము.

మ॥ మతికందోఁచని గ్రంథసంతతికి స♦న్మాన్యంబుగా భాష్య మూ
ర్జితబుద్ధిం దగఁజేసి విశ్వవిజయ♦శ్రీనొంది వ్యాపించు దు
ర్మతముల్ ఖండనఁజేసినిల్పి కడుధ♦ర్మంబెందుఁ బేరొందు నా
యతివర్యుల్ నతు లేనొనర్చెదను వి♦ద్యాశంకరుల్ శంకరుల్. ౭

తే॥ రామభక్తులు ననుఁగన్న ♦ రామలక్ష్మి, లక్ష్మినారాయణులకును ♦ లలినిఁబెంచి
నట్టి సూరమ సూర్యనా♦రాయణులకుఁ, జేతు వందనశతములు ♦ జేతులెత్తి. ౮

సీ॥ వ్యాస వాల్మీకి వి♦శ్వామిత్ర తాపస, కవిసార్వభౌముల ♦ కరుణఁ గోరి
భారవి శ్రీహర్ష ♦ భవభూతి శంకర, కాళిదాసాది స♦త్కవుల నెన్ని
నన్నయ తిక్కన ♦ నాచనసోమభా,స్కర పోతనా ద్యాంధ్ర♦కవులఁ దలఁచి
అష్టదిగ్గజములం ♦ చభినుతిఁగాంచిన, పెద్దనాదులనెల్లఁ ♦ దద్దపొగడి

తే॥ కూచిమంచి కులాంబుధి♦కువలయాప్తుఁ,దిమ్మకవిచంద్రుఁ గవితను♦నెమ్మిఁబొగడి
తత్కృత గ్రంథరచనావి♦ధాస్ఫురణకు, నందఱికిఁజేతు సాష్టాంగ♦వందనములు.

ఉ॥ తప్పులుఁ గొన్నియుండెఁ గవి♦తల్లజసత్కృతులం దటంచు మున్
జెప్పరె నాప్రబంధమునఁ ♦ జెప్పఁగనేలను వేర తప్పులా
కుప్పలుగాఁగనుండు నవి ♦ కూరిమి నొప్పులుఁగా గ్రహించుచే
గొప్పతనంబునుండు మిముఁ ♦ గోవిదులార యుపాస్తిఁ జేసెదన్. ౧౦

తే॥ మీరి కవిపుంగవులమీఁది ♦ మీఁదికేఁగి, వేచి యెప్పుడు రంధ్రముల్ ♦ వెతకునట్టి
కుకవి కాకంబులను లెక్కఁ ♦ గొనఁగనేల, దరికిఁ జేరంగనీయక ♦ తరుమ వలయు.

ఉ॥ అందఱుఁ జూచి చెందెదరు ♦ హర్షము రామచరిత్ర మాటచేఁ
గొందఱు సంతసంబుఁ బ్రీతి♦కూలత నొందరు కాక లోపమే
మందజికేల్ ముదంబు మది ♦ కందఁగఁ జేయుచునుండు దీప మే
యెందుననైనఁ బ్రీతిని జ♦నింపఁగఁ జేయునె మూషకాళికిన్. ౧౨

వ॥ ఇట్లు తాపసోత్తమ నమస్కరణంబును, సుకవి పురస్కరణంబును, కుకవి బహిష్కరణంబును, దుర్జన తిరస్కరణంబునుం గావించి రామాశ్వమేధంబను పుణ్యచరిత్రం బాంధ్రీకరింపనెంచి తొలుత మదీయోభయవంశంబుల నభివర్ణించెద. ౧౩

## — కృత్యుభయ వంశ వర్ణనము —

తే॥ బ్రహ్మఋషులందు మేటియై ♦ పరగునట్టి,హారితమునివర్యు సద్గోత్ర♦మందుఁబుట్టెఁ
బావనంబైన గోర్త్య స్వ♦వాయమందు, సాంగవేద విదుండు సు♦బ్బావధాని.౧౪

సీ॥ సకల విద్వజ్జన ♦ సభలయం దేమేటి, యమిత సన్మానంబు ♦ లందఁ గల్గె
శిష్య ప్రశిష్యాభ్య♦సిత వేద ఘోషచే, నేయార్యునిలు మారు♦మ్రోయుచుండెఁ

దనదు సుబ్రహ్మణ్య♦తను వెలయించి యే, ధీరుఁ డన్వర్థాభి♦ధేయుఁ డయ్యె
ననవరతాభ్యాగ ♦ తాభ్యర్చన క్రియా, సక్తి నేసూరి ప్ర♦శస్తిఁ గాంచెఁ
తే॥ అట్టి పండిత మూర్ధన్యుఁ♦డమల యశుఁడు, లలితగుణజాల యుతసత్కు♦ల ప్రసూత
దివ్యచరితఁ బతివ్రతా ♦ తిలకమనఁగ, వెలయు నరసమయను కన్యఁ ♦ బెండ్లియయ్యె
క॥ ఆ సుబ్రహ్మణ్య సుధీ, వాసవ నరసాంబికలకుఁ ♦ బద్మా భుజగ
గ్రాస తురంగుల కాకమ, లాసనుఁడుం బోలె బ్రహ్మ♦యాఖ్యుఁడు పుట్టెన్. ౧౬
కం॥ బ్రహ్మయ ప్రజ్ఞా ఢ్యత నా, బ్రహ్మయ నిఖిలాగమైక ♦ పాండిమచే నా
బ్రహ్మయ విబుధ జ్యేష్ఠత, బ్రహ్మయ నిగమజ్ఞుఁ డగుట ♦ బ్రహ్మయ భువిలో.
ఆ॥ అర్థిజనుల యెడ ద♦యాళులౌ నీబ్రహ్మ, యావధాని కమల♦ధీ విశార
దయగు బుచ్చమాఖ్యఁ♦దనరి పతివ్రతా, మహిమమీరు రమణి♦ గృహిణియయ్యె.
కం॥ ఆ రామామణిగర్భ, క్షీరాంబుధిఁ గౌస్తుభంబు ♦ చెలువున లక్ష్మీ
నారాయణాభిధానుఁడు, నారాయణ నిరతసేవ♦నారతుఁ డౌడమెన్. ౧౯
సీ॥ ఆమ్నాయమును శ్రద్ధ ♦ నభ్యాసమొనరించి, యెనలేని సౌజన్య♦తను గడించి
భగవత్కృతులఁ గొన్ని ♦ పాడఁగాఁ దానేర్చి, పరమభాగవతుఁడన్♦ బ్రథవహించి
అర్థార్జనముమీఁద ♦ నాసక్తిఁ గుదియించి, ధర్మకార్యాసక్తిఁ ♦ దవిలి మించి
పితరుల నకలంక♦ప్రేమచేఁ బోషించి, పెద్దల సంగతిఁ ♦ బేరుగాంచి
తే॥ అనఘుఁడౌ వేలమూరి బ్ర♦హ్మావధాని, కన్య రామలక్ష్మమ్మయనెడి ♦ కలికి మిన్న
ధర్మపత్నిగ గ్రహియించి ♦ ధరనుమించె, నమలగుణముల లక్ష్మీ నా♦రాయణుండు.
కం॥ ఆ రామలక్ష్మమ్మ కెన యని, ధారాళంబుగను జెప్పఁ ♦ దగిన పడంతుల్
లే రా వశిష్ఠునతియే, కా రామ సువంశజాత ♦ గాసిల్లు మదిన్. ౨౦
సీ॥ సతతంబు శ్రీరామ ♦ చరణసేవా సక్త, మతియై తనర్చె నే ♦ మంజువాణి
పారిజాతాది ప్ర♦బంధాళి యక్షగా, నంబుగాఁజేసె నే ♦ యంబుజాక్షి
భగవత్కథలఁ గొన్ని ♦ పాటలుగాఁజేసి, పాడఁగాఁ గల్గె నే ♦ పరమసాధ్వి
వేదాంతమున గొల్ల♦వెలఁది కలాపంబుఁ, గావించి మించె నే ♦ కలికిమిన్న
తే॥ అఘహరములగు దక్షిణ♦యాత్రలెల్ల, భక్తి సేవించి తత్తత్సు♦పర్వచరిత
ములను గృతులుగఁజేసె నే ♦ పొలతిమిన్న, అట్టి సతి కెనయనఁదగు♦ నతివ గలదె.
కం॥ ఆ రామలక్ష్మ లక్ష్మీ, నారాయణులకు సనయులు ♦ నలువురు తనయుల్
గారాబు కూఁతురొక తెయు, శ్రీరామపదార్చనా ర♦సికు లొడమి రిలన్. ౨౩
సీ॥ అం దగ్రజుఁడు బ్రహ్మ♦యాభిఖ్యఁ జెన్నొందె, నవరజుఁడు నృసింహుఁ♦డౌ నృసింహుఁ
డవనిమించెను సుబ్బ♦యాఖ్యఁ దృతీయుండు, నేనందఱికిని గ♦నిష్ఠుఁడనయి
రామమూర్త్యాఖ్యచే ♦ రహిమించితిని భువి, బుచ్చమయనఁగఁ దోఁ♦బుట్టువొప్పె
సీతేశులీలలఁ ♦ జిరతరముం దేలు, పితరులచేత లాఁ♦లితులమగుచు

తే॥ ఢుండిగణపతిభక్తుల ♦ నిండుప్రేమ, సకలవిఘ్నములందొలి ♦ సాకమదిని
నెంచి తానెందు సాక్షాత్క ♦ రించె నట్టి, ఢుండిపురమనునుండి మే ♦ ముందునంత. ౨౪

సీ॥ జ్యోతిర్విదగ్రగ ♦ ణ్యుఁడు వెంకటార్యుఁడు, తండ్రి తాతాయె నే ♦ ధార్మికునకు
తత్త్వవిచార త ♦ త్పరుఁడైన మహాదేవ, శాస్త్రి తాతాయెనే ♦ సజ్జనునకు
నిఖిల కర్మ క్రియా ♦ నిపుణుఁడౌ పరదేశి, తండ్రిగారాయె నే ♦ తత్త్వవిదున
కధ్యాత్మ విద్యయం ♦ దసముఁడౌ మహదేవుఁ, డన్నగారాయెనే ♦ యమలమతికి

తే॥ వేద్యభైషజ్య విద్యాన ♦ వద్య గుహ్య, వేదియై యేవదాన్యుఁడు ♦ వెలసెఁగీర్తి
నట్టి చింతలపాట్యన్వ ♦ యాంబునిధి సు, ధాంశుఁడనఁదగు సూర్యనా ♦ రాయణుండు.

మ॥ ఒకనాఁడూర్పులు పుచ్చు చొక్కయెడఁ దా ♦ నొక్కండ కూర్చుండి లో
నఁగడుం బొక్కుచునుండఁజూచి మదిలో ♦ నన్ సంశయంబంది యే
లకో యిట్లుండి రటంచుఁ దత్సతి విలో ♦ లస్వాంతయై చేరఁబో
యి కటా యిట్లు విచారమూనఁగఁ గతం ♦ బేమో వచింపందగున్. ౨౬

వ॥ అని సవినయంబుగాఁ బ్రార్థించిన గృహిణికి గృహమేధి యిట్లనియె. ౨౭

క॥ వామాక్షి యేమితెల్పుదు, నీమానవ దూషణముల ♦ కిరవైతి మయో
వేమాటలేల ము న్నొక, నోమే మనమిద్దరమును ♦ నోచితిమికదా. ౨౮

క॥ యతినిందఁ జేసినారమొ, హతమతి విప్రుల ధనంబు ♦ హరియించితిమో
కతమేమొ బాలుఁడొక్కం, డతివా యుండంగ నోమ ♦ మైతిమి యింటన్. ౨౯

క॥ పున్నామ నరకమగునని, విన్నార మపుత్రకులగు ♦ విబుధులకైనన్
గన్నారము గ్రంథంబుల, నిన్నాళ్లుం బ్రతికినందు ♦ కింతాయెఁ గదా. 30

తే॥ అనుచు వగఁగూరు పతిఁగని ♦ యనియెఁ బత్ని, దీనికై మనమింతగా ♦ దిగులువడిన
నేమి లాభము చేసిన ♦ దేరికైన, ననుభవింపకపోవునే ♦ యవనిలోన. ౩౧

ఉ॥ చెప్పెద నొక్కమాట మదిఁ ♦ జేర్చుఁడు నల్వురు పుత్రులిప్డు చి
న్నప్పకడన్ గలారు మన ♦ మందుఁ గనిష్ఠుని నిమ్మటన్నఁదాఁ
దప్పకనిచ్చు బావయును ♦ దానికి సమ్మతినొందుఁగాని వే
ర్జెప్పుఁడు రేపొ మాపొ చని ♦ చెప్పుద మిద్దర మీ యుదంతమున్. ౩౨

తే॥ గోత్రమొకటియ కావునఁ ♦ గోరవచ్చు, ననిన సతితోడ సూర్యనా ♦ రాయణుండు
ఢుండిపురమున కేగి ని ♦ ర్దిష్టమైన, సుదినమున నాదు జనకునిఁ ♦ జూచి యనియె. 33

ఉ॥ అన్నయ యొక్క నందనుని ♦ కైనను నోచకపోతి మే మిఁకే
మున్నను నేమి నీతనయు ♦ నొక్కనిఁ బ్రేమ నొసంగి పెద్ద లె
ప్డెన్నఁగ దీపమింట వెలిఁ ♦ గింపఁగఁ జేయుము పుత్రదానమే
మిన్నని యంద ఱందురు సు ♦ మీ సుత నిచ్చుటకన్న నిద్ధరన్. ౩౪

క॥ అనుటయు మందస్మితముఖి, వదనుండయి నాదు తాత♦పాదుఁడు పత్నిన్
గన సాభిప్రాయంబుగ, ననె సోదరిఁజూచి యామె ♦ హార్ద్రముఁ దోపన్. ౩౬

తే॥ అమ్మ సూరమ్మ యింతగా ♦ నార్ద్రగుంద, నేలనమ్మ కనిష్ఠు నీ ♦ కిత్తునమ్మ
పుట్టినప్పుడ వీఁడు నీ ♦ పట్టియంటి, మమ్మ వగవకుమమ్మ మా♦యమ్మ కొమ్మ.

తే॥ అనఁగ నా దంపతులు మహా♦హర్ష వార్ధిఁ, దోగి నా తల్లిదండ్రుల♦తోడ నన్నుఁ
గూరిమిం జౌటపల్లికిఁ ♦ గొంచుఁబోయిఁ, దత్తతను జేసికొనిరి య♦థావిధిగను. ౩౭

క॥ క్రమమున నుపనయనవివా,హములను గావించి కొన్ని ♦ హాయనములకున్
సుమనఃపురమున కేగెను, విమలుఁడు ననుఁబెంచినట్టి ♦ పిత సుకృతమునన్. ౩౮

—♦ గ్రంథావిర్భావ కారణము ♦—

వ॥ అంతఁ గొంతకాలంబునకుఁ బౌత్త్రిముఖ సందర్శనానందం బనుభవించి మజ్జననియు విభుని యంతికంబున కరుగఁ గొన్ని హాయనంబులకుఁ జౌటపల్లి గ్రామంబునకు సార్ధ క్రోశమాత్రదూరంబున నున్న గుడివాడ యను తాలూకా గ్రామంబున కేగి యందుఁ గాపురంబుండి నే నొక్కనాఁడొక్క కార్యవశంబున లింగవరగ్రామంబునకుఁ బోవ నందు. ౩౯

సీ॥ వివిధ విద్వజ్జన ♦ వినతుఁడౌ మలిరెడ్డి, వేంకటస్వామి యే ♦ వెలఁది తండ్రి
కొండపల్లి కులాబ్ధి ♦ కువలయమిత్రుఁడౌ, సాబ్బనరెడ్డి యే ♦ సుదతిమామ
దేవభూదేవ సం♦సేవనాసక్తుఁడౌ, రాఘవరెడ్డి యే ♦ రమణిభర్త
సకలమంగళగుణ ♦ సంపూర్ణయగుటచేఁ, బూర్ణమ యనఁగ నే ♦ పొలతిపరగె

తే॥ ఎల్లగుణముల ననసూయ♦యే యటంచు, సుమతియేయంచు నేసతి♦సొబగుఁ గాంచె
నా సతీమణి నన్గాంచి ♦ యనియె నధిక, భక్తి మొ్రక్కుచుఁ బ్రస్తావ♦వశత నిట్లు.

మ॥ అతిరమ్యంబుగ నయ్యగారు మును మా ♦ యానందనామేశుపై
శతకంబొండు రచించినారుకద యా♦చంద్రార్కముం గీర్తి వి
స్తృతముం జేయునదే ప్రబంధ మదియున్ ♦ జేయంగ యత్నించి యా
కృతి మాధూర్జటికే యొసంగుఁడు కలం♦డీశుండు మీ కంతకున్. ౪౧

తే॥ ముద్రణాదుల కగునట్టి ♦ మూల్యమెంత, యైన భరియింతునే న్గాల♦హరణమిపుడు
నిక్కమువలదు దేహ మ♦నిత్యమనుట, వినమెయనుచును మధురోక్తి♦విన్నవింప.

వ॥ అందులకు నేనియ్యకొని గృహంబున కరుదెంచి మనంబున నిట్లు వితర్కించితి. ౪౩

క॥ శతకంబు లెన్ని జేసినఁ, గుతుకంబున గూపకములఁ ♦ గొన్ని నవలలన్
గతలెన్ని వ్రాయఁగల్గిన, క్షితినిఁ బ్రబంధంబకాదె ♦ చేర్చును యశమున్. ౪౪

క॥ కావునఁ బ్రబంధ మొక్కటి, శ్రీవరుకారుణ్యమునను ♦ జేయఁగలిగినన్
గేవలముకాదు కీర్తికిఁ, దావలము పరంబునకును ♦ దావలముఁగదా. ౪౫

తే॥ పుణ్యఖనులౌదు రా పూర్వ♦భూమిపతులు, వారి చరితంబుకన్న దే♦వతలచరిత
మెన్నఁగావలె దానికి ♦ మిన్నయనుచుఁ, జెప్పఁదగు రాముకథ శివ♦సేవ్యమగుట.

క॥ అట్టి రఘూద్వహు కథ కల, యట్టి ప్రబంధంబుసేయ ♦ నలవడునే యి
ప్పట్టున ననఁగూడదు తుది, ముట్టఁగ రామాశ్వమేధ♦మునుఁ జూచితి మున్. ౪౭

క॥ దీనినిఁ దెనుఁగించుటకై, పూనెదఁ గృతిపతిని రాఘ♦వుని సేయఁగనేఁ
బూనుట తగ దిది సీతా, జానిచరిత్రంబ యగుట ♦ శర్వునిజేతున్. ౪౮

వ॥ ఇట్లు కృతనిశ్చయుండనై. ౪౯

ఉ॥ జానగు రాఘవేశ్వరుని ♦ సచ్చరితంబిది సర్వమంగళా
జాని కృతీశ్వరుండు బలె ♦ జన్మము సార్థతనొందుఁగాని నే
దీని రసోచితంబుగఁ దు♦దిన్ గనఁజేతునొ చేయలేనొ దు
ర్మానవకోటిచేత నవ♦మానము నొందెదనో యెఱుదునో. ౫౦

తే॥ అనుచుఁ జింతామహాంబుధి ♦ మునిఁగి స్వేష్ట, దైవమైనట్టి జానకీ♦ధవుని భవ్య
చరితమేకద? నన్నొక ♦ దరికిఁజేర్ప, దాశరథియే కలండని ♦ ధైర్యమంది. ౫౧

వ॥ మదీయ హృదయకమల కర్ణికాపీఠంబున సీతాలక్ష్మణ సహాయుండగు శ్రీరామభద్రునింజేర్చి నిఖిలోపచారంబులఁ బూజించి కరంబులు మోడ్చి తిరంబగు బత్తినిఁ దదేక ధ్యానపరవశుండనై శరీరంబు మఱచియుండునంత. ౫౨

మ॥ కలయో లే కది తన్మయత్వమొ మదిన్ ♦ ఖండించి చెప్పంగ నా
వలనన్గాదు సపీతరక్త తరభా♦స్వద్దీప్తి మున్ముందుగాఁ
దలమైతోఁచెను జూడ నావల సుధాం♦ధస్స్వామి నీలోపలా
మలకాంతిచ్ఛటదోఁచెఁ దోఁచినను సం♦భ్రాంతుండనై యుండఁగన్ ౫౩

సీ॥ ఒకచేత వాల్గలాఁ♦డొకచేత డాల్గలాఁ, డఱుతవిల్లుగలాఁడు ♦ నెఱిగలాఁడు
అసురులఁదోలువాఁ♦డనదలపాలివాఁ, డిరువంకలను దొన ♦ లిడినవాఁడు
ముందుభూపుత్రి యా♦ముందు సౌమిత్రిగా, నలువంక లఱయుచు♦నడుచువాఁడు
కమలంబులను బోలు ♦ కన్నులుగలవాఁడు, మెఱుగారు నల్లని ♦ మేనివాఁడు

తే॥ దిట్టముగఁ దలజడలను ♦ జుట్టినాఁడు, గరగరనివాఁడు నారలు ♦ గట్టినాఁడు
ఎలమికలవాఁడు నాదు పా♦లింటివాఁడు, దశరథుని పెద్దకొడుకు ప్ర♦త్యక్షమయ్యె.

తే॥ అంతనింతంతయనరాని ♦ హర్ష తోయ,రాశిలోపలనుండి శ్రీ♦రామచంద్రు
దర్శనంబునఁ బొంగుచుఁ♦ దరలెననఁగఁ, గనుల నానంద బాష్పముల్ ♦గారఁదొడఁగె.

క॥ తనువునఁ బులకలు ♦ పొదలఁగ,మనమున విస్మయముఁదోప♦మాన్పడి యెదియో
యనఁబోయి యనఁగలేకను, దను నే న్గనుఁగొనుచునుండ ♦ దాశరథి ననున్. ౫౬

శా॥ వత్సా రమ్మని చేరఁదీసి కడుఁ దా ♦ వామాస్య హస్తంబునన్
వాత్సల్యంబున వీపుఁదట్టుచును నీ ♦ వాఁడన్గదా యెందుకీ
హృత్సందేహము భేద మీశునకు నా ♦ కేమాత్రమున్ గంటవే
మత్సాన్నిధ్యము కల్గు శంకరున కీ ♦ మ్మా భక్తితో నీకృతిన్. ౫౭

క॥ ఆనందేశ్వర శతకం, బానందముఁగాగ నతని ♦ కర్పించితి వా
ఆనందేశ్వరునే యను,మానంబునువీడి చేయు♦మా కృతిపతిగాన్ ౫౮

వ॥ ఇట్లు కరుణారసంబొలుకు పలుకులు వలుకు నయ్యినకులతిలకుం గౌఁగలింపఁగమకిం
చుచుఁ గరంబులు సాచునంతఁ దెలివొంది కనులువిచ్చి చూచి యెవరినిం గానక
వెరఁగుపడి కృపాసముద్రుండగు రామభద్రుండు ననుఁ గటాక్షించె నింక నాకు
గోరంతయుఁ గొరంతలేదను సంతసంబునం బొదలుచు. ౫౯

—♦ షష్ఠ్యంతంబులు ♦—

క॥ హరునకు గజదానవసం, హరునకు మునిహృదయ వనవి ♦ హరునకుఁ గరుణా
కరునకుఁ బురహరునకు శం, కరునకు నిజభక్తలోక ♦ కలుషహరునకున్. ౬౦

క॥ శూలికి శుభ్రాంశుకళా, మాలికి వేధః కపాల ♦ మాలికిని సదా
పాలిత హరిహయముఖసుర, పాళికి శ్రితభక్త జనవి♦పాటిత కలికిన్. ౬౧

క॥ కుండలికుండలునకు వృష, కాండునకు మురాసురారి ♦ కాండునకు జగ
త్కాండావన శౌండునకును, దాండవలోలునకు యమమ♦ద విఖండునకున్. ౬౨

క॥ శారద నీరద నారద, పారద హరిహారహార ♦ పాటీరకరీ
ట్స్ఫారసదర కాశనిభా, కారునకు మదాంధకాంధ♦క విదారునకున్. ౬౩

క॥ ఈశ్వరున కజున కానం, దేశ్వరునకుఁ బార్వతీ స♦తీశ్వరునకు స
ర్వేశ్వరున కనంతునకు న, నశ్వరునకు నందివాడ ♦ నగరేశునకున్. ౬౪

వ॥ సమర్పితంబుగ నా యొనర్పంబూనిన రామాశ్వమేధంబను చంపూమహాప్రబంధం
బునకుఁ గథాక్రమం బెట్టిదనిన నిఖిల భూభారభరణ నిపుణుండగు శేషునిం గని
వాత్స్యాయన మునివరుం డిట్లనియె. ౬౫

## —♦ కథాప్రారంభము ♦—

క॥ నానాదేశ వినిర్మల, భూనాయక చరితములను ♦ భూగోళాదుల్
నే నారవికులరాజ, న్యానూనకథలను వింటి♦నయ నీ వలనన్. ౧౬

సీ॥ అం దేది స్మరియించి ♦ నంతను వినినంత, దలఁచినంత మహాఘ♦దళన చతుర
మేది సంప్రార్థితా♦భీష్టప్రదాయక, మేదిభక్తౌఘప్ర♦మోదకరణ
మేది రక్షోజన♦హృదయవిదారణ, మేది బృందారకా♦హ్లాదదాయి
ఏది త్రిలోకజ♦నాదరణాశ్రయ, మేది భవానీ మ♦హేశశ్లాఘ్య

తే॥ మారఘురాడ్వహు శ్రీ పావ♦నాశ్వమేధ, సారచరితంబు మునువింటి♦సంగ్రహముగ
దాని విశదంబుగను సవి♦స్తరముగాఁగ, నాకుఁ జెప్పంగదయ్య ప♦న్నగకులేంద్ర.

వ॥ అనిన శేషుం డిట్లనియె. ౧౭

చ॥ మునివర నీవు ధన్యుఁడవుఁ ♦ బుణ్యుఁడ వా రఘురాము దివ్యప
ద్వనజయుగార్చనేచ్ఛవిహి♦తంబగు నీదు మనంబు మేలు ధ
న్యుని ననుఁగూడఁ జేసితి ర♦ఘూత్తమునిన్ స్మరియింపఁ జేసి స
జ్జనవినుతా శుభంబులకు ♦ సజ్జన సంగతి మూలమేకదా. ౧౮

తే॥ సకల సురవర దైత్య మ♦స్తక కిరీట, రత్ననీరాజితాంఘ్రియా ♦ రామచంద్ర
సత్కథాక్షీరనిధికి మ♦శకనిభుండ, నైన నేనేడ నదిచెప్పఁ ♦ బూనుటేడ. ౨౦

క॥ కమలోద్భవ హరిహయముఖ, సుమనస్సులునైన నతని ♦ శుభచరితంబుం
భ్రమఁజెంది తెలియలేరన, విమలమతీ యెంతవాఁడ ♦ వివరింపంగన్. ౨౧

తే॥ అయిన నిప్పుడు దీని ని♦త్యాదరమున, నడిగితివి కానఁ జెప్పలే♦దనుటకాదు
మునుబుధాళులవలన నే♦ వినినయంతఁ, దెలిసినంతను గనినంతఁ ♦ దెలియఁబరతు.

వ॥ సావధానుండవై వినుము. ౨౩

## —♦ అయోధ్యాపుర వర్ణనము ♦—

ఉ॥ శ్రీలకుఁ దానకంబగుచు ♦ శ్రీదుని యాయలకాపురంబునే
మేలములాడు చొక్క మొగి ♦ మేదిని కబ్బురపుం విభూషణం
బై లలి గోపురాగ్ర కల♦శాయిత గోపురమై యయోధ్య నాఁ
గ్రాలు ప్రసిద్ధిఁగన్నపురరా♦జము శాత్రవరా డయోధ్యమై. ౨౪

క॥ అదిపరిఘాయిత సరయూ,నది యది రవివంశజాత ♦ నరనాథుల కా
స్పద మది సంశ్రితదుర్జన, విదళిత దురితంబు లోక ♦ విదితం బదియే. ౨౫

సీ॥ ప్రాసాదముల విప్పుఁ ♦ బ్రాకారములయొప్పు, దివిరి యందునఁ జూచి♦తీరవలయు
రాజవీథులసొరు ♦ రాతిగోడలతీరుఁ, దివిరి యందునఁ జూచి ♦ తీరవలయు
గోపురంబులమెత్తు ♦ గురుజుల పెనుసత్తుఁ, దివిరి యందునఁ జూచి♦తీరవలయు
మేడలయందంబు ♦ మిద్దెలచందంబుఁ, దివిరి యందునఁ జూచి♦తీరవలయు

తే॥ తిరుకోళంబుల నటఁ జూచి♦తీరవలయు, దిగ్గియలనెల్ల నటఁజూచి ♦ తీరవలయు
దేవళంబుల నటఁ జూచి♦ తీరవలయుఁ, దీరులన్నియు నటఁజూచి ♦ తీరవలయు ౨౬

క॥ లేదాపురి కీడగుపురి, మేదిని వేరొకటి యెంత ♦ మెలపునఁగనినన్
గాదనరా దది యనిరా, యాదినిజెప్పుటకు హేతు♦వదియేమి బుధుల్. ౨౭

ఉ॥ కొండలటంచు బుద్ధి రథ♦కోటులనెంచి తదగ్రభూములం
దుండుదమంచుఁజేరి పద♦మూనఁగఁబోయినఁ దత్పతాకలన్
మెండుగఁ బుట్టుచుండెడి స♦మీరముల న్విడి పింజపింజలై
గండడిపోవుచుండుఁ గల♦కాలము నప్పురి వారివాహముల్. ౨౮

చం॥ అమరధునీ ప్రవాహప్రరు♦హన్నవకబ్జర పద్మముల్ గరా
గ్రములఁ బెకల్చిపట్టి నగ♦రంబుననుండు మదేభజాలముల్
తమకముతోడ నెప్డు మెయిఁ♦దాల్చుకతంబునఁ బద్మశబ్ద వా
చ్యములయి చెన్నుఁగాంచె ముని♦సత్తమ యప్పటినుండి భూస్థలిన్. ౨౯

తే॥ మెచ్చికొన్నను నొక్కింత♦మెచ్చునేమొ, వ్యగ్రచిత్తుల మనము లా♦వంతయైనఁ
దూర్ణగమనంబునఁగురంగ♦తురగుఁగాంచి, మెచ్చికొనవెప్పు డవ్వీటి♦మేటిహయులు.

తే॥ శూరతనుమించి సింహకి♦శోరములను, బలమునను మించి వనమత్త♦కలభములను
గలిగి ధైర్యంబుఁ బురిఁబేరు♦గాంచినట్టి, పద్మశంఖాల సంఖ్యల ♦ భటులుకలరు. ౩౧

ఉ॥ నాలుగువేదము ల్మనసి ♦ నాలుగుమోములఁ జెప్పనేరికిన్
జాలఁడు చెప్ప సృష్టివివ♦శత్వమునన్ ద్రుహిణుం డిసీ యటం
చాలపనంబు సేయుదు రొ♦కాననమందునవాని జెప్పఁగా
బాలురకెల్లఁ జాలుదు ర♦వారిగ బ్రాహ్మణు లెప్పు డప్పురిన్. ౩౨

సీ॥ ఇచ్చెదనని విత్త ♦ మీలేక నిడుములఁ, బడిన హరిశ్చంద్రుఁ ♦ బరిహసించి
కంటనీర్గార్చుచుఁ ♦ గాయంబుసగమిచ్చె, ననుచు మయూరకే♦తనుని నెంచి
అతిబలుండేకాని ♦ యని నటునిటుఁజూడు, ననుచుఁ గుమారుని ♦ నపహసించి
కాండంబుమాత్రంబు ♦ గన్నంతఁ దేజంబుఁ, గోల్పోవు నాపావ♦కునిహసించి
తే॥ ఇత్తునన్నది వెంటనే ♦ యీయఁజాలి, ఇచ్చునది పూర్ణముగఁదుష్టి ♦ నీయఁజాలి
అనికిజంకక నెదురుగఁ ♦ జనఁగఁజాలి, ఎప్డుఁ దేజంబుఁగనఁజాలు♦నృపులుకలరు.

ఆ॥ న్యాయముగను బేర♦మాడి సంపాదించు, ధనము సద్వ్యయంబుఁ♦దనరఁజేసి
పాతరలనువేసి ♦ పాలించునట్టి కు, బేరునెంతుప్రపురిని ♦ బేరు లెలమి. ౩౪

కం॥ నాగలియుండిన దున్నుట, బాగు హలిపురమును నీటఁ♦బడఁబూనుట యే
బాగని తరిభువిదున్నుచు, బాగుగఁబండింతుర్ దాన♦పరులగు శూద్రుల్. ౩౫

సీ॥ పుటముఁదీరిన స్వర్ణ ♦ పుంగణికలుకాదు, వానికి సీమార్దవ ♦ వంబు కలదె
విరహులబాధించు ♦ మరుశరంబులుకాదు, వానికిఁజూడ నీ ♦ వాసి కలదె
నెఱిమించునా తొల ♦ కరి మెఱుపులు కాదు, వానికి నిల్కడ ♦ పాటు కలదె
మేలగు వజ్రింపుఁ ♦ గీలుబొమ్మలుకాదు, వానికిఁ జేతన ♦ భావమున్నె
తే॥ అనుచు నిటు పూర్వపక్ష సి ♦ ద్ధాంతములను, జేయు యువకులఁగనిరర ♦ స్మేరచంద్రి
కలను దన్నె త్రికువలయ ♦ ములకుఁగొ్రొత్త, యింపు సేతురువార పూ ♦ ర్ణేందుముఖులు.

తే॥ తాళ మొకచేత నొకచేతఁ ♦ దంబురయును, బట్టి మీటుచుఁ గాళ్ళకుఁ ♦ గట్టి గజ్జ
లత్యధికభక్తి సేయుచు ♦ నృత్యములను, బాడుచుండుదు రప్పురి ♦ భక్తజనులు. ౫౮

కం॥ మేడల కెప్పుడుఁదరుగని, పాడికిఁ బంటకును గ్రాస ♦ వాసాదులకున్
పోడిగఁ దృణకాష్ఠములకుఁ, జూడఁగ నే కొఱఁతలేదు ♦ సూ పౌరులకున్. ౫౯

తే॥ తత్పురీజనముల లెక్క ♦ తప్పకుండఁ, జెప్పఁ జదువులసామి కే ♦ చేతకాదు
అదియటుంచుము నిష్కుటు ♦ లందుఁ దపసి, రాయసీరాము సేన స ♦ రాము సేన.

—♦ రామాయణ సంగ్రహము ♦—

కం. ఆపురిని దశరథాహ్వాయ, భూపలలాముండు ప్రజలఁ ♦ బ్రోచుచు నీతిన్
గాపురముండి తనూభవ, లోపమునకుఁ జాల బుద్ధి ♦ లో వందురుచున్. ౬౦

తే॥ గురువునాజ్ఞను బుత్రేష్టిఁ ♦ గోరిచేసి, ధాత్రి కౌసల్య కైక సు ♦ మిత్రియనుచు
ఖ్యాతిఁగాంచిన సతులందు ♦ నచ్యుతాంశ, ప్రబలు పుత్రుల నల్వురఁ ♦ బడసె నంత.

వ॥ వారికి రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను నామకరణంబులు సేసి యుక్తకాలంబునఁ గ్రమంబుగఁ జౌలోపనయనోద్వాహంబు లొనర్చి యందుఁ గల్యాణగుణభద్రుం డగు రామభద్రుం యౌవరాజ్య పట్టభద్రుం జేయందలంచు నెఱింగి. ౬౨

క॥ నాఁడిచ్చినయావరముల, నేఁడీయుఁడటంచుఁ గైక ♦ నిజపుత్రుం డీ
నాఁడే ప్రభువుగఁ బదు నా, ల్గేడులు రాముండు నడవి ♦ కేఁగఁగఁ గోరెన్. ౬౩

ఆ॥ సత్యభంగమునకు ♦ జంకుచువందురు, జనకువిధము రామ ♦ చంద్రుఁడెఱిఁగి
తడవుసేయ కపుడు ♦ తలిదండ్రులకు మ్రొక్కి, వల్కలములుఁ గట్టి ♦ వనటఁదక్కి

సీ॥ జానకీలక్ష్మణ ♦ సహితుఁడై చని చిత్ర, కూటమందుననుండి ♦ కొన్ని దినము
లటమహీపతిమృతి ♦ నా కైకపట్టిచే, విని నివాపాంజలు ♦ లనునొసర్చి
తనపాదుకలు భర ♦ తునకిచ్చి పంపించి, పంచవటిని జేరి ♦ పర్ణశాల
యందుండ రావణుఁ ♦ డతివ హరింపఁగ, ననుజునితోడ నం ♦ దందఁగనుచు
తే॥ అరిగి సుగ్రీవుతోడ స ♦ ఖ్యంబొనర్చి, సీతజాడ హనూమంతు ♦ చే నెఱింగి
కపులతో నేగి వారిధిఁ ♦ గట్టి లంక, చుట్టుసేనల విడియించి ♦ సురలుపొగడ. ౬౪

ఉ॥ రావణకుంభకర్ణముఖ♦రాక్షసులం దునుమాడి లంకకుఁ
బావనుఁడౌ విభీషణుని ♦ బాలకుఁజేసి వనాటదైత్యరా
ట్సేవితుఁడై ముదంబున వ♦సించి విమానమునం దయోధ్యకుఁ
బోవుచు నారఘూత్తముఁడు ♦ భూమిజతో ననియెం బ్రియంబునన్. ౯౬

చ॥ ఇదె రణభూమి చూడు మిది ♦ యీవువసించిన శింశుపానగం
బిది లవణాబ్ధి సేతు విది♦యే యిదియే మన పర్ణశాలను
మ్మదె ప్లవగాధినాథుపుర ♦ మంద వధించితినాఁడు వాలి న
ల్లదియ యయోధ్యనాగ విన♦యంబున మ్రొక్కెరి లేచి యందఱున్. ౯౭

ఆ॥ ఖరకరాన్వయుండు ♦ గాంచి నంది గ్రామ, మరరె గడువుకడచి ♦ నంతనొక్క
నిముషమైనబ్రతుక ♦ నీవురాకుండిన, ననియె భరతుఁ డప్పు♦డనుచు వగచి. ౯౮

క॥ అంతపనిసేయునతఁ డే, నంతికమున కేఁగకున్న ♦ నది నిజమని తా
స్వాంతమునఁదలఁచుచు హనూ,మంతునితోననియె నిఖిల♦మర్కటులువినన్. ౯౯

ఉ॥ పట్టుగ నాదుపాదుకల ♦ భావనసేయుచు నారచీరలే
కట్టుక కేశముల్ జడలు♦గట్టఁగ నెప్పుడుఁగూడు నీరునుఁ
ముట్టక బ్రహ్మచర్యవ్రత♦ముంగొని కుందుచుఁ గాల మెట్టులో
నెట్టుచు నాదుసోదరుఁడు ♦ నేలఁబరుండుచునుండు మారుతీ. ౧౦౦

తే॥ నిరత ముపకృతిసేయుట ♦ నీదుసొమ్ము, నందిగ్రామంబుననుండు♦నాదుతమ్ము
నెఱిఁగి నారాకనిపుడెఱిఁ♦గింపఁబొమ్ము, తడవు సేసినఁ గార్యంబు♦తప్పుసుమ్ము. ౧౦౧

వ॥ అనుటయు నాజగత్ప్రాణనందనుం డమందగమనంబున నందిగ్రామంబు సేరఁజని
యందొక్కయెడ. ౧౦౨

సీ॥ హారామ హారామ ♦ హారామ యనుచెప్పు,పోడిమిఁదక్కి వా♦పోవువాని
అనవరతోపచా♦రాభావ నిరశన, త్వాతిసైల్యకృశాంగ ♦ యష్టివాని
జ్యోతిర్విదులఁగాంచి ♦ సీతాధవుండెప్పు, డరుదెంచుననిప్రశ్న ♦ లడుగువాని
అగ్రజక్షేమ మ♦భ్యర్థించి గృహదేవ,తార్చనల్ భక్తినొ♦నర్చువాని
తే॥ పరమపావనులైన సో♦దరుల నడవి,పాలుఁజేసిన లోభుఁడఁ ♦ బాతకుఁడను
ఏమిచేసెదో నన్నెట్టు ♦ లేలుకొనెదొ, వేడివేలుపయని మొఱ ♦ పెట్టువాని.

లయగ్రాహి॥ ఖిల్లులును బిల్లులును ఝిల్లులును భల్లులును గొల్లుమని మ్రోయఁగను
ఝల్లుమనగుండెల్
ఎల్ల సిరిసంపదలు కొల్లలుగఁగల్గి పొదరిల్లు పడకల్లుగను గల్లుశయనింపన్

జెల్లెవని బర్వుగను బెల్లుగను నల్లటము తల్లియగుసీత దురిపిల్లుటయుగల్గెఁ
ఎల్లరికి నైతిజను తెల్లరును నవ్వనని యుల్లమున డిల్లవడి తల్లడిలువానిఁ

తే॥ పాపినాతల్లి కతమున ♦ వచ్చెనింత, ఏమిసేయుదు నాపాప♦మెట్లు తొలఁగుఁ
జెప్పఁడీయంచు మంత్రులఁ♦జీరువాని, భరతుఁగని యిట్టులనియెను♦బవనసుతుఁడు

మ॥ అనయం బే మహాసీయురాక మది న♦భ్యర్థిఁంపు చీవుంటివో
ఇనవంశాగ్రణి రామచంద్రుఁడదిగో♦యే తెంచుచున్నాఁడు భూ
తనయా లక్ష్మణవానరాసురవరుల్ ♦ దన్గొల్వ క్షేమాన నీ
వనుమానింపకుమన్న పల్కు భరతుం♦డాలించి విభ్రాంతుఁడై. ౧౦౬

మ॥ కలయా కాదది నిద్రలేక యకటా ♦ కన్పట్టునే కల్గెఁ గే
వలచిత్తభ్రమణంబు కాదదియు నె♦వ్వాఁడో మదీయాంబకం
బులకగ్గంబగుచున్నవాఁడు నిజమే ♦ బుద్ధిన్విచారింప నా
యిలువేల్పౌననియెంచి యిట్లనియెఁ దా♦నీక్షించి వాతాత్మజున్. ౧౦౭

ఉ॥ ఈతరిఁబోవు ప్రాణముల ♦ నీయఁగవచ్చిన, సర్వమంగళా
నేతవొ నిన్ను నాకడకు ♦ నేర్పునఁబంపిన రామభూమిరా
డ్దూతవొ చెప్పుమయ్య పరి♦తో షముగల్గఁగవుంగలింప నా
చేతముఁ గోరుచున్న దెడ♦సేయక రమ్మిటు వానరోత్తమా. ౧౦౮

తే॥ ఏడి మారాఘవేశ్వరుఁ ♦ డేదిలోక, మాత మాసీత యేడి మా♦పూతచరితుఁ
డైన లక్ష్మణుఁ డిపుడు వా♦రందఱెచట, నున్నవా రెప్డు వచ్చెద♦రోలిఁ జెపుమ.

వ॥ అనుటయు హనుమంతుం డిట్లనియె. ౧౧౦

సీ॥ శ్రీరామచంద్రుఁడు ♦ చిత్రకూటముఁ జేరు, వఱకంతయును నీవ♦యెఱుఁగుదుకద
అటపైన మహాదర♦ణ్యమునఁ బంచవటియం, దుండ రావణుఁడను ♦ దండి రాత్రి
చరుఁడు తరింగని ♦ జానకిఁగొనిపోయి, లంకయందుంచి ని♦శ్శంకనుండ
నిటరామలక్ష్మణు♦లేఁగి సుగ్రీవుతో, స్నేహమొనర్చినవై ♦ దేహివార్త
తే॥ వినుచునావల్లఁ గపులతో ♦ వెడలి వార్ధిఁ, గట్టి రావణువధియించి ♦ కట్టి పట్ట
మతనితమ్మునకతివతో ♦ నదిగొవచ్చె, నంబరంబునఁ బుష్పకం ♦ బనుచుఁ జెప్ప.

కం॥ విని భరతుఁడపుడుఁ దాబాం, దినముదమింతంత యనుచుఁ ♦ దెలియఁబలుక నా
కనువగునె వేయినోరులు, గనినను వాగ్గోచరంబు ♦ గాదు మునీంద్రా. ౧౧౨

వ॥ ఇట్లు డెందంబునందుండి యానందపారావారంబు పవననందన సందేశ పర్వసమాగ
మంబున నెల్లివిరిసి పొంగిపొరలుచున్నదనఁ గనులవెంట నానందబాష్పంబులురుల,
నతని శీతలవాగమృతధారలందొప్పఁదోఁగు కతంబునఁ దనువునఁ బులకలుబొదల

నేటికి రామభద్రు భద్రవార్త వినంగంటిననుచు మనంబున నుబ్బి తబ్బిబ్బగుచు దిగ్గునలేచి యిట్టి పరమోపకారికి నీ కింతకన్న వేరొం డేమీయఁగలనని గాఢాలింగనంబిచ్చి కరంబువట్టి కురంగటకుం దిగుచు తెరంగెఱింగి వశిష్ఠుండభార్గ్యాదులచే యథార్థంబుగ నహాఁణలోసంగుచుండు నంతట విమానంబు సమీపించుట యెఱింగి భరతుండు సామాత్యుండై వశిష్ఠాదులతో నెదురుగఁ బోవుచుండెనప్పుడు.

సీ॥ సోదరు నేటికిఁ ♦ జూడఁగల్గితినంచుఁ, జూచిడెందంబునఁ ♦ జొక్కువానిఁ
జేలంబు మెడఁజుట్టి ♦ చేతులుబైకెత్తి, ముందుముందుకువచ్చి ♦ మొ్రక్కువానిఁ
బండ్లెనఁబూర్తిగ ♦ భక్షణసేయమి, నడవలేకను దడఁ♦బడెడువానిఁ
బాదుకల్దలనిడి ♦ వసుధాసుతారఘు, పతులకు జయమంచుఁ ♦ బలుకువాని
తే. క్షతచిహ్నంబులుడిగి ప్ర♦గ్గడలతోడ, వచ్చుభరతునిగని మది ♦ వసటఁజెంది
విభ్రమముఁజెంది వెగటొంది♦ వెరపుఁజెంది, తనమనంబునఁదలపోసెఁ♦దరణికులుఁడు.

తే. దశరథునియంతవానికిఁ ♦ దనయుఁడగుచు, సుప్రసిద్ధార్కవంశ ప్ర♦సూతినొంది
వచ్చుచున్నాఁడుపీఁ డుత్త♦పిచ్చివాఁడు, వోలెఁ గాల్నడ నేమందుఁ ♦ గాలగతికి.

శా. కంటే నీవు విభీషణా యనుజుని ♦ గన్నావ సుగ్రీవ నా
కంటెన్ మిన్నగ నారగుడ్డలు జడల్ ♦ గ్రాలంగ నన్నెంచి నీ
ర్కంటంగార్చుచు నేమియుందినక ♦ శీర్యద్గాత్రుఁడై యున్నవాఁ
డ్వీంటేభల్లుకనాథ యిట్టి సుజనున్ ♦ విశ్వంబునం దెయ్యెడన్. ౧౧౬

తే॥ నాదుసోదరుఁడెంతయు ♦ నావియోగ, జాతదుఃఖాగ్నిఁ గ్రాఁగుచు♦సర్వతోము
ఖంబెఱుంగని సస్యంబు♦కరణి వాడి,వత్తియైయుండెఁ గంటిరే ♦ ప్లవగులార. ౧౧౭

ఉ॥ ఈతఁడు వొందుకష్టములు ♦ నీతఁడునొందెడి దుఃఖము ల్కుటా
భూతలమం దెవండయినఁ ♦ బొందెనె మున్ననినామె లక్ష్మణా
యాతనలొందినారము మ♦హాటవియం దవి యెన్నియైన హా
యీతఁడు వొందుబాములకు ♦ నీడనిచెప్పఁగ నోరువచ్చునే. ౧౧౮

మత్తకోకిల॥ మానినాయకుఁడవ్వశిష్ఠుఁడు ♦ మంత్రులుం దనతోడరా
నేను వచ్చుటెఱింగి నన్నన ♦ నేఁడువచ్చెను నాబహిః
ప్రాణ మీతఁడు లోకపూజ్యుఁడు ♦ బావనుండు మహాత్ముఁ డీ
మానుషోత్తముఁగాంచినంతన ♦ మానసంబు కలంగెడున్. ౧౧౯

క॥ ఇట్టనుచు దిగి విమానముఁ, గట్టెదుటమెలంగు భరతుఁ ♦ గన్గొని తండ్రీ
ఇట్టుంటి వేమియనుచున్, గట్టిగఁగౌఁగిటనుజేర్చెఁ ♦ గనికరమొప్పన్. ౧౨౦

తే॥ ఎట్టివో రక్తిభక్తులా♦యిద్దరకును, గౌఁగిటనేయుంచె భరతుని ♦ ఘడియవఱకు
రాముఁ డటమీఁద భరతుఁడు♦రాముపాద,కంజములనుండెఁ దా నర♦గంటవఱకు.

వ॥ అంత శ్రీరాముండుఁ దనపదములఁ గన్నీటిచేఁ గడుగుచున్న భరతు నతిప్రియ
త్నంబునఁ దనకరంబులచే నెట్టకేలకు లేవనెత్తి యుత్తరీయాంచలంబున నేత్రం
బులఁదుడిచి శరీరంబు నివురుచు నక్కునంజేర్చి శిరంబాఘ్రాణించి యతనిచందం
బంతయుం జూచునంతఁ దనయంతరంగబను సముద్రంబున దుఃఖంబు లను తరంగం
బులు పొంగిపొరలుచుండఁ దనకుఁదాన యుపశమింపంజేసి దగ్గదస్వరుండై వత్సా
యనిపిలుచు రాముంగని భరతుం డిట్లనియె. ౧౨౨

శా॥ అన్నా రాఘవభూతధాత్రీతనయా ♦ హస్తాబ్జసంస్పర్శముల్
గన్నంతం గడుఁ గందు నీదుపదముల్ ♦ కాంతారకూరదృష
చ్ఛన్నక్ష్మాతలి నెంత నొచ్చినవొ దు♦శ్చారిత్రు నాకై మఱిం
కెన్నెన్నోపడి తీవు కష్టములు హా♦యేనెంత నీచుండనో. ౧౨౩

ఆ॥ అనుచు బాష్పపూరి♦తాక్షుఁడై వందురు, భరతుఁజూచి రామ♦భద్రుఁడెలమి
మఱలఁ గౌఁగిలించి ♦ మన్నించి యతనితో, నావిమానరాజ ♦ మధివసించె. ౧౨౪

క॥ గురులకు మంత్రులకును సా,దరమునఁ జేతులనుమోడ్చి ♦ దయచేయుఁడనన్
బరమామోదంబున నం,దఱుఁ బుష్పకమెక్కి రీప్సి♦తంబు లిగుర్పన్. ౧౨౫

తే॥ అంత భరతుఁడు సర్వంస♦హాత్మజాత, పాదపంకేరుహములపైఁ♦బడుచు నిన్నుఁ
బెక్కువిధములఁ గష్టాలఁ ♦ బెట్టినట్టి, హీనుఁడను డెందమునఁ గటా♦క్షింపు తల్లి.

వ॥ అనుచు విలపించు మఱఁదింగాంచి భూపుత్రి యిట్లనియె. ౧౨౭

పంచ॥ విరించి శక్రముఖ్యులైన ♦ వేల్పులున్ ద్యజింప లే
ర్పరాకృతంబు దీనిఁద్రోయఁ ♦ బూన నెంతవారమో
మరంది యే మెఱుంగవన్న ♦ మాట నే నెఱుంగుదున్
దురంత కష్టముల్ దమంతఁ ♦ దోఁచుచుండు దేహికిన్. ౧౨౮

మ॥ విను మింకొక్కటి మమ్ము నవ్వనికి, నా♦పిన్నత్తగా ర్పంపె నాఁ
డనుటేకాని యదంత నిక్కముగ నా♦హా దైవకృత్యంబు చూ
చిన డెందంబున నామెచేసినది కిం♦చిత్తైన లేదయ్యా లే
దనుమానంబు స్వకర్మసూత్ర గ్రథితం♦బౌఁగాదె యీలోకమున్. ౧౨౯

తే. వత్స యెచ్చటనైన నీ♦వంటి సుజనుఁ,గాంచ మభివృద్ధి నిన్ను నో♦దించు నీదు
మంచియే యంచునుండ వి♦మాన ముద్గ,మించెనప్పు డయోధ్యా స♦మీపమునకు

— ♦ భరతుండు పురం బలంకరించుటకు సుముఖు నంపుట ♦ —

కం॥ భరతుండంతటఁ దనకున్, బరమాప్తుండైన సుముఖుఁ ♦ బలికె నిపుడు స
త్వరముగ నీవేఁగి పురం, బరుదుగఁ గైసేయఁ బంపు♦మయ యిటువినుమా. ౧౩౦

సీ॥ పదునుగా వీథులఁ ♦ బన్నీరుఁజల్లింపు, మాణెముత్తెపు ముగ్గు♦లలవరింపు
మచ్చుటచ్చుటఁ దోర♦ణాళిఁ గట్టింపుము, కదళులవీథులఁ ♦ బాదలఁజేయు
మింటింటికిఁ బతాక♦లేడెన్మి దెత్తింపు, భిత్తులవ్రాయింపు♦చిత్తరువులఁ
బూలదండలు వ్రేల♦మేలుకట్లలరింపు, కీలుబొమ్మలఁ గ్రిందఁ♦గలుగొల్పుఁ
తే॥ తెలియదే నీకు వేర నేఁ ♦ దెలుపనేల, నిభముల హయంబులనలంక♦రింపఁబంపు
మెలపులంగని వాసరుల్ ♦ మెచ్చునట్లు, చేయఁదగిన యలంకృతుల్♦సేయఁబంపు.

ఉ॥ వేలకొలందికన్యకలు ♦ విప్రసువాసిను లర్ఘ్యపాత్రలన్
బూలును దూర్వ లక్షతలు ♦ బూని రహింగయి నేసి యందఱున్
గ్రాలు రథంబులెక్కి రఘు♦రాము నెదుర్కొని వాద్యఘోషతో
వ్రాలినభక్తిఁ గప్రపుని♦వాళు లొసంగెడునట్లు సేయుమా. ౧౩౩

ఆ॥ కోర్కెలెదలఁ బొదలఁ ♦ గొందఱుకన్యలు,రమ్యభూషణాంబ♦రములఁ దాల్చి
మత్తగజములెక్కి ♦ మంచిముత్తెముల సే, తేశుమీఁదఁ జల్ల♦నేర్పఱుపుము. ౧౩౪

క॥ తనయాగమన సువార్తను, విని మనకౌసల్య మోద♦వివశయగుచు రా
మునిజూచి సౌఖ్యవారిధి, మునిఁగెడుఁ గావుత వయస్య ♦ ముందుగఁజెపుమా.

ఆ॥ వారనారులెల్ల♦వార లలంకార, ధారులగుచు సపరి♦వారముగను
నంద ఱిచ్చ మెచ్చ♦నాడుచుఁబాడుచు,వచ్చునట్లుసేయు♦పౌరతతితొ ౧౩౬

క॥ మనపౌరులకేకా దీ, మనుకులభూషణుసమాగ♦మం బీనానా
జనపదములకున్ దెలియఁగఁ, బనుపుము బల్లెలకుఁ గూడ♦ భటులను వేగన్. ౧౩౭

వ॥ సుముఖుండిట్లు భరతుఁడు సెప్పినట్లు సత్వరంబు నరిగి యయ్యైజనములకు శ్రీరామాగమనోత్సవంబుఁ దెల్పి పురం బలంకరింపఁ జేయునంత. ౧౩౮

క॥ రాఘవవిరహాత్యంతని, దాఘంబున వాడివన్నె ♦ దరిగినజనన
స్యాఘము తదాగమన వా,ర్తాఘనవర్షాప్తినప్డు ♦ తనిసెన్ బెలుచన్. ౧౩౯

—♦ రాముని జూచుటకుఁ బౌరు లరుదెంచుట ♦—

సీ॥ కలధౌతవస్త్రము♦ల్గట్టిఫలాల్గొని, వేదముల్జదువుచు ♦ విప్రవరులు
అతిబలు లతిశూరు ♦ లతివీరు లాఢ్యులు, జయశీలురైనట్టి ♦ క్షత్రియులును
ధనమున ధనదు న♦ధఃకరింపుచును శ్రీ,రామమూడలఁ గొంచుఁ ♦ గోమటులును
స్వాచారతత్పరు♦లగుచు ద్విజార్చనా, శోభితులైనట్టి ♦ శూద్రజనులు
తే॥ స్వర్ణకారులుఁ దక్షకుల్ ♦ సాలివాండ్రు, ముచ్చివారలు శిల్పులు♦మొదలుకాఁగ
వీటఁగలవారు జానకీ♦విభునిఁజూడ, వెడలిరప్పుడు వీథులు ♦ పిక్కటిలఁగ. ౧౪౦

సీ॥ అళికభాగములయం ♦ దరచేతిమందానఁ, బట్టెవర్ధనములు ♦ బరగదిద్ది
వెల్లచేసినగండ♦భేరుండధోవతుల్, బంచకచ్చలువోసి ♦ పైకిఁగట్టి
కూర్చిన కస్తూరితో ♦ గుమగుమలాడు శ్రీ,చందనంబును మేను♦లం దలంది
తామరపూసల ♦ దండలుఁ దులసిపూ,సల పేర్లు మెడనిండ ♦ నలవరించి

తే॥ వెనుక పెనుజుట్టుముడు లొక ♦ వింతఁదెలుప, చేవుమంచును బొట్టలుఁ♦బిసికికొనుచు
ద్రవిడ వేదముఁజదువుచు ♦ దాశరథిని,జూడ శ్రీవైష్ణవులు గుంపు♦గూడిచనిరి.

క॥ కీలించిచెవులఁ బత్తిరి, నోలి న్మెడలింగకాయ ♦ లుయ్యాలోదం
పాలోయనియూఁగఁగ భ,స్మాలోడన దేహులగుచు ♦ నరిగిరి శైవుల్. ౧౪౪

తే॥ అటిటుచెవులను గుండలా♦లాడుచుండ, భుజములందున శాలువుల్ ♦ బొందుపఱచి
చిన్నరుమాలు నీటితోఁ ♦ జేతఁబట్టి, సోమయాజులువెడలిరి ♦ రాముఁజూడ.

ఆ॥ గంధమలఁది మేనఁ ♦ గాశ్మీరశాలువుల్, గప్పి పైనఁ బండ్లఁ ♦ గప్పు బెండ
కాయబొట్లు శిఖలఁ♦గ్రాలఁ బూదండలు, గాంచఁబోయెమధ్వ♦గణము రాము.

చ॥ ఎదురుగవచ్చువారిఁగని ♦ యెవ్వరొ వీరలటంచు నుల్కుచున్
బదములనెత్తియెత్తి తమ♦పాణిముల్ బిగఁబట్టి మెట్టుచున్
జదువుచు వేదమంగుళులు ♦ సాచి మొగుడ్చుచు బిళ్ళగోచులిం
పొదవఁగ రామచంద్రుఁ గనఁ ♦ బోయిరి ఛాందసులైన వైదికుల్. ౧౪౫

ఉ॥ గోచులు శీలమండలఁద♦గుల్కొనుచుండఁగ శిల్కుకంచువాల్
వైచి భుజంబులన్ బమిడి ♦ పట్టెలకట్టులుఁ జేతులందునన్
వాచులు ముందు జేబులనుఁ ♦ బ్రిక్కబిడీల్ సిగిరెట్లు వాతులన్
బ్రాచిపొగాకుచుట్టలును ♦ గ్రాలఁగ నేఁగిరి లౌక్యులందఱున్. ౧౪౬

తే॥ కాలి కొక గుడ్డపీలిక ♦ గట్టి కొంకి, కఱ్ఱలను బట్టి పైన గొం♦గళులఁగప్పి,
ఈర! ఈ రెంక ! నాగమీ♦ ఎఱ్ఱికాల,రండు పెదదొరగార్వచ్చి♦రంట సూత,
మంచుగొల్లలు పిల్చుచు♦నరిగిరపుడు. ౧౪౭

క॥ పురిఁగల వ్యాపారస్థులు, పరమామోదమున వారి♦వారికిఁగల యా
పరవస్తుసమితిఁగైకొని, యరిగిరి భక్తిని దశాస్య♦హరు నీక్షింపన్. ౧౪౮

వ॥ అంత. ౧౪౯

—♦ శ్రీరాముఁ డయోధ్యలోఁ బ్రవేశించుట ♦—

చ॥ ద్యుమకుణిలావతంసుఁడగు ♦ దూషణవైరియు వెంట ఖేచరుల్
తమతమవాహనంబుల ము♦దంబుననెక్కుచు రాఁ బ్లవంగముల్
తమతనుకాంతు లంతటను ♦ దద్దయుఁ బర్వఁగఁ గుప్పిగంతు ల
బ్రిముగనువైచు చభ్రిమున ♦ రాఁగఁ బ్రివేశమొనర్చె నప్పురిన్. ౧౫౦

క॥ పురవరప్రాంతస్థలిఁ దన, పరివారముతో విమాన♦వరముం దిగి వే
నరయానమెక్కి తరలెన్, దరుణియుసోదరులుభక్తిఁ ♦ దను సేవింపన్.

సీ॥ జయరఘుకులదీప ♦ జయహృతజనతాప, జయవిఖండితఫాల♦నయనచాప
జయదీనమందార ♦ జయమేరునగధీర, జయమానిహృత్కుశే♦శయవిహార
జయయజ్ఞరక్షణ ♦ జయదుష్టశిక్షణ, జయపితృవాక్యమా♦చరణనిపుణ
జయకాననవిహార ♦ జయవాలిసంహార, జయదశాస్యకరద్రు♦చయకుఠార
తే॥ అనుచు నుతియించువంది సూ♦తాదినుతులు, వినుచుఁ బట్టణశోభను ♦ గనుచు భరతు
నచ్చపుంబత్తికిని లోన ♦ మెచ్చికొనుచు, రాజవీథినిఁ జనుచుండె ♦ రాఘవుండు.

వ॥ పురస్త్రీలు సీతారామలక్ష్మణులు రాజమార్గంబున వచ్చుట విని. ౧౫౩

ఆ॥ అమ్మలార మనగృ♦హంబునఁ బనులెప్పు, డుండు వాటికేమి♦ లెండు రాముఁ
జూతమింతకు మన ♦ సుకృతంబునను బురిఁ, జొచ్చినాఁడు చేర♦వచ్చినాఁడు. ౧౫౪

తే॥ చేడియలు చెప్పుకొను చిట్లు ♦ మేడలెక్కి, తోరణంబులనివసించి ♦ సూర్యవంశ
పావనుండగు శ్రీరామ♦భద్రుఁ గాంచి, పల్కిరిట్టుల మోదబా♦ష్పంబులురుల.

సీ॥ అతిబలిశాలియౌ ♦ హరికులేశ్వరువాలిఁ, గోలనొక్కంటను♦ గూల్చినాఁడు
ఖరదూషణాది రా♦క్షసులను బదునాల్గు, వేల నొక్కఁడ దుంపఁ♦జాలినాఁడు
అడవిద్రిమ్మరుల సా♦యమున నూరామడ, కడలికిఁ బెనుకట్టఁ ♦ గట్టినాఁడు
క్రూరులౌ రావణ ♦ కుంభకర్ణాదుల, యమపురికిని సాగ ♦ నంపినాఁడు
తే॥ ఎందఱినొ తాపసులఁ బ్రేమ ♦ నేలినాఁడు, వింటిరే మనరాముని ♦ విధము నేఁడు
భాగ్యవశమున మనకండ్లఁ ♦ బడినవాఁడు, ఎందుకింకను మనల కీ ♦ యింటిగోడు.

చం॥ మెలమెలఁ బల్కినంత బలె♦ మేలగు, ముత్యములొల్కు నెన్నియో
కలకల నవ్వినంతటనె ♦ గల్లలరాలు వరాలు కుప్పలై
తెలతెల కాంతులుట్టిపడుఁ ♦ దేరి కనుంగొన నేటిక ఘృణీ
ట్కులతిలకుం గనంగ నొనఁ♦గూడెను గన్నులకర్వు తీరఁగన్. ౧౫౬

చం॥ వ్రతముల నెన్నినోచిరొ త♦పంబుల నెన్నియొనర్చినారొ యే
వెతలకునోర్చి యెందఱికి ♦ వేల్పుల కెంతగ మ్రొక్కినారొ? మున్
సతతము భిల్లనారులు వ♦నంబుననుండియుఁ బూర్ణచంద్రబిం
బతులిత రాఘవాననముఁ ♦ బాయక వార్గనఁ గాంచి రెంతయున్. ౧౫౭

మ॥ దరహాసోజ్జ్వల మబ్జపత్రనిభ నే♦త్రభ్రాజితం బంబరాం
బరముఖ్యామరదర్శనీయము సదా ♦ బంధూకపుష్పప్రభ
క్కరణాచంద్ర దనచ్ఛదాఢ్యము జనై♦కప్రీతిపాత్రంబు నీ
కరుణాసింధుముఖంబుఁ గన్నులఁ గనం♦గాఁ గల్గె నిన్నాళ్ళకున్. ౧౫౮

క॥ అనుచీరీతిని రాముని, గొనియాడుచు స్త్రీలు నేత్ర ♦ కువలయకాంతుల్
దనువెల్లనిండఁ బరపి య,తనిఁజేసిరి వేయికంటి ♦ దఱి నిముసములోన్. ౧౬౦

తే॥ రామచంద్రుఁడు స్మేరచం♦ద్రాతపములఁ, గైరవాక్షులఁ దేర్చి క్రీఁ♦గంటఁజూచి
మెల్లమెల్లఁగఁబోయి సౌ♦మిత్రి జనక,జాత్మజులతోడ మాతృగృ♦హంబు సేరె. ౧౬౧

వ॥ అనుటయు వాత్స్యాయన మునీంద్రుండు ఫణీంద్రుంగని యిట్లనియె. ౧౬౨

మ॥ ఉరగాధీశ్వర సంశయంబు మది నా♦కొక్కండు గన్పట్టె నా
దరభావంబున దానిఁ దీర్పుము మహా♦త్మా మున్ను రాముండు భీ
కరకాంతారము సొచ్చుటాదిఁ గృశయై ♦ కౌసల్య యిన్నాళ్ళుఁ దె
ప్పరమా సూనుని విప్రయోగమునఁ దాఁ♦ బ్రాణంబులం దాల్చెనే. ౧౬౩

క॥ సుముఖుఁడు చెప్పిన రామా,గమనము విని లోననెట్టి ♦ కౌతుకమొందెన్
సుముఖునితో నేమనె నా, సమయంబున నెట్లుమెలఁగె ♦ సర్వము చెప్పుమా. ౧౬౪

వ॥ అని ప్రశ్నించిన వాత్స్యాయనమునీశ్వరునకుఁ బన్నగ కులేశ్వరుం డిట్లనియె.

ఆ॥ బాగుబాగు మంచి ♦ ప్రశ్నఁ జేసితివయ్య, రామచరిత మఘవి♦రామ మార్య
సమ్మతంబు నేఁడు ♦ జక్కఁగఁజెప్పెద, దానివినుము సావ♦ధానమునను. ౧౬౬

తే॥ సుముఖవదనాంబుజచ్యుత ♦ క్షోణిజా ధ,వాగమవచస్సుధారస ♦ మాదరమునఁ
ద్రావితా,వియుఁదోఁచక ♦ మ్రానువడి వి, చేష్టయైయుండెఁగౌసల్య♦చిత్తరువుగ.

వ॥ ఇట్లుండి కొంత తెలివొంది తనమనంబున. ౧౬౮

క॥ కలయో నాకిది భ్రాంతియొ, పలికెనొ నాచిత్తమితఁడు ♦ భ్రమియింపంగన్
దులలేని మందభాగ్యను, గలుగునె మారామభద్రుఁ♦గనుఁగొననాకున్. ౧౬౯

ఉ॥ ఎన్నియొనోమినోముల మ♦తెన్నియొచేసి జపాలు నిష్ఠనా
పన్నగరాజభూషణు కృ♦పన్ సుతునొక్కనిఁగంటి వాని రా
జ్యోన్నతిఁజూడ నే మురియు♦చుండఁగ హా విధి నేమనందు నా
కన్నులఁగప్పి మున్నుచనెఁ ♦ గాననభూములకెంత పాపినో. ౧౭౦

వ. అని వగచుచున్ సుముఖుంజూచి. ౧౭౧

తే. మంత్రివర యిప్పుఁడీవన్న ♦ మాటనిజమె, అంతభాగ్యంబు నాకిఁక ♦ నబ్బఁగలదె
యేడిచెప్పుము మారాముఁ♦డేది సీత,యేడి మాలక్ష్మణుం డిప్పు♦డెందుఁగలరు.

క॥ వనచారియైన రాముఁడు, ననుఁజూడఁగ నింక వచ్చు♦నా యెక్కడిమా
టని గోలు గోలు నేడ్చుచు, మునిఁగెన్ బెనుమూర్ఛఁదల్ప♦మున మానవతా. ౧౭౩

ఆ॥ అంత మంత్రి పైఁ బ♦టాంచలమునవీచి, వీచి పెక్కుశైత్య ♦ విధులు సేయఁ
గోసలాత్మజాత ♦ కొంచెము తెలివొంది, కండ్లువిచ్చి దిశలఁ♦గాంచుచుండ. ౧౭౪

శా. అమ్మా నీదుకుమారుఁ డల్లదుగొ భా♦ర్యాసోదరుల్ గొల్వ మా
యమ్మా వచ్చెను జూడు సంశయము వ♦ద్దమ్మా రవంతైన నీ
విమ్మాడ్కిన్ దురపిల్లుటొప్పునె నిజం♦బీమాట వే లేచిరా
రమ్మా దీవనలిమ్ము పుత్త్రునకు నా♦రాజాస్య రోమాంచయై. ౧౭౫

ఆ॥ అప్పు డొందునట్టి ♦ యానందమింతంత, యనుచుఁ జెప్పనాకు ♦ నలవికాదు
కనుల మోద బాష్ప♦కణములఁ గౌసల్య, కురియు చరిగి కనియెఁ ♦ గొమరునంత.

వ. శ్రీరామచంద్రుండును ముందుఁ బిన్నతల్లి యగు కైకగృహంబున కరిగివచ్చెదనని
తలంచి యేగి పదంబులంబడి లేచి యిట్లనియె. ౧౭౭

తే॥ తల్లి నీయాజ్ఞఁ జేకొని యా♦దలను వనికి, నేగివచ్చితి నాకింక ♦ నేమి సెలవు
చెప్పుమాయనఁ దలవంచి ♦ సిగ్గుచేత, నేలవ్రాయుచుఁ బెనువ్రేల♦నిలచియుండ.

సుగంధి॥ అమ్మనాఁడు నాకుఁ జెప్పి♦నట్టు చేసినాఁడ నే
మమ్మ నాడ వేమి యించు♦కంతయైన లేదులో
పమ్మ మ్రొక్కుచున్న నన్నుఁ ♦ బారఁజూచి దీవెనల్
సమ్మదంబుతోడ నిచ్చి ♦ సాగనంపు మిమ్మగన్. ౧౭౯

క॥ అనుటయుఁ గేకయరాట్సుత, యనియెన్ శ్రీరాముఁగాంచి ♦ యవనతముఖియై
అనుమానముడిగి నాయెడ, జననీగృహమునకు నేఁడు ♦ చనుమిఁక వత్సా. ౧౮౦

సీ॥ అనవిని రాముండు ♦ వనితాసుమిత్త్రకు, మారులతో భక్తి ♦ మఱల మ్రొక్కి
కదలి సుమిత్త్రా ని♦కాయంబుఁ జేరంగ, నామెవీర్వచ్చుట ♦ నరసివచ్చి
చేకొని కౌఁగిటఁ "జిరం♦జీవ చిరంజీవ" యనుచు మూర్ధాఘ్రాణ ♦ మొనరఁ జేసి
నాతండ్రి యెన్నిది♦నాలకు నాకండ్లఁ, బడితివటంచు మైఁ♦దడవితడవి
తే॥ వారుమువురు నమస్కృతుల్♦వరుసఁ జేయ, నెన్నియో ప్రేమ నాశీస్సు♦లిచ్చి మోద
జలధిలో మున్గి తేలెడి♦జననిఁ జూచి, యనియె శ్రీరామచంద్రుండు ♦ వినయ మొప్ప.

మత్తకోకిల॥ తల్లి నీతనయుండు వేయివి♦ధాల నన్నలరించె నే
నెల్లవారలలోఁ బ్రసిద్ధిని ♦ నెంతయో ♦ కనఁగాంచితిన్
జెల్లెఁ గోరిక లీతఁడుండుటఁ ♦ జేసినాకడ వింటివా
కల్లకాదిది పుత్త్రరత్నముఁ ♦ గంటివమ్మ నిజంబుగన్. ౧౮౧

సీ॥ వనముగృహమ్ముగ ♦ మనఁగల్గి తిన్నే డు,లితని సహాయంబు ♦ కతనఁగాదె
వెతలెన్ని వచ్చిన ♦ వెరపింత గననైతి, నితనిసహాయంబుఁ ♦ కతనఁగాదె

ఖరదూషణాదుల ♦ ఖండించి తొలుత త్రుటి, నితనిసహాయంబు ♦ కతనఁగాదె
ఖలులరావణకుంభ ♦ కర్ణులఁ జంపితి, నిత నిసహాయంబు♦ కతనఁగాదె
తే॥ అతివఁగంటి నితనిసహా ♦ యమునఁగాదె, యశముఁగంటి నితనిసహా♦యమునఁగాదె
చేసె నుపకారమని వేరె ♦ చెప్పనేల, రత్నగర్భవు నీవు మే♦లగ్రిత్నమితఁడు. ౧౮౩

క॥ అనురాముని గాఢా లింగన మొనరిచి యనెసుమిత్రి ♦ గహనంబునకీ
ర్జనుటాదిగనలమతిగెడి, జననింగన వత్స వేగఁ ♦ జనుమనినుడువన్. ౧౮౪

తే॥ సోదరులతోడఁ బినతల్లి♦పాదములకు, మ్రొక్కి తదనుజ్ఞవడసి రా♦ముండు సపరి
వారుఁడై మింటవిబుధులు♦వచ్చుచుండ, నేగెఁదనతల్లియింటికి♦హృదయమెరియ.

వ॥ ఇట్లరిగి గృహద్వారంబున నరయానంబుడిగి. ౧౮౬

క॥ తల్లీ తల్లీ యనుచును, బెల్లుగవాపోవుచరిగి ♦ పెనుదుఃఖమునన్
డిల్లవడి యెదురు చూచెడి, తల్లి పదాబ్జములఁగాల్లు ♦ తడబడఁ బడియెన్. ౧౮౭

సీ॥ అడుగులఁ గన్నీటఁ ♦ గడుగుచుఁబడియున్న కొమరునిఁ గౌసల్య ♦ గ్రుచ్చియెత్తి
పులకలుమేనునఁ ♦ బొదలహర్షాశ్రులుఁ, గార్చుచుఁ గౌగిటఁ ♦ జేర్చిచేర్చి
తద్దర్శనోత్కంఠఁ ♦ దరలితస్వాంతయై, నివ్వెరపాటున ♦ నిల్చినిల్చి
హారామ యనఁబోయి ♦ యదిరాకనోటను, గద్గదకంఠయై ♦ కాంచికాంచి
తే॥ నిమిషమాత్రింబుగాత్రింబు♦నిమిరినిమిరి, మోదవారిధిలోపల ♦ మునిఁగిమునిఁగి
తేలుచుండెడితల్లిని♦ దేర్చి రాముఁ, డనియెవచ్చిన పెనుదుఃఖ ♦ మడఁచియడఁచి.

మ॥ జననీ యెంతటిభాగ్యహీనుఁడనొ నీ ♦ సత్పాదసేవ జే
వనభాగ్యంబున కోపనైతి నకటా ♦ పాటించి యిన్నేడులున్
జననంబొందియుఁ దల్లిదండ్రులెద మె♦చ్చన్ భక్తిశుశ్రూష సే
యనివార్పుత్రులె శుక్లసంభవక్రిముల్ ♦ హా! యెంతవారైనచో. ౧౮౯

తే॥ తల్లిరో యేమిసేయుదుఁ ♦ దండ్రియాజ్ఞ, కేనుబద్ధుండనైవని ♦ కేగినాఁడ
వనమునందున్న నీకృపా♦పాంగదృష్టి, కలన దుఃఖాబ్ధినేదాటఁ ♦ గల్గినాఁడ. ౧౯౦

తే॥ రావణుండను పెనుకూళ ♦ రక్కసుండు, సీతఁగొనిపోయి లంకలోఁ ♦ జేర్చెనంత
సపరివారంబుగాఁబోయి ♦ చంపి యతని, మఱలఁదెచ్చితి నీదగు♦కరుణచేత. ౧౯౧

తే॥ అమ్మరో కోడలిదుగో నీ♦యడుగుఁదమ్ము, లందుఁబడి సేయుచున్నది♦వందనములు
బరమసాధ్వియుఁ జకితస్వ♦భావ దీని, గౌరవింపుము దీవించి ♦ కనికరమున. ౧౯౨

వ॥ అనినఁ గౌసల్య సీతంగాంచి యిట్లనియె. ౧౯౩

శా॥ అమ్మా జానకి కాపురంబుఁ బతితో ♦ హర్షంబునన్ జాలకా
లమ్మందర్మది మెచ్చఁజేయుము కులా♦లంకారులంగాంచు మో
యమ్మా పుత్రులనిద్దరన్ బడయు మా♦యత్యంత భాగ్యంబు లే
లెమ్మా చేయుము మాకులంబు సుగుణా♦ళిన్ బల్ పవిత్రంబుగన్. ౧౯౪

క॥ తల్లీ కష్టసుఖంబుల, వల్లభుతోఁబాటు మనెడి ♦ వనితలిడుములన్
బెల్లుగ నీవలెఁ బడువా, ర్ముల్లోకములందులేరు ♦ మునుమిడికనినన్. ౧౯౫

తే॥ ఇడుములెక్కవకలవంచు♦నెఱిఁగియెఱిఁగి,మగనితోఁబాటుచనుటయొ♦మంచిదనుచుఁ
బోయి పడరానిబాములఁ♦బొందియోర్చి,వచ్చితివి నిన్నుఁబొగడంగ♦వశమె నాకు.

చ॥ ఎచట మదాంధశాత్రవ కు♦లేంధన వహ్నులు పూరుషుల్గలా
రెచటఁ గులద్వయంబు నెల♦యించెడి యిట్టిపతివ్రత ల్గలా
రచటఁ సమస్తభాగ్యము ల♦నంత సుఖంబు లమేయశోభ నా
లచటఁ బ్రకృష్టసమ్మదము ♦ లబ్బఁగ నబ్బురమేమి యిద్దరన్. ౧౯౭

తే॥ ఇటులదీవించి కోడలి ♦ హృష్టచిత్త, యగుచుఁ గౌసల్యకనుచుండ♦నంత భరతుఁ
డన్నపాదంబులకు మ్రొక్కి♦యధికభక్తి, ననియె నంజలినొనరించి♦వినయమునను.

—♦ శ్రీరామ పట్టాభిషేకము ♦—

శా॥ అన్నా రాజలలామ! మత్తకరి మో♦యంజాలు భారం బహో
యెన్నండైనను లేడిమోయఁగలదే ♦ యెన్నేండ్లు యత్నించినన్
మున్నీవిచ్చిన యాజ్ఞచే నపుడెటో ♦ మోదించితేనేడ న
న్నన్నాదీనిభరించులేడనిదె రా♦జ్యంబీవ కైకొమ్మికన్. ౧౯౯

మ॥ ఇవి యేసౌధము లాలయంబు లరదా♦లేనుంగు లశ్వంబు ల
ల్లవియే సేనలు వీరవీరభటు ల♦ర్థాగారము ల్జూడుమా
అవి యిప్డిప్పటికన్న వృద్ధిని బదా♦రంతల్ గనెన్ జూడు నీ
యవినే నీ పదపద్మసేవకునిగా ♦ నన్నాకటాక్షింపవే. ౨౦౦

వ॥ ఇట్లు భరతుఁడు శ్రీరాముం బ్రార్థింపుచుండ మంత్రులు దైవజ్ఞులం బిలిపించి ముహూర్త నిశ్చయంబుసేయించి కపులచే నానా నదీ సముద్రోదకంబులఁదెప్పించి నిఖిలోపకరణంబుల సమకూర్చి యుండునంత వసిష్ఠ వామదేవాది మహామునులు వ్యాఘ్రచర్మంబున సప్తద్వీపములతో మేదినిన్ లిఖియించి యందుఁ జంద్రతారా బలయుక్తంబగు సుదినంబున సులగ్నంబున రామభద్రు రసానుతాసమేతంబుగా నాసీనుంజేసి పట్టాభిషేక ప్రక్రమంబు సక్రమంబుగనుపక్రమించి కన్యా సహస్రం బును వృద్ధదంపతులును మంత్రులు మొదలగువారు సువర్ణకలశంబులచే నభిషే

కింపుచుండ ననువాకంబులు చదువుచుఁ బత్నులతోడఁ దామును నభిషేకంబు
లొనర్చి ఫాలంబునఁ బట్టంబుఁగట్టి ఛత్త్రచామర కిరీటాదులచే నలంకరింపఁజేసి
యాశీర్వచనంబులు చదువుచు ముత్తైదువులచే నీరాజనంబర్పించుచుండు నవసరం
బున. ౨౦౧

ఉ|| ఆడిరిమింట నప్సరస ♦ లందఱిపైఁ బడెఁగల్పసూనముల్
పాడిరి కిన్నరుల్ మొరసె ♦ భాంకృతులొప్పఁగ దేవదుందుభుల్
కూడిరి పౌరులుత్సుకత ♦ గుంపులు గుంపులుగాఁగనంగమే
లాడిరనంతసౌఖ్యముఖ ♦ రాశికిఁ గల్గునటంచు దేవతల్. ౨౦౨

ఉ|| వాడె నరాతిలోకముఖ♦వారిరుహంబులు వెల్లవెల్లనై
వీడెఁ దపోధనప్రకర ♦ హృద్వనవీథుల సాధ్వసంబు బల్
కూడె సమస్త దుర్జనుల ♦ గుండెలలోఁ బెనురాయి వింతగాఁ
బాడెఁ బవిత్రతత్కథ శ♦బాసన గాయక బృంద మత్తఱిన్. ౨౦౩

సీ|| అతివలు పతియాజ్ఞ ♦ కడుగైనదాటక, తగుసపర్యలవారిఁ ♦ దనుపువారు
పురుషులభ్యాగత ♦ పూజలొనర్చుచు, మతధర్మములను నే♦మఱనివారు
రామ శ్రీరామ శ్రీ♦రామ రామయటంచు, నెల్లవారలు జపి♦యించువారు
కడజాతివారైనఁ ♦ గాలికిందనుజీమ, పడునేమొయను చుల్క ♦ పడెడివారు
తే|| యక్షరక్షస్సు రోరగా ♦ ధ్యక్షులైన, దాశరథియాజ్ఞ మెలఁగంగఁ ♦ దలఁచువారు
నైరిరాముఁడు సర్వం స♦హాధిపత్య, పట్టభద్రుండుగాఁగఁదా♦పసకులేంద్ర. ౨౦౪

తే|| ముడియవిడుపుల సడి వేర ♦ నుడువనేలఁ, బయ్యెరయు దారినడచెడి ♦ వారిమూపు
పైనఁజేరాడు సన్నంపు ♦ వలువనైనఁ, దపసిరాయ! నిజంబు క♦దల్పఁబోడు.

వ|| మఱియు. ౨౦౬

సీ|| తల్లిదండ్రులుమాకు ♦ దైవంబులనివారు, చెప్పినట్టులఁ బను ♦ ల్సేయువారు
గడన చేడెలనైనఁ ♦ గనులఁజూడకయేక, పత్నీవ్రతంబుచేఁ ♦ బరగువార
లరులైనవచ్చి త♦మ్మాశ్రయించినమాత్ర, సోదరులనుబలెఁ ♦ జూచువారు
తగు "యథారాజాత ♦ థాప్రజా" యను నుడి,కనుగుణముగనుర్వి ♦ నలరువార
తే|| లైరిజనములర్థులపాలి♦యమరతరువు, సకల నరసురవానిసం♦స్తవనుఁడగుచు
రామచంద్రుండు సోదర ♦ త్రయముతోడ, నిండువేడుక గద్దెపై ♦ నుండునపుడు.

— ♦ బ్రహ్మాదిసురలు రాముని నుతించుట ♦ —

క|| నోరులు నాల్గయిదుంగల, వారలుఁ బదినూర్లకండ్ల ♦ వాఁడును జేజేల్
మోరలుఁ బదికలరక్కసు, బారిసమరినట్టివాని ♦ బల్పొగడిరిటుల్. ౨౦౭

సీ॥ జయరవికులదీప ♦ జయహృతజనతాప, జయఖండితలలాట ♦ నయనచాప
జయ దశరథరామ ♦ జయదనుజవిరామ, జయవరరఘువంశ ♦ జలధిసోమ
జయభక్తమందార ♦ జయమేరునగధీర, జయమునిహృత్పుష్క ♦ శయవిహార
జయనిజదారాంగనా ♦ సంగ్రహణవ్యగ్ర, కరదుష్టశాత్రవ ♦ గణవిదార
తే॥ జయజయాఖిల సుజనర ♦ క్షణవిలోల, జయజయార్థి జనేప్సితా ♦ చరణశీల
జయజయోద్ధూత సురతాప ♦ సజనబాధ, జయజయ విదేహభూపాత్మ ♦ జాసనాథ.

తే॥ ఈశ జన్మ జరామృతుల్ ♦ లెఱుఁగనట్టి, యచ్యుతుఁడవీవు చూడ య ♦ థార్థమిదియ
ఇట్టి నీ కివికల్గుట ♦ లెల్లమమ్ముఁ, బ్రోచుటకునైన వేడబం ♦ బులు మహాత్మ.

క॥ ఇనకులదీపక నీపా, వననామములన్ స్మరించు ♦ పాపులహాహా
వనులౌదురనఁగననఘులు, జనులేమగుదురో వచింపఁ ♦ జాలము దేవా! ౨౧౧

మ॥ హరపంకేరుహగర్భసన్నుతము స ♦ ర్వాభీష్టసంధాయకం
బురుపాపౌఘ విదారకం బమలచి ♦ త్తోద్యన్మునిధ్యేయమం
బురుహారిధ్వజశంఖ చిహ్నితము స ♦ త్పూజ్యంబునౌనీదు ప
త్సరసీజద్వయముల్ భజింపఁగఁ గటా ♦ క్షింబుంచుమా మాపయిన్. ౨౧౨

క॥ ఓకరుణామయ యభయం, బీకాశ్యపికొసఁగి త్రుంప ♦ వేని దనుజులన్
మా కాపురము లెటుండునొ, మీకే తెలియునుమహాత్మ ♦ మేమన నేలా. ౨౧౩

ఉ॥ దానవు లెప్పుడెప్డు మము ♦ దారుణబాధలఁ బెట్టుచుందురో
మానుగ నప్పుడప్పుడిటు ♦ క్ష్మాతలమందునఁ బుట్టి ప్రోచె దీ
శానుత కీశ్వరుండవయి ♦ జన్మలెఱుంగని నీకిదంతయున్
దీనశరణ్య చూడ భవ ♦ దీయ కృపారసమేకదా ప్రభూ. ౨౧౪

తే॥ మృతసుధా సదృశంబులు ♦ వృజినహరము,లైన నీదుచరిత్రము ♦ లవనియందు
నిండవెదఁ జల్లి గుణముల ♦ నిరతివొగడు,విబుధతతితోడఁబొందు మా ♦ స్వీయపదము.

ఉ॥ హారివి యోగిమానసవి ♦ హారి వనాదివి క్రూరదైత్య సం
హారివి మారసన్నిభుఁడ ♦ వాద్యుఁడ వాఢ్యుఁడవున్ విభుండవ
బ్జారిశిరోవిభూషణ స ♦ మర్చితపత్కమలుండవైన కా
కారి! సతంబు నీకువిజ ♦ యంబగుఁగాక వసుంధరాస్థలిన్. ౨౧౬

వ॥ ఇట్లు విరించన ప్రముఖనిలింపులు లోకత్రయవిద్రావణుండగు రావణుని హర
ణంబున కుప్పొంగుచుఁ బునఃపునఃప్రణామంబులనుజేసి పొగడినపలుకుల కత్యంత
సంతుష్టాంతరంగుఁడై వారలంగని రామచంద్రుం డిట్లనియె. ౨౧౭

ఆ॥ ఓ నిలింపులార ♦ మానివర్యులకైన, నేరికైనఁ బొంద ♦ నేరనట్టి
వెట్టివైన వరము ♦ లిత్తుఁగోరికొనుండు, స్వాంతమందువలదు ♦ సంశయంబు. ౨౧౮

వ॥ అనిన బృందారకు లిట్లనిరి. ౨౧౯

తే॥ డొక్కలోనుక్కుమేకగు ♦ రక్కసుండు, చచ్చె విచ్చలవిడినుండ ♦ వచ్చెమాకు
నింతకన్నను వేర్వరా ♦ లేలనయ్య, నీదుదయహాయిగానిద్రఁ ♦ బోదుమయ్య. ౨౨౦

క॥ చెడురాకాసులచే మే, మిడుమలువడు తరిని మీర ♦ లీరీతిని నీ
పుడమిని జనియింపుచు మా, యిడుములదయగెడపుచుండు ♦ మినకులతిలకా.

చ॥ అనుటయు నట్లకాకయని ♦ యా రఘువీరుఁ డమర్త్యులార నా
గొనము లెరింగి మీరిపుడు ♦ కూరిమిఁ జేసిన యీ స్తవంబు నే
మనుజుఁడు రేయి వేకువను ♦ మానుగఁ దాఁ బఠియించు నిస్వదు
ర్జన పరిరుజాది బాధల ని ♦ జంబుగ నొందఁడు వాఁడిఁకెన్నఁడున్. ౨౨౨

వ॥ ఇదియునుంగాక. ౨౨౩

క॥ మత్పదభక్తియుతుండై, సత్పథమున మెలఁగి సర్వ ♦ సముఁడై తుదిక
స్మత్పథమున వసియించు వి, యత్పథచరులారయనిన ♦ నామోదమునన్. ౨౨౪

క॥ ఆనరదేవశిఖామణి, కానతశిరులై యమర్త్య ♦ లతి వినయముతో
నానతిఁగొనియేగిరి స్వ, స్థానంబులకెదను రామ ♦ చంద్రుఁ బొగడుచున్. ౨౨౫

క॥ అంతరఘూత్తముఁ డనుజుల, సంతతమున్ బుధులఁ బ్రజల ♦ జనకుఁడువోలెన్
స్వాంతమునఁ గాంచుచున్ దయ, నెంతయుఁబ్రోచుచును రాజ్య ♦ మేలుచునుండెన్.

సీ॥ మహి నెచ్చటనకాల ♦ మరణముల్గనలేవు, దండికినెట్టి తొం ♦ దరలు లేవు
చూతమన్నను రోగు ♦ లేతరిలో లేరు, వైద్యులు తమయిండ్లు ♦ వాసిపోరు
చోరుఁడన్మాట నె ♦ వ్వారికి వినరాదిఁ, కేరికిఁ బైలాభ ♦ మేమి లేదు
ఏసస్యములకైన ♦ నీతిబాధలు లేవు, హాళికులకు హాళా ♦ హాళులు లేవు
తే॥ దురితకృత్యములకు నెవ ♦ ర్బొచ్చిరుట లేదు, చొచ్చువారికి స్వర్గానఁ ♦ జోటు లేదు
లేమి లేదిండ్ల సిరివాసి ♦ లేచిపోదు, మానివర రాముమహిమ నే ♦ మనివచింతు.

సీ॥ కూటికిరమ్మని ♦ మూటలఁదడవుచు, హేయమనాకకాఁ ♦ జేయువారు
ఏమెర్గనట్లుండి ♦ యితరుల కొంపలు, గులపువారివియైనఁ ♦ గూల్చువారు
దొంగతనాల్జేసి ♦ నంగనాచివలె ని, ల్చుచు నేలచూపులు ♦ జూచువారు
పాపమనకదొంగ ♦ పత్రాలుసృష్టించి, పరులసొత్తులకుఁ ♦ బొల్పడెడివారు
తే॥ ఒరులసంపదకు నసూయ ♦ నొందువార, లర్థముకనృత సాక్ష్యంబు ♦ లాడువారు
వెంగలులు నేడనీ యేడు ♦ ద్వీపములను, దాపసకు లేంద్ర యెంత వె ♦ తకిన లేరు.

ఉ॥ పొంగుచు షడ్రులందొడగి ♦ బోనము మెక్కెడివారు వింత క్రొ
ఛ్ఛింగులవా ర్కమాన్లు తుది♦ వెట్టినకత్తెర జుట్టువారల
న్యాంగనఁగోరువార లన♦యంబు నబద్ధములాడువారు వే
దాంగములున్ శ్రుతుల్ స్మృతు ల♦నర్హము లేయనువారు లేరెటన్. ౧౨౯

ఆ॥ బోడితలలవారు ♦ బోనకత్తెలతోడఁ, జేరి యిల్లు గుల్ల♦ సేయువారు
బ్రాహ్మణులను స్త్రీలఁ♦బడఁదిట్టువా ర్వ్యాస, నాలఁజిక్కవడెడి ♦ నరులు లేరు. ౧౩౦

సీ॥ కుటిలప్రవర్తన ♦ గూఢపాదములంద, యనయంబుఁజూడ ర♦థాళులంద
చిక్కెల్లఁ గుచాగ్ర♦సీమహారములంద, జడతలు కాంతల ♦ నడకలంద
లేములు లేమల ♦ లేనడుములయంద, విభ్రమంబులు ధునీ♦వితతులంద
దండమ్ము ఛత్ర కు♦ద్దాల వ్యజన హల, ములయంద కఠినత ♦ శిలలయంద
తే॥ కాని విషయంబులందు భూ♦జానులందు, వ్యవహృతులయందు♦విద్యార్థులందు మాను
షాళియందున విద్వాంసు♦లందుఁగ్రోధ, మందు నారుల హృదయంబు♦నందు లేదు.

క॥ జ్వరబాధ లేదు కామ, జ్వరబాధయె కాని చూడ ♦ సకలజనులకున్
శరమంద గుణవియోగము, నరులందున లేదు లే ద♦నారత మెచటన్. ౧౩౧

తే॥ కలవు దృఢబంధములు పుస్త♦కములయంద, తనరుజాడ్యంబు జలప్రభం♦జనములంద
నెగడును దమం బసితపక్ష ♦ నిశలయంద, ప్రబలుఁగంపంబు సాత్త్విక♦భావమంద.

తే॥ నెలకుఁగురియును మూడువా♦నలు ధరిత్రిఁ, బాలముదున్నకపండును♦బూర్ణముగను
గొలుచుపోకకుఁబుట్టెడు ♦ విలుచఁజూతు, రదియుఁ గొనువార లెవ్వార♦లందు లేరు.

క॥ చెరువులు జలపూర్ణంబులు, తరువులు సుమఫలశలాట♦దళయుతములు శం
బరజాకరములు కొలనులు, పురములు ధనధాన్య రత్న♦ముక్తాకరముల్. ౧౩౪

సుగంధి॥ రామరామరామరామ ♦ రామరామరామ శ్రీ
రామరామరామరామ ♦ రామరామ యంచుఁ ద
న్నామమును బఠింపగా న ♦ నారతంబు భూజనుల్
రామశబ్ద శబ్దితంబ ♦ రామరాజ్య మంతయున్. ౧౩౫

క॥ దుష్టులకు దండధరుఁడై, శిష్టజనంబులకు నెల్లఁ ♦ జింతామణియై
కష్టము లెడపుచు రాముఁడు, శిష్టముగను♦ బాలనంబు ♦ సేయుచునుండెన్. ౧౩౬

వ॥ ఇట్లనుటయు వాత్స్యాయన మునీంద్రుండు ఫణీంద్రుంగని మహాత్మా రఘూ
త్తముని చరిత్రం బఖిలాఘహారం బవాఙ్మానస గోచరం బ ప్రతర్క్యం బనూపమం
బని తలంచెద నావలికథ వినుటకు నామనంబు త్వరపడుచున్నయది దాని నెరిం
గింపు డనుటయు. ౧౩౭

శా॥ వ్యాఘ్రాంచ చ్ఛ్రుతికుండలాపురహరా ♦ హారాయితోరస్సరా
ప్రాలేయాచలకన్యకారమణ తా♦రారాట్ఛిరోభూషణా
హేలాభక్షిత ఘోరహాలహాల స♦ద్యోయాక్రతుధ్వంసకా
కాలాభ్రాభ శిరోధిమస్త ధృతగం♦గాభద్రరథ్యామృగా. ౨౩౯

మాలిని॥ ఖలదనుజవిదారీ. ♦ కాలగర్వాపహారీ, విలసదమలశీలా ♦ విశ్వరక్షైకలోలా
కలుషచయవిభంగా♦కక్షదీవ్యత్కురంగా, చలితమునిజనార్తీ♦చంద్రచంద్రాభకీర్తీ.

గద్య

ఇది శ్రీమద్గార్గ్యాన్వయ పవిత్ర లక్ష్మీనారాయణార్యౌరసపుత్ర శ్రీ చింతలపాటి
వంశ క్షీరపారావార రాకాసుధాకరాయమాన సూర్యనారాయణార్య దత్త
పుత్త్ర శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షాసమాసాదితానవద్యోభయ
కవిత్వ విద్యావధాన
రామమూర్తిశాస్త్రి కవ్యభిధాన ప్రణీతంబగు రామాశ్వమేధంబునందు
ప్రథమాశ్వాసము.



శ్రీ

గణాధిపతయే నమః

శ్రీరామభద్రాయ కరుణాసముద్రాయ నమః

# రామాశ్వమేధము

## ద్వితీయాశ్వాసము



మద్గౌరీ విలసిత
వామాంగ కృతాంతమదవి♦భంగ శుభాంగా
సోమాంచితోత్తమాంగా
కామారీ నందివాహ♦గ్రామనివాసా ! ౧

వ॥ అవధరింపు మనంతర కథాశ్రవణ కుతూహలుండగు వాత్స్యాయన మునివరుం గని శేషుం డిట్లనియె, నయ్యినకులతిలకుండగు రామచంద్రుండు సకల జనానురంజకంబుగ రాజ్యంబుఁ జేయుచుండఁ బదునొకండు వేలహాయనంబులుకడ చనియె, నంత నీచుండగు రజకుని దూషణంబునకుఁ దలంకి, జానకిని వనంబున కనిచి, యందు సురక్షితంబుగ నుండుటఁ దెలిసియు నింతంత యనరాని వంతందగిలియుండ నొక్కనాఁడు ౨

—♦ శ్రీరామునికడ కగస్త్యముని వచ్చుట ♦—

క॥ భద్రాత్ముం డీనాల్గు స,ముద్రంబులఁ ద్రావిలోక♦ముల నేలిన ని
ర్నిద్రయశుండగు లోపా, ముద్రానాథుం డగస్త్య♦ముని తో తెంచెన్. ౩

క॥ వచ్చినఁ గని విభుఁ డెదురుగ, వచ్చి యల వశిష్ఠమౌని♦ వర్యునితో లో
నచ్చిన భయమున నర్ఘ్యం, బిచ్చి మునిం దెచ్చి పీఠ♦మిచ్చి నతుండై. ౪

క॥ విచ్చేయుమయ్య యిట కీ, ర్విచ్చేయుట గేహదేహ♦ విభవాదులకున్
వచ్చెఁ బవిత్రత నిజముగఁ, ద్వచ్చరణాబ్జములఁ గనుట♦ ధన్యుఁడనైతిన్. ౫

ఆ॥ స్వాగతంబు నీకు♦ వాతాపిభంజన, స్వాగతంబు నీకు♦ సంయమీంద్ర
యేగుదేరనిటకు♦ హేతువు చరితార్థుఁ, గాఁగ నన్నుఁ జేయఁ♦గాదె తలఁప. ౬

సీ॥ అగములు మధురఫ♦లాదుల నిచ్చునే, యగములు సుఖగమ♦నాస్పదములె
హరిముఖ మృగబాధ♦ నందరుకద హర, హరిముఖసురపూజ♦ లలరుచున్న

సవనంబుతోనె కాంసారము ల్చెరువులు, సవనముల్ నలిలేక ♦ జరుగునుగద
పుణ్యజనులవల్లఁ ♦ బొలివోకనుందురె, పుణ్యజనులమైత్రి ♦ పొసగునయ్య
ఆ॥ స్నానసంధ్యహోమ ♦ జపతపంబులుఁగాల, మందుఁజేయఁ దగున♦టయ్యపరమ
సాధ్వియైనమీదు ♦ సహధర్మచారిణి, క్షేమమున సపర్య ♦ సేయునయ్య.

క॥ మీరునిరీహులు మీకే, కోరికలుం గల్గ వున్నఁ ♦ గోరకపరులన్
మీంకే చక్కంజేసెడి, వారైన వచింపరయ్య ♦ వచ్చినవిధమున్.

వ॥ అనుటయుఁ గలశభవుం డిట్లనియె.

మత్తకోకిల॥ ఓరఘూత్తమ వాసవాది సు♦రోత్తమాళులకైన వే
తేరిచూడఁగరాని నీశుభ ♦ దివ్యమూర్తి నిజూడఁగాఁ
గోరి నేనిటవచ్చితిన్ నృప ♦ కోటిమస్తకిరీట దు
ర్వారకాంతి లసత్పదాంబుజ ♦ రాజరాజ కృపానిధీ. ౧౦

ఉ॥ రావణకుంభకర్ణముఖ ♦ రాక్షసులన్ యుధి మీర్వధించుటన్
దేవతలెల్లముద్వనధిఁ ♦ దేలఁగఁగల్గిరి యావిభీషణుం
డేవగ లేకరాజ్యము వ♦హించి భవత్పద చింతనంబుచేఁ
బావనుఁడయ్యె నిన్గని వి♦పాపుఁడనై ముదమందఁగల్గితిన్. ౧౧

ఉ॥ వింటి భవచ్చరిత్రమును ♦ వింటి ధరాభర మీవుతాల్చుటల్
గంటి భవన్మహామహిమఁ ♦ గంటి ధరాసుతఁ బూర్వకర్మముల్
గెంటి భవిష్యదుద్భవము ♦ గెంటి నిజంబుగ మంటినేఁడు ము
క్కంటిమెఱుంగలేని నినుఁ ♦ గంటి కృతార్థుఁడనైతి రాఘవా! ౧౨

వ॥ ఇట్లు నుడువుచు దర్శనాహ్లాద పారవశ్యంబునంజొక్కు కుంభసంభవుంగాంచి రామ
చంద్రుం డిట్లనియె. ౧౩

క॥ లోకంబుల గలవృత్తము, లేకాలపునాఁటివైన ♦ నెఱిఁగి తెలుపఁగన్
మాకందఱకును దగుదువు, లోకాతీతుఁడవునీవు ♦ లోకస్తుత్యా! ౧౪

తే॥ నీదుకృప మున్ను నాచేత ♦ నిహతులైన, క్రూరతనుమించు రావణ ♦ కుంభకర్ణు
లెవ్వ రేజాతివా రెక్కల♦మేదివారిఁ, దేటపడ నాకుఁ దాపస♦తిలక చెపుమ. ౧౫

చ॥ అనవిని కుంభసంభవుఁ డ♦హర్పతివంశ విభూషణుం గనుం
గొని యిటువల్కెనేఁడు ననుఁ ♦ గోరితెల్పు మటంచు సృష్టిలోఁ
గననిది నీవెఱుంగనిది ♦ కల్గునె! మెచ్చుట నైన గౌరవం
బునిచితి వింతయైనను నృ♦పోత్తమ చెప్పెద నాలకింపుమా. ౧౬

—♦ అగస్త్యుఁడు రామునితో రావణాదుల వృత్తాంతం బెఱింగించుట ♦—

సీ॥ సృష్టికర్త విధాత ♦ సృజియించెను బులస్త్యుఁ,డనువాని మానస♦మందుఁ దొలుత
నాపులస్త్యుఁడుగనె ♦ నామ్నాయ రతు విశ్రి,వసుని నాతని కైరి ♦ పత్ను లిర్వు
రందు మందాకిని ♦ యను నగ్రిపత్ని తా, ధనదుఁడన్పుత్త్రినిఁ♦గనెఁ గనిష్ఠ
కైకసియనునది ♦ కాంచె రావణ కుంభ,కర్ణ విభీషణా♦ఖ్యులఁదనర్చు

తే॥ వారి నందుఁ గనిష్ఠుఁ డా♦చారనిరతుఁ, డయ్యె నగ్రజులిర్వురు ♦ నసురసంధ్య
రక్కసికిఁ బుట్టుకతన దు♦ర్మార్గులగుచు, రాక్షసత్వంబునొందిరి ♦ రఘుకులేశ!

మ॥ ఒకనాఁ డైలబిలుండు తండ్రినిఁగనన్ ♦ సోత్కంఠతన్ సన్మణి
ప్రకరస్ఫారమరీచిజాల లసద♦భ్రిత్వాంతరంబైన పు
ష్పకరాజంబును నెక్కి దామరశయల్ ♦ పద్మాస్య లిర్వంకలన్
వికచాబ్జేక్షణయోర్తునెల్లిఁగొని తా ♦ వెన్కన్ గనద్రత్న పా
దుకలన్ బట్టుక యోర్తు ముందు భయసం♦తోషంబునన్ గొల్వఁ గన్. ౧౮

క॥ విచ్చలవిడిఁ దిరుగుచును వి,యచ్చరు లచ్చెరువుఁగొను మ ♦ హైశ్వర్యమునన్
వచ్చి విమానంబును దిగి,యచ్చుగఁ బితరులకు మ్రొక్కె ♦ నతివినయమునన్.

ఆ॥ తల్లిదండ్రులార ♦ దర్శనంబునఁ గృతా,ర్థుండనైతిఁదపము♦పండెఁ బెలుచ
నీదినంబు సుదిన ♦ మిందరిలోఁ గీర్తిఁ,గంటి మిమ్ముఁజూడఁ♦గంటి నంటి. ౨౦

ఆ॥ అనుచు హర్షపూరి♦తాత్ముఁడై పులకలు, తనువునందుఁ బొదలఁ♦దండ్రిపాద
ములకు మఱల మ్రొక్కి♦ముమ్మారు వలగొని,భవునిసఖుఁడుచని యె♦భవనమునకు.

క॥ ఇదియంతయుఁ గని రావణుఁ,డెద నుమ్మలికంబుఁదోఁప ♦ నిట్లనెఁ దల్లీ
త్రిదివేశ్వరఘనవిభవా, స్పదుఁడగు వీఁ డెవఁడు నాకుఁ♦జయ్యన చెప్పుమా. ౨౨

శా॥ వచ్చెన్ స్వీయగణంబుఁ గొల్వఁగ మహా♦వైభోగసంయుక్తుఁడై
మెచ్చెన్ వాని వినీతినమ్రతల మే♦ల్మేలంచు మాతండ్రిమే
మచ్చెర్వొందుచుఁ జూచుచుండ జననీ ♦ యామేటి యెచ్చోటకో
యిచ్చెన్ దాఁ జనె నిట్టి భాగ్యనిధి ము♦న్నెందైనఁ గన్గొంటినే. ౨౩

ఆ॥ ఆవిమాన రాజ♦మందలిచిత్రంబు, లందుగదులతీవి ♦ యందు మేలు
కట్లయంద మందఁ♦గల యంతరంబుల, సొరుఁగనను వినను ♦ జగమునందు. ౨౪

క॥ ఆరామోద్యానములకు, నీరాకర వరవిలాస ♦ నిలయంబుల కా
ధారంబైనది యెట్టి య,పారంబగు తపము పేర్మిఁ ♦ బడసెనొ దీనిన్. ౨౫

వ॥ ఇట్లనుచున్న పుత్త్రుంగని కైకసి రోషవిక్లబయై వెచ్చనూర్చుచు నిట్లనియె. ౨౬

మ॥ తనయా యాతని జన్మకర్మశుభ వృ♦త్తాంతంబు నేనింక నే
మనుచున్ దెల్పుదు నయ్యపూజ్యతమురా♦లౌమత్సభార్యోదర
స్థనిదానంబు సుమీ స్వమాతృకుల వి♦స్ఫార ప్రదీపంబతం
డనివార్యైక తపఃప్రసాదిత విరూ♦పాక్షుండుఁ దద్భృత్యుఁడున్. ౨౮

తే॥ అమితమహిమా స్పదంబగు ♦ నావిమాన,మభవుమెప్పించి కొన్నవాఁ♦డాతఁడట్టి
సూనుఁగనెఁదల్లి పౌరుష♦హీనుఁడవయి, పుట్టితివినాదు కడుపునఁ♦బురుగువగుచు.

క॥ పదితలలుఁజేతులొక యి,ర్వదిమోయుదువయ్య యేమి ♦ వచ్చెనుదీనన్
బదిలముగ మోయఁజాలుం,గదఖరమెంతైనఁ బరువుఁ♦గంటివె దానిన్. ౨౯

వ॥ ఇట్లుమట్టు పలికిన తల్లిపలుకులు చెవులకు ములుకులై సార నులికిపడి వెలవెలం బోయి లోపలఁజెయివెట్టి కలఁచినట్టులఁ గడుంగడు కుంది యుస్సురని వేడి నిట్టూర్పులిచ్చుచు వేదురుఁ గొన్నవిధంబునఁ బిచ్చియెత్తినమాడ్కి గ్రహంబు సోకినవడువున మిన్నుమీఁదఁబడిన చందంబున నిశ్చేష్టుండై కొంతవడి మూర్ఛనువడిన యట్లుండి తలయూచియూచి మెల్లనఁ దల్లింగని యిట్లనియె. ౩౦

సీ॥ ఈలీలననుఁ దూల♦నేల నమ్మ మఱింతఁ, దల్లడిల్లఁగఁ జేయఁ♦దగునటమ్మ
రత్నంబులము మేము♦రత్నగర్భవు నీవు,గాక మఱెవ్వరుఁ♦గారు సుమ్ము
వానితపంబెంత ♦ వానిధనంబెంత, వాఁడొక్కపురువుగాఁ ♦ జూడుమమ్మ
ఆవిమానంబెంత ♦ కధికంబు లౌసిరుల్, మూఁడుగడెలఁదెత్తుఁ ♦ జూడుమమ్మ
తే॥ కూడునీరును ముట్టక ♦ కొంచెమైన, ఘోరతపమున మెప్పించి ♦ నీరజభవుఁ
బొందివరముల నీమూఁడు♦భువనములను, నెమ్మినేలెద నామాట ♦ నమ్ముమమ్మ.

తే॥ ఇటులసేయంగలేనైతి ♦ నేని నాదు, ప్రతినవిను పితృజనఘాత ♦ పాతకములఁ
బొందువాఁడను సోదరుల్ ♦ ముందునడవ, వేగనేగెద నిదెఘోర ♦ విపినమునకు.

## —♦ రావణుండు వరగర్వంబున నందఱ జయించి మించుట ♦—

మ॥ ముదమున్ బొందుమటంచుఁబల్కి యను జ♦న్ములోడరా సాధ్వసా
స్పదమా కాననమందు ఘోరతపమ ♦ స్వప్నల్ భయంబందగాఁ
బదివేలేడులుఁజేసి యబ్జభవుచేఁ ♦ బాలింప ముల్లోకముల్
దిగ్రిదశేంద్రాదులచేతఁ జాకునికి కో♦ర్కెల్గాంచి యత్యుగ్రుఁడై. ౩౩

శా॥ అన్నన్నందు జయించి పుష్పకముఁ దా♦సామర్థ్యుఁడై కొంచు నే
మన్నన్బెద్దలు పాటుసేయ కది లం♦కాధ్యక్షతన్ గాంచి పల్
బన్నంబుల్వడఁజేసి దేవమనుజ♦వ్యాళాదులన్ భీతిఁ ద
గ్నన్నారందఱుఁ బొందఁజేసెను త్రిలో♦కా లల్లకల్లోలమున్. ౩౪

ఉ॥ మానులబాధ వెట్టిఁ ద్విజ♦మండలి గీటడగించి మానులన్
దీనులఁ జేసి క్రూరతను♦ దెచ్చి నిలింప పతంగభోగిరా
ణ్మానుషకన్యలన్ జెరల ♦ మానక వెట్టి కలంచు నట్టి యా
దానవనాథుచందమును ♦ దానవవైరులు జూచి భీతులై. ౩౫

క॥ విధిపాలికిఁ జని రావణు, విధమంతయుఁ దెలుప నతఁడు ♦ వేల్పులతోడన్
విధుమౌళిఁ జేరి నానా, విధములఁ గీర్తించె నిట్లు ♦ వినయము తోడన్. ౩౬

తే॥ నీలకంఠాయ శర్వాయ ♦ నిఖిలలోక, పాలనాయ కపర్దినే ♦ భయహరాయ
శంభవే శూలినే గిరి ♦ శాయ తేన, మోనమోయనిసురలతో♦ మ్రొక్కుటయును.

క॥ గిరిజానాథుఁడు సురలన్, బరికింపుచు నిట్టు రాఁగఁ♦బని యేదియొ నా
కెఱుఁగన్ దెల్పుఁడన న్వా, రెఱిఁగించిరి యా నిశాచ♦రేంద్రుని విధమున్. ౩౮

ఆ॥ అంత భవుఁడు మదినిఁ ♦ గొంతయాలోచించి, వేల్పులార రండు ♦ వెన్నుఁడేక
లండతండుఁ దక్క♦ నొండొరు లి కార్య, భారము న్వహించు♦వారు కలరె. ౩౯

వ॥ అనుచు నాకౌకసులతో వైకుంఠంబున కరిగి నిట్లందఱు నారాయణునిం గని.

తోటకము॥ జయ దేవ! రమాధవ! ♦ చక్రధరా
జయ సర్వసుపర్వవి ♦ చారహరా
జయతాపస హృజ్జల ♦ జాతచరా
జయదుష్టవినాశ వి♦చారపరా. ౪౧

తే॥ అనుచు నుచ్చైస్స్వరంబున ♦ వినుతిసేయు, శర్వముఖ్యులఁ గన్గొని ♦ చక్రపాణి
యుడుములెల్లను గెడపఁగ ♦ నెదఁదలంచి, జలదగంభీరనినదంబుఁ ♦ జెలఁగఁబలికె.

పంచచామరము॥ పురారినీరజోద్భవేంద్ర ♦ ముఖ్యనిర్జరుల్ వినుం
డెఱుంగుదున్ గరంబుమీర ♦ లెల్లనొందుకష్టముల్
దరంబుబూనకుండుఁడీ ♦ ధరన్ బురంబయోధ్యనా
విరాజిలున్ దినేశవంశ ♦ వీరరాజసేవ్యమై. ౪౩

వ॥ నిఖిలభూమండల మండనాయమానంబగు నప్పుటభేదనంబైశ్వర్యవిజిత ధనేశ్వరుండును, స్వకరస్ఫురత్కరాళ కరవాల నిర్దళితారాతి దోర్దర్పుండును జతుస్సముద్రముద్రిత నిఖిల రాజన్యశిరఃకిరీటాంచలోల్లసద్రత్న ప్రభా పుంజరంజిత పదారవిందుండునునగు దశరథభూమండలాధిపాఖండలుం డిపుడుఁ బాలింపుచున్న వాఁడతండు. ౪౪

సీ. అరువదివేలేడు ♦ లఖిలరాజన్యుల, నేలినాఁడరులను ♦ దోలినాఁడు
సంతతిలేకున్కిఁ ♦ జాలఁగుందితపంబుఁ, జేసినాఁడిల బ్రీతిఁ ♦ జేసినాఁడు
పుత్త్రేష్టికై యిష్టు ♦ మునిఋష్యశృంగుని, వేడినాఁడాతఁడు ♦ గూడినాఁడు
మువ్వురుభార్యలతోడ ♦ మొనసియాసవదీక్షఁ, బూనినాఁడితరంబు ♦ మానినాఁడు
ఆ॥ అందు రామలక్ష్మ ♦ ణాఖ్యల భరత శత్రుఘ్ననామములను ♦ రూపములట
నాల్గుఁగాఁగఁబుట్టి ♦ నయహీనురావణు, సానుచరముగాఁగఁ ♦ జంపువాఁడ. ౮౫

క॥ మీరలు మీమీయంశల, గూరిచిమర్కటతరక్షు ♦ గోలాంగూలో
దారాంగులరై పుట్టుఁడు, ధారుణిపై నని యదృశ్య ♦ తన్ హరిపలికెన్. ౮౬

సీ॥ అబ్జయోనికిఁ బుల ♦ స్త్య బ్రహ్మ జనియించె, నాతఁడు విశ్రవ ♦ స్సనుతనూజుఁ
బడసెను నాత్రయీ ♦ పారంగతునకుఁ గై, కసియనురాక్షస ♦ కన్యయందుఁ
బ్రభవించెలోక వి ♦ ద్రావణుండుఘనుండు, రావణుండను బ్రహ్మ ♦ రాక్షసుండు
ఆదురాత్ముఁడొనర్చి ♦ నట్టిదుండగముల, నక్కటా చెప్పంగ ♦ నలవికాదు.
తే॥ వజ్రిముఖ దిక్పతులఁ జల ♦ పట్టిపోలె, దమకమున వారిపురములఁ ♦ దానయేలె
వేల్పుల పడఁతులను జెర ♦ పెట్టఁజాలెఁ, జెనటి నేటికి రామ నీ ♦ చేతఁగూలె॥ ౮౭

తే॥ బ్రహ్మకులమునఁ బుట్టిన ♦ న్పలుకకాని, ఆగమంబుల విభజించె ♦ ననుటకాని
పేర్మిఁదపమునుజేసెన ♦ న్పేరెకాని, కృత్యమంతయుఁగడుఘోర ♦ కృత్యమయ్యె. ౮౮

తే॥ ఇప్పటికి భోగులకుఁదల ♦ లెత్తనయ్యె, నిప్పటికి బ్రాహ్మణులకు జ ♦ పింపనయ్యె
నిప్పటికి ఖేచరులకుఁజ ♦ రింపనయ్యె, నిప్పు డాక్రూరునీవు వ ♦ ధించుకతన. ౮౯

వ॥ ఇట్లు వింధ్యగ్రావగర్వభంజనుండు దశగ్రీవోత్పత్తి ప్రవర్తనలన్ దెలియఁబలికిన
విని. ౯౦

—♦ రాముఁడు మూర్ఛిల్లుట ♦—

కం॥ నిలువుననీరై రాముఁడు, గళదశ్రుపరీత నేత్ర ♦ కమలుండై లో
పలదుఃఖించుచు మునివర, యిలకొరగెను మూర్ఛగదుర ♦ నేమనిచెప్పుదున్. ౯౧

కం॥ కలశోద్భవముని యంతట, మెలమెలగఁదదశ్రువులను ♦ మెలపున స్వకరాం
గుళులన్ దుడుచుచు నొయ్యనఁ, బలికె సమాశ్వాసనంబుఁ ♦ బరగ నతనితోన్. ౯౨

సీ॥ శ్రీరామ నీవిట్లు ♦ చింతనొందెదవేల, నీవెవఁడవో యాత్మ ♦ నిజముఁగనుము
జరిగినదియు నిఁక ♦ జరుగఁబోనున్నది, జరుగుచున్నది మది ♦ నెఱిఁగిసంచ
రింతు వీవెఱుఁగని ♦ దేదిలే దెచ్చట, నసురసంహారుండ ♦ వాదివిష్ణుఁ
డవు లోకసంపూజ్యుఁ ♦ డవు మేటివి సనాత, నుండ వీవఖిల బ్ర ♦ హ్మాండకోటి

తే॥ కెల్ల నాధారభూతుఁడ ♦ వీవకావె, ప్రాకృతుండట్ల పెనుమూర్ఛఁ ♦ బడెద వేమి
పాపమనుమాని చేయూతఁ ♦ బట్టి లేచి, కండ్లుమెల్లనవిచ్చి భూ ♦ కాంతుఁ డెలమి. ౫౩

క॥ దీనుండై లోపాము, ద్రానాథుంగాంచి యనియెఁ ♦ దలవంచి త్రిపథ
హా నా చేచేతులనిటు, ఛీ నేరక బ్రహ్మహత్యఁ ♦ జేసితిని గదా. ౫౪

క॥ ఎంత దురాత్ముఁడనో నే, నెంత విమూఢుఁడనో యెంత ♦ హీనుఁడనో హా
యెంతటి యజ్ఞానుఁడనో, యంత మొనర్చితిని బ్రాహ్మ ♦ ణాన్వయజాతున్. ౫౫

వ॥ అయ్యా సర్వజ్ఞులగు మీకుఁ జెప్పనోడెద నైన నావిన్నపంబాలింపుఁడు. జ్ఞాతాజ్ఞాతంబులను భేదంబులచేఁ బాతకంబులు ద్వివిధంబులై యుండు. బుద్ధిపూర్వకకృతంబులు జ్ఞాతంబులు, తద్వ్యతిరిక్తంబు లజ్ఞాతంబు. లందు మొదటివి భోగంబునం గాని నశింపవు. రెండవయవి ప్రాయశ్చిత్తాదుల నశించు నిదియే శాస్త్రనిశ్చయంబు. నేనుఁ గేవల బుద్ధిపూర్వకంబుగ బ్రహ్మహత్యంజేసిన పాపుండ, వ్రతతపోదాన యజ్ఞ తీర్థార్చనాదులలో నెద్ది నాపాపంబుఁ బాపనోపు, నెద్దానిచే నిర్మలయశంబునాకబ్బు నదినెమ్మనంబున నాలోచించి నాకెఱింగింపవే మహానుభావా! యని యభ్యర్థించు రామచంద్రుంగాంచి యగస్త్యుం డిట్లనియె. ౫౬

— ♦ అగస్త్యుండు రామునితో నశ్వమేధంబుఁ జేయుమని చెప్పుట ♦ —

మ॥ నతదేవాసుర రాజమౌళి వరస ♦ న్నద్ధాచ్ఛ రత్నప్రభా
తతి నీరాజిత పాదపద్మ యుగళా ♦ త్రైలోక్య రక్షాదరా
మతిమంతుండవు నీవెఱుంగనిదె బ్ర ♦ హ్మఘ్నాఘముం బోవఁగా
వితమేఁ దెల్పెద నశ్వమేధము జగ ♦ ద్విఖ్యాతిగాఁ జేయుమా. ౫౭

క॥ విను నీపూర్వులు మను సగ, ర నహుషతనుభవ దిలీప ♦ రాజోత్తము లీ
ఘన సవనముఁ జేసియ పావనులై యాపరమపదముఁ ♦ బ్రాపించిరొగిన్. ౫౮

తే॥ జిష్ణుఁడిది నూరుమారులుఁ ♦ జేసి దివిష, దింద్రుఁడై కాంచెఁ బూర్వది ♦ గీశపదవి
దీనిఁ జేయుట కష్టంబ ♦ కాని నీకు, సులభఁ మతిశూరు లనుజులు ♦ గలుగు కతన.

క॥ కాకుత్స్థునకు లోత్తంసుం, డాకుంభజుఁ డిటులఁ బల్క ♦ నవి విని తా ని
ర్వ్యాకులుఁడై యనెఁ బ్రమదో, త్రేకంబునఁ గ్రతువుసేయ ♦ దృఢనిశ్చయుఁడై.

మత్తకోకిల॥ కుంభసంభవ యెంతవిత్తముఁ ♦ గూర్పఁగావలె దాని ప్రా
రంభమెప్డు సమాప్తమెప్డు తు ♦ రంగ మెట్టిది యందునన్
సంభజించెడి దైవమెవ్వఁడు ♦ చాలియింతకు నీ హయా
లంభన క్రతు వేనొనర్పఁ గ ♦ లానె సర్వముఁ జెప్పుమా. ౬౧

వ॥ అనిన నగస్త్యుండిట్లనియె. ౬.

ఆ॥ ఎరుపు మొగము చూడ ♦ నింపగునల్లని, చెవులు పచ్చతోఁక ♦ చెలువుమీఁద
దిటముఁగల్గి నునుపుఁ ♦ దెల్లనిమేనితో, నున్న గుఱ్ఱమొప్పు ♦ జన్నమునకు. ౬

కం॥ నారాయణుఁ డధిదైవ మ, పారంబగు విత్తమింకఁ ♦ బడయఁగవలె నీ
వీరేడు జగంబులలో, శూరుఁడవది సేయనీకుఁ ♦ జొప్పడు టరుదే. ౬౦

సీ॥ గమనంబుల సురాశ్వ ♦ సమమై మనోవేగ, మునమించునట్టి వీ♦తిని యథోక్త
ముగను శ్రీ వైశాఖ ♦ పూర్ణిమయందున, నింపుగా భక్తి న♦ర్చింపవలయుఁ
దత్ఫాలమందునఁ ♦ దగ బిరుదాక్షరా, ల్గల పట్టమొక్కటి ♦ గట్టవలయు
వెంట బలాఢ్యులౌ ♦ వీరులఁ బెక్కండ్రఁ, బంపఁగఁ దగువారిఁ ♦ బంపవలయు
తే॥ ఎపుడు గుఱ్ఱంబు వెంట వా♦రేగవలయుఁ, బట్టు రిపుఁగొట్టి దాని గా♦పాడవలయు
ధర నదొకయేఁడు స్వేచ్ఛగాఁ♦దిరుగ వలయుఁ, జివరకిటకుఁ దనంతఁదాఁ ♦ జేరవలయు.

చం॥ తురగము వచ్చు నంతకును ♦ దోరపునిష్ఠనుఁదాల్చి జింక కొ
మ్మెరవుగ బ్రహ్మచర్యము వ♦హించుచు నా తురగంబురాఁగ భూ
సుర కృపణాంధదీనుల వ♦సు ప్రకరంబుల భక్ష్యభోజ్యచో
ష్య రస వరాన్న దానముల ♦ సంతసమొందఁగఁజేయఁగావలెన్. ౬౬

తే॥ ఇటులయజమానుఁ డెవ రేవ♦రేవిఁ గోరు, నటులనవి సమకూర్చుచు ♦ నధికనిష్ఠఁ
గ్రతువు సంపూర్ణమొఁనరింపఁ,గల్గెనేని, ఘన యఘంబులఁదాఁ బాపి♦కొనఁగలండు.

వ. కావుననీవీక్రతుకరణాశ్వపాలనాభ్యర్చనంబుల నత్యంత సమర్థుండవు. దీనింజేసి యమేయంబగు యశంబు వడసి పవిత్రుండవై యందఱఁ బవిత్రులను జేయు మను టయు శ్రీరాముండు. ౬౭

క॥ మునివర మన సాహిణమున, ఘనతురగము కలదొ లేదొ ♦ కలయంగఁగనుం
గొని తెల్పుఁడు పోదము రం,డని వేడ నగస్త్యమౌని ♦ యామోదమునన్. ౬౮

తే॥ అపుడ రఘుకులతిలకుతో♦నశ్వశాల,కరిగి యటఁజిత్రగాత్రంబు ♦ లలర వాయు
వేగ శరవేగ మానస ♦ వేగములను, బొల్చు హయరత్నములను దాఁ♦బోలఁజూచి.

సీ॥ అమరావతిని వీడి ♦ యవనికి డిగ్గిన,వాసవతురగసం♦భవములొక్కొ
పాలవెల్లినిఁబుట్టి ♦ పరిపరివిధముల, నలరు సుధా ప్రవా♦హంబులొక్కొ
అఘహారులైనట్టి ♦ రఘువంశరాజోత్త,ముల తేటగు నసంపు♦ముద్దలొక్కొ
కలధౌతగిరిఁదెచ్చి♦కరిగి విధాత్రుండు,మూసనుదీసిన ♦ మూర్తులొక్కొ
తే॥ బాగు ఈధాళధళ్యమీ♦నైగనిగ్య, మీామెరుం గీతెరం గిట్టి ♦ యింపుసొంపు
కలదెయేగుఱ్ఱములకైన♦నిలనుజూడ, ననుచుఁదలయూఁచుచు నొకింత♦యరిగియరిగి

సీ॥ శోణగాత్రంబుల♦సొబగొందిచూడఁగ, నొప్పారు తత్తడు♦ లొక్కవంక
కస్తూరివర్ణముల్♦గలిగినల్లని చెవు,లుక్కుమీఱెడి మావు♦ లొక్క కేవ
పుటముఁదీరిన మేలి ♦ పుత్తడిఁగని యెక,సక్కెమాడెడు తేజు♦ లొక్కచోట
నీలవర్ణంబుల♦నిగ నిగలాడెడి♦యెక్కిరింతలచాలు♦ లొక్కచక్కి
ఆ॥ శబలవర్ణ మొప్పు♦జక్కులునొక తావు, పెక్కువన్నె తురికు♦లొక్క కెలన
నుండఁ గాంచి మౌని♦యుప్పొంగు చాత్మలో,నచటువాసికొంత♦యవలికరిగి. ౭౨

మ॥ అటగాంచెఁ దనలుపై నకర్ణములు, ర♦క్తాస్యంబులు న్మారుతో
త్కటవేగంబులుఁ బీతపుచ్ఛములు రా♦కాచంద్రతుల్యాంగముల్
స్ఫుటసంధుల్ శుభలక్షణంబులునునై ♦ పొల్పొందు దేహద్యుతి
చ్ఛటలఁ జీఁకటులన్ హరింపఁదగు మే♦ల్సాంబ్రాణులన్ బెక్కటన్. ౭౩

క॥ కని పరమానందంబునఁ, దనువునఁ బులకాంకురములుఁ ♦ దనర వివశుఁడై
వననిధిశోషణముని యా,వననిధి గర్వాపహరునిఁ♦బలికె దృఢముగన్. ౭౪

తే॥ యజ్ఞయోగ్యంబులైన యీ ♦ హరులనెన్ని
మార్గుఁగన నేత్రముల కిసు ♦ మంతతృప్తి
కలగలే దిట్టివెందైనఁ ♦ గలవెయవియు
నెన్నియో యుండె నీభాగ్య ♦ మేమనందు. ౭౫

ఉ॥ తప్పక నశ్వమేధమును♦దక్షుణమే యొనరింపఁ బూనుకొ
మ్మిప్పుడ యజ్ఞశాలరచి ♦ యింపఁగఁబంపుము శిల్పవర్యులన్
జెప్పెడిదేమి యన్నియును ♦ జేర్పుము వేసవనార్థవస్తువుల్
చెప్పఁగఁబంపు మౌనులకు ♦ సేవకులన్ నిజబంధుకోటికిన్. ౭౬

క॥ తపనుఁడువోలె దైత్యులను ♦ దాపమునొందఁగఁజేసి యాత్రివి
ష్టపపతిమాట్కిఁ బెక్కులగు ♦ జన్నములొప్పఁగఁ జేయుచున్ భవ
దీపుల నడంచి జన్యముల ♦ శ్రీమదనంత సుఖైకభోగముల్
సపరిజనుండవై కుడిచి ♦ సద్యశ మాశలయందు నింపుమా. ౭౭

ఇట్లు మృదుమధుర గంభీరంబులుగఁ బలుకు నయ్యగస్త్య మౌనీంద్రు వచనంబుల కత్యంత పరితుష్టాఖిలేంద్రియుండై రాముండు వసిష్ఠాది మునిగణంబులతో సరయూనదిం జేరి తత్తీరంబునఁ జతుర్యోజన సమచతురంబగు ప్రదేశంబున.

—♦ రాముని అశ్వమేధ ప్రారంభము ♦—

మంచిలగ్నంబున ♦ మంత్రిపూర్వకముగా, బంగరు నాగంట♦ బరగదున్ని
యందు మంటపము ల♦త్యంతసుందరములు, గావసిష్ఠునియాజ్ఞఁ♦ గట్టఁబంచి

మూఁడుకుండంబులు ♦ మూఁడేసిమేఖల, లొప్పఁగట్టించి యథోచితముగ
స్వర్ణరంభాస్తంభ♦సరణులఁ గీలించి, ముత్యాలచందువా♦ లొప్పందుపరచి
తే॥ సర్వయజ్ఞీయవస్తువుల్ ♦ సంతరించి, యుండునంతట నవ్వసి♦ష్ఠుండు శిష్య
వర్గములచేత సవనంపు♦వార్తఁ దెలియఁ, జేయవచ్చిరి మునులు స♦శిష్యులగుచు.

వ॥ వారల నెఱింగించెద వినుము. నారదుండును, నసితుండును, బర్వతుండును, గపిలుండును, జాతుకర్ణుండును, నాంగిరసుండును, నార్ష్టిషేణుండును, నాసురియు, నత్రియు హారీతుండును, యాజ్ఞవల్క్యుండును, సంవర్తుండును శుకుండును నీమొదలగువారలు హయమేధదర్శనోత్సుకులై రా రామభద్రుండు వసిష్ఠాదులతో నెదురుగాఁజని యర్ఘ్యాద్యులంబూజించి గోహిరణ్యంబు లొసంగి తోడ్తెచ్చి యర్హాసనాసీనులను జేసి కృతాంజలియై యిట్లనియె.

ఆ॥ తాపసేంద్రులార ♦ దయ మీరు విచ్చేసి, నన్గృతార్థుఁజేసి ♦ నా ర్కోరంత
లేక మఖముసేయఁ ♦ జేకురె నిఁక దీని, భార మీరు పూన♦వలయు సుండు. ౮౧

ఆ॥ అనుచుఁ బఙ్క్తికంఠ ♦ రారి మానులతోడఁ, గొంతవడికు నిష్ట♦గోష్ఠి సలిపి
ధర్మపద్ధతులను ♦ దద్దయుఁజెప్పుఁడనఁ, దెల్పి రరసి కొన్ని ♦ తేటపడఁగ. ౮౨
వ॥ అనుటయు వాత్స్యాయనమునివరుం డహికులేశ్వరుంగని యిట్లనియె. ౮౩

—♦ మునులు రామునకు ధర్మంబులు సెప్పుట ♦—

క॥ ఏయే ధర్మంబుల భూ,నాయకుఁడు వినంగఁ గోరె♦నారద ముఖ్యుల్
పాయక యెవి చెప్పిరి యవి, నాయెడ దయయుంచి చెప్పుము ♦ నాగకులేంద్రా. ౮౪

క॥ అనుటయు శేషుం డిట్లను, జననాథుండట్లు ప్రశ్న♦సలుపఁగ మానుల్
వినుమయ యవధానంబుగ, ననుచుఁ వచియించి రిట్లు ♦ సాదర ఫణితిన్. ౮౫

సీ॥ అగ్రజన్ముఁడు యజ♦నాధ్యయనాదులు, సలుపుచు నెప్పుడు ♦ మెల గవలయు
నాగమోత్సర్జనం ♦ బనువుగ నొనరించి, పైని గార్హస్థ్యంబుఁ ♦ బూనవలయు
విప్రుఁడెన్నఁడును శ్వ♦వృత్తియు నీచసే, వానుజీవనమును ♦ మానవలయు
నెఱిఁగిధర్మంబుల ♦ ఋతుకాలములయంద, కువలయాక్షుల గృహి♦కూడవలయు
తే॥ యువతిఁ బవలునఁగూడ నా ♦ యుఃక్షయంబు, శ్రాద్ధదినముల సర్వప♦ర్వంబులందు
మోహవశమున మగువలఁ♦బొందువాఁడు, ఘోరనరకంబులందునఁ♦గూలుఁజుమ్ము.

క॥ ఋతురాత్రులలోనే తన, సతిఁగూడినవాఁడు బ్రహ్మ♦చారియ నిక్కం
బతఁడు గృహాశ్రమియా నో, సితకరవంశప్రదీప ♦ సిద్ధము వింటే. ౮౭

మ॥ ఋతురాత్రుల్పదియారు నాల్గుమొదటన్ ♦ హేయంబులౌ వాటిలో
నితరాంచత్సమ రాత్రిమూలమఖలన్ ♦ ఋక్షంబులుందక్క శ

స్తతరంబా పురుషత్రయ మందు శశిసు♦స్థానంబునం దుండఁగా
సతివల్లూడిన బుట్టు పాజ్ఞుఁడు సుతుం♦డత్యంత పుణ్యాత్ముఁడుర్. ౫౫

తే॥ ఇట్టిసంపదతోఁగూడి ♦ నట్టి చేసి, రేల నెలనాగలను బొంది♦ రేని శీల
వంతులగునట్టి కన్యలఁ ♦ బడయఁగలరు, కాన బురుషులు విధిమెలఁ♦గంగవలయు.

ఆ॥ ఆర్షమను వివాహ♦మందు రెండావులఁ, గొనుట గన్యకలకుఁ ♦ గూడుఁగాని
యన్యమునగు శుల్క ♦ మణుమాత్రమైనను, బడసి నరకమందుఁ ♦ బడి తపించు.

ఆ॥ బ్రాహ్మణులకు నెప్డు ♦ వాణిజ్యమును వేద,విక్రయముఁ గ్రియాన ♦ పేతమైన
కుకరపీడనంబు ♦ కువలయంబున నధః, పతన హేతువులు కృ♦పాసముద్ర. ౯౧

కల్యాణి॥ అన్నము నీరము మూలఫలంబుల ♦ నర్థులకిచ్చిన వారిన్నమా
అన్ని శ్రుతుల్వ్రతియించిన విప్రుల ♦ కర్చనసేయుచు భక్తిగ మే
ల్సన్నని బంగరుశాలులుమీఁదఁ బ♦సందుగఁ గప్పుచు దూడలతో
నెన్నఁగశక్యముఁగాని సుగోవుల ♦ నిచ్చినపుణ్యముఁగండ్రు సుమా.

తే॥ పఙ్క్తి మొదటను బీఠంబు♦పై వసించి, అందఱునుజూడ నన్నంబు♦ముందు మెక్క
వాఁడు తనపుణ్యమంతయు ♦ వారికిచ్చి, వారిపాపంబులనుదాను ♦బడయునిజము

తే॥ మధ్యసలిలంబు తృణము భ♦స్మంబునగ్ని, దారినిమ్నస్థలంబును ♦ స్తంభమిందు
నొక్కటుండిన దుష్కృతం ♦ బుండదనిరి, పఙ్క్తివేరగు కతన నృ♦పాలతిలక! ౯౪

సీ॥ అభ్యాగతుండు ని♦రాశుఁడై యరుగుచోఁ, గులపతిపుణ్యంబుఁ ♦ గొంచుఁబోవు
పితృదేవ నరుల క♦ర్పించి భుజించిన, శేషాన్నమమృతంబు ♦ సిద్ధ మొరుల
కేరికిఁబెట్టక ♦ నెలమిఁ దాఁ దినునది, యన్నంబుకాదది ♦ యఘము సుమ్ము
పదునాలుగారు నె♦న్మిది ముప్పదితిథుల, నఘముందుఁ దైలంబు ♦ నందుఁగాన
తే॥ గూడ దభ్యంగనముఁగాంతఁ♦గూడరాదు, క్షౌర మాతిథులందుఁ ద♦గదుమ చెప్డు
భార్యతోఁగూడభుజియింపఁ♦బాడికాదు,కూడదురజోవతులతోడఁ♦గూటమియును

సీ॥ ఉన్న తాసనమున♦నుండుచు నేకవ,స్త్రంబుతోడ భుజింప ♦ రాదు కుడుచు
తలిరుబోడులఁజూడఁ ♦ దగ దనలమునోటి, గాలితోఁజ్వాలయింపఁ♦గాదు చీర
గట్టకయున్నట్టి♦ కాంతను గానరా, దరకాండ్లు గాచరా ♦ దగ్నిలోన
నెపుడుఁగూడదు జీవ♦హింస సంధ్యాద్వయి, నాహారనిద్రల ♦ త్యంతపాప
తే॥ దాయకము లింద్రచాపంబు♦దగదుచూప, రాత్రిఁ బెరుగుఁబవల్ సార♦రహితవస్తు
సేవనంబొప్ప దన్యోప♦ సేవ్యములగు, వస్త్రపాదుకలధరింపఁ♦బాడికాదు. ౯౬

క॥ తినరాదు దూషితాన్నముఁ, దినఁగూడదు భిన్నమైన ♦ తెలియం దన్నం
బనరాదు మొదవుపాలను, ఘనముగనిచ్చునని యెప్డు ♦ కాకుత్స్థవరా.

తే॥ కంచుపళ్లెములోఁ బద♦క్షాళనంబు, నార్ద్రపదములతోఁ బీఠి♦నధివసింప
నశుచివస్తువు వేయుట♦యగ్నిలోనఁ, దగదు తినుచన్నమును దన ♦ తల స్పృశింప.

తే॥ పురుషులో రఘువరదీప ♦ హారణమెపుడు, కలువకంటులు కూష్మాండ♦ఖండనంబు
సేయఁదగ దవి తెలియక ♦ చేసిరేని, శీఘ్రముగఁ గల్గు వంశవి♦చ్ఛేదనంబు.

క॥ కూడదు పరుండి తినఁగాఁ, గూడదు నరనుతయు నెన్ని♦కోటులొసఁగినన్
గూడదు సిందించుకొనన్, గూడదు పరమర్మ మెంత♦కోరినఁ జెప్పన్.

తే॥ మ్రొక్కఁగారాదు ప్రీతిన♦భ్యుద్యతునకు, మెక్కఁగారాదు రాత్రుల♦ వెక్కసముగ
మెక్కి ప్రక్షాళనము లేక♦ మెలఁగఁగూడ, దతిగఁ దార్యత్రికప్రియుం♦డగుటఁదగదు.

తే॥ ఇటుల గార్హస్థ్యధర్మంబు ♦ నెలమిఁ గడిపి, యాలికలవాఁడు లేనివాఁ♦ డైనమూఁడ
వాశ్రమముఁ గోరిచేరి మ♦హావనంబుఁ, బుండరీకాక్షు ధ్యానింపు♦చుండవలయు.

వ॥ ఇట్లు తపోధనులవలనఁ బరమధర్మంబులు వినుచున్న రామచంద్రుంగాంచి వసిష్ఠుఁ డిట్లనియె.

క॥ చనుదెంచె వసంతంబిఁక, నొనరఁగ హయమేధయత్న♦ మొనరింపవలెన్
గనకమయంబగు ధరణీ, తనయాన్వితముగను దీక్షఁ దాల్పుము రామా. ౧౦౪

ఆ॥ బ్రాహ్మణోత్తములను ♦ రావింపు మఖిలసా, మగ్రి సిద్ధఁబరుప ♦ మన సుమిత్ర
కొడుకుతోడఁ జెప్పు ♦ కుండమంటపములఁ, గట్టుటకును శిల్ప ♦ కరులఁ బంపు. ౧౦౫

కం॥ కడుశూరులతో జన్నఁపు, బడివాగెను దేరఁబంపు ♦ భటులను బెలుచన్
గెడపు మఖిలభోగంబుల, గడుపుము కాలంబుఁ బుణ్య ♦ కర్మంబులచేన్ ౧౦౬

వ॥ అనుటయు రాఘవుండు లక్ష్మణుంగని యిట్లనియె. ౧౦౭

ఉ॥ వింటివ లక్ష్మణా! తెలియ ♦ వీరలు తెల్పినమాటలెల్ల నే
డొంటరమింటరంబు లెవి ♦ యుండఁగనీయక నిర్వహించు బల్
దంటల నయ్యయిక్రియలఁ ♦ దద్దయు నిల్పిమహాధనుర్ధరుల్
వెంటను రాఁగ దెమ్మిటకు ♦ వీతిని వేసపరిచ్ఛదంబుగన్. ౧౦౮

చ॥ అనవిని లక్ష్మణుండుఁ బను ♦ లందఱికిన్ నియమించి కాలజి
త్తను తమ సైన్యనాథుఁ దన ♦ యంతికసీమకుఁ బిల్వఁ బంచి దే
వ నరవరేణ్యమౌళిమణి ♦ వారలసత్సుషమాపరీతప
ద్వనజుని రాము నాజ్ఞ విశ ♦ దంబుగఁ దెల్పఁగ నాతఁడయ్యెడన్ ౧౦౯

మ॥ ధ్రువకంబుల్పది కల్గి లక్షణములన్ ♦ దీపించు సామ్రాణిమే
ల్పవడంబుల్ రతనాలు ముత్తెములచే ♦ బాగొప్పఁ గైసేసి వా

రువముల్ తేరులుబంటు లేన్గులబా ♦ రుల్వెంట రాఁగాలజి
త్తు వరచ్ఛత్రి పతాకచామరలతోఁ ♦ దోడ్తెచ్చెఁ దచ్చాలకున్. ౧౧౦

వ॥ అంతరామభద్రుండు గాత్రస్వర సీతాసమన్వితుండును గుశాస్తరణాసీనుండును, మేఖలాజిన దండధారియునైయుండ వసిష్ఠుండు బుణ్యాహంబొనరించి వల్మీకసంభవుండధ్వర్యుండు, నగస్త్యుండుబ్రహ్మయుఁ, గణ్వుండు ద్వారపాలుండునుఁగాఁ దానాచార్యుండై హయమేధక్రమంబు సక్రమంబుగ నుపక్రమించి. ౧౧౧

సీ॥ క్రతుశాలకిందద్రి ♦ ద్వారమందున దేవ, లాసితులను నుంచి ♦ యత్రికశ్య
పుల దక్షిణంబున ♦ నిలిపి జాజలిజాతు, కర్ణులఁబడమట ♦ గవసి నుంచి
ద్వితు నేకతుఁగుబేర ♦ దిగ్ద్వారముననిడి, మూడగ్నులనుగ్రమ♦ముగనుగుండ
ములయందు విధ్యుక్త ♦ ముగఁబ్రతిష్ఠించి స,మంత్రకంబుగ వేల్చి ♦ మహిత తురగ
తే॥ రాజమర్పించి దివ్య నీ♦రాజనముల, నిచ్చి శత్రుఘ్న సేనాస♦మేతముగను
వీతితోఁ బోవనియమించి ♦ శాతకుంభ, పట్టమొక్కటి నుదుటను ♦ బరగఁగట్టి.

మ॥ సకలోర్వీరమణప్రకాండమకుటాం♦చద్రత్న నీరాజితాం
ఘ్రికబంధోద్భవుఁ డార్యసత్తముఁడు వై♦రిక్షోణినాథేభసిం
హకిశోరుండగు రామచంద్రహయమే ♦ ధాశ్వంబు దీనిన్ సము
త్సుకతన్ శూరులువట్టుఁడున్న ధనరా♦సుల్దెండు గాకుండినన్. ౧౧౩

క॥ శత్రునృపాలవనానిల, మిత్రుఁడు లవణాంతకుఁడు సు♦మిత్రాసుతుఁడౌ
శత్రుఘ్నుఁడు వచ్చెడివాఁ, డ క్షత్రియవరులార యీమ♦ఖాశ్వము వెంటన్. ౧౧౪

వ॥ ఇట్లరుంధతీవల్లభుండీ మొదలగు బిరుదుపద్యంబులు వ్రాసినవనాశ్వంబు విడిచె నంత శ్రీరాముండు శత్రుఘ్నుం గాంచి యిట్లనియె. ౧౧౫

— ♦ తురగంబువెంటఁ జనుశత్రుఘ్నునితో రాముఁడు నీతులు జెప్పుట ♦ —

ఉ॥ తమ్ముఁడ ! వీతివెంటను ర♦థద్విరదాది చమూయుతంబుగాఁ
బొమ్ము సమస్తభద్రములఁ ♦ బొందుము మార్గము నందు బెన్బలి
ష్ఠమ్ములు వైరికర్షణ దృ♦ఢంబులగున్ భవదీయబాహువుల్
గొమ్మజయంబుయుద్ధమునఁ ♦ గూల్చుము యోధులఁ బెక్కుభంగులన్. ౧౧౬

ఉ॥ కాతరులన్ వివస్త్రలను ♦ గర్మ్మల నమ్రుల భ్రష్టులన్ రుజో
పేతుల దూతలన్ విరథ♦వీరుల సుప్తులఁ గావుమంచు నిన్
చేతులు మోడ్చువారి వధ ♦ సేయఁగరాదు వధించినట్టి యా
ఘాతకులెల్ల ఘోరనర♦కంబులఁ గూలి తపించెదర్జుమా. ౧౧౭

సీ॥ పూజ్యులఁదప్పక ♦ పూజింపుచుండుము, కూడదు నీచునిఁ ♦ గూడ నెప్పుడు
దయకల్గియుండు మి♦తరధనకాంతల, యందును భ్రాంతినిఁ ♦ జెందవలదు
గోవిందభక్తుల ♦ గోబ్రాహ్మణులఁగని, యభివాదనమొనర్ప ♦ నందుశుభము
వృద్ధులప్రేరణ ♦ యుద్ధమునకుఁ బోయి, కొమ్ముజయంబును ♦ గుణోవి కమ్ము
ఆ॥ విశ్వనాథుసాక్షి ♦ విశ్వంభరుని విష్ణు, స్వాంతమందుఁ జేర్చి ♦ నట్టి భక్త
లచ్యుత స్వరూపు♦లై దరింతురుకాన, వారిదర్శనంబు ♦ పాపహరము. ౧౧౮

తే॥ స్వీయపరకీయ భేదంబు ♦ సేయకెపుడు, శత్రుమిత్రులయెడ బుద్ధి ♦ సమతఁజేసి
పద్మనాభుని భజియించు ♦ భక్తవరులు, పావనునిఁజేయఁ గల రెంత ♦ పాపినైన.

ఉ॥ భాగవతంబు నందుఁదగు ♦ బ్రాహ్మణులందును భక్తికల్గు వా
రాగమవాక్కులందునన ♦యంబు స్వధర్మమునందు రక్తులున్
నాగశయాను డీ కుభువ♦నంబుఁ బవిత్రముసేయ నెంచి తాఁ
బాగుగఁ బంపినట్టి వర ♦ పావనమూర్తులుగాఁ దలంపుమా. ౧౨౦

తే॥ వనజ నాభుని నామంబు ♦ వక్త్రమందు, నిందిరాధవు రూపంబు ♦ డెందమందు
మదనజనకుని నైవేద్య ♦ ముదరమందు నున్నశ్వపచుఁడు శ్రీవైష్ణ♦వోత్తముండు.

కం॥ మాధవ వాణీధవ గౌ, రీధవుల కభేదమనియె♦తేఁగికొల్చెడు నా
సాధుజనుల శ్రీపదరజ, మాధిహరంబనుచు మస్త♦మందునఁ దాల్తున్. ౧౨౨

కం॥ గౌరీగంగాలక్ష్ములు, వేరెన్నఁడుగారనే వి♦వేకముఁగలవా
ర్సారపురాగతె పావన, పూరుషులుగఁదలఁపవలయుఁ ♦ బురుషవరేణ్యా! ౧౨౩

కం॥ శరణాగతరక్షకుఁడును, బరమానముఁగాచునట్టి ♦ పరమార్థవిదుం
డరవిందాక్ష ప్రీతిగఁ' బరులకెదో యిచ్చువాఁడు ♦ వైష్ణవుఁడుసుమా. ౧౨౪

తే॥ కేశవ పవిత్రనామ సం♦కీర్తనమునఁ, బాపభూధరములు పటా♦పంచలగును
గాదె యామాధవునిపాద♦కమలములను, దలఁచువాఁడెడ వైష్ణవో♦త్తముఁడుగాదె.

కం॥ పరభామను గరవాలముఁ, బెరధనమును లోష్టముగను ♦ వీక్షింపుసుమా
కరణంబులను జయింపుము, మఱవకుమా నాదుమాట ♦ మదిశత్రుఘ్నా. ౧౨౬

కం॥ ఈవడువున శ్రీరాముఁడు, బావనుశత్రుఘ్నుఁ గూర్చి ♦ పలికి ప్రియమునన్
దీవనలిచ్చుచు వీర, త్స్నవరులన్ గాంచి యనియె ♦ మానివరేణ్యా! ౧౨౭

ఆ॥ శూరులారనాదు♦సోదరుతోఁ దురం, గంబు వెంటబోవఁ♦గల్గు దిట్ట
యెవఁడు పోయిరిపుల ♦ నెదిరించువాఁడు నా, హస్తవీటకంబు ♦ నందవలయు. ౧౨౮

క॥ అనుటయు వెంటనెభరతుని, తనయుఁడు బుష్కలుఁడువచ్చి ♦ తగమ్రొక్కుచు రా
ముని కరకంజమువలనన్, గొనియెను వీటకము నృపులు ♦ కొనియాడంగన్. ౧౨౯

వ॥ ఇట్లు తాంబూలంబుఁ బరిగ్రహించి రామచంద్రుంగాంచి యిట్లనియె. ౧౩౦

శా॥ స్వామీ! నాపినతండ్రితోఁ గవచినై ♦ శస్త్రాస్త్రయుక్తుండనై
ప్రేమంబెప్పుడునాయెడన్ గలుగఁగా ♦ వెన్వెంటనేయుండి త
త్క్షేమంబారయుదు న్వనుల్ గలుఁ గఁగాఁ ♦ జేదోడువాదోడుఁగా
నేమంబొప్పఁజరింతు ఘోటకముపై ♦ నేనొక్కకన్నుంచెదన్. ౧౩౧

మ॥ జనకా నీదుప్రతాపమే సకల మీ♦సర్వాంసహాచక్రముల్
జెనుపారంగ జయింపఁగాఁగలదు సూ♦పేర్కొంటకే మేము మీ
రనుకంపాయుత దృష్టి న న్గనిన దై♦త్యాదిత్యమర్త్యాళి నో!
యినవంశోత్తమ విన్ము నేనొకఁడనే♦ యేడాటలాడింపనే. ౧౩౨

వ॥ అనుటయు రాముండు బుష్కలుంగని. ౧౩౩

తే॥ వత్స! యంతటివాఁడవే ♦ బాగుబాగు, సంతసించితి నీ ధైర్య♦సంపదలకుఁ
బొమ్ము సకలశుభంబులఁ♦బొందుమనుచుఁ, బవనసంభవుఁ గన్గొని ♦ పలికె నిట్లు॥

శా॥ ఆటంకంబు మఱేమిలే కపుడు నా♦కై దేవతుల్మెచ్చఁగాఁ
దాటంగంటివి యా సముద్రమును నా♦తంకంబు లే కందుచేఁ
దాటంగంటి విపత్సముద్రము జగ♦త్ప్రాణాత్మజా నే నిరా
ఘాటంబొప్పఁగ రాజ్యసౌఖ్యముల నేఁ♦గన్నాఁడ నీయండచేన్. ౧౩౫

మ॥ విను నిన్నెంత నుతింపరా దిపుడు నే ♦ స్త్రీయుండనే యాట నా
యనుగుందమ్ముఁడు నొవ్వకుండఁ దరి సా♦హాయ్యంబుఁగావింపుమా
నిను నేనమ్మికయున్నవాఁడ మదిలో ♦ నీ పీభరం బూనుమా
చనుమా యెట్టిబొంకంతలేక గ్రతువున్ ♦ సాగింపఁగాఁ జూడుమా. ౧౩౬

శా॥ ఓ సుగ్రీవగవాక్షనీల ద్వివిదా ♦ యో జాంబవంతా నలా!
మీ సాహాయ్యముఁగోరినాఁడ దయతో ♦ మీ రందఱుంగూడి యీ
భూసంచారము సేయఁబోవు వారితో ♦ మోదంబునన్ బొందు సం
త్రాసంబున్ గలిగించి వైరులకు, మో♦దంబొప్ప రం డాఢ్యులై. ౧౩౭

వ॥ ఇట్లు గజ గవయ గంధమాదన పనస దధిముఖాంగదాది కీశవరులకుం జెప్పి సుమంతుం బిలిపించి. ౧౩౮

తే॥ మంత్రివరయిచ్చటున్నల ♦ మనుజపతుల, యందు సవనాశ్వపరిపాల ♦ నార్హు లెవరు
తెలుపుమావీరిలోనీకుఁ ♦ దెలియనట్టి, వారు లేరుకదా? యనఁ ♦ బలికెనిట్లు. ౧౩౯

—♦ సుమతి రామునితో హయంబువెంటఁ బోఁ దగినవీరులం దెల్పుట ♦—

సీ॥ రాఘవ యానీల ♦ రత్నభూపతిమహా, వీరుఁడు మేటి మ♦హారథుండు
నొక్కఁడేయోధుల ♦ నొకలక్షఁబరిమార్పఁ, గలదుదశాక్షౌహి♦ణులబలంబు
అడుగో ప్రతాపాగ్ర్యుఁ ♦ డతఁడరిగిరి వజ్రి, యఖిలాస్త్రవేత్త స♦వ్యాపసవ్య
బాణసంధానైక ♦ పటుఁడిర్వదక్షౌహి, ణులుకలవాఁడతి ♦ బలుఁడువాఁడె.
ఆ॥ వీడుబావ సింహ ♦ నిభవిక్రముండు ల, క్ష్మీనిధి ప్రతాప ♦ కీలి బ్రహ్మ
వలనవడసెబ్రహ్మ ♦ వైష్ణవపాశు ప, తాసురాది ఘోర ♦ వాస్త్రములను. ౧౪౦

తే॥ లెక్కలేనట్టివీరుల ♦ నొక్కఁడితఁడె, నుక్కడంగింపఁజాలిన ♦ మొక్కఁడగుటఁ
గలదొకాక్షౌహిణీమాత్ర ♦ మలతిసేన, యిపుడులక్ష్మీనిధి రసా త♦లేశ్వరునకు.

మ॥ స్వపితృప్రఖ్యాతిమేఘముక్త విశిఖా ♦ సారప్రశాంతారి రా
ట్తపనుండౌ రిపుతాపుఁడన్ నృపతి యే♦తన్మాతృఁడే తత్సముం
డపరేశానుఁడు జన్యమం దమితసే♦నాధ్యక్షుఁ డుగ్రాశ్వుఁడీ
నృపులందర్భవదీయ సోదరునిదా♦రిన్పోవువారే సుమా. ౧౪౨

క॥ శిరమున శత్రుఘ్నాజ్ఞను, ధరియించుచు నీసమస్త ♦ ధరణీనాథుల్
తురగముతోఁ బోవఁగఁ దే,వరయానతిఁ గోరుచున్న ♦ వారు మహాత్మా! ౧౪౩

క॥ అనినచివుండిటువలుకఁగ, వినిపరమానందమొంది ♦ విభుఁడానృపులన్
గనిమీరందఱు శత్రు,ఘ్నునితో హయపాలనంబు ♦ కొఱకఱుగుఁడనన్. ౧౪౪

క॥ ఆరాజన్యులు జన్యము, గోరుచునుండెదరుకానఁ ♦ గోదండులుఁదూ
ణీరులుఁగవచులునై రఘు, వీరులకడకఱిఁగి రమిత ♦ విభవంబులతోన్. ౧౪౫

వ॥ అంత. ౧౪౬

సీ॥ తాపసప్రోక్తవి♦ధంబున నందఱఁ, గ్రమముగ నర్చించి ♦ రామభద్రుఁ
డాచార్యునకు షష్టి♦హాయన ద్విరదంబొ, కండుముక్తామాలి ♦ కావిరాజ
మానాశ్వమొక్కటి ♦ మణిరత్నఖచితంబు, యుగ్యచతుష్టయ ♦ యోజితంబు
నఖిలవిభోపస్క♦రాఢ్యమై యొప్పు కా, ర్తస్వరమయల స♦ద్రథమొకండు
తే॥ మౌక్తికతులాశతంబు స♦న్మణులులక్ష, వేయితులముల స్ఫుటలస♦ద్విద్రుమముల
వివిధసస్యోపపన్నంబు ♦ వివిధమంది, రాఢ్యగ్రామంబొకండిచ్చె♦నర్హవిధిని.

క॥ అరుదుగ బ్రహ్మాధ్వర్యుల, కిరువుర కట్లొసఁగిభక్తి ♦ ఋత్విజులకు నె
ల్లర కర్హాభంగి నిచ్చి య,పరిమితధనమితర విప్ర♦వరుల కొసంగెన్. ౧౪౮
వ॥ ఇట్లు రామచంద్రుండు భూదాన గోదాన హిరణ్య దానాదు లనేకంబులొసంగి
వారివలన నాశీస్సుల నొందుచుండె నప్పుడయ్యజ్ఞంబున, ౧౪౯

సీ॥ ప్రొద్దుపోకకుమున్న ♦ భోజనంబులు సేయ, విచ్చేయుఁడనుచును ♦ వేఁడువారు
వచ్చినవారికి ♦ వెచ్చనినీరు స్నానాలు సేయఁగనీయఁ ♦ జాలువారు
స్నాతులుఁగట్టఁగ ♦ సన్నంపు తెలిపట్టు, పుట్టముల్ పీటలఁ ♦ బెట్టువారు
పఙ్క్తులుతీరిన ♦ వారికి నరటాకు, విస్తళ్లు వెంటనే ♦ వేయువారు
తే॥ పప్పుఁగూరలు వడియంబు ♦ లప్పడంబు, లావడలు లడ్డులుం గారె♦ లతిరసములు
నేతులుం బెర్గు మొదలైన ♦ నిఖిలవస్తువులను వడ్డించువారైరి ♦ పురజనములు.

క॥ ఫలములుఁ బాయసములు మీ,ర్వలసినయవి బుచ్చుకొనుఁడు ♦ బరితృప్తిఁగనన్
బలుకులుఁ జాల్వద్దనియెడు, పలుకులు వినఁబడుచునుండుఁ♦బగలన్ రేలన్. ౧౫౧

ఉ॥ ఎప్పుడు వంటయింట నొక ♦ యింధనముండదు నిప్పునీరులే
దన్నఁపుఁ బర్వతాలుఁ బర♦మాన్నహ్రదంబులుఁ బప్పు ధప్పళాల్
గుప్పలుఁగాగ భక్ష్యములుఁ ♦ గూరలరాసులుఁ బ్రొద్దురాకకున్
దప్పకయుండు వాడినను ♦ దగ్గవు వేకువదాఁక నిత్యమున్. ౧౫౨

క॥ త్రిదశులగవిఁ ద్రిదశులమణిఁ, ద్రిదివేశ్వరునడిగి తెచ్చి ♦ త్రిదివనగంబున్
బదిలముగనుంచె రాముఁడు, కొదవయగునె యన్న మెన్ని♦కోటులకిడినన్. ౧౫౩

వ॥ అంత శత్రుఘ్నుండుఁ దల్లికడకుం జని సవినయంబుగ మ్రొక్కి యిట్లనియె. ౧౫౪

శా॥ అమ్మా నేఁ జనుచున్నవాఁడ నిపుడా♦యజ్ఞీయవాహంబుతో
నిమ్మా నాకు ననుజ్ఞ నీ కృప రిపూ♦ర్వీశావళిం ద్రుంతు వే
యిమ్మాశీస్సులఁ దద్బలంబునను నే♦నేతెంతు క్షేమంబునన్
దెమ్మా నా విలు నమ్ములన్ గవచముం ♦ దీవించి నాకీయుమా. ౧౫౫

కం॥ అనుటయు సుమిత్రి పుత్రుం, గని యనెఁ బుష్కలుని నెట్లు♦కనెదో తనయా
యనుపమబలుఁ డతిశూరుఁ డ,గునుగాని యతండుఁ జాల ♦ కుఱ్ఱఁడు సుమ్మా.

తే॥ ఇట్టి పుష్కలునితోడ నీ ♦ వేగితేని, నాదుమానసమునకు నా♦నంద మొదవు
వత్స! కాకున్న నేదుఃఖ♦భాజనగుదు, సర్వశుభములు నీకును ♦ సంఘటించు. ౧౫౭

వ॥ అనుటయు శత్రుఘ్నుం డిట్లనియె. ౧౫౮

తే॥ తల్లి నీయాజ్ఞ నాదు నౌ♦దలధరించి, పుష్కలుని నిజధనముగాఁ ♦ బ్రోచువాఁడఁ
గరుణదీవించి ననుబంపు ♦ కొఱఁతయొకటి, కలదె పేరున కనువుగ♦ మెలఁగుదనిన.

వ॥ అప్పుడు సుమిత్రి పాదప్రక్షాళనంబుఁ జేసికొని వార్చి శుచియై వత్సా నిన్నహోరాత్రింబులు సకలదేవతలు, గ్రహంబులు సర్వకాల సర్వావస్థలయందు రక్షించెదరుకాక యని యాశీఃపూర్వకంబుగా రక్షయొనర్చి పంప శత్రుఘ్నుండు సకల

మునిజనసంసేవ్యమానుండై దీక్షితుండై యున్న రామభద్రుఁ జూచి నమస్కరించి హయపాలనార్థం బరుగుచున్నవాఁడ శెలవొసంగుం డను తమ్మునింగాంచి యతం డిట్లనియె. ౧౬౦

తే॥ బాలురఁ బ్రమత్తులును శస్త్ర♦వర్జితులును,దమ్ముఁడా! స్త్రీలఁ జంపఁగాఁ♦దగనివార
లనుచుఁ జెప్పఁగ నగి విదే♦హాత్మజాతుఁ, డక్షిచలనంబు సేయుచు♦ననియె నిట్లు

— ♦ లక్ష్మీనిధి రామునితో మేలమాడుట ♦ —

ఆ॥ దశరథాత్మజాత ♦ ధర్మపరాయణ, యనుజ మనుజులందు ♦ నధికుఁగాఁగ
శిక్షసేయు మన్న♦చేసిన నాతఁడు, జేసి పుణ్యపదవిఁ ♦ జెందుఁగాత. ౧౬౨

మ॥ వెతలన్ బెట్టినఁ గూడదంటివికదా ♦ విప్రావమానంబు నీ
పితచంపెన్ బితృసేవనానిరతు స♦ద్విప్రుం ద్విలోకైక గ
ర్హితమా స్త్రీవధఁ జేసితీవు ఘనకీ♦ర్తింగాంచెనీ సోదరుం
డతివన్ జేసి విరూపినేర్పడర నా ♦ హా కోసి ముక్కుం జెవుల్. ౧౬౩

క॥ ఇతఁడన్యుఁడె శత్రుఘ్నుం, డతిబలుఁడును నీదుతమ్ముఁడౌ నీశిక్షన్
వితథంబుగఁజేయునె చే, సి తనదుకులధర్మమెడలఁ ♦ జేయునె చెప్పుమా. ౧౬౪

ఆ॥ ఇటుల మేలమాడు ♦ పెరిఁగి శ్రీరాముఁడు, ముఖమునందు నగవు ♦ మొలకలెత్త
బలికె జలద నినద ♦ పటుభాషణంబుల, మరది వినగ యోగి ♦ వరులజూచి. ౧౬౫

సీ॥ శాంతులుసుఖదుఃఖ ♦ సములు సంస్కృత్యకూ, పారసంతారణో ♦ పాయవిదులు
వినుఁడు శాస్త్రార్థకో ♦ విదులు ధనుర్ధరుల్, వీరులౌ వారికి ♦ విశదమగును.
భండనవార్తభ♦వాద్భృశులకు నగో,చరముత్పథ ప్రవి♦సారిణులఁ బ
రోపతాపనులఁ బ♦రోపకారులున్నృపుల్, మడియఁజేయుటతగు ♦ నెడరుఁగాంచి

తే॥ అనుచరిం దముఁడౌ లక్ష్మ♦ణాగ్రజుండుఁ, బలుకనందరు నవ్విరి ♦ కలశజన్ముఁ
డంతనశ్వంబువిడవఁగా ♦ నావసిష్ఠుఁ, డశ్వమునుఁ జేతనిమురుచు♦ననియెనిట్లు.

క॥ తురఁగమ యాగార్థము దిన,కరకులతిలకుండు విజయ♦కాంక్ష విడిచె నిన్
ధరణీతలమంతయు వ♦త్సరము తగన్ దిరిగి మఱల♦నరగున రమ్మా. ౧౬౭

వ॥ అంతనాతురంగంబు సకలశస్త్రాస్త్రకోవిదులగు ధనుర్ధరులు చతురంగబలములతో వెంటనరుదేర మరుద్వేగంబునఁ దూర్పుగా నడవందొడంగె, నప్పు డో! వాత్స్యాయన మునీంద్రా యేమిసెప్పుదు నాకీభూభారంబు భరించుటకు మిక్కిలి భరం బయ్యె నప్పుడు. ౧౬౮

క॥ విమలంబులయ్యె దిక్కులు ♦ క్షమయుద్భవహించె వీచెఁ ♦ గరువలి యనుకూ
లముఁగాఁగ దక్షిణంపు భు♦జముఁగన్నును నదరెఁబావు♦శత్రుఘ్ను నకున్. ౧౬౯

తే॥ ఇట్లుజయచిహ్నములఁజూచి ♦ హృదయమందు
బొంగిలక్ష్మణునుజుండు ♦ వోవుచుండఁ
నపుడుఁ బుష్కలుఁడాత్మగే♦హమున కేగి
ప్రేయసింజూచి పలికెనుఁ ♦ బ్రియముగదుర. ౧౭౦

తే॥ రామచంద్రునియాజ్ఞ శి♦రమునఁ దాల్చి, పితఁబాలనమునకునై ♦ పిన్నతండ్రి
తోడరథమెక్కి పోవుచు♦న్నాడఁగాన, నుడిగి సంతాప మేఁజెప్పు ♦ నుడులవినుము.

క॥ అత్తలయానతి మీరకు, మత్తలు భుజియించు పిదప ♦ నాహారముఁ గొ
న్మత్తల పాటొందక త,చ్చిత్తముఁ గనిపెట్టి సేవ ♦ సేయుము తరుణీ. ౧౭౨

క॥ లోపాముద్రాది సతీ, శ్రీపాదంబులను భక్తి ♦ సేవింపుమొగిన్
గాపాడుము దీనులనెపు, డేపగిదిన్ జేయవలదు ♦ హేళన మెవరిన్. ౧౭౩

ఆ॥ ఇటులఁ బల్కుదయితు ♦ నీక్షించి తత్పత్ని మొగమునందు నగవు♦ మొలకలెత్త
గద్గదస్వరంబు ♦ గదురఁబ్రేయసి సిగ్గు, పెనగొనంగఁ బల్కె♦వినయమునను. ౧౭౪

చ॥ సవనతురంగమేమరక♦జాణతనానఁ జరింపుచుండు డా
హవమున శత్రుమండల జ♦యంబును బొందుడుఁ బిన్నతండ్రియా
లవణవిరోధియానతిఁ ద♦లం ధరియింపుడు నీదుదాసి నన్
బవరమునందుఁ దప్ప తమ♦స్వాంతమునందుఁ దలంచుఁడెప్పుడున్. ౧౭౫

ఉ॥ చెప్పెడిదేమి నన్మదినిఁ జేర్చితిరేని రణాంగణంబునన్
దప్పకవచ్చు నోటమి మ♦నంబున నుంచుడు నాదుమాట యిం
కెప్పుడు నాథ నాహృదయ ♦ మెందునఁజేరదు నిన్నుగాని మీ
రెప్పినరీతి నత్తలకు ♦ సేవలొనర్చెద భక్తిమీరఁగన్. ౧౭౬

క॥ ఏరాలులం దరిది రణ,భీరువుసతి యాతఁడొక్క ♦ వీరుఁడెయనుచున్
గేరడములు వల్కుచుననుఁ, గూరిచి చప్పటులుఁ గొట్ట♦కుండ మెలఁగుడీ. ౧౭౭

సీ॥ ఆయోధనములకు ♦ నందటికన్ననీ, వేపునముందుగ ♦ నేగవలయు
నేగిశాత్రవ సేన♦లెల్లఁ జెడ్పడునట్లు, చెలఁగి జ్యాఘోషంబు ♦ సేయవలయుఁ
జేసి తీక్ష్ణశరాళిఁ ♦ జెండాడివైరులఁ, గుంభినిఁజాలఁ బే♦ర్కొనఁగవలయు
గొని నినుఁ గనువారి ♦ గుండెలలో దిగుల్, గల్గునట్టుల మెల♦గంగవలయు
తే॥ మెలఁగి రిపువిజయుండవై ♦ మెరయ వలయు,
మెరసి మీవంశనృపులను ♦ మించవలయు
మించిదిక్కుల సత్కీర్తి ♦ నించవలయు
నించిక్షేమాన గృహమరు ♦ దెంచవలయు. ౧౭౮

చ॥ మదరిపుహృద్వి భేదన సమర్థవిరావము నీశరాసనం
బిదె రిపుకంఠలుంఠన కృ ♦ దిష్వధిపూరిత తూణధి ద్వయం
బదిగో నిజచ్ఛవిప్రమథి ♦ తాంధతమోవృజి వజ్రిసత్తను
చ్ఛదముదిగో కిరీటముల ♦ సన్మణిదీప్తమిదే ధరింపుడీ. ౧౭౯

ఆ॥ ఇటులఁ బల్కునంతి ♦ నీక్షించి ప్రేమచే, మోదవార్ధిలోన ♦ మునిఁగిభండ
నప్రచండుఁడరి వి ♦ నాశనుండతిధీరుఁ, డైనభరతసూతి ♦ యనియెనిట్లు. ౧౮౦

ఆ॥ చెప్పినట్లు నీవు ♦ చేసెదసర్వంబుఁ, జెప్పఁదగిన నుడులఁ ♦ జెప్పివీర
పుత్రిపై టివింకఁ ♦ బోలతిరో! వినువీర, పత్ని వగుటనిజము ♦ భయమువలదు. ౧౮౧

క॥ అన గాంతిమతియుస్మేరా, ♦ ననయై ధనురాది సాధ♦నము లందియుఁగ
గొనిధరియింపుచునవి మో, హనగాత్రుఁడు మెఱసె శంబ ♦ రారివిధమునన్.

క॥ అంతటఁగాంతి మతీసతి, కాంతుఁడు ననుదేరఁజూచి గళదశ్రువునై
స్వాంతంబెఱియఁగ స్వకుచో, ♦ పాంతంబునఁజేర్చి చేసె ♦ నాలింగనమున్. ౧౮౩

వ॥ పుష్కలుఁడును గాఢాలింగనంబొనరించి యిట్లనియె. ౧౮౪

ఆ॥ వీరపుత్రివిట్టి ♦ విధమున వందుర, నగునె క్షత్రధర్మ ♦ మదియకాదె
యెరుఁగఁజేయటంచు ♦ నెద నుమ్మలిక మాన్పి, నిల్పిచనియెఁదండ్రి♦నిలయమునకు.

వ॥ ఇట్లేగి.

తే॥ తల్లిదండ్రులపాద ప♦ద్మముల కెరఁగి, వారియాశీర్వచనముల ♦ వారియాజ్ఞ
నొంది తురగంబుతోఁబోవు ♦ చున్నపిన్న, తండ్రిఁజేరంగఁ జనె భర♦త ప్రసూతి.

వ॥ అంతసకలవిద్యా విశారదుండును, నన్వర్థాభిధేయుండును, రామభద్రుని ముఖ్యామాత్యుండును, మతివిజితబృహస్పతియగు సుమతియు, శత్రుఘ్నుండును, నయజితనలుండగు పుష్కలుండును మొదలగు యోధాగ్రగణ్యులతో నత్తురంగంబు క్రమంబునఁ బాంచాలకురూత్తరకురు దశార్ణ విశాలాది దేశంబులకు బోవుచుండ నక్కడక్కడ రాజన్యులు భయభక్తులు మనంబులఁ బొదల రథ గజ తురఁగాది ధన కనక వస్తువాహనంబులతో నరుదెంచి శత్రుఘ్నుంగాంచి యయ్యా త్రిలోక కంటక దశకంఠ కంఠలుంఠన దక్షుండగు రఘువీరుని యజ్ఞీయాశ్వంబిది. దీనింబట్టు వారుంగలరే? యీయఖిలసంపదలు నీరాజ్యంబులుమీయవి. మే మా రాఘవేంద్రుని దాసులమని తాము తెచ్చిన సర్వస్వంబొసంగ నవి బహుమానంబుగఁ గైకొని మీరు మా రామభద్రుని యాగంబునకు దయసేయవలయుననియు,యిది రాముని యాజ్ఞయనియు నని వారిం దోడ్కొని పోవుచుండ నత్తురంగం బహిచ్ఛత్ర పుర ప్రాంతంబుఁజేరె.

—♦ సుమతుని చరిత్రము ♦—

క॥ ఆపురము జయశ్రీలకుఁ, గాపుర మఖిలోప భోగ ♦ కామంబులకా
గోపురము నీతివిదులకుఁ, గాపురమన్నిటికి ద్వార ♦ కాపురము జుమీ. ౧౮౯

సీ॥ వర్ణాశ్రమాచార ♦ వర్తనులు స్వధర్మ, చారులైనట్టి స♦జ్జనులుఁగల్గి
రాధేయ శిబి మయూ ♦ ర ధ్వజులకున్నైనఁ, దప్పనుఁ బుట్టించు దా♦తలునుఁగల్గి
ధవుని కన్నను వేఱు ♦ దైవంబులేదని, పతినిసేవించెడి ♦ సతులుఁగల్గి
గానాభినయనాట్య ♦ కళలందు రంభోర్వ, శులనుమెప్పించు వే♦శ్యలునుఁగల్గి
తే॥ ఎప్పుడుఁ దృణజలకాష్ఠ స♦మృద్ధిగల్గి, పాడిపంటలు నఖిల సం♦పదలుగల్గి
వెండి బంగరుమానికముల ♦ నిండఁగల్గి, యొప్పు నప్పుర మొప్పుల ♦ కుప్పయగుచు.

ఉ॥ శ్రీలఁజెలంగుచుండు పురి ♦ చెంతను నొక్కవనంబు తింత్రిణీ
సాల తమాలమాలు సుర ♦ సాల విశాల రసాలతాల కు
ద్దాల పటీర నారికేళ ♦ దాడిమ మన్మథ నక్తమాల హిం
తాల జటాంశు మత్కుల వి♦దారి ముఖద్రుమ రాజితంబునై. ౧౯౧

క॥ మల్లీ ద్రాక్షాలతా శ్రీ, వల్లీబంధూకనాగ ♦ వల్ల్యాది లతా
వేల్లిత తరుమండపములఁ, నల్లలితంబైనదాని ♦ సౌమిత్రికనెన్. ౧౯౨

ఉ॥ ఆవన మధ్యసీమ నెస ♦ నాశ్వముచేర సమిత్రిహంత యా
పావని ముఖ్య సద్వ్రత పరి ♦ వారముతోఁ జనికాంచె దంత దం
తావళి నిర్మితాలయము ♦ కాస్పదమౌ విబుధాలయంబు నే
యావలకేగ దోత్రముల శిఖ♦రాగ్రమునొ విబుధాలయంబుఁదాన్. ౧౯౩

ఆ॥ చూచిచూచి దాని♦సొబగంతయునుఁదల, యూచియూచిమంత్రిఁ♦ జూచియనిమె
నీ సురాలయంబు ♦ నెవరు నిర్మించినా, రీవనంబు నగర ♦ మెవరివయ్య. ౧౯౪

క॥ ఈదేవాలయమందుండు ♦ బేదేశంబునను జూడ ♦ నిదిరత్నమయం
బేదేవత కలదిందున, నాదరమగుచుండె దీని♦నంతయువినఁగన్. ౧౯౫

వ॥ అనుటయు సుమతిట్లనియె. ౧౯౬

సీ॥ శత్రుసూదనవినుము ♦ సావధానంబుగ, వినుపింతునీకు నీ♦విధము దెలియ
సుమదాభిధేయుండు ♦ క్షోణీంద్రుఁడీ యహిచ్ఛత్రాఖ్యపురికి నీ♦శ్వరుఁడితండు
కట్టించియీగుడి ♦ కామితార్థప్రదా,యిని పాపహంత్రి భు♦వనపవిత్రిఁ
గామాక్షిఁ బ్రతిష్ఠించి ♦ గావించెనిందు నా,శర్వాణిదర్శించి ♦ చనుమునీకుఁ
తే॥ గార్యసంసిద్ధికల్గును ♦ గల్గువిజయ, మనఁగ శత్రుఘ్నుఁడనె సుమ♦దాభిధాను
డెవ్వఁడెట్టితపంబుచే ♦ నిలకులోక, మాతఁడేఁ గల్గె నంతయు♦మంత్రిచెప్పుమ.

వ॥ అనిన నయ్యమాత్య శేఖరుం డిట్లనియె. ౧౯౮

మ॥ నతవైరిక్షితిపాల యీ సుమదభూ♦నాథుం డమిత్రౌఘ సం
హృతపుత్రానుజ భృత్యుఁడై సిరులు వా♦యన్ హేమకూటంబునం
దతిపుణ్యస్థలిఁ జేరిచేసెను స్వనా♦సాగ్రస్థదృక్కుండు శి
క్షితసర్వేంద్రియుఁడై తపంబు దృఢ♦శక్తిన్నిల్చి యొక్కంజపై. ౧౯౯

సీ॥ ఈరీతినిష్ఠమూ♦డేండ్లు మూఁడేడు లెం,డినయాకులే యేరి♦దినుచు మఱియుఁ
బవనజలంబులు ♦ భక్షించి మూఁడేడు,లేమియు, దినక మూ♦డేండ్లు శీత
కాలమందున నీట♦ఘనవర్ష ధారలఁ, బైటగ్రీష్మంబునఁ ♦ బంచవీతి
హోత్రులమధ్యఁ దా♦రాత్రులఁబవలులఁ, నిల్చి కామాక్షిని ♦ నిల్పిమదిని
తే॥ నేరికి నలవికానట్టి ♦ ఘోరతపము, సల్పుచుండఁగనింద్రుండు సంశయించి
యఖిలపరివారయుతు మారు♦నంపె వెంటఁ,బంపె రంభోర్వశులమహో♦పాయవిదుల.

శా॥ కామాదుల్ సురకాంతలెంతయుఁ బడం ♦ గారానిపాట్లెన్ని యో
సామంబొప్పఁగఁ బట్టుపట్టి పడి యే ♦ చందాననాధీర రా
ణ్ణేమంబుం జెడఁ గొట్టలేకయికహో ♦ నింగొందు మంచేగి యో
సామీయార్పులఁ జేరినా మతనిచే ♦ శాపంబుల న్పొందరన్. ౨౦౧

తే॥ అనుచుఁ దెల్పినవిని త్రిది ♦ వాధినేత, మదినిభయవిస్మయంబులుఁ♦ బొదలనుండె
నంతనిక్కడ సుమదుఁడ ♦ త్యంతభక్తి, నితరమెరుఁగక దేవి ధ్యా♦నింపుచుండె.

క॥ అంత ననంతాధిపుని ని ♦ రంతరభక్తికిని శంభు ♦ రాణికడునిజ
స్వాంతమున సంతసింపుచుఁ♦ జెంతం బ్రత్యక్షమయ్యె♦ స్మితముఖియగుచున్. ౨౦౩

మత్తకోకిల॥ పావనాకృతిసారసాంకుశ ♦ పాశబాణధనుర్ధరన్
దేవరాజముఖామరార్చిత ♦ దివ్యపాద సరోరుహన్
బావితాఖిల లోకభంజిత ♦ పాపపంచముఖాఢ్య నా
దేవిఁగన్గొని భూవరుండు త♦దీయపాదములన్బడెన్. ౨౦౪

క॥ పులకిత తనుఁడై కన్నుల, జలజలరాల్మోద బాష్ప♦జలములను బదం
బులఁగడుగుచుండ నెత్తెన్, మెలమెలగా దేవినృపుని♦ మేను నిమురుచున్. ౨౦౫

వ॥ అంత సుమదుండు ముకుళిత కర కమలుండై నిల్చియిట్లని నుతియించె. ౨౦౬

సీ॥ జయదేవి! జయ విధి ♦ శంకరాది సురేంద్ర, సంసేవ్యపదసరో ♦ జాతయుగళ!
జయశ్రీమహాదేవి! ♦ జయచతుర్దశలోక, సృష్టిస్థితివినాశ ♦ హేతుభూత!
జయదుష్టభంజని! ♦ జయపదధ్యానాను, రక్తభక్తేప్సితా♦ర్థప్రదాత్రి!
జయశాంభవి భవాని ♦ జయశంభు పాదాంబు, జ మరందనాస్వాద ♦ చంచరీక

తే॥ తల్లి నీశక్తిచేఁ గదా ♦ తపనుఁడు బ్రధి, పీ రసంబెల్ల గ్రహియించి ♦ విడువఁగ్రాఁ
వహ్ని యుష్మత్పరితాపంబు ♦ వలననిండి, యంతటజనంబుల సుఖంబు ♦ నందఁజేసె.

తే॥ అంబ లోకైకపావని ♦ వాది విద్య, వీవు విష్ణు మహామాయ ♦ వీవు సర్వ
జగము లుదరంబులోనింపఁ ♦ జాలుదీవు, జగములం దంతటను నుండఁ♦జాలుదీవు.

శా॥ తల్లీ నీవలనన్ సరోజభవ గో♦త్రిధ్వంసి ముఖ్యామరుల్
గొల్లల్గాఁగ సమస్తవైభవములన్ ♦ గొంచున్నవార్గాదె నా
యుల్లంబందలి కోర్కెఁదీర్ప సమయం♦బో దేవి నీసత్కృపన్
వెల్లుల్గా నికనాదుపైఁ బఱుపుమా ♦ భేదంబుగాఁ జూడకే. ౨౦౯

వ॥ నిరంతర నిరశన తపశ్చరణ కృశాంగుండగు నరపుంగవుండు నిటలతట ఘటిత కర
పుటుండై యిటుల నుతింపుచుండ నద్దేవి సంతసించి వత్సా! నీ యభీష్టం బడుగు
మిచ్చెద నన సుమదుం డిట్లనియె. ౨౧౦

శా॥ అమ్మా! దుర్హృదయప్రభంజన కృద♦త్యంత పరితాపంబు నా
కిమ్మా నాదగు రాజ్యలక్ష్మి రథమ♦త్తే భాశ్వయూథంబుతో
నిమ్మా నాదు పురోపకంఠ వన మం♦దెప్డుండి త్వద్దర్శనం
బిమ్మా జన్మవినాశ ముక్తిదయ నా ♦ కిమ్మా జగత్పాలినీ! ౨౧౧

వ॥ అనిన నా కామాక్షి యిట్లనియె. ౨౧౨

సీ॥ విగతకంటకరాజ్య ♦ విభవముఁగొను మహి, లా రత్నజుష్టప♦దారవింద
యుగళుఁడవగు మీఁక ♦ నోటమి రిపులచేఁ, గలుగ దెన్నఁడు ముందుఁ♦గలుగుయశము
వినిపింతు నొక్కటి ♦ విపులేశవినుము శ్రీ,రామచంద్రుఁడు దుష్ట♦రావణాది
సురవైరులను దునిమి ♦ తురగమేధము సేయు, శత్రుఘ్నుఁడరుదెంచు♦సప్తితోడ
గీ॥ నపుడు సర్వధనంబు రా♦జ్యంబుతోడ, నతనికర్పించి చతురంగ ♦ యుతుఁడవగుచు
హాయముతో నేగి శత్రుఘ్ను ♦ ననుసరించి, తిరిగి తుదకల్ల సాకేత♦పురముఁ జేరి.

ఉ॥ అందు మునీంద్రసేవితుని ♦ నధ్వరదీక్షితు రామరూప గో
విందునిఁగాంచి తత్పదర♦వింద సమర్చనఁ జేసి యోగిరా
డ్బృందములందరాని పద♦వి న్గొనుమంతకు భూమినాథ! నే
నుందు భవత్పురీపరిస♦రోర్విని భక్తజనేష్టదాయినై. ౨౧౪

మ॥ ధరణీశుం జగదంబవల్కి యిటు లం♦తర్ధాన మొందన్ ధను
ర్ధరుఁడై యా సుమదుండు వైరినృపదో♦ర్దర్పంబు మాయించి యం
దఱు మేల్మేలనఁ బ్రాజ్యరాజ్యరమచే♦త న్బెంపువాటించి శ్రీ
కరుఁడై చేసెఁ బ్రతిష్ఠ మెచ్చ బుధులా ♦ కామాక్షినీ కోవెలన్. ౨౧౫

క॥ పాయక నెల్లప్డు మహా,మాయను బూజించుకతన ♦ మావునుఁబట్టన్
రాయఁడు రాడసురులకు న,జేయుఁడు వీరాతివీర ♦ సేవితుఁ డయ్యెన్. ౨౧౮

తే॥ రామచంద్రుని మహిమ త♦త్ప్రభవంబు, విన్నవాఁడొకొట నీవిప్డు ♦ వీతితోడ
వచ్చుటయు విని యెదురుగ ♦ వచ్చునతఁడు, సర్వవైభవములతోడ♦ శత్రుదమన!

క॥ అని తెలుపఁగ నోవాత్స్యా, యన విని డెందమున నద్భు♦ తానందంబుల్
బెనఁగొన శత్రుఘ్నుఁడు సుమ,దుని మేల్మేలనుచుఁ బొగడెఁ ♦ దోరముగాఁగన్.

వ॥ అంత నక్కడ సుమదుండు. ౨౧౯

సీ॥ అక్కజంబుగ వేద♦ఋక్కుల నాశీస్సు, లొనరించు బాడబు ♦ లొక్కవంక
శస్త్రాస్త్రధారులై ♦ సమరంబులందుఁ బెం,పెక్కినరాజు లిం♦కొక్క చక్కి
సంచుల రత్నపు ♦ సరుకులుఁగలయట్టి, యూరుజ వితతి మ♦ఱొక్కచోట
దేవతాభక్తి భూ♦దేవతాభక్తిచే, నొప్పు పాదజులు వే♦రొక్క కెలన

తే॥ కొలువఁ బేరోలగంబునఁ ♦ గొలువుఁదీర్చి, యుండుతరి వచ్చి సేవకుఁ♦డొక్కఁడయ్య
వచ్చె ముందొక్కజన్నంపు ♦ వారువంబు, వచ్చెఁబతివెంట సేనతో♦వనికి నెవఁడొ.

వ॥ అనుటయు సుమదుండు వెరవరియగు నొక్కసేవకుంబిలచి సత్వరంబుగ నీవేగి యావృత్తాంతంబు సర్వంబును నెఱింగి రమ్మన నాతం డటేగి యంతయునుం దెలిసి వచ్చి యిట్లనియె. ౨౨౦

మ॥ మనుజాధీశ్వర! సర్వదేవనరస♦మ్మాన్యుండు శ్రీరామచం
ద్రునియజ్ఞీయహయావతంసమది శ♦త్రుఘ్నుండు వాతూల నం
దనలక్ష్మీనిధి పుష్కలాదికబలుల్ ♦ తన్గొల్వ వెన్వెంట వ
చ్చినవాఁడందఱునున్నవారు పవన ♦ శ్రీఁజూచుచోనందునన్.

వ॥ అనిన సుమదుండు మంత్రులంగని యిట్లనియె. ౨౨౩

ఉ॥ ఎన్నఁడు సేయుజన్నము ది♦నేశకులాభరణుండు రాఘవుం
డెన్నఁడువచ్చుఁదత్తురగ♦మెన్నఁడువచ్చు సుమిత్రిపట్టి యిం
కెన్నఁడఁనాకు ముక్తి ల♦భియించు నటంచు మనంబులోన నే
నెను చునుండ నేఁటికి ల♦భించెఁ గృతార్థతనొందజన్మమున్. ౨౨౪

ఆ॥ మంత్రులార నేఁడు♦మనమందఱము సర్వ, ధనముఁ గొంచునతని♦దర్శనమున
కరుగవలయులెండు ♦ పురకన్యలటకుఁ గై,సేసి వచ్చునట్లు ♦ చెప్పవలయు. ౨౨౫

సీ॥ అనుటయువిని మంత్రు♦లావార్తఁ దెలుప సా,మంతులు పౌరులు♦నంతిపురపు
జనముఁగన్నెలు రథ♦శకటేభతురగము, లెక్కరా వెంటఁ దా♦నేగి విభుఁడు

శత్రుఘ్నుఁగని మ్రొక్కి ♦ చాలకాలమునుంచి, నీరాకఁ గోరుదు♦ నేటికబ్బె
జన్మసాఫల్యంబు ♦ సమకూరె నారామ,భద్రునిఁగాంచు స♦ద్భాగ్యమొదవె.

తే॥ ఇవియరథములుఁ దురగంబు♦ లేనుఁగులును, నివియ నాయెల్లసిరులునీ♦యదియరాజ్య
మంతయునునీదెయనుచు స♦మర్పణంబు,సేయ శత్రుఘ్నుఁడనె నృపుఁ♦ జేరఁదీసి.

క॥ ధన్యుఁడవైతివి యో! రా,జన్యవరా! భక్తిఁగొల్చి ♦ జగదంబను నే
ధన్యుఁడనైతిని గనిసా,మాన్యుఁడవా నీవుమాకు ♦ మాన్యుఁడవనఘా! ౨౨౮

తే॥ అనుచునాలింగనముసేయ ♦ హర్షవార్ధి, మునిఁగి సుమదుండుఁ జేతులు, మోడ్చిమీర
లందఱరుదెంచి నాదు గే♦హానగరములఁ, బావనంబులుసేయుఁడో ♦ భవ్యులార.

సీ॥ అనియహిచ్ఛత్రపు ♦ రాధినాథుఁడులక్ష్మ, ణానుజుసితకరి ♦ నధివసింపఁ
జేసిపుష్కలముఖ్య♦ క్షితిపతులగ జాశ్వ, రథములనెక్క నే♦ర్పాటొనర్చి
తానొక్కతురగంబు ♦ పైనెక్కి యాశ్వీక, సమితితో ముందర ♦ జనుచునుండ
భేరికాదులుకడు ♦ భోరుకల్గుచునుండ, నింతులుహారతు♦లిచ్చుచుండ

తే॥ ఇరుకెలంకులనేస్గుల ♦ నెక్కికన్నె, లెల్లలాజలుముత్తెముల్ ♦ జల్లుచుండ
నెలమిమాగధులెదుర గ♦తింపుచుండ, సుందరులుమేడలందుండి ♦ చూచుచుండ.

తే॥ సౌధముల తీరు గోడల ♦ సౌరు గోపు,రంబుదిగఁద్రొక్కునాగోపు♦రములతీరుఁ
జూచి తెగయూరుచునుఁదల♦యూచుచరిగి,రాఘవునిసోదరుఁడుఁ జేరె♦ రాజగృహము

కం॥ అంతట సుమదుండు నిజ,స్వాంతమునను బొంగుచర్ఘ్య♦ పాద్యాదులచే
నెంతయుభయభక్తుల లవ, ణాంతకుభూభుజులతోడ ♦ నర్చించియొగిన్. ౨౩౦

తే॥ అందఱికి విందులొనరించి♦ చందనం బ,లంది విడెములొసంగియా ♦ నందుఁడగుచు
మందిరారామ ముఖ్యసం♦పదల నాజ, నందనజ్యేష్ఠునకు న♦ర్పణ మొనర్చె. ౨౩౧

ఉ॥ క్షేమమెరామభద్రునకుఁ ♦ జెప్పుమయీమహనీయులందఱా
రామునియాననాబ్జము ని ♦ రంతరమక్షిపుటంబులన్గడుఁ
బ్రేముడిద్రావుపుణ్యులిక ♦ వీరశిరోమణి భక్తపోషునా
స్వామినిజూచుభాగ్య మరి ♦ భంజన యెప్పుడునాకుఁగల్గెడిన్. ౨౩౩

వ॥ మున్ను కామాక్షిదయార్ద్రహృదయయై యొసంగిన ధనకనక వాహనాది వస్తుజాతం బంతయుం గృతార్థతనొందె నాజన్మంబు పావనంబయ్యె, సకుటుంబముగావచ్చి శ్రీరాముని దర్శించి కృతార్థతనొందఁగోరెద ననుటయు శత్రుఘ్నుండు సంతసించి రామచంద్రుగుణాభి వర్ణనంబు సేయుచు నచ్చటఁ ద్రిరాత్రంబధివసించి ప్రయాణోన్ముఖుండగుట యెఱింగి సుమదుండు బుత్రునియందు రాజ్యభారంబొనంగి

శత్రుఘ్నపుష్కలుల యనుమతంబున సైనికుల కెల్లరకు నమూల్యాంబరాభరణా
దులొసంగి చతురంగబలయుతుండై వెడలెనంత సవనతురంగంబు. ౨౩౪

తే॥ వాహినుల్ తత్పతుల్ వెంట ♦ వచ్చుచుండ, నఖిలనదులఁ బురంబుల♦నధిగమించి
చనిపయోష్ణీమహాపగా♦సవిధభూము,లందు మెలఁగఁగాఁగాంచుచు♦నచటిమునులు.

క॥ హరి హరిమేధ హయంబిది, హరివెంటన్వచ్చువారు ♦ హరిభక్తులె యీ
హరిఁబట్టంగల ధీరుం, డరయఁగ నీ త్రిభువనంబు ♦ లందునఁ గలఁడే. ౨౩౬

తే॥ అనుచునీరీతిఁ బెనుబత్తి ♦ నచ్చటచట, నుడువుచుండెడి మానుల ♦ నుడులవినుచు
మోదమునదాశరథి కేలు♦ మోడ్పులిడుచు, సవనతురగంబు వెను వెంటఁ♦జనుచుముందు.

—♦ చ్యవనముని చరిత్రము ♦—

సీ॥ అవిరతశ్రుతి మహా♦రవసదాశ్రవణ నిర్మథితమానుషచయా ♦ మంగళంబు
వీతిహోత్రార్చిర♦ర్పిత హవిర్ధామ ప, వితీకృతాశేష ♦ విష్ణుపదము
ప్రతిసునాసీర వి♦రచితాగణిత మహా,క్రతుయూపజాలవి ♦ భ్రాజితంబు
కుంభసమోద్భవ ♦ గోచరణోద్ధర, జఃపావనీకృత ♦ క్ష్మాతలంబు

తే॥ ఆగమధ్వని ముఖరితా ♦ శాంతరంబు, సర్వదాపుష్పఫల లస♦చ్ఛాఖియుతము
వికచరాజీవయుత సరో♦విలసితంబు, నైన పుణ్యాశ్రమముఁ గాంచి ♦ హర్షమునను.

మ॥ సుమతీ యెవ్వరియాశ్రమంబిది కనన్ ♦ జోద్యంబుఁదోచె న్గురం
గమ వ్యాఘ్రంబులు గూఢపాన్నకులముల్ ♦ గంధేభసింహంబులున్
దమలోఁ బ్రేముడిమీర మూర్కొనెడు రం♦ధ్రాద్రిప్రవ్వ కాఖుల్ బిడా
లములన్ జేరి విహారముల్ సలుపు నీ♦లాగెంతయో వింతయా. ౨౩౯

తే॥ లేళ్లునీవారముల భీతి♦లేక మెసవు, చుండె మునివారములుచూచు♦చుండి రాద
రంబుదళుకొత్తనివి యీజ♦గంబునందు, నెందుఁగననిందునున్నవా♦రెవరుచెపుమ.

వ॥ అనిన మంత్రి యిట్లనియె. ౨౪౧

సీ॥ ఆశ్వినేయులకునే ♦ యమివర్యుఁడధ్వర, భాగంబుఁగల్పించి ♦ పరగనిచ్చె
స్వాయంభువుని యజ్ఞ ♦ సమయమందేమాని, నగవైరిదురభిమా♦నంబడంచెఁ
దెలిపి వేదంబులం♦తేవాసులకునే త, పస్వివారిఁదనంత ♦ వారిఁజేసె
పత్ప్రభావంబుచే ♦ స్వప్రభావంబుచే, నేవ్రతియందటి ♦ నెలమిమించె

తే॥ నట్టిపావనమూర్తి బు♦ధానువర్తి, సాధునుతకీర్తి తాపస ♦ చక్రవర్తి
యనఘుఁడు దయాళుఁ డాశ్రితా♦వనుఁడు ఘనుఁడు, చ్యవనుఁ డెందఘుశైలదు♦
శ్చ్యవనుఁ డుండు. ౨౪౨

క॥ ఈ మునివరు సామర్థ్యం, బీమునిసుతపఃప్రభావ ♦ మే లోకమునం
దే మునికైనఁ గలదే, యేమనుదుఁ వేదమూర్తి ♦ యేయతఁ డధిపా! ౨౮౩

వ॥ అనుటయు శత్రుఘ్నుం డమాత్యుంగని యిట్లనియె. ౨౮౪

చ॥ సవనపు భాగమీయ నెటు ♦ చాలెనుదస్రులకెల్ల రెంచనా
చ్యవనమునీంద్రుఁడేల బల ♦ శాసను గర్వముడంచె నా ఘనుం
డెవని తనూభవుం డెచట ♦ నెట్టి తపంబొనరించె నంతయుఁ
వివరముఁగాఁగఁ దెల్పుమనఁ ♦ బెగ్గడ యిట్లని చెప్పె సర్వముఁ. ౨౮౫

సీ॥ బ్రహ్మవంశంబునఁ ♦ బ్రభవించె భృగుఁడను, ప్రఖ్యాతి కల ముని ♦ వరుఁ డొకప్పు
డతఁ డడవికి సమి ♦ దాహరణార్థమై, సాయంబుననుబోవ ♦ సమయమెఱిఁగి
సవనవిధ్వంసంబు ♦ సలుపంగ మదినెంచి, దముఁడను రాక్షసా ♦ ధముఁడు బలుఁడు
వచ్చి యెక్కడముని ♦ బంధుఁడాతని పత్ని, యెక్కడెక్కడయని ♦ వెక్కసముగఁ
తే॥ బలుకుచతిరోషమునమండి ♦ పడుచు మరల, మరల నిటువల్కఁగోపంబు ♦ మదినెఱింగి
భయమునొందుచునిదెముని ♦ పత్నియనుచు, హస్తసంజ్ఞనుఁగావించె ♦ హవ్యవహుఁడు.

తే॥ అంత నా రక్కసుండు దు ♦ రంతచింత, స్వాంతమందునఁబొందుచు ♦ నడలు దాని
వెరపునఁ గురరివడువున ♦ మొరగుదానిఁ, గావవే? నాథయని యేడ్చు ♦ గర్భవతిని.

క॥ తన వాక్యపరిహారంబుల, ననదయగుచుఁ బొగులుసాధ్వి ♦ నదలింపుచు వే
కొనిపోవుచుండ భయమున, మునిసతిగర్భస్థశిశువు ♦ భూమిఁ బడియెఁ. ౨౮౮

వ॥ ఇట్లు వడి జ్వాలనుండువోలెఁ బ్రజ్వలన్నేత్రుండై యిట్లనియె. ౨౮౯

ఉ॥ సచ్చరితక్రమదంబను ని ♦ శాచర యెత్తుకపోవుచుంటివా?
చిచ్చొడిఁగట్టినాఁడవుర ♦ ఛీ! యెటుపోయెదు పోవనిత్తునే
యిచ్చటఁ జావవారిసె విధి ♦ యెల్లరుఁజూడఁగఁ బోకుపోకుమీ
నిచ్చలుమెచ్చ దేవతలు ♦ నిల్వునభస్మము గమ్ము దుర్మతీ. ౨౯౦

ఆ॥ బాలుఁడిట్టులనుచు ♦ బల్కఁగ దముఁడువే, భగ్గుమనుచుమండి ♦ భస్మమయ్యె
నంత నెత్తుకొనుచు ♦ నాబాలుమునిపత్ని, యాశ్రమంబు సేరె ♦ హర్ష మునను. ౨౯౧

ఉ॥ అంతభృగుండువచ్చి విధ ♦ మంతయు శిష్యులచే నెఱింగి యీ
వంతకునెల్లఁగారణము ♦ వహ్నియయంచుఁ గలంగి రోషయు
క్స్వాంతతసర్వభక్షకుఁడ ♦ వౌచుమెలంగుము వీతిహోత్ర! నీ
వింతటనుంచి దుర్మద దు ♦ రీక్షణసూచకయంచుఁ దిట్టినఁ. ౨౯౨

మ॥ అనలుండిట్లనె మాళిమౌనివరపా ♦ దాబ్జంబులఁ జేర్చియో
యనఘా యిట్లుశపింపఁబాడియె యమ ♦ ర్త్యారాతిభీతిఁ మ్మృషో

క్తినిబల్కఁగ జారనైతిదీనుని గటా♦క్షింపందగున్ దోఁహిచిం
తనలేదెన్నఁడుఁ జిత్తమందునెటులై♦నన్ బాపుమా హైన్యమున్ ౨౫౩

తే॥ అనుచుదీనత్వమునవేఁడు ♦ హవ్యవహుని, యందుఁగనికరమునమాని♦యనియెసర్వ
భక్షకుఁడవైనఁ బావక♦పావనుండ,వగుదు వెదలోన దీనికై ♦ వగవ వలదు.

వ॥ ఇట్లనలు ననుగ్రహించి. ౨౫౪

క॥ రవిశత తేజుండైన శి,శువునకు మునిజాతముఖ్య♦శుభకర్మంబుల్
వివరముగఁ జేయగభర్గ,చ్యవనుఁడగుటననిరి మునులు♦చ్యవనుండనుచున్. ౨౫౫

వ॥ అంత నా బాలుండు వళక్షపక్షక్షపాకరుండువోలె దినదినప్రవర్ధమానుండై వృద్ధి
నొందె. ౨౫౬

సీ॥ తపముసేయఁగనెంచి ♦ తలిదండ్రులాజ్ఞను, బడసి శిష్యులతోడ ♦ వనికనేగి
రేవానదీతీర ♦ పావనస్థలియందుఁ, బదివేలవత్సరాల్ ♦ పరమనిష్ఠఁ
దపమొనర్చుచునుండ ♦ దారువన్ శంకమ్ము,గాళ్ళులుకండూతి♦యణగరాచు
కొనుటనెఱుంగఁడా♦తనియంసములఁ గింశు,కములు రెండుఁజనించి♦కాంచెవృద్ధి
తె॥ చుట్టుదట్టముగాఁ బెద్ద♦పుట్టపెరిగె,నంతనొకనాఁడనంతసై♦న్యంబుతోడ
మనునృపాలుండుఁజనుదెంచెఁ♦దనకుటుంబ,యుక్తుఁడై తీర్థయాత్రాప్ర♦సక్తినటకు.

క॥ ఆవసుధేశుఁడు రేవా,పావనతీర్థములఁగ్రుంకి ♦ పడతులతో భూ
దేవులకు దానములుఁ బిత్రృ,దేవతులకుఁ దర్పణములుఁ ♦ దృప్తిగఁజేసెన్.

ఉ॥ వన్యలతాసుమంబుల న ♦ వారిగఁగోయుచు నానృపాలమూ
ర్ధన్యకుమారికామణి ప్ర♦తప్తసువర్ణవిభూషణాఢ్యసౌ
జన్యనిదాన కన్యసువి♦చారసుకన్యసఖీజనంబుతో
వన్యతలంబులందిరిగి ♦ వచ్చి కనుంగొనె వామలూరువున్. ౨౬౦

కం॥ అందునిమేషోన్మేషము, లందని దేజంబు గాంచి ♦ యాశ్చర్యమునన్
బొందుచు గుచ్చెశలాకలఁ, జిందఁగరక్తంబు బాల్య ♦ చేష్టదెలియకన్.

కం॥ నెత్తురుఁగనితనమదిలోఁ, దత్తరపడియెంతకూర ♦ తకునొడిగడితిన్
జిత్తంబవియఁ దొడఁగెను, నిత్తరువులమధ్యనుండె ♦ నేమునివరుఁడో. ౨౬౧

అంబురుహము॥ ఎందుకువచ్చితి నీవనికక్కట ♦ యింటివద్దను నుండకే
నెందఱురారిట వచ్చినమాత్రమె ♦ యిట్టిసేతలుసేతురే
క్రిందుమీఁదునుఁగానకచేసిన ♦ కీడుపోవునేయూరకే
యుండదటిలోఁగడుఁబాతకినై తిని♦హా యెటాదునొ దైవమా. ౨౬౩

తే॥ ఇట్లుతనలోనఁదాఁగృశియింపుచుండి, తల్లిదండ్రులకదిచెప్ప ♦ నొల్లదాయె
నంతనుల్కలురాలెన ♦ నంతకదిలె, ధూమములుఁగప్పెనినునకుఁ ♦ దోఁచెబరిధి

వ॥ ఆ మనుభూపాలుం డిట్టి యుత్పాతంబులకు మనంబునఁదలంకుచుండ.

కం॥ ఏనుఁగులుసమసెవెంటనె, సైనికులునుమడసిరశ్వ ♦ సమితియుఁజచ్చెన్
హీనంబయ్యెనువిత్తము, హీనమణులతోడఁగలహ ♦ మెచ్చెఁబరులతోన్. ౨౬౬

శా॥ ఆరాజేంద్రుఁడుకుంది యందునకు డా ♦ యంబోయితాఁబెద్దలన్
ఘోరాపత్తులకేతిఁదెల్పుఁడయ నా ♦ గోడంతయుంచాడి యీ
నేరంబాత్మజ దింతమూడెనోకమా ♦ నిశ్రేష్ఠుచే నంచుఁదాఁ
బారంపర్యముగా నెఱింగి కడు దు ♦ ర్వారవ్యథాక్రాంతుఁడై. ౨౬౭

తే॥ సపరివారంబుగాఁబోయి ♦ తపసిబాద, ములకుఁగాసోహమనుచుఁదా ♦ మొక్కికూతు
బట్టుకొని మౌనిపదములఁ ♦ బడగఁజేసి, పలికెనిట్టులగద్గద ♦ స్వరముగదుర. ౨౬౮

తే॥ అయ్యనేమనునరపతి ♦ నయ్యయింత, పాపమొనరించినదినాదు ♦ పట్టియయ్య
యడలుచుఁబదాలబడియుండె ♦ నయ్యదీని, తప్పుక్షమియింపుమయ్యయో ♦ తపసిరాయ.

చం॥ వెలవెలఁబోవుచుండెఁబెను ♦ భీతినినాసుతసేనచూడఁగాఁ
బలుపలచన్నబడెన్ విమల ♦ భావముఁగొండనఁదాపసుండు నీ
పలుకు లికేల నీసుతను ♦ భార్యగ నిమ్మడుముల్లోలంగ నాఁ
దెలతెలపోయి యానృపుఁడుఁ ♦ దేకువఁదప్పదటంచు నిచ్చెఁదాన్.

ఉ॥ నాతనుజన్ శిరీషసుమ ♦ నవ్యశరీరను గర్కశాంగుఁడై
శీతునవెండఁగస్తివడు ♦ చీకున కిచ్చితిఁ జేతులారఁజే
చేతులఁజేయు పాతకము ♦ చెల్లునెతోర్యయుఁగ నెంతవారికిన్
నాతనుజాతయెంతటిది ♦ నల్లవోయంచు బలంబుతోఁబురిన్. ౨౭౧

వ॥ దందహ్యమానమానసుండై పొగులుచుం జేరె నిక్కడ. ౨౭౨

తే॥ ఎప్పునృపుఁ డాత్మజనుమౌని ♦ కిచ్చె నప్డు, తాపస రుషోద్గతాఖిలో ♦ త్పాతసమితి
శాంతమొందెను దిక్కులు ♦ స్వచ్ఛతను వ, హించెజనులకు సౌఖ్యంబు ♦ మించెనంత.

వ॥ చ్యవనమునియుఁ గాంతాద్వితీయుండై స్వాశ్రమంబుఁ జేరి సుఖంబుండె. నాసుక
న్యయును. ౨౭౪

సీ॥ ఇలు లేదనకను బతి ముదు, సలియనకను గుడ్డియనక ♦ సమోన్మాదమునన్
మెలఁగుచు నిష్టపరిదయగు, కులదేవతవోలెఁబతినిఁ ♦ గొల్చుచునుండెన్. ౨౭౫

వ॥ మఱియు. ౨౭౬

సీ॥ స్నానార్థమై యుష్ణ♦జలకలశంబులఁ, దెచ్చి తాఁజేతి కం♦దిచ్చుచుండు
సంధ్యాతపోహోమ ♦ సామగ్రినంతయు, నింగితంబెఱిఁగి తా♦నిచ్చుచుండు
పదములుఁ గడిగి యా ♦ వారిశిరంబున, ధన్యనైతిననటంచుఁ ♦ దాల్చుచుండు
వన్యఫలంబు ల ♦ వ్వారిగాఁదెచ్చి తా, వేళకునవి సమ♦ర్పించుచుండు

ఆ॥ పదములొత్తుచుండుఁ ♦ బదములకడనుండి, విసువుఁగొనక నెపుడు ♦ విసరుచుండు
రిపువినాశవింటె ♦ త్రికరణఁశుద్ధిగ, మెలత నిత్యమిట్లు ♦ మెలఁగుచుండు. ౨౭౭

క॥ పతినెడఁబాయదొకప్పుడు, పతితావిధియించి నట్టి♦పనులే సేయున్
క్షితి నాసతికెనయనఁదగు, సతు లత్రి వసిష్ఠమునుల ♦ సతులిద్దరుసూ. ౨౭౮

శా॥ సౌమిత్రీ విను సావధానమతితో ♦ సౌజన్యభావంబునన్
గామక్రోధమదాదులన్విడచి యా♦కంజాక్షి చిత్తేశ్వరున్
నేమంబొప్పఁగ నప్రమత్తయగుచున్ ♦ నిత్యంబుఁబాలోమి సు
త్రాముంబోలెభజింపుచుండునెడ న♦బ్దంబుల్ చనెన్ నూర్పదుల్. ౨౭౯

క॥ సతిసేయుసపర్యలకా, వ్రతికులతిలకుండు మోద♦నార్ధిమునుఁగుచున్
గుతుకముననుండ సుకుమా,రతనులుడస్రి లోకనాఁడు ♦ రా భక్తిమెయిన్. ౨౮౦

తే॥ ఎదురుగాఁబోయిస్వాగతం♦బిచ్చియర్ఘ్య, పాద్యములొసంగి తోడ్తెచ్చి♦పాదములను
గడిగి తడియొత్తి పెనుబత్తిఁ♦గందమూల, ఫలములనొసంగిసంతుష్టిఁ♦బరచుటయును,

క॥ శర్యాతితనయసేయు స, పర్యల కా సాధ్వి సేయు ♦ పతిసేవకు నా
శ్చర్యపడి స్వఃపురభిష,గ్వర్యులు పల్కిరిటు నగుచుఁ ♦ గరమనురక్తిన్. ౨౮౨

ఉ॥ చక్కనివారిలో మిగులఁ ♦ జక్కనిదానవు కొమ్మఁ నీదగున్
జక్కఁదనానకుం దగిన ♦ చక్కని పూరుషుఁ గోరుకొమ్మనన్
బక్కున నవ్వి యిట్లనుట ♦ పాడియె మీకు రతీశుఁడైన నా
కెక్కువె కూర్మియున్న హృద♦యేశ్వరుఁ గన్నులుఁ జక్కసేయుఁడీ. ౨౮౩

వ॥ అనిన నాశ్వనేయు లిట్లనిరి. ౨౮౪

తే॥ సవనభుక్కులతో మాకు ♦ సవనభాగ, మమ్మ నీనాథుఁడిప్పింతు♦ననిన నేఁడుఁ
గండ్లు బాగొనరించు టొ♦క్కటియకాదు, కనుము వరుమరుఁ జేయమే♦క్షణములోన

క॥ అనుమాటలు చ్యవనుఁడు విని, యనుమానంబేలసేతు ♦ నట్లనె యన న
శ్వినులో సాధ్వీ! నీవిభు, ననుపుము మాతోడ సిద్ధ ♦ హ్రదమునకనుడున్. ౨౮౬

ఆ॥ సంతసంబునొంది ♦ సతితనకాంతుని, సిద్ధహ్రదమునందుఁ ♦ జేర్చునంతఁ
ద్రిదశవైద్యులందు ♦ ముదుసలి తపసితో, మువ్వురొక్కమారు ♦ మున్గిలేచి.

వ॥ సౌవర్ణమాల్యాంబరధారులును, దుల్యవయోరూపలావణ్యమూర్తులునై యుండుట
జేరిపారఁజూచి యప్పతివ్రతాతిలకంబు విస్మితాంతరంగయగుచు, ౨౮౮

మ॥ ఇతఁడేనావిభుఁ డంచు నెంచుఁ గని కాఁ♦డీతం డతండౌను నా
పతియంచుం దమిఁ జేరఁబోవు మదిలో ♦ భావించి కాఁ డీతఁ డ
ల్లతఁడౌ నౌనని సంశయించుమతియ♦త్యంతానుమానంబుచే
నతఁ డీతం డితఁ డాతఁ డాఁతఁ డితఁడే ♦నంచున్నదుర్భ్రాంతయై. ౨౮౯

ఆ॥ మగని తెలియలేక ♦ మలకలఁబడి సాధ్వి, దేవవైద్యులార ♦ దివ్యులార
దయితునిచ్చినన్ను ♦ ధన్యను జేయరే, యనుచు వేడ దస్రు ♦ లతివఁజూచి. ౨౯౦

కం॥ అమ్మా నీపాతివ్రత్యమ్మునకెదసంతసంబు ♦ నందితి మితఁడే
నమ్మా నీపతియని వా,ర్సమ్మతిగను దెల్పిఁ జనిరి ♦ స్వనిలయములకున్. ౨౯౧

వ॥ అంతఁ గొంత కాలంబునకు. ౨౯౨

చ॥ అనవరత వ్రతాఢ్యఁ గృశ ♦ యైనప్రియం గని మౌనివర్యుఁ డి
ట్లనుఁ దరుణీ శరీరసుఖ ♦ మాత్మఁదలంపక నానిమిత్తమై
దినదినమున్ శ్రమంపడుచుఁ ♦ దేర్చితివీవు సపర్యలన్ ననుం
దనిపెదఁ జూడుభోగములఁ ♦ దద్దయునాదగు దివ్యభావముల్. ౨౯౩

మ॥ జపవిద్యాసుసమాధియోగపత్రప♦స్సంపాద్యముల్ సర్వదా
యపశోకంబుల సాధ్వసంబులు నమే♦యంబుల్ నరాలభ్యముల్
నృపపుత్రీ భగవత్ప్రసాదములు నా♦నేర్పొప్పఁగా నిశ్చయం
బిపుడే నే బ్రసరింపఁజేసెదను నీ♦హృత్పద్మ మేపారఁగన్. ౨౯౪

తే॥ దురధిగమములు నిజధర్మ♦దోహములును, దివ్యములు రుక్రముఖశుభ♦దేవతేశు
భ్రూవిజృంభణ మాత్రానఁ♦బొదలునట్టి, సంపదలనుభుజింపు నీ♦సాటికెవరు. ౨౯౫

వ॥ ఇట్లు నుడువు యోగ మాయా విద్యావిచక్షణ దక్షుండును తపోధనాఢ్యుండగు
పతిఁ గని గత వ్యథయగుచుఁ బ్రశ్రయ ప్రణయవిహ్వల స్వరంబున నీషద్వ్రీడావి
లోక విలసితనతస్మేరాననయై సుకన్య యిట్లనియె. ౨౯౬

సీ॥ యోగివర్యయమోఘ ♦ యోగమాయాధిపు, లగుటనంతలుసేయు ♦ టరుదెనీదు
సకృదంగసంగంబు ♦ సతులకన్నిటికిని, గారణంబనిమున్న ♦ గంటిఁగాని
ఏమందునందుల ♦ కిప్పటికినినోమ, నైతిమన్మథపీడి ♦ తాత్మనగుచు
నిఁకభవత్సంగమ ♦ మెప్పు డెప్పుడటంచుఁ, గోరుచుమీయాజ్ఞఁ ♦ గోరుచుంటి
తే॥ ఎట్లు విధియించెదరొ విధి ♦ యించునట్లు, చేసెదను గానియొక్కటి ♦ సేతుమనవిఁ
గలసి మనముండుటకుమంచి♦నిలయమొక్క, టిపుడనిర్మింపు మఖిలలో♦కైకవంద్య.

వ॥ అని ప్రార్థించుటయు. ౨౯౮

ఆ॥ చ్యవనమౌనియాత్మ ♦ సంతసింపుచుఁ బ్రియ, సతినిదనుపయోగ ♦ సంస్థుఁడగుచుఁ
గనక విరచితంబుఁ ♦ గామగంబగువిమా, నము సృజించె మేల ♦ నంగసురలు. ౨౯౯

వ॥ అదియు సర్వకామదుఘంబును మనోహరంబును సర్వరత్న సమన్వితంబును మణిస్తంభోప సేవితంబును దివ్యోపస్తరణోపేతంబును సర్వకాల సుఖావహంబును విచిత్రపతాకాభిరామంబును నమ్లాన పుష్ప మాలాలంకృతంబును క్షౌమదుకూల కౌశేయాంశుక బద్ధవితానావలంబి విద్రుమ ముక్తా మాలా విరాజమానంబును నుపర్యుపరి రచిత గృహన్యస్త వ్యంజన పర్యంకోపధాన విలసితంబును నానాశిల్పోప శోభితంబును మరకతస్థలీ లసద్విద్రుమ వేదికాజుష్టంబును వజ్రవిద్రుమ మయద్వార కవాట దేహళీశోభితంబును నింద్ర నీలశిఖర న్యస్తసువర్ణ కలశవిభ్రాజితంబును వజ్రభిత్తిస్థగితపద్మరాగనయ నాంచితంబును మంజుగుంజితమంజీరోల్లసత్షడంఘ్రియుతంబునై సిద్ధాశ్రమంబువోలెఁ బరమహంస భాసురంబై భాగవతంబువడువున శుకాలాపమధురంబై ధృతరాష్ట్రుని సభమాదిరి గాంగేయ విలసితంబై ప్రబంధంబుచాడ్పున సుగంధి చంపకమాలోత్పలమాలాంబురుహ బంధురంబై యొప్పి యుండుటఁ గాంచి చ్యవనుండు సుకన్యం గాంచి యిట్లనియె. ౩౦౦

మ॥ లలనా చూడు సరోవరం బిదిగొ లీ♦లన్ జేయుమా స్నానమిం
దుల సద్రత్నవిమానమల్లదుగొ నా♦తో నందధిష్ఠించు నీ
తలపుల్నేకురె నేటికన్నతినుడుల్ ♦ దన్వంగి యాలించి ని
ర్మలతం జేయఁగ మేనుఁ జీరెలను జే♦రంబోయెఁ గాసారమున్. ౩౦౧

ఉ॥ అందు విమానమందు లవ♦ణాంతక చిత్రమదేమి తెల్పుదున్
సుందరులుద్భవించిరి కి♦శోరవయస్కులు వేవు రందఱున్
సుందరిఁ జూచి మ్రొక్కి దయఁ♦జూడుము మమ్ము విధింపు కృత్యమో
యిందునిభాస్య మేలుకొను ♦ మిందఱి నిప్పుడు దాసురాండ్రఁ గన్. ౩౦౨

సీ॥ అనుచు హస్తముపట్టి ♦ యతివను బంగరు, పీటపైఁ గూర్చుండఁ♦బెట్టె నొకతె
జడలుఁ గట్టినకురుల్ ♦ సవరించి గుమగుమ, లాడెడినూనెఁ ద♦లంటె నొకతె
కస్తూరినీటితోఁ ♦ గలసినశనగల, పిండితో నలుగులు ♦ పెట్టె నొకతె
వెచ్చగాఁ గాచిన ♦ యచ్చపుఁ బన్నీటఁ గొంచక జలక మా♦డించె నొకతె

తే॥ ఒల్లెతోఁ దల తడికురు♦లొత్తె నొకతె, పట్టుసరిగంచు చీరగట్టఁ ♦ బెట్టె నొకతె
నిల్వుటద్దంబుముందర ♦ నిల్పె నొకతె, దీటుగా ఫాలమున బొట్టు♦దిద్దె నొకతె.

మ॥ ఒకతె యొయ్యారి కటిన్మణిస్థగితమా ♦ యొడ్డాణము న్బెట్టె వే
ఱొకవాల్గంటి కడాని కంటియఁ సరా♦లుం జెన్నగళంబందు నిం

క్రొక్క ప్రోయాలత్రినాల దండకడి యా•లుంచెన్గరంబందు నిం
క్రొక్క పూఁబోడి యలంకరించె నగ ల•త్యుత్కంఠ నబ్జాక్షికిన్. ౩౦౪

క॥ పూచినతంగెడు పోలపున, గాచిన మవ్వంపుమావి • కరణిఁ గనులకున్
జూచుటకు ముచ్చటగు నా, మేచకకచఁగాంచి మదిని • మెచ్చుచు యువతుల్.

ఆ॥ పసిడిపళ్లెరమున • భక్ష్యభోజ్యంబులు, మధురసాన్నముల న•మర్చికుడువఁ
బెట్టునంతఁదృప్తిఁ బెరసి సతీమణి, దయితు నాత్మలోనఁ • దలఁచుటయును. ౩౦౬

చ॥ తలఁచినయంతలో నెదుటఁ • దాపసవర్యుఁడు మోహనాంగుఁడై
నిలచి తదీయ మానసవి • నిశ్చయ మాత్మ నెరింగి కంకణా
దులు ఘలుఘల్లనన్ మొరయఁ • దోయజనేత్రి కరంబువట్టి తా
మెలపున ముద్దియగ్గొలువ • మెల్లగఁజేర్చె విమానరాజమున్. ౩౦౭

వ॥ అంత నవ్విమానంబు చ్యవనమునివతంసుని యనుమతిని గగనపథంబున నడచు
చుండ. ౩౦౮

క॥ నారీజనమధ్యంబున, స్వారాడ్విభవమునఁనొప్పు • సంయమివరుఁ డా
తారామధ్యస్థుండగు, తారానాథుండువోలెఁ• దద్దయు మెరసెన్. ౩౦౯

సీ॥ గిరులందుఁ ఝరులందు • గిరికందరములందు, స్ఫటికశిలామయ • స్థలములందు
వనులందు ధునులందు • ఘననికుంజములందు, సురరాణ్ముఖదిగీశ • పురములందు
చైత్రరథమున వై•శ్రంభకమున మధు,వనమున నందన • వనమునందు
మానసమున సుర•మాన్యవనంబులఁ బుష్పభద్రంబునఁ • బులినములను

ఆ॥ రామఁగూడి మౌని•రాజు తా నత్యంత, సంతసమునఁగ్రీడ • సలుపుచుండ
నిశలువారికపుడు • నిమిషంబులై చనెఁ, జనెఁబగళ్లు కల్ప•సమములగుచు. ౩౧౦

తే॥ సకలభూతల రమ్యదే•శంబులందు, తపసియీరీతిశర్యాతి • తనయతోడ
సురతసౌఖ్యంబులన్ బొంది•సోలుచుండ, నరిగెనూరేడు లరుగుఁ•మెఱుఁగఁడతఁడు.

వ॥ అంతటఁ గొంత కాలంబునకు నయ్యింతిమిన్న యంతర్వత్నియై పదియువదగు
మాసంబున సులగ్నంబున నొక్క కన్నెమిన్నంగనియె. ౩౧౨

ఉ॥ పిమ్మటఁ గొన్ని రోజులకుఁ • బెక్కులుహాయనముల్ గతించుటల్
నెమ్మనమందెఱింగి తన • నెచ్చెలిపూర్ణ మనోరథాఢ్యయై
సమ్మతినుండుటల్ దెలిసి • చయ్యనఁబుష్పకమున్ మరల్చి సౌ
ఖ్యమ్ముల కాస్పదంబయిన • స్వాశ్రమమందువసించి నిష్ఠతోన్. ౩౧౩

చ॥ పరమతపంబొనర్చుచుఁ ద•పస్విశిఖామణిత్రితుల్లన శిష్యకోటికిన్
గరపుచు భక్తిసేయు తన • కాంత సపర్యల కిచ్చ మెచ్చుచున్

స్థిరమతినుండునంత జగ♦తీతల నాయకుఁడై నమామ య
ధ్వరమును జేయఁగాఁదలఁచి ♦ పంపెను దూతల నొక్కరోజునన్. ౩౧౪

క॥ దూతాహూతుండై యా, పూతాత్ముఁడు మానితనదు ♦ పుత్రీపత్న్య
న్వీతుండై నృపుపురమున, కేతేరఁగఁగాంచి నృపతి ♦ యెంతయుఁ బ్రీతిన్. ౩౧౫

తే॥ అర్ఘ్యమును గొంచునెదురుగా♦నరిగినంది,యంబు నొందుచునుండఁగా♦నంతవచ్చి
పాదములమీఁదఁబడినట్టి ♦ పట్టికెత్తి,పడక నాశీస్సులిడుటకుఁ ♦ బలికెనిట్లు. ౩౧౬

తే॥ పరమదుర్మార్గురాల నీ♦భర్త గుడ్డి, ముసలికదాయటంచును ♦ వదలియతనిఁ
బడుచువానిని రూపసి ♦ పాంథునొకని, గడనఁజేసితె ఛీ నిన్నుఁ ♦ గాంచనగునె.

క॥ జనకునివంశము నీ నా,థునివంశముఁగూడ నేట♦ద్రోచితివికదే
నినుఁ గన్నందుల కీమే,దినిఁదల వంపులనుజేసి♦తివి పదుగురిలోన్. ౩౧౮

ఆ॥ అనుచుముట్టనాడు ♦ జనకునినుడులకు, మొగమునందు నగవు ♦ మొలకలెత్తఁ
బలికెనిట్లు దసుప్రి♦లలరిమీయల్లుని, నింతవానిఁజేసి ♦ రింతనిజము. ౩౧౯

మ॥ అని కంజేక్షణమానివృత్తమును నా♦ద్యంతంబునుం దెల్పఁగా
విని శర్యాతినృపుండు విస్మయముచే ♦ విభ్రాంతుఁడై యల్లునిన్
దనయందోడ్కొని సంతసింపుచొకస♦ద్మంబందునన్ జేర్చి యా
ఘను నధ్వర్యునిఁజేసియధ్వరము సాఁ♦గన్ జేసె సోత్కంఠుఁడై ౩౨౦

శా॥ అందా నిర్జరవైద్యులన్ జ్యవనుఁ డా♦హ్వానించి హవ్యంబునా
నందంబొప్పఁ గొనుండటంచు నిడఁగా ♦ నా దసుప్రిలద్దానిఁ జే
నందంబోవఁ బురందరుండుఁగని యా♦హా గంటి నీ దార్ష్ట్యమం
చుందర్పించఁగ లేచిపల్కె మునితో ♦ నత్యంత క్రోధాత్ముఁడై. ౩౨౧

మ॥ కపటస్వాంతుఁడ మంచి చెడ్డలరయం♦గాలేక నష్టోమెద్రో
యుపకారంబొనరించినారనుచునో ♦ హాయోయాయపా త్రేయులన్
గృపగీర్వాణులమధ్యఁజేర్చుటకునూ ♦ హింతే సహింపంజు మా
యపరాధంబునటంచు నెత్తేఁదన వ♦జ్రాభీల దోర్దండమున్. ౩౨౨

ఉ॥ అత్తరిమానిహాఘమ్మని మ♦హాగ్రిహాపూరితుఁడాచుఁ జూడఁదా
నెత్తినబాహువెత్తినటు ♦ లేర్పడనుండుట కద్భుతంబులో
నుత్తలపాటుతల్లడము ♦ నొందుచులేచిపురందరుండులో
కోత్తరుఁడా మునింగని న♦మో త్తులనిట్లని పల్కెనమ్రుఁడై. ౩౨౩

ఉ॥ ఇంతటివాఁడవంచెఱిఁగి ♦ యేజడతన్ దెలియంగలేక నీ
స్వాంతమునొవ్వఁజేసితిఁ గృ♦పన్ గని తప్పుక్షమింపుమయ్య పీ

రింతటనుంచి మాత్రిదశ ♦ బృందముతోఁ గ్రతుభాగ మెంత యున్
సంతసమారఁ గొందురిక ♦ సందియ మేమియు లేదు లోపలన్. ౩౨౪

తే॥ అనుచుఁ బ్రార్థింపగతకోపుఁ ♦ డయ్యె వాని, శక్రుఁ డంతటఁ గతభుజా ♦ స్తంభుఁ డయ్యెఁ
హర్షభూయిష్ఠమానసు ♦ లైరి జనులు, నంద ఱగ్రిజులబలంబ ♦ యధికమనిరి. ౩౨౫

వ॥ అంత శర్యాతిధరాకాంతుండు ఋత్విజుల కపారధనం బొసంగి తక్కినధరణి బృందారకుల మనంబులలర మణిమయకాంచనాంబరాభరణాదులొసంగి యవబృథస్నాతుండై యల్లునికి సపర్యలందనువుచుండఁ గతిపయదినంబులకు నమ్మునికులతిలకుండు సుకన్యతోఁ దనయాశ్రమంబుఁ బ్రవేశించి తపంబున్న వాఁ డెద్దినీవడిగితివది విశదంబుగ వింటివిక దా యిప్పుడు సేవితాఖిల జనాఘలతా లవనుండగు నాచ్యవనుఁ దర్శించి నమస్కరించి జయాశీస్సులనొంది యా తాపసోత్తముని యధ్వరంబున కాహూతుం జేయుమని సుమతి తెల్పుచుండ నయ్యాజ్ఞాశ్వంబు తదాశ్రమంబుఁ జేరి నవీనమసృణదూర్వాంకురంబుల మెసవుచుండె నట్టియెడ శత్రుఘ్నుండు. ౩౨౬

సీ॥ చ్యవనమునీంద్రు నా ♦ శ్రమమునకేగి సద్భక్తి నాతని పాద ♦ పంకజములఁ
బడివివస్వత్కుల ♦ పాథోధిశుభ్రాంశుఁడై మించు రామచం ♦ ద్రానుజుండ
శత్రుఘ్నుఁడనువాఁడ ♦ సవనతురంగమా, వనమునకై వెంట ♦ వచ్చినాఁడ
మామకాఘౌఘు శ ♦ మనమునకై దేవ, సన్నుత నే మ్రొక్కు ♦ చున్న వాఁడ

తే॥ ననుటయు మునీంద్రుఁ డామోద ♦ వనధిమునిఁగి, నరవరోత్తమ నీకున ♦ నంతశుభము
లశ్వరాశ్వావనంబున ♦ నరి విజయము, ఘనతరంబైన కీర్తియుఁ ♦ గలుగుఁ గాత.

వ॥ అని యాశీస్సులిడి యచ్చటనున్న బ్రాహ్మణులం గాంచి యిట్లనియె. ౩౨౭

సీ॥ పాతకంబులు పటా ♦ పంచలై పోవు నే, గుణనిధి నామస్మ ♦ రణమువలన
నేహ్యారూపమువాసి ♦ యిటు చక్కనైతి నే, యనఘుని శ్రీపద ♦ ధ్యానమునను
భువినున్న పెనురాయి ♦ పొలఁతియై నిలచెనే, రఘునరపాద ప ♦ రాగమునను
జన్యమం దసురులు ♦ సారూప్యమంది రే, ధన్యముఖాబ్జసం ♦ దర్శనమున

తే॥ అట్టి పావనమూర్తి కే ♦ యఘము నేది, యొకటికలదంట యాదుష్కృ ♦ తోపశాంతి
కొఱకు హయమేధ మొనరింపఁ ♦ గోరెనంట, వింటిరే యిట్టిచిత్రముల్ ♦ విశ్వమందు.

తే॥ యోగమార్గస్థులైనట్టి ♦ యోగివర్యు, లే మహాత్ముని హృద్గుహా ♦ నెలమిఁ జేర్చి
ధ్యానమొనరించి పరమప ♦ దంబుఁ గందు, రట్టి పావనమూర్తి కే ♦ యఘము కలదె.

ఉ॥ చారుసునాసికంబు సిత ♦ సారసపత్రనిభాక్షు మిందిరా
గారము భ్రూలతోన్నతము ♦ గాంచనకుండల రాజతంబునౌ

మా రఘువర్య నెమ్మొగము ♦ మానకఁ జూచెద నీదురంత సం
సారమహాబ్ధిదాటెదను ♦ జన్మము సార్థకమందఁజేసెదన్. ౩౩౧

క॥ ఖరదైత్యాంతకుక్షేమం, కరవార్తను వింటి నాదు ♦ కర్ణములలరన్
గరుణామూర్తినిఁ గన్నుల, కరువుం దీరంగజూడఁ ♦ గంటినిమ్మంటిన్. ౩౩౨

తే॥ రామనామంబుస్మరియించు ♦ రసనరసన, కానికానిరసన పూర్తి♦గా ద్విరసన
రసనయనిచెప్పవచ్చు నా♦రామనామ, మిపుడు స్మరియింపఁజేసితి ♦ వినకులేశ. ౩౩౩

క॥ ఇప్పటికేఁబండె నాతప,మిప్పటికి మనోరథంబు ♦ లీడేరెను నే
నప్పకదప్పక తత్పదరజమున, నిప్పుడపావనము సేయ ♦ నేగెదఁ దనువున్. ౩౩౪

క॥ ధన్యుఁడనయ్యెడ వ్రతమూ, ర్ధన్యులపాలింటి కల్ప♦తరువగు నృపమూ
ర్ధన్యునిఁగని తద్వార్తల, ధన్యముగను జేతునిపుడు ♦ తగనారసనన్. ౩౩౫

వ॥ అనుచు శ్రీరామచంద్ర చరణస్మరణ మాత్రసంజాత ప్రేమామృత ప్రస్రుత గద్గదవాగుదస్రుండై శరీరంబుమఱచియుండి కొంతవడికిఁ దెలసి. ౩౩౬

తే॥ శ్రీరఘూద్వహా శ్రీరామ ♦ శ్రీధరాత్మ,జామనోహర ఘోర సం♦సారజలధి
మగ్నజనయానపాత్ర ధ♦ర్మస్వరూప, "మాంసముద్ధర" యంచుఁ బ♦ల్మారు మ్రొక్కె.

వ॥ పరమానందంబునన్ జొక్కుచున్న యప్పరమభాగవతాగ్రగణ్యుంజూచి శత్రుఘ్నుం డిట్లనియె. ౩౩౮

తే॥ యమివ రా రామచంద్రుని ♦ యజ్ఞశాలఁ, బావనంబుగఁ జేయవే ♦ పదరజమున
రాముఁ డత్యంత సుగుణాభి♦రాముఁడయ్యెఁ, జిత్తపంకజమునమీరు♦చేర్చుకతన.

వ॥ అను శత్రుఘ్నుని పలుకుల కలరి నిఖిలాగ్నులతో సపరివారంబుగఁ బ్రయాణోన్ముఖుండగు చ్యవనుంగాంచి హనుమంతుండు లవణాంతకునితో నిట్లనియె. ౩౪౦

తే॥ శలవాసంగితీవేని యో♦శత్రుదమన, నిమిషమాత్రనఁ దాపసా♦నిమిషనాథు
మూపునందునఁ జేర్చి కొం♦పోయిరామ, భద్రుముందరఁబెట్టనే ♦ భద్రముగను.

వ॥ అనుచు లక్ష్మణానుజన్మునాజ్ఞవడసి సపరివారంబుతో నమ్మౌనిఁ దన మూపున నిడికొని పవనతనయుం డు పవనవేగంబున నయోధ్యంజేరునంత రఘూత్తంసు డెఱింగి యెదురుగాఁబోయి యర్ఘ్యాద్యులంబూజించి తోడితెచ్చి యర్హాసనంబున నుండ నియమించి నమస్కరించి యిట్లనియె. ౩౪౨

మత్తకోకిల॥ ఓతపోధనవర్య మీర్దయ♦యుంచి నేడరుదెంచుటన్
నాతపంబు ఫలించె నీ సవ♦నంబు సార్థకమొందె నీ
భూతలంబున సద్యశంబును ♦ బొందితిన్ మనఁగల్గితిన్
బాతకంబులు నాశమొందెను ♦ బావనత్వముఁ గాంచితిన్. ౩౪౩

వ॥ అనిన మునిపుంగవుం డిట్లనియె. ౩౮౪

క॥ బ్రహ్మాదిసురనుతుండవ, జిహ్మగుఁడవ ధర్మమార్గ ♦ శిక్షకుఁడగునో
బ్రహ్మణ్యదేవయెపుడీ, బ్రాహ్మణపాలనమునీకు ♦ భావ్యంబకదా. ౩౮౫

క॥ ఓవాత్స్యాయన మునివర, యీవడువున నిష్టగోష్ఠి ♦ నెలయించి విభుఁ
డావరమునగనుండెను ముని, పావనిచని యిది సుమిత్ర♦పట్టికిఁ దెల్పెన్. ౩౮౬

వ॥ అంత శత్రుఘ్నుండు మునికులాలంకారుండగుచ్యవనుని ప్రభావంబున కచ్చెరు వందుచుఁ బయోష్ణీనదీ జలపానంబుఁజేసి తత్తీరంబున విశ్రమించెనని యిట్లు వాత్స్యాయన మునీంద్రునకు ఫణీంద్రుండు సెప్పె. ౩౮౭

శా॥ ఛిద్రాంతశ్శ్రయ భూషణాసితగరు ♦ త్సీతాంశుకాశద్యుతీ.
క్షుద్రేభాసుర జీవనాతిబల చ♦క్షుశ్శ్రోత్రభేత్స్యేఖరా
యద్రిప్రోద్భవ విస్మయాపహతుషా♦రాద్రిప్రసూతాప్రియా
భద్రోద్ధారణ స్వర్ధునీపదకదం♦బా భక్త భద్రప్రదా. ౩౮౮

క॥ కమలారిశిరోభూషణ, కమలాది సురార్చితాంఘ్రి ♦ కమలాకలస
త్కమలా తూణీకృత, కమలాకర విధృతకమల ♦ కమలానాధా. ౩౮౯

మాలిని॥ అమరవరవసుగేయా! ♦ వ్యాఘ్రచర్మోత్తరీయా!
విమలతరశరీరా! ♦ వేదమార్గప్రచారా!
సమరభయదరూపా! ♦ సర్వరాట్తల్పరోపా!
శమితవిమతజాలా! ♦ శైలజా ప్రాణలోలా! ౩౯౦

గద్య

ఇది శ్రీ మద్గార్త్యన్వయ పవిత్ర లక్ష్మీనారాయణార్యౌరసపుత్ర శ్రీ చింతలపాటి వంశ క్షీరపారావారరాకాసుధాకరాయమాణ సూర్యనారాయణార్య దత్త పుత్త్ర శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షాసమాసాదితానవద్యోభయ కవిత్వ విద్యావధాన రామమూర్తి శాస్త్రి కవ్యభిధాన ప్రణీతంబగు రామాశ్వమేధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ

గణాధిపతయే నమః

శ్రీరామభద్రాయ కరుణాసముద్రాయ నమః

# రామాశ్వమేధము

## తృతీయాశ్వాసము



లోలాద్భృతశీలా
శూలాంచితహస్త తీర్థ♦జూటాకంఠే
కాలా కాల స్మయహర
వ్యాళేశవిభూష యీశ ♦ యానందేశా ! ౧

వ॥ అవధరింపుము వాత్స్యాయన మునీంద్రుండనంతరకథాశ్రవణ కుతూహలుండై ఫణీంద్రుంగని యిట్లనియె. ౨

క॥ అచ్చోటనుంచి తురగం, బెచ్చోటకుఁ జేరఁబోయె ♦ నెట్లుమెలఁగెనా
సచ్చరితము మదివినఁగా, ముచ్చటగాఁ దోఁచెఁజెపుము ♦ భుజగాధీశా ! ౩

వ॥ అని ప్రశ్నించిన వాత్స్యాయనునకు శేషుం డిట్లనియె.

సీ॥ అధ్వర ఘోటకం ♦ బాపయోష్ణీనదీ, నీరంబులను బొట్ట♦నిండఁద్రావి
చతురంగబలముతో ♦ శత్రుఘ్నుఁడు సువర్ణ,రథమెక్కితన వెంట♦రాగ విమల
ధరణీశుఁడేలుర♦త్నాతటాఖ్యపురంబుఁ, జేరఁగ నారాజుఁ ♦ జేరిభటులు
భూపాల మనరామ♦భూపాలు సవనాశ్వ, మిటకువచ్చెనటంచు ♦ నెఱుఁగఁజేయ
తే॥ నిందునిభకాంతి కలడెబ్బ♦దేనుఁగులును, వేయిరుక్మరథా ల్పది ♦ వేలుపెల్ల
గుఱ్ఱములు, విత్తరాసులుఁ ♦ గొంచుఁబోయి, భూపుఁడాలవణాంతకు♦ముందుఁబెట్టి.

తే॥ పాదములమీఁదఁ బడిలేచి ♦ పరమభక్తి,గడలుకొన నిట్టులనియెనా♦క్ష్మాధినాథుఁ
డనఘ నాజన్మసాఫల్య ♦ మయ్యెనేఁటి, కైతిధన్యుఁడనిజముగ ♦ ననుచుఁబలికి. ౬

ఉ॥ నేఁటికిరామభద్రుని వి♦నిర్మలవార్తనువింటి నింకనా
కేటికి సీతురంగమము ♦ లేనుఁగులీరథముల్ ధనంబు లిం
కేటికిరాజ్య మీవిభవ ♦ మేటికి నిన్నియు నర్పణంబునా
మేటికిఁ జేసియుండెదన ♦ మిత్రహతత్పదసేవఁ జేయుచున్.

క॥ తనయుండెడఁగో విూపద, వనజంబుల నాశ్రయింప ♦ వచ్చెనయా నే
ననుమిూవాఁడను నీయా, జ్ఞనుగోరెద నేమిశెలవు ♦ నరవర! చెప్పుమా. ౮

ఆ॥ అనసుమిత్రిపట్టి ♦ యాలింగనముజేసి, అనఘ! విమల! భూప! ♦ యానతిచ్చు
టకును నెంతవాఁడ ♦ సకలంబు నీదిగా, నడుపువీతివెంట ♦ నడువుమయ్య.

క॥ అనుటయునాభూపతి త,క్కినవారిప్పటికిజాన♦కీజానిఁగనుం
గొనఁగల్గెనంచు మోదం,బునఁ బొంగుచుఁ గదలిరమిత♦ముగఁ గొంచుసిరుల్. ౧౦

వ॥ ఇట్లు కదలితురంగంబునకు మొక్కి వెంటఁజనుచుండు సమయంబునశతృఘ్నుండు ముందర. ౧౧

శా॥ కాంచెన్ స్ఫాటిక రౌక్మరాజిత లస♦ద్గ్రావాంచిత ప్రస్థ మ
చ్ఛాంచత్పుష్కర నిర్ఝరారవము దీ♦వ్యద్ధాతు సంవీతముం
జంచద్గాంగతరంగ సమ్మిళిత శ♦శ్వత్సీతతోయాఢ్యమున్
బ్రాంచద్ధంసశుకాది విష్కిర విరా♦వావాలమున్ శైలమున్. ౧౨

ఆ॥ చూచిచూచి దాని ♦ సొబగంతయును దల, యూచియూచి మంత్రిఁ♦జూచిపల్కెఁ
నహహ కలవెయిట్టి ♦ యద్రులెందైనను, గలయ వెతకిచూడఁ ♦ గలవెముందు. ౧౩

వ॥ మఱియు నిది సిద్ధదంపతీ క్రీడావిలసితంబును, గంధర్వాప్సరో నాగకన్యాస్వైర విహారాభిరామంబును, వేణువీణాక్వణన మనోహరంబును నై నాడెందమున కతి విస్మయంబుఁ గలిగింపుచున్నయది. యీ నగాభిధానంబెద్ది దీనియందే దేవత యుండు నీ వృత్తాంతంబు సవిస్తరంబుగఁ దెలుపు మన సుమతి యిట్లనియె. ౧౪

సీ॥ శత్రుఘ్న! నీలాఖ్య ♦ శైలంబు సుమ యిది, స్ఫాటికమయశృంగ ♦ చయముఁగల్గి
చూడ నింపుగనుండు ♦ సురఁదాగ్రవువారలు, పరదారలను రక్తిఁ ♦ బట్టువారు
గోవిందుగుణముల ♦ గుర్తెరుంగనివారు, ధర్మదూషకులు న♦ధర్మరతులు
హేతువాదముసేయు ♦ హీనులు నీల క్రి,యంబులా ♦త్మావిక్రి♦యమును సలుపు
తే॥ వారు బ్రాహ్మణులయ్యును ♦ బొలుఁబెరుగుఁ, జల్లనేతుల విక్రియా ♦ ల్సలుపువారు
శీలవతియగు పత్ని దూ♦షించువారు, ఘాతకులు నీ గిరీంద్రింబుఁ ♦ గానలేరు. ౧౫

క॥ కులశీలంబులు రూపముఁ, గలవానికిఁ గన్నెనీకఁ ♦ గడుమోహితుఁడై
పలుగాకి కమ్ముకొను నా,ఖలుఁడే మాతృమును గండ్లఁ ♦ గాంచఁడు దీనిన్. ౧౬

తే॥ శీలవతియైన భార్య దూషించువాఁడు, బంధువులకైనఁ బెట్టక ♦ పాయసాదు
లొక్కఁడే పొట్టనిండను ♦ మెక్కువాఁడుఁ, బజ్ఞిభేదియుఁ గనలేఁడు ♦ పర్వతంబు.

తే॥ ఎండతాకునఁ బడలుచుఁ ♦ నేగుదెంచి, నట్టి యభ్యాగతుఁనకేది ♦ యైననిడక
నాస్తినాస్త్యనువారికి ♦ నంతరిక్షు, భుజుల కగపడదయ్య యీ ♦ భూధరంబు. ౧౮

ఆ॥ మాటలేల నింక ♦ మన రామచంద్ర సే,నాపరాజముఖులగు ♦ పాతకులును
చేరినమ్మువారిఁ ♦ జెరిపెడివారలు, నీ నగోత్తమంబుఁ ♦ గానలేరు. ౧౯

ఉ॥ చూచినమాత్రమేజనుల ♦ శుద్ధులుగాఁగను జేయు భక్తితో
వేచనుమాత్రమేసిరులఁ ♦ బెల్లుగఁబైపయిఁ గుమ్మరించు నా
నాచలరాజిదీని పది♦యారవవంతున కోడు రత్న స
ద్రోచుల కేమి పున్నెముల ♦ పోవుసుమా? ఇది లక్ష్మణాగ్రజా! ౨౦

ఉ॥ ఈజగతీధరంబున సు♦రేంద్రశిరోమకుటస్థరత్నసీ
రాజితపాదుఁ డార్యజన ♦ రక్షకుఁడౌ పురుషోత్తముండుఁదాఁ
బూజలఁ గొంచునుం డతనిఁ ♦ బూజలఁ దన్ని నివేదితాన్నముం
భోజన మొప్పఁజేసివిను ♦ భూప! చతుర్భుజు లౌదు రెల్లరున్. ౨౧

ఆ॥ లేవులేవు శ్రుతులుఁ♦గావుకావెపుడుం బ్ర,మాణములు స్మృతుల్ పు♦రాణములు న
టంచునుడువు మూఢు♦లైనట్టి బ్రాహ్మణుల్, తెలియఁ,జాలరెందు♦ దేవదేవు. ౨౨

భుజంగప్రయాతము॥ సరోజాసనేంద్రాది♦సర్వాదితేయుల్,
నిరాహారనిష్ఠన్ వ♦సిన్ జేరుమౌనుల్
ధరన్ గల్గు తీర్థాళి ♦ దర్శించువారెం,
దరైనన్ గనన్ లేరు♦తత్పద్రజంబున్. ౨౩

తే॥ విమలవేదాంతవాక్య సం♦వేద్యుఁడతఁడు, పరమనిశ్చలభక్తి సం♦వశ్యుఁడతఁడు
జ్ఞానమార్గైకవేత్తృ సం♦గమ్యుఁడతఁడు, కలుషనాస్తికమానుషా♦గమ్యుఁడతఁడు.

వ॥ స్మరణమాత్రంబున దురితహార సమర్థంబగు నప్పురుషోత్తమదేవు చరిత్రంబును దెల్పు నొక్క యితిహాసంబుఁగలదు దాని నెరిగింతు నవధానుండవై వినుమని సుమతి యిట్లనియె. ౨౪

సీ॥ కలధౌతమయసౌధ ♦ విలసితమంబర, చుంబిప్రాకార సం♦శోభితంబు
నమితగజస్యంద ♦ నాశ్వాదిచతురంగ, బలవాహన సమృద్ధి ♦ భాసురంబు
వర్ణాశ్రమాచార ♦ వర్తనాసక్తివి, ప్రాదివర్ణచతుష్ట ♦ యాశ్రియంబు
సకలజనారతో ♦ చ్చారితరామేతి, పూతనామాత్యంత ♦ ముఖరితంబు
తే॥ సత్యదానదయాతప ♦ శ్శాంతశమ న, యాదినిఖిలామలగుణాశ్రి ♦ యాశ్రియంబు
హేయగుణజాలయుతజన ♦ హీనమగుచు, రాజిలుధరిత్రిఁ గాంచీ పు♦రంబొకండు.

శా॥ శీలాచారయుతుండు దుష్టజనతా ♦ శిక్షాపరిదక్షుండు స
త్యాలాపైకరతుండు బ్రాహ్మణప♦ర్యాసక్తచిత్తుండు ది
క్కూలాతిక్రమణ ప్రశస్తయశుఁడ♦క్రోధుండు శూరుండు నే
నీలగ్రీవన్నపాలుఁ డప్పురముఁదా ♦ నేరొప్ప నేలుంజుమా. ౨౬

క॥ గౌరవమునఁ బెంపొందుచు, నారవభాగంబుపన్ను ♦ నందరివలనన్
నేరుపునఁ గొంచువైరుల, నారుగురఁ జయించిమించె ♦ నధిపుండవనిన్. ౨౮

వ॥ ఇట్లా నృపాలుండు ధర్మంబుఁదప్పక ప్రజాపాలనంబుసేయు చొక్కనాడు పరమ పతివ్రతారత్నంబగు విశాలాక్షి యను పత్నింగని యిట్లనియె. ౨౯

ఉ॥ హాయనముల్ మఱెన్నియొ య♦హా కనుచుండఁగఁ బోయెనింక నీ
కాయముఁజూడ వార్ధకతఁ ♦ గాసిలిఁజెందుచునుండె మాయురే
హేయముఁలైన సంపదల ♦ నెక్కువగా మదినమ్మియుంటి నేఁ
జేయనుపాయమొక్కటియుఁ ♦ జెందఁగ ముక్తిఁ గురంగలోచనా! ౩౦

ఉ॥ సూనులు రాజ్యభారమును ♦ సొంపుగఁ బూనఁగనర్హులున్నవా
రేను వసుంధరాభరము ♦ నెంతయు మోసి భరంబుఁజెందితిన్
మానిని రమ్ము వెంట నను♦మానములేదు పురీజనంబుతోఁ
గానఁగఁబోయెదన్ సురని♦కాయ్యములన్ గల తీర్థకోటులన్. ౩౧

క॥ గోవిందుననుగ్రహమున, నేవెంటఁ గొరంత లేక ♦ నెల్లసుఖములే
నీవరకు ననుభవించితి, గోవిందుని సేవసేయఁ ♦ గోరెదనింకన్. ౩౨

తే॥ చచ్చువరకెప్పు డుదరపో♦షణముకొరకుఁ, బాటుఁబడుటయ కాని శ్రీ♦పద్మనాభు
సేవ సేయకయున్నట్టి ♦ చెడుగు పెద్ద, బరువుమోసెడియెద్దుగాఁ ♦ బలుకఁదగదె.

వ॥ ఇట్లు పలికి యారాత్రిఁ గొంతవఱకు మాధవకథాసుధన్ గ్రోలుచుండి నిద్రింపుచుండ నిశాంతంబునఁ దపస్వియగు నొక బ్రాహ్మణుని స్వప్నంబునం గని మేల్కని స్నానాది నిత్యకృత్యంబులు నిర్వర్తించి కొలువుండునంత. ౩౪

గీ॥ దండ మొకచేత నొకచేఁ గ♦మండలంబుఁ, బట్టువాఁడును నారలుఁ♦గట్టువాఁడు
జడలవాఁడుఁగృశాంగుఁడుఁ♦బుడమిరేని, యక్షులకు జటి యొకఁడుఁబ్ర♦త్యక్షమయ్యె.

క॥ వచ్చిన యా విప్రుంగని, విచ్చేయుఁడటంచు భక్తి♦వినయంబులతో
నచ్చుగ నర్చనలిడితో, డ్తెచ్చి కనకపీఠినిడి య♦ధిపుఁడిట్లనియెన్. ౩౬

ఉ॥ ఎచ్చటనుంచి యెచ్చటికి ♦ నేగెదరయ్య ద్విజాగ్రగణ్య! మీ
రిచ్చటికేగుదెంచుట మ♦దీయగృహంబు ననున్ గృతార్థతన్
బుచ్చుటకే కదా జడులఁ ♦ బ్రోచుటకై యరుదెంతు రిట్టివా
రిచ్చజనించెనయ్య యొక ♦ యీ♦ప్సితమద్ది వినుండు తెల్పెదన్. ౩౭

ఉ॥ మీరు సమాధితత్పరులు ♦ మిక్కిలి శ్రేష్ఠులు సర్వతీర్థముల్
వారక దేశదేశముల♦పారములౌ విబుధాలయంబులన్

గూరిమిఁగాంచి నార్జన ని♦కుక్షినిఁజేరగనీని క్షేత్రమ
ప్ద్వారిగముక్తినీఁగల సు♦పర్వుఁడెవండు నెరుంగఁజెప్పుడీ. ౩౯

వ॥ అనుటయు జటిలుండిట్లనియె.

క॥ భవమునుబొందఁగనీయని, దివిషద్వరుఁడట్టి పుణ్య♦తీర్థంబెదియో
వినిపించెద నిపు డది నే, నవధానంబుగనువిను మ♦యా! భూమీశా! ౪౦

క॥ ఉరుసంసారజ్వరసం, హరుఁడౌ రామచంద్రుఁ-డనుచు నెరుఁగుమా
వరమునిజనసంసేవ్యుఁడుఁ, బురుషోత్తమసంజ్ఞలోక-పూజ్యుండతఁడే॥ ౪౧

చ॥ తిరిగితి నెల్లదేశములఁ ♦ దీర్థములన్నిటిలో మునింగితిన్
దురితమహాటవీదహన ♦ తుల్యములై చెలువొందుచున్న స
త్పురములఁజూచితిన్ సవన ♦ భుక్కులఁబూజలఁదన్పితింక నే
నెరుఁగనివేవిలేవుధర ♦ ణీశ్వరయీధరణీతలంబునన్ ౪౨

క॥ కంటి నయోధ్యనవంతికఁ, గంటినివిమలాఖ్యపురము ♦ గాంచీ పురమున్
గంటిని గోకర్ణంబును, గంటిహరిద్వారహాట♦కక్షేత్రములన్. ౪౩

క॥ కంటినిసరయూనది నేఁ, గంటినిదాపినిసముద్ర ♦ గామినిరేవన్
గంటినిముక్తినిజూచిన, వెంటనెయిడుమల్లికాఖ్య ♦ విపులనగంబున్. ౪౪

తే॥ పతితమానుషగాత్రసం ♦ స్పర్శమునను, నీలవర్ణోదకములువి♦నిర్మలంబు
లగుట నీ తీర్థమఘనాశ ♦ నాఖ్యతీర్థ, మనఁగఁబరగెనుగంటిఁబ్ర♦త్యక్షముగను. ౪౫

సీ॥ అమరదానవసేవి ♦ తాష్టాపదవికార, వరచతుర్ద్వారగో♦పురములెచట
నిద్రవోవలయంబు ♦ నిధన మొందిన మోక్ష, మనెడిశుత్ర్యర్థమ♦న్వర్థమెచట
బశుమృగకీటక ♦ పతగమనుష్యపా, షాణములెవ్వరైన ♦ జక్రులెచటఁ
బ్రహ్మహత్యాదిపా♦పములఁబోఁదోలుత్రి, విక్రమదేవు ని♦వేశమెచటఁ.

తే॥ గలవొపొందినదోమైరో♦కలదొయట్టి, బ్రహ్మజల శుభపూర ♦ ప్రభాసమాన
గోమతీవాహినీస్నాన ♦ కుశల సకల, పుణ్యపురుషాఢ్య ద్వారకా ♦ పురముగంటి.

వ॥ సకలహత్యాలతాలవిత్రంబగు కురుక్షేత్రంబును ననంతపాతకోపపాతక శిలోచ్చ
యాశని సదృశంబగు శమంతపంచకంబును సుకృతైకరాశియగుకాశింగంటి. ౪౬

సీ॥ అన్నపూర్ణా విశా♦లాక్షీసమేతుఁడై, యెలమి విశ్వేశ్వరుఁ♦డెచటనుండు
గంతుఁ గొనెడివారి ♦ కర్ణబిలంబుల, శివుఁడు తారకమెటఁ ♦ జెప్పుచుండుఁ
చీమలెల్కల్ క్రిముల్ ♦ దోమలు మొదలుగా, నేవియైనను ముక్తి♦నెచటఁగాంచు
నివసించువారల ♦ నిఖిల దుష్కృతరాశి, పంచబంగాళమై ♦ పారిపోవు

తే॥ దండికలఁడంచు నొకరైనఁ♦దలఁచరెచటఁ, గర్మశేషంబుఁ బరమునఁ♦గాంచరెచటఁ
గాలభైరవదేవుఁడె ♦ ప్రేలునట్టి, వారణాశిని వర్ణింప♦వశమె నాకు. ౮౮

తే॥ విశ్వనాథాఖ్యఁ జెన్నొందు ♦ వేటకాఁడు, కాశియనువింట నారిగా ♦ గంగఁగట్టి
కోలగా మణికర్ణికఁ ♦ గూర్చి-భక్త, జనఘనాఘ మృగంబులఁ ♦ జంపుచుండు.

వ॥ నరేంద్రా యీ యానంద వనమాహాత్మ్యం బా భాగీరథీప్రభావం బా మణికర్ణికా విభవం బా విశ్వేశ్వరు మహిమం బెన్నుటకు నచ్చిలువరేనికైనం దరంబుగాదది యట్లుండనిమ్ము. ౯౦

క॥ ధరణింగల తీర్థంబులు, నెఱిఁగాంచితిఁగాని నీల♦గిరిఁ బోలుగిరిన్
బురుషోత్తమదేవునకెన, యానిర్జరునెందు నీజ♦గానన్ గానన్. ౯౧

చ॥ ధరణిప శ్రద్ధధానులయి ♦ తన్నగముల్ భజియించు మానవుల్
పరగ సనాతనంబయిన ♦ బ్రహ్మపదంబునుగాంతురు తీర్థముల్
దిరుగుచుఁ బోయి చూచితిని ♦ దేవనదీసరితా మధీశ శం
బరవర శీకర ప్రసర ♦ ప్లావిత ప్రాంగణమా గిరీంద్రముల్. ౯౨

క॥ బొల్లను నేగిరి మహిమం, బెల్లరెరుఁగ రొక్క-చిత్ర♦మేఁ గంటినటన్
భిల్లులు చతుర్భుజులుచే, విల్లుగలారం దరమిత ♦ వీరులు వింటే. ౯౩

తే॥ కందమూలఫలాది భ♦క్ష్యములఁదినుచుఁ, గాలమునుబుచ్చునావిలు♦కాండ్రఁజూఁడ
నొక్క-సందేహమప్డు నా♦కొదవెనాల్గు, చేతులుండుటకేమియో ♦ హేతువనుచు. ౯౪

వ॥ మఱియు.

సీ॥ శంఖచక్రగదాబ్జ ♦ శార్ఙ్గోల్లసితపాణు, లచ్యుతలోకవా♦సాభరూపు
లయ్యారెవనమాలి ♦ కాభిరాములువిజి, తేంద్రియులీభిల్లు ♦ లెల్లవారు
బ్రహ్మాదులకునైనఁ ♦ బడయశక్యముఁగాని, వివిధీరికెట్లు సం♦భవములయ్యె
బలెవిష్ణుభక్తుల ♦ వలెనున్నవారంచు, డెందమందద్భుత ♦ మొందివారిఁ
తే॥ జేరిమీరేమి పుణ్యంబుఁ ♦ జేసిపూర్వ, మిట్టిరూపంబుఁగాంచినా ♦ రెవరుమీరు
చెప్పుఁడనినన్ను హాస్యంబుఁ ♦ జేసివారు, నవ్వుకొనుచిట్లుపలికిరి ♦ నరవరేణ్య. ౯౫

తే॥ అయ్యయోనీవువిప్రుఁడ ♦ వయ్యుఁదెలియ, వైతివే పిండమాహాత్మ్య♦మనుచుఁ గేర
డంబుఁ జేసిననేను బిం♦డంబనంగ, నేదదే దేవతకుఁదగు ♦ నిడఁగనంటి. ౯౬

వ॥ అప్పుడా కిరాతులు నన్నుగాంచి యిట్లనిరి. ౯౭

సీ॥ విప్రుఁడామానుడుల్ ♦ వినుము మాపిల్లవాఁ, డర్భకులనుగూడి♦ యాడుకొనుచు
నేరేడుపండ్లను ♦ నిత్యంబు దినుచొక, నాఁడుఁగ్రీడాతమి ♦ నగశిఖరమ్ము

బాలులతోనెక్కి ♦ పవిమలగారుత్మ, తాదిరత్నాఢ్యకు♦డ్యములుఁగల్గి
తనకాంతిచేనంధ ♦ తమసంబుఁబోకాచుఁ, జుండుదేవాలయ ♦ మొకటిఁగాంచి

ఆ॥ స్వాంతమందువిస్మ ♦ యమునొందిదేదేవ, తాలయంబొ? భళిర ♦ యరిగిచూతుఁ
గాకయనుచు మెల్లఁగా నప్పుగోహంత, పోతవితతితోడఁ ♦ బోయిపోయి. ౫౯

శా॥ కాంచెన్గాంచన పొల్లసన్మకుట స♦ద్గ్రైవేయ రత్నస్ఫుర
త్కాంచీకంకణహార నూపురమహా ♦ కల్పాభిరాముఁ బదా
బ్జాంచచ్ఛ్రీతులసీదళాభరణు దే♦వాధ్యక్షు మూర్తిభవ
చ్చంచచ్చక్రగదాబ్జశార్ఙ్గజల రు♦ట్సంసేవితాంఘ్రిద్వయున్. ౬౦

వ॥ మఱియు నక్కడ నారదాది పరమభాగవత మునిజనసేవ్యుండును దర్శనమాత్రా ఖిల మానుషాపవర్గప్రదుండును నగు నప్పురుషోత్తమస్వామి కభిషేకంబు సేయు వారును మనోహర సురభికుసుమంబుల నర్చనల సల్పువారును ధూపదీపంబుల నొసంగువారును నవవిధాన్నంబుల నైవేద్యంబు సేయువారును నీరాజనం బిచ్చు వారును నృత్యగానంబులు సేయువారును నైకొంతవరకు సత్కథా కాలక్షేపం బొనర్చి దేవతలు వారివారి యునికిపట్లకుంబోవ నంతయుంజూచుచు. ౬౧

తే॥ బ్రహ్మముఖ్యులకందఁగ ♦ రానిదాని, భాగ్యవశమునముందరఁ ♦ బడినదాని
నారసింహాని వేదితా ♦ న్నకణ మొకటి, దీసికొనితినెమావాఁడు ♦ ద్విజవరేణ్య. ౬౨

క॥ తినునంత సరోజాక్షుని, గనునంతఁజతుర్భుజములు ♦ కలవాఁడై శ్రీ
వనజసుదర్శనముఖలాం, ఛనములచేనొప్పెవాఁడు ♦ చకితవిధమునన్. ౬౩

క॥ డెందంబున నరుదందుచ, మందగతిన్వచ్చియచటి ♦ మహిమనతఁడుమా
కందరికిని దెలుపఁగనా, నందంబునఁబోయిచూచి ♦ నారము విష్ణున్. ౬౪

ఆ॥ భక్తిమొ్రక్కులిడుచు ♦ భగవన్నివేదితా, న్నంబుఁదినుచునుండ ♦ నళిననయను
దాసరూపమపుడ ♦ తాల్చితిమేమింక, వేరచెప్పనేల ♦ పిండమహిమ. ౬౫

క॥ వినవలసినదీవంతయు, వినిచితిమికదా? యటంచు ♦ భిల్లులు వలుకన్
మనముననద్భుతమొందుచుఁ, జనివిష్ణు పదీసముద్ర ♦ సంగమమందున్. ౬౬

చ॥ మునిగిపవిత్రమూర్తినయి ♦ మోదమునంజనికంటి రత్నపుం
గనులవెలుంగు శృంగమును ♦ గంటిని గంటికిఁబందువౌనటుల్
వనజభవాదిసర్వసుర ♦ వంద్యపదున్బురుషోత్తమాభిధున్
దినుచుఁ బ్రసాదమచ్యుతుని ♦ తీరునఁగంటిఁ జతుర్భుజత్వమున్. ౬౭

వ॥ మఱియు.

తే॥ శంఖనైతినిగదినైతి ♦ శార్ఙ్గపాణి, నైతినిరథాంగపాణినే ♦ నైతిఁబద్మ
నైతిఁ గుండలినైతినే ♦ మందుఁదల్లి, పాలికెప్పుడుఁ ద్రావనివాఁడనైతి. ౨౦

తే॥ మనుజనాయకనీవు నా♦మాటవినుము, వినుచునాగిరిరాట్కూట♦మునకుఁజనుము
చనుచునాపురుషోత్తమ♦స్వామిఁగనుము, కనుచునైవేద్యమునుభక్తిఁ♦గొనుచుదినుము.

క॥ తినినంతనె శంఖసుద, ర్శనముఖలాంఛనములెల్ల♦ సంప్రాప్తములౌ
జనిలేనివాఁడ వగుదువు, పనిలేదే తీర్థములకుఁ ♦ బరుగిడనధిపా. ౨౧

వ॥ అనిన నృపుం డిట్లనియె. ౨౨

చ॥ క్షితిసురవర్య మీరిపుడుఁ ♦ జెప్పఁగ నా పురుషోత్తమాఖ్యదై
వతమహిమంబు వింటిని గృ♦పానుతిఁ దీర్థము లేగువారికే
ఖితమున సంచరింపఁగల♦భించును బూర్ణ ఫలంబు యాత్రలం
చితముగఁజేయ నెద్దివిధిఁ ♦ చెప్పఁగదే యనఁబారుఁ డిట్లనెన్. ౨౩

చ॥ చెలువుగఁ దీర్థకృత్యమును ♦ జెప్పెదనే వినుమా జరావలీ
పలితశరీరుఁడైన దృఢ♦వంతుఁ డెవండయినన్ శరీరమా
విలమపమృత్యుదూషితమ♦విశ్వసనీయమటంచు నెంచికే
వల పరమార్థచింతకల ♦ వాఁడయి శ్రీశు భజింపఁగావలెన్. ౨౪

క॥ హరినామస్మరణంబున, హరినామశ్రవణమునను ♦ హరిపదపూజన్
హరిపదవందనమునమతి, నిరతముఁ జేర్పంగవలయు ♦ నిఖిలవిరతుఁడై. ౨౫

తే॥ సర్వమతిదుఃఖదము క్షణ♦స్థాయి నశ్వ,రంబటంచు నెరింగి యా♦యంబుజాక్షు
నచ్యుతుని జన్మమృత్యుజ♦రాన పేతు, భక్తివల్లభు భజియింప♦వలయు భూప! ౨౬

వ॥ కామ క్రోధ లోభ మోహ దంభ భయ ద్వేషాసూయాదులకు దూరుండైన నరుండెట్టి దుఃఖంబుల నొందఁ డతం డచ్యుతసముఁ డేరికి సత్సాంగత్యం బవశ్య కర్తవ్యంబు దుష్కృతతూల శైల జ్వాలనులును లోకపవిత్రులు నగు సజ్జనుల దర్శనంబుఁ దీర్థంబులంగాని లభింపదు; సంసార భీరువుఁ డిట్టి పుణ్యులదర్శనంబులకై తీర్థంబులకరుఁగవలయునని చెప్పి బ్రాహ్మణుండు మఱల నిట్లనియె. ౨౭

ఆ॥ తీర్థములుఁ బవిత్ర♦తీర్థాశ్రయంబులు, తీర్థములు సుపుణ్య♦ధీమదాశ్రి
యంబులగుట దురిత ♦ హరణసమర్థంబు,లయ్యెఁ దద్విధాన ♦ మవధరింపు. ౨౮

సీ॥ తీర్థయాత్రలకేగు ♦ ధీరులన్నిఁటియందు, ముందు వైరాగ్యంబు ♦ నొందవలయు
నజినదండకమండ♦లాదులఁ గైకొని, తైర్థికవేషంబుఁ ♦ దాల్చవలయు
రామ శ్రీరామ శ్రీ♦రామయంచొగి తీర్థ,ములయందు భక్తిచే ♦ మునఁగవలయు
కేశంబులందు దు♦ష్కృతము లుండుటఁ జేవ, పన మందులను జేసి♦కొనఁగవలయు

తే॥ క్రోసుదూరంబుకన్నను ♦ గూడదుచనఁ, దగదు లోభగుణంబెప్డు ♦ తైర్థికులకు
నగునుదుష్కృతమనియమం♦బుగఁజరింపఁ, బూర్ణఫలమబ్బు శాస్త్రోక్త♦ముగ నటింప.

ఆ॥ పాణిమానసములుఁ ♦ బాదముల్ విద్యాయ, శస్తపస్సులెటసు♦సంహితంబు
లౌనొవాఁడు భూత♦లాధిప! నిజమాఁడు, వాఁడుఁ దీర్ఘఫలముఁ ♦ బడయఁగలఁడు.

మ॥ "హరి! గోవింద ముకుంద దైత్యజన సం♦హారీ సరోజాక్ష శ్రీ
ధరనారాయణ పద్మనాభ నృహరే ♦ దామోదరా మాం సము
ద్ధర సంసారమహాబ్ధి మగ్న"మనుచున్ ♦ దానాల్కచేఁ బల్కుచే
సిరియింటం గలవాఁడు గాలినడచే ♦ క్షేత్రంబులన్ బోవనా. ౮౧

ఆ॥ అటులఁ బోమెనేని ♦ యందుఁ బూర్ణఫలంబు, బండ్లమీఁద నర్ధ♦ఫలమునందుఁ
బాదుకలనుబోవఁ ♦ బడయుఁ జతుర్థాంశ, మష్టభాగమబ్బు ♦ నన్యసేవ. ౮౨

క॥ పరులకు నెరిగించెడివాఁ, డెరుఁగకఁ దీర్థములఁగూర్చి ♦ యేగెడివాఁడో
నరవర తృతీయభాగం, బరభాగముఁగాంతురు వరుస ♦ నవనీ స్థలిలోన్. ౮౩

క॥ గోయానంబున యాత్రికుఁ, బోయెడివాఁ డొందుగోవుఁ ♦ బొలియించునఘం
బాయాసమపోఁ జనదా, దాయముఁగొని పరులకై వృ♦థయగుటచేతన్. ౮౪

క॥ తనకుందోచిన భంగిన్, జనువాఁ డఘచయముఁ ద్రోయఁ♦జాలును నియతిన్
జనువాని గురిచి వేరుగ, నననేలన్ ముక్తిఁగాంచు ♦ ననఘుం డగుచున్. ౮౫

తే॥ ఇదియ తీర్థవిధానమే ♦ నింతవరకు, సంగ్రహంబుగఁ జెప్పితి ♦ సాంగముగను
నీవు నియమంబుతోడనా ♦ నీలశైల, మేగి పురుషోత్తముని భజి♦యింపుమయ్య.

మత్తకోకిల॥ అందుఁగాంచెద విందిరేశప♦దాంబు రుద్బలి సక్తులన్
గందువంతట వారుదెల్ప న♦ఖండభక్తిని శార్ఙ్గినీ
డెందమందున నట్టిభక్తిఁ గ♦డిందిగాఁ గృపసేయునీ
కందుచేత సనందనాదుల ♦ కందరానిపదంబగున్. ౮౬

వ॥ అనిచెప్పి వెండియు నిట్లనియె. ౮౭

ఆ॥ అవనినాథతీర్థ ♦ యాత్రాఫలంబెవ్వఁ, డైన వినినయంత ♦ నఖిలదురిత
చయముఁ బాఱఁదోలి ♦ సంశుద్ధుఁడై సాధు, సేవఁజేసిముక్తిఁ♦జెందఁగలఁడు. ౮౮

సీ॥ సౌమిత్రివినుమిట్లు ♦ భూమిదేవుఁడుఁదెల్పఁ, బతిసంతసించియా ♦ బ్రాహ్మణుని ప
దంబులకెరగుచుఁ ♦ దత్తీర్థదర్శనో, త్సేకాతివిహ్వల ♦ చిత్తుఁడగుచు
ననెమంత్రితోవింటె ♦ మనపురిలోనున్న, పౌరులతోనిట్లు ♦ పరగననుము
మనరాజుపురుషోత్త ♦ మక్షేత్రయాత్రికుఁ, దనకుటుంబముతోడఁ ♦ దరలెననుము

తే॥ శీఘ్రముగ మిమ్ము రమ్మని ♦ చెప్పెననుము, పిన్నలును బెద్దలందరు ♦ వెడలుఁడనుము
తివిరి రాకున్న శిక్షవి♦ధింతు ననుము, నీవునుం బైనముం గమ్ము ♦ నేఁడె చనుము.

క॥ పురుషోత్తముఁగనలేక న, దరపూర్తికిఁ బాటువడెడి ♦ తనపుత్త్రాదుల్
మఱిమిత్త్రులమేధ్యముఁదిను, చరుదుగఁదిరుగాఁడు వందు♦లని చెప్పఁదగున్. ౯౧

తే॥ హరిముకుందజగన్నాథ! ♦ యనుచుఁ నొక్క, పరిస్మరింపఁబవిత్రులఁ ♦ బరఁపుహరికి
శరణనుచు భక్తినొక నమ♦స్కారమీ న,గర నివాసులు చేతురు♦గాక సచివ! ౯౨

వ॥ ఇట్లు పలుకు భగవద్గుణ గుంభితంబులును మనోహరంబులును నగు నృపాలువచ నంబులకలరి సత్యవచనైక కృతాదరుండును సత్యనామధారియగు నాసచివుం డిట్లనియె. ౯౩

క॥ నీలగ్రీవసఖుండగు, నీలగ్రీవాచలేంద్ర ♦ నిలయు హరిఁగనన్
బోలదనువారు కలరే, నీలగ్రీవాచలేంద్ర ♦ నిజముగఁ జెపుమా. ౯౪

తే॥ అయ్య మీయాజ్ఞఁ జేసెద ♦ నంచు మంత్రి, వేగ భటులకదంతయు ♦ నెరుక సేయ
దంతిపై నెక్కి పటహవా♦ద్యములు మొరయ, నన్నివీథులఁ దిరుగుచి♦ట్లనిరి వారు.

సీ॥ మనరాజు పురుషోత్త♦మక్షేత్రయాత్రకుఁ, జనును రేపో పుర♦జనములార
అందరమిమ్ము ర♦మ్మనుచు నాజ్ఞనొసంగి, నాఁడు మీ స్వజనంబు ♦ తోడఁ రండు
అఖిలసంసారమ♦హాబ్ధి నావేల్పుగో,ష్పదముగ దాటింపఁ ♦ జాలునంట
దర్శించి తత్ప్రసా♦దముఁగొన జక్రాది, చిహ్నితభుజములు ♦ చెలఁగునంట
ఆ॥ రానివారినెల్ల ♦ రప్పించి మనరాజు, శిక్ష యముఁడువోలెఁ ♦ జేయునంట
యట్టి కష్టమేల♦నయ పోయి మీవారు, మీరు పరమపదముఁ ♦ జూరఁగొనుఁడు.

క॥ అది విని పౌరజనంబులు, ముదమునఁ బొదలుచు రమేశుఁ ♦ బురుషోత్తమునిన్
ద్రిదశార్చితుఁగనఁ గుతుకము, గదుర నెదలఁబదుఁడటంచుఁ ♦ గదలిరి భక్తిన్.

సీ॥ హరి దర్శనంబబ్బె ♦ నంచు శిష్యులతోడ, విభుని దీవించుచు♦విప్రవరులు
ధన్యులమని ధను♦ర్ధరులైన క్షత్రియుల్, వస్తుక్రయాంచిత ♦ వైశ్యవరులు
నిస్సారసంసార ♦ నిస్తారమునుగంటి, మని పొంగుచు విరించ ♦ నాంఘ్రిభవులు
చాకలుల్మంగలు ♦ ల్చర్మకారులు భిత్తి,కారకుల్ తైలవి♦క్రయులు చరులు
తే॥ వందిమాగధసూతులు ♦ వాద్యధరులు, బట్టలమ్మెడివారలు ♦ వంటవారు
కుట్లుపనివారు పౌరాణి♦కులు నృపాలు, నాజ్ఞ వెడలిరి పొదలప్ర♦హర్ష మెదల. ౯౮

క॥ వైద్యులు పరిహాసకు లతిహృద్యముగన్ బాడువార ♦ లితిహాసాల్వా
రుద్యోగస్థులు గారడి,విద్యలఁ బేర్గొన్న వారు ♦ వెడలిరి వరుసన్.

ఆ॥ క్షౌద్రవితతి కుంభ ♦ కారులు పశ్యతో, హరులు దమలపాకు ♦ లమ్మువారు
పరఁగఁ జిత్తరువులు ♦ వ్రాసెడివారును, బోయలరిగి రినునిఁ ♦ బొగడుకొనుచు.

వ॥ అంత, ౧౦౧

క॥ శ్రీలలనాధిపుఁగన భూ, పాలుఁడుఁ బోనున్నవాఁడు ♦ పరిజనములతో
నాలస్యంబిఁక జేయుటఁ, బోలదనుచు లోకబాంధ♦వుం డుదయించెన్, ౧౦౨

ఉ॥ అంతటఁ గాల్యకృత్యముల ♦ నన్నిఁటి జక్కఁగఁదీర్చి యా ధరా
కాంతుఁడు విప్రవర్యుఁ గుతు♦కంబునవేఁ బిలిపించి యా దయా
స్వాంతుని యాజ్ఞఁ దా వెడలి ♦ పౌరతతుల్ తనవెంటరాఁ బురీ
ప్రాంతముఁ జేరివెల్గె నుడు ♦ రాజిగతుండగు చంద్రుఁడోయనన్. ౧౦౩

ఆ॥ ఇట్లు క్రోసుదూర♦మేగి క్షౌరంబుసే,యించుకొని హరిన్ స్మ♦రించుకొనుచుఁ
బుణ్యతీర్థమందు ♦ మునిగి దండకమండ, లాజినములఁదాల్చి ♦ యందెదీక్ష. ౧౦౪

వ॥ తదనంతరంబ. ౧౦౫

మందాక్రాంతము॥ కామక్రోధాదులకు వెలియై ♦ క్రాలుహృత్పద్మమందా
శ్రీమానాథున్ సురపరివృఢుం ♦ జేర్చి భూమీంద్రుఁడేగెన్
భూమిధ్రావాస జయజయభో ♦ భోవిభో త్వంభవాబ్ధే
ర్మాముద్ధర్తుంక్షమయని జనుల్ ♦ రాఁగభేరుల్ ధ్వనింపన్ ౧౦౬

సీ॥ ఎడనెడఁ దీర్థము♦లొప్పెడఁగాంచి యందరీ, బ్రాహ్మణమహిమంబుఁ ♦ బరగవినుచు
హరికీర్తనములఁ గా♦యకులఁ బాడించి త, చ్ఛ్రీకథానందిత ♦ చిత్తులగుచుఁ
బుణ్యాస్రవంతుల ♦ మునఁగఁగంటిని నేటి,కహహా కృతార్థుండ ♦ నైతిననుచు
హీనాంగపంగ్వంధ ♦ కృపణార్తులను నన్న, దానాదికంబులఁ ♦ దన్పుకొనుచు
తే॥ విషయవిరతుండునింద్రియ♦విజయుఁడగుచు,మధువిభంజన పురుషోత్త♦మా!రమేశ!
హరిముకుందజనార్దన♦యనుచుఁబోయి,పోయిపొడఁగాంచెనృపుఁడొక్క♦పుణ్యనదిని.

తే॥ చూచియందలి చక్రాంక ♦ శుద్ధశిలలఁ, జూచిమానులఁ దటనివా♦సులనుజూచి
చూచికండ్లారనదియొక్క ♦ సొబగును దల,యూచియూచిద్విజేంద్రునిఁ♦జూచిపలికె.

క॥ ఇదియేనదినామతికతి, ముదమున్ గలిగించెఁజెపుమ ♦ మునివర యనినన్
సదయుండై యిట్లనిచెప్పఁదొడంగెనతండు మధుర ♦ వాగ్గుంభనలన్. ౧౦౮

సీ॥ వినుమయ్యగండకి ♦ యనుపుణ్యనదియది, దీనినెప్పుడుదేవ ♦ దితిజవరులు
సేవించెదరుపుణ్య ♦ జీవనీయప్రవా, హయగుటఁదాపసా♦యతనమయ్యెఁ
గనునంతగాయక ♦ కలుషంబుఁబోకార్చున్, స్పర్శమానసికంబు ♦ సంహరించు
వాచికాఘముఁజల ♦ పానంబుచేఁబాపు, నీనదీ మాహాత్మ్య♦ మెన్నఁదరమె

ఆ॥ మునివిధాతపాపు ♦ లనుబవితుర్లఁజేయఁ, గాఁదలంచితనను ♦ గండములను
గారుస్వేదబిందు ♦ గణముచే నీమహా, నదిని సృష్టిఁజేసె ♦ నరవరేణ్యా! ౧౧౦

క॥ గండంబులఁ బుట్టుటచే, గండకియనఁ బరఁగె నెట్టి ♦ కల్మషుఁడు నృపా
ఖండల జననీగర్భగ,తుం డెప్పుడుగాఁడు దీని ♦ తోయస్పర్శన్. ౧౧౧

—♦ సాలగ్రామ మాహాత్మ్యము. ♦—

ఉ॥ ఈతటినీభవంబులగు ♦ నెల్లశిలల్ దగు చక్రచిహ్నలన్
బూతము లీశిలాతతులును ♦ పుణ్యదముల్ భగవత్స్వరూపముల్
భూతలనాథ! యీశిలలఁ ♦ బూజలొనర్చెడి వారలే మహా
పాతకులైనఁదల్లి చనుఁబాలను ♦ గ్రోలరు ముం దిఁకెప్పుడున్. ౧౧౨

క॥ పరధనదారాపహరుల్, దురితాత్ములుఁ దంభలోభ ♦ దూషితులెప్పుడున్
వరసాలగ్రామములా, దరమున్నను బూజసేయఁ ♦ దగదు నృపాలా. ౧౧౩

క॥ ద్వారవతీ భవచక్రసు, పూరితములు గండకీ స♦ముత్పన్నములౌ
సారశిలల్ పురుషచయా, పారజని కృతాఘచయము ♦ ఁబారందోలున్. ౧౧౪

క॥ నిరతము దురితశతంబులుఁ, గరమరుదుగఁ జేసినట్టి ♦ కల్మషుఁడైనన్
వరసాలగ్రామశిలో, పరి జలపానంబుఁజేసి ♦ పరిశుద్ధుఁడగున్. ౧౧౫

సీ॥ బ్రాహ్మణ క్షత్రియ♦ వైశ్య శూద్రులు వేద, మార్గానుసారులై♦ మహితభక్తి
బూజసాలగ్రామ ♦ ములకుఁజేసినయంతఁ, జెందరు భవముఁగాం ♦ చెదరుముక్తి
విధవమైన సుశీల ♦ విమలగుణాన్విత, సధవమైనను భువి♦స్వస్వహితము
లనుగోరు స్త్రీలు సా♦లగ్రామనుచర్చింప, ఁబోల దెప్పటికెంత ♦ మోహమున్నఁ
ఆ॥ బూజఁజేసెనేని ♦ పుణ్యంబుఁ గో♦ల్పోయి కూలునరకమందుఁ♦గువలయాక్షు
వజ్రహతికి మిన్న ♦ వనితలచేతులఁ, బూజసేయునట్టి ♦ పుష్పచయము. ౧౧౬

చ॥ అతివలచే శిలోపరిస♦మర్పిత చందన మా విషాభ మా
యతివలుఁ బూజసేయు కుసు♦మావళి వజ్రసమాన తీక్ష్ణమా
యతివలుఁ బెట్టునట్టి మృదు♦లాన్నరసంబులు కాలకూటమా
యతివలుసేయనిట్లు నిర♦యంబున నుండెద రొక్కకల్పమున్. ౧౧౭

క॥ ప్రకటాఘాచారుఁడు వెర,వక బ్రాహ్మణ హత్యసేయు ♦ వాఁడుకలుష దా
హకమగు సాలగ్రామో,దక పానంబునను బొందుఁ ♦ దప్పకముక్తిన్. ౧౧౮

ఆ॥ చందనంబుఁ దులసి ♦ శంఖంబుఘంటయు, జలముఁదామ్రపాత్రి ♦ చక్రశిలలు
హరిపదామృతంబు ♦ నచ్యుతునామామృ,తంబుఁ ద్రొమ్మిదఘవి♦దాహకములు.

తే॥ శాస్త్రవేత్తలు శాంతలౌ ♦ సర్వమునులు, వేరు వేరుగఁ దద్బిందు♦బిందువునకు
సర్వతీర్థ పరిస్నాన ♦ సర్వక్రతుస,మర్చనలకంటె నృప ఫల♦మధిక మనిరి. ౧౨౦

కం॥ సాలగ్రామార్చన మెట, శీలయుతుల చేతఁ బూజ ♦ సేయంబడునో
నాలుగుకోసులవరకది, మేలగుతీర్థంబటండ్రు ♦ మేదినిలోనన్. ౧౨౧

కం॥ సమములు పూజార్హములౌ, సమములలో రెంటిఁ బూజ ♦ సలుపన్ దగద
హాఁ ములు విషమంబు లెపుడు వి, షమములలో మూఁటిఁ బూజ ♦ సలుపఁదగదుసూ.

కం॥ ద్వారవతీ భవచక్రం, బారయ గండకినిఁ బుట్టు ♦ నశ్మశ్రేష్ఠం
బీ రెంటికి సంగమమెట, భూరమణా! గంగ యుండు ♦ బూర్తిగ నచటన్. ౧౨౩

సీ॥ ఆయుర్యశశ్శ్రీబ ♦ లాదులఁ బోకాచున్, నవనీశరూక్షము ♦ లైన శిలలు
కావు నమ్మృదువులుఁ ♦ గడురమ్యశిలలుఁ బూ, జింపఁగా నెంతయుఁ ♦ జేర్చు సిరులు
ఆయురర్థంబుల ♦ నందఁ గోరి భజించి, యవియిహపరముల ♦ నందఁగలఁడు
హరినుడిజిహ్వానా ♦ హరిశిలహృదయమం, దంతికము న మృతి♦యందుఁ గల్గు
ఆ॥ భాగ్యశాలి పొందుఁ ♦ బరమపదంబు నే, యూరికైనఁ బోవు ♦ చుండి శిలను
భుజముఁ జేర్చి మోయు ♦ పుణ్యుఁ డడ్గడ్గున, కశ్వమేధ ఫలము ♦ నందుఁ జుమ్ము.

ఆ॥ యతివరుండు స్నిగ్ధ ♦ మైన సాలగ్రామ, మవని దేవుఁ డీత్రి♦యంబు నేన
భేద మేమి మాకు ♦ లేదని యచ్యుతుఁ, డంబరీషుతోడ ♦ ననియె మున్ను. ౧౨౫

కం॥ పాపుల పాపౌఘంబులఁ, బాప హరి త్రిరూపములను ♦ బడసెను వీనిన్
బాపమతిన్ దూషించిన, పాపుఁడు నిరయముననుండుఁ ♦ బ్రళయమువరకున్.

ఆ॥ పూజ సేయఁ బోవు ♦ పుణ్యాత్ముఁ గన్గొని, కూడదనుచు మాన్పు ♦ కుత్సితుండుఁ
దల్లిదండ్రి బంధు ♦ తతితోడఁ దాఁ గూలు, ఘోరతీక్ష్ణనరక ♦ కోటులందు. ౧౨౭

కం॥ ప్రేష్టుంగని శిలవిధి ని, ర్దిష్టముగ భజింపుమనుచుఁ ♦ దెల్పఁగ లబ్ధా
భీష్టుండై వైకుంఠం, బిష్టులుఁ బూర్వజులతోడ ♦ నేగునె వాఁడున్. ౧౨౮

సీ॥ ఇందుకుఁ దెల్పెద ♦ నితిహాసమొక్కటి, వినుమయ్య కీకటం ♦ బను నధర్మ
దేశంబు కలదందుఁ ♦ దీక్ష్ణస్వభావుఁడు, శబరుఁడన్పుల్కస ♦ జాతివాఁడు
శరధనుశ్శరధులు ♦ ధరియించువాఁడెప్డు, జీవహింసలఁ బెల్లు ♦ సేయువాఁడు
తీర్థయాయులఁ గొట్టి ♦ తీసి ప్రాణాల్వారి, ధనమంతయును దోచి♦కొనెడువాఁడు
తే॥ విషవిలిప్తశరాగ్రుఁడు ♦ వివిధజీవ, భయకరుఁడు రాగయుక్తుఁడు ♦ భయదవేషుఁ
డనవరతజంతుభయదకా ♦ ననవిహారుఁ, డొకఁడు కలఁ డఖిలజనమ♦హోగ్రుఁడగుచు.

వ॥ ఆదుష్టుండుఁ దనకు మరణంబుఁ గలదని యెఱుంగక నిరంకుశప్రభావుండై మెలంగు చుండునంత నొక్కనాఁడు. ౧౩౦

తే॥ పాశముద్గరపాణులు ♦ భయదమూర్తు, లసితవర్ణులులంబోష్ఠు ♦ లసితలోహ
దండహస్తులు యమభటుల్ ♦ తామ్రకేశు, లరుగుదెంచిరి యాయర♦ణ్యాటుకడకు.

ఉ॥ పక్కమసంగ వీని తల♦లం బ్రిద్దలుం గొట్టుడు దుడ్డుకఱ్ఱలన్
జెక్కలురెండుం గాఁగఁగొని ♦ చీల్చుడు నిల్వున వీనిదేహముల్
ముక్కలుముక్కలౌ నటుల ♦ ముప్పిడిఁగోయుఁడు మేనికండలన్
గ్రిక్కన రక్తపూరములు ♦ గ్రిక్కనటుల్ బడఁగుద్ది తన్నుఁడీ. ౧౩౨

వ॥ ఇట్లక్కిరాతుంజూచి పలుకుచుండ నంతలోనొకండిట్లనియె. ౧౩౩

మ॥ కృపలేశంబెదలేదు వీనికహహా ♦ యేనాఁడు జీవాళికే
యుపకారంబునుజేయఁ డర్థహరణో♦ద్యోగంబుఁ బ్రాణాపహా
రపరాకాంక్షయకాని వీనిరసనన్ ♦ రాగోళ్లతోఁదుంతునీ
కృపణుంగొట్టెద మొత్త్రి మొత్త్రియనుచున్ ♦ గీపెట్టఁగారాతిపై. ౧౩౪

క॥ అట్టిట్లు కదలకుండఁగఁ, బట్టికనులురెండుఁ బెరక♦వలెనని యొకఁడున్
జెట్టలనరికెదనని యొకఁ, డట్టులనే చెవులఁజేతు♦నంచు మఱొకఁడున్. ౧౩౫

తే॥ వచ్చుమొరకునిగని పర♦స్పరముభటులు, పలుకుచిట్టులఁ బటపటఁ ♦ బండ్లుఁగొరుకు
చుండనంతట వారిలో♦నొకఁడు సర్వ, మగుచుఁగరచినయంతనే♦యతఁడు మడసె.

క॥ అంతటఁ బాశంబులచే, నంతకభటులంటఁగట్టి ♦ యాతనిఁగశలన్
గుంతంబులఁ బొడుచుచునుదు, రంతక్రోధముననిట్టు ♦ లనిరి నృపాలా! ౧౩౬

పంచచామరము॥ అరే! దురాత్మ! నీవుడెంద ♦ మందునైన ధర్మ మా
చరింపనెంచవైతి దుర్వి♦చార! నీ శరీర మీ
ఖరాసిచేతఁగోసి ఖండ♦ఖండముల్ దగన్దినన్
బిఱానవాయసాళిముందుఁ ♦ బెట్టనడ్డెవండురా. ౧౩౭

సీ॥ పుల్కసాధమనీవు ♦ పుట్టినదాదిగా, హరిసేవనొకక్షణ♦మైనఁజేసి
యెరుఁగుదే నీవారి ♦ నేలఁగల్గితివెల్ల, నరులకు ద్రోహ♦హంబొనర్చికాదె
పాపదాహకమైన ♦ పద్మనాభునినామ, మెప్పుడైనను స్మరియించినావె
పుణ్యపూరుషులఁజం♦పుటకాని యిసుమంత, పుణ్యకృత్యముఁదలపోసినావె.
ఆ॥ కానఁగశలఁగొట్టి ♦ కట్టికుంభీపాక, రౌరవాంధకూప ♦ క్రూరలోహ
శంకుముఖ్యనరక శతములఁ బడఁద్రోతు, మంతకాజ్ఞనో! దు♦రాత్మ! నిన్ను. ౧౩౮

వ॥ ఇట్లాశమనకింకరులు వలుకుచుఁ బాశముద్గరదండ పరశ్వధపాణులై యా కిరాతుంబొదివి పట్టుండు కొట్టుఁడు చెక్కలుసేయుండు ముక్కలుఁ గోయుఁడు లోహదండంబులఁ బిండిపిండిగ మోదుఁడనుచు నినుపగొలుసుల బంధించి కొని

పోవు సమయంబునఁ బరమభాగవత శిఖామణియగు నొక్కపురుషుం డరుదెంచి యదంతయుం గని దయార్ద్రహృదయుండై యయ్యో? యీ పుల్కసుండిట్టి కష్టంబుల నామెదుట నొందుచుండఁ జూడఁగలనే? యితని నీ కష్టంబులవలన విముక్తుఁ జేసెదనని తలంచి తదంతికంబున కరిగి తులసీదళమిశ్రితంబగు సాలగ్రామ శిలాపవిత్రోదకం బతని వక్త్రంబున నుంచి శిరంబునఁ దులసీదళంబును హృదయంబున సాలగ్రామంబును నిడి తత్కర్ణబిలంబున రామనామంబు జపించుచుఁ గింకరులంగని యిట్లనియె. ౧౪౦

తే॥ పొందుయమదూతలార యీ♦పుల్కసుండు, యాతనాసక్తుఁడైన మీ♦యాతనలను
బొందఁడు హరిశిలాసంగ♦మునఁ దదీయ, పుణ్యజల పానమునవీఁడు♦పూతుఁడయ్యె.

క॥ ఈరీతిఁ బల్కుచుండఁగ, నారాయణభటులు శార్ఙ్గ ♦ నందకముఖ్య
స్ఫారాయుధ పాణులు శ్రీ, ధారాధర దేహులబ్జ♦దళ సమనేత్రుల్. ౧౪౨

ఆ॥ వచ్చి వచ్చునంతఁ♦ బాపాత్ముఁబుల్కసు, మోచితుసిగఁజేసి ♦ చూచి కాల
కింకరులను విష్ణు ♦ కింకరుల్ పలికిరి, వారిము గ్గభీర ♦ భాషణముల. ౧౪౩

ఆ॥ పూజ్యదేహుఁడైన ♦ పుల్కసు నీరీతిఁ, గట్టఁ దెల్పుఁడేమి ♦ కారణంబొ
పంపెనెవ్వఁడెవని ♦ భటులు మీరెప్పుడు, చాలు వీనివిడిచి ♦ సాగిపొండు. ౧౪౪

వ॥ ఇటుల నుడువు దైత్యాంతకకింకరులం గని యంతక కింకరు లిట్లనిరి. ౧౪౫

సీ॥ ధర్మరాజాజ్ఞనొఁ♦దలధరించి కిరాతుఁ, గొనిపోవవచ్చితి ♦ మనఘులార
ప్రాణిహత్యామహా ♦ పాపకారియకాని, యేరికిమేల్సేయఁ ♦ నెరుఁగఁడయ్య
యఖిల తీర్థంబుల ♦ కరుగు పుణ్యులనరి, కట్టిసొత్తులమూటఁ♦గట్టెనయ్య
పరసతీహరణాది ♦ పాపంబులెన్నినా, నీరజాసనుఁడైన ♦ నేరఁడయ్య
తే॥ యముఁడితనిఁదెమ్మటంచు మ♦మ్మంపెనయ్య, పాపిఁదోడ్కొనిపోనున్న♦వారమయ్య
యీ దురాత్ముని విడిపింప ♦ నేలనయ్య, తెల్లముగ మీరలెవ్వరో♦తెల్పరయ్య.

వ॥ ఇట్లనిన హరికింకరు లిట్లనిరి. ౧౪౬

తే॥ బ్రహ్మహత్యాది ఘోరపా♦పములుజీవ, కోటిహత్యోద్భవాఘముల్♦గూడవినుఁడు
పావనంబైన హరిశిలా♦స్పర్శనమునఁ, బారిపోకుండునే పటా♦పంచలగుచు. ౧౪౭

మ॥ కడుదుష్టుండగు మానవాధముని దు♦ష్కర్ణంబులో నెట్టులోఁ
బడుమాత్రంబున రామనామమఘముల్ ♦ పర్త్తిక్రిశుచిప్రక్రియన్
గడుభస్మంబుగఁ జేయదే తులసి స♦ద్గ్రావంబు శ్రీనామమే
ర్పడఁగన్ మస్తమనశ్వరంబులను జే♦ర్పంబోవె యేపాపముల్. ౧౪౮

తే॥ అట్టి పుణ్యంబు సమకూరె ♦ నంత్యదశను, గాననిర్దగ్ధపాపుఁడై ♦ కడువిశుద్ధ
గాత్రుఁడగుచును బాపులుఁ ♦ గాంచలేని, పరమపదమునుఁ వీఁడిప్డుఁ ♦ బడయఁగలఁడు.

క॥ పదివేల వత్సరంబులు, ముదమునభోగించియఖిల ♦ భోగములచటన్
బదపడి భారతభూస్థలి, నుదయించి ముకుంద సేవ ♦ నొందును ముక్తిన్. ౧౫౧

చ॥ అవని నెరుంగకున్న మహి ♦ మాతిశయంబును గండకీసము
ద్భవశిలముట్టినన్గన స ♦ పర్యలొనర్చిన మానవుండు దు
ర్భవములనొందఁబోఁడు గడుఁ ♦ బావనుఁ డెప్పుడటంచునా రమా
ధవునిభటుల్ వచింపనది ♦ దండికిఁదెల్పిరి పోయితద్భటుల్. ౧౫౨

ఆ॥ అంతవిష్ణుభక్తుఁ ♦ డగుమహాపూరుషుఁ, డెరుకనరక బాధఁ ♦ దొరఁగెననుచు
మోదవార్ధిలోన ♦ మునుఁగుచుండగనప్డు, కానిపించెదివి వి ♦ మానమొకటి. ౧౫౩

వ॥ అది కింకిణీజాల మండితంబును నతిమనోహరంబును రత్న స్తంభ విరాజితంబును దుకూలవితానావలంబిముక్తామాలా విరాజమానంబును నై దేవలోకానీతంబగు నావిమానంబునం దా పుళిందుండు ముకుందకింకరులతో నధిష్ఠించి మహావైభవంబున వైకుంఠంబున కరగి యచట ననంతభోగంబు లనుభవించి పిమ్మటఁ గొంత కాలంబునకు విశ్వేశ్వరావాసంబగు వారణాశియందుఁ గడుశుద్ధంబగు బ్రాహ్మణకులంబునఁబుట్టి జగదీశ్వరు నారాధించి పరమపదంబునొందెనని చెప్పి మఱియు నిట్లనియె. ౧౫౪

ఆ॥ పరమసాధుదయను ♦ బడిసి సాలగ్రామ, సంగమమున నెరుక ♦ సకలమునులుఁ
బడయరానిపరమ ♦ పదమందెఁదచ్ఛిలా, మహిమనెన్నఁదరమె ♦ మానవేశ! ౧౫౫

క॥ వాలాయము నేఁదెల్పిన, సాలగ్రామాశ్మమహిమ ♦ శ్రద్ధాన్వితుఁడై
యాలించిన మానవుఁడా, శ్రీలలనానాధుపదముఁ ♦ జెందున్నృపాలా. ౧౫౬

వ॥ అని విప్రుండు దెల్పిన. ౧౫౭

మ॥ లవణారీవరగండకీ మహిమనీ ♦ లగ్రీవ భూపాలకుం
డవధానంబున నాలకించి కడు ధ ♦ న్యత్వంబునేఁ బొందితం
చు విధిన్ స్నానముఁ దర్పణంబులను న ♦ చ్చోఁజేసితద్గండకీ
భవముల్గ్రావము లిర్వదుల్ మఱియునా ♦ పై నాల్గుఁదెప్పించితాన్. ౧౫౮

సీ॥ విప్రులుచెప్పిన ♦ విధమునఁ బూజించి, యామోదపూరిత ♦ స్వాంతుఁడగుచు
గోవిందకీర్తనల్ ♦ గావించుచతిభక్తి, దానంబులెన్నియో ♦ తనరఁజేసి
సకలసైన్యంబుతో ♦ ఁజనిచని జాహ్నవీ, సింధుసంగమమును ♦ జేరి యచట
స్నానసంధ్యాద్య ను ♦ ష్ఠానంబులను దీర్చి, యా తాపసునిఁజూచి ♦ యనియెనిట్లు

తే॥ అయ్యయిట కెంత దవ్వునీ♦లాద్రియెచట, నుండుఁ దెల్పుమనఁ బ్రాహ్మ♦ణుండుపలికె
నివియసీలశిలోచ్చయ♦సవిధభూము, లదుగొ నీలాద్రిచూడుమో♦యధిప! యనుచు.

క॥ అనుడులు విని నృపాలుఁడు, మానుగఁ బరికించియచట ♦ మలగానకయో !
మానివర! యెందుఁ జూచినఁ, గాననయా దూరమెంతఁ ♦ గలదో చెప్పుమా. ౧౬౦

వ॥ అనుటయు బ్రాహ్మణుం డిట్లనియె. ౧౬౧

తే॥ గట్టిగాఁ జూడుమిదె యెప్డుఁ♦గావునావి, వట్టిమాటలు కనులకు ♦ ఁగట్టినట్టు
గట్టుకన్పట్టుచుండ నీ♦పట్టపగలె, యిట్టులాడుటఁ గడుఁజిత్రి♦మిది నృపాల. ౧౬౨

తే॥ అనినవిప్రుని మాటల♦నాలకించి, మఱల మఱల నృపుండుఁ బల్మారుఁ జూచి
కనకనయగారు చెప్పుడు నాఁ♦కర్మమేమి, యద్రిఁ గననైతి హరిమాట♦ లట్లెయుండ.

వ॥ నీలభూధర దర్శన నోత్కంఠిత మానసుండగుచు నిట్లు దురంతసంతాపంబు నొందు
చుండు నాభూకాంతుం గాంచి బ్రాహ్మణుండిట్లనియె. ౧౬౪

క॥ ఇచ్చట స్నానముఁ జేసితి, నిచ్చటనేఁ జూచినాఁడ♦నే భిల్లుల నాఁ
డిచ్చట నీమార్గంబున, నచ్చుగఁ జని యెక్కినాఁడ ♦ నచలేంద్రింబున్. ౧౬౫

తే॥ నాకు దర్శనమిచ్చిన ♦ నగవరంబు, నాకుదర్శనమిచ్చిన ♦ నగధరుండు
నీకు దర్శనమీవేళ ♦ నీకయుంట, కొక్క కారణమేదియో ♦ నుండనోపు. ౧౬౬

వ॥ అయినను. ౧౬౭

మ॥ మదిలోఁ దాపము నొందకయ్యగిరిని ♦ న్నాథు దర్శింపఁగా
సదుపాయంబువచింతు యాచకజన ♦ స్వర్గద్రుమంబచ్యుతుం
డు దయాసింధువుఁ గాన భక్తతతినె ♦ ప్డుంబాయఁ డాతండు నీ
యెదుటన్ గన్పడునంత కాయతరతిన్ ♦ హృద్వీథిధ్యానింపుమా. ౧౬౮

—♦ నీలగ్రీవమహారాజు ముక్తినొందుట ♦—

క॥ అనితాపసవిప్రుఁడు దెల్పిన భూపుఁడులోనఁ బరిత♦పించుచు గంగా
ధునిసాగరసంగమమున, మునిఁగియనశనవ్రతంబుఁ ♦ బూనినియతుఁడై. ౧౬౯

తే॥ నిండుదయతోడఁ బురుషోత్త♦ముండునాదు, ముందుఁ గన్పడునంతనేఁ ♦ బూజఁ జేసి
భోజనమొనర్చెదనునది ♦ పోసఁగదేని, చేతునుపవాసమును మృతిఁ♦జెందువరకు.

వ॥ ఇట్లు రత్నగ్రీవ రత్నగర్భేశ్వరుండు, కృతనిశ్చయుండై గంగాసాగరసంగమంబున
స్నానంబొనర్చి నిరశనవ్రతదీక్షవహించి గోవిందుని గుణగ్రామంబుఁ బాడుచు
నిట్లు వినుతింపందొడంగె. ౧౭౦

సీ॥ జయదీనమందార ♦ జయదుఃఖసంహార, జయజీవనీయము♦క్సుమశరీర
జయమానివరగేయ ♦ జయసజ్జనవిధేయ, జయమంగళాహ్వాయ ♦ జయముకుంద
జయరాక్షసవిరామ ♦ జయనీలగిరిధామ, జయపూరితార్తౌఘ ♦ సకలకామ
జయపుండరీకాక్ష ♦ జయనరహర్యక్ష, జయయాతుధాన శి♦క్షాపరిదక్ష
తే॥ జయసముద్రాత్మజాంచద్వి♦శాలవక్ష, జయసురాసురపూజిత ♦ చరణయుగళ
జయతపోధన హృత్కుశే♦శయవిహార, జయసుదర్శనదరగదా ♦ శార్ఙ్గహస్త.

దండకము॥ శ్రీమానినీమానసాంభోజభృంగా గరుత్మత్తురంగా సనందాదిమానీశ్వర స్తోత్రపాత్రా ద్యురత్నాబ్జనేత్రా సునాశీరముఖ్యామరానీకమస్తాగ్రవిన్యస్తదివ్య త్కిరీటస్థరత్నప్రభాజాలనీరాజితాంఘ్రిద్వయా యద్వయా నిన్ను దర్శింపఁగా నెంచి కామాదులం దుంచి నా వాకెనందుంచి యీ దూర మేతెంచితిన్ భక్తకల్పద్రుమా యొక్క మా ర్నీదు రూపంబుఁ గన్పింపఁగాఁ జేసి దేవా కృతార్థున్నునీతాత్మునిం జేయవే నన్ను మన్నింపవే నా మొరాలింపవే ప్రేమలో నింపవే ద్రుంపవే పాపముల్ పద్మగర్భుండు రుద్రుండు దిక్పాలకుల్ సూర్యసోమాదులాయజ్ఞభుక్కుల్ వసిష్ఠాదిబ్రహ్మర్షులున్ నారదాదుల్ సరోజాక్ష నీమాయ నిక్కంబుగా నించు కంతన్ గనన్ జాలరే నా సిను న్గాంచువాఁడన్ దయాసాగరా నీవు నిక్కంబుగాఁ జూడ నొక్కండవై యుండియున్ రూపము ల్కోటి సృష్టింపఁగాఁ బెంపఁగా నొంపఁగాఁ దాల్చి తౌ దేవదేవా యమేయప్రభావా హరీ యంబరీషుండు దూర్వాసుఁడన్మౌని శాపాగ్నికీలల్ దనుం ముట్టి బాధింపఁగాఁ గైటభారీ ముకుందా హృషీకేశ దీనార్తిసంహార యో భక్తమందార రావే యయో నాయవస్థల్ విలోకింపవే యంచు నిన్వేడ నా రాజ సుతాత్రముగర్భంబులోఁ దూరి యామౌని శాపంబు లీరైదు నీవే కృపం దాల్చి చక్రప్రయోగంబుచే మౌనిగర్వంబు సర్వంబు మాయించి భక్తు న్గటాక్షింపవే మున్ను దైత్యుండుఁ దాఁ గన్నపట్టి హరిన్ దల్చువానిన్ దయాశూన్యుఁడై పట్టి శూలంబులన్ గ్రుచ్చి త్రాటం న్బిగన్ గట్టి నీటం బడం ద్రోచి యగ్నిం బడం జేసి యెన్నెన్ని యో బాధల న్బెట్టి యో ఠోరి వాచాట నీవెప్పుడున్ శ్రీహరీ గీహరీ యంచు వాపోవుచున్నావిసీ!మూఢ!వాఁడేడి రా చూపరా యీస భాస్తంభమం దంచుఁ బాదంబునన్ దన్ను నంతన్ నృసింహుండవై స్తంభమం దుద్భవం బొంది దైత్యాధము న్గోళ్ళతోఁ జీరి మర్దించి యాబాలుఁ గాపాడవే వారణేంద్రంబు కాసారముం జేరి నీరంబులం ద్రావుచో నక్రవక్త్రంబుసం జిక్కి గీపెట్టుచున్ రాగదే దేవ దేవా దయాభూ కడుంగష్టము ల్పొందుచుంటిన్ విలోకింపవే యంచుఁ బాళిన్ మొర ల్పెట్ట చక్రంబుచేగ్రాహకంఠంబు వేదుంచి యా నాగమున్ బ్రేమ రక్షింపవే యెప్డు నీ సేవకుల్ కష్టముల్ పొందుచున్నారొ నీ వప్పుడే యీధరన్ బుట్టి నీ దివ్య నామంబులన్ నీదు దివ్యచ్చరిత్రంబులన్ భక్తులన్ బూతులుం జేయుచుందో

రమేశా శచీశాదిబృందారకానీకవంద్యాఽ నవద్యప్రభావా భవానీశమిత్రా
భవాంభోధినిస్తారకా నేను మూఢుండఁ బాపుండ దుష్టుండ నీచుండ నావంటి
దీనుం గృపం బ్రోచుటే ప్రోచుటల్ పుణ్యులన్ బ్రోచుటో వింతయే నిన్ను
విత్తంబులున్ రాజ్యముల్ భూములన్ గోర నేనొక్కమా ర్నీదు రూపంబుఁ
జూపించు మంటిన్ ప్రభూ యింతకంటెన్ మఱే వేవియుం గోరనంటిన్ గృపా
సార మొక్కింత పై చిల్కుమంటిన్ మదిన్ నిన్నె నే నమ్మియుంటిన్ బరాకింక
వద్దంటి నో తమ్మికంటీ త్రిలోకంబులన్ జూడ నీవంటి దైవంబు లేఁడింతకుం
బాలనే ముంచెదో నీటనే ముంచెదో కీర్తియున్నదె దుష్కీర్తియున్నదె నన్బ్రో
చు భారంబు సర్వంబు నీదేసుమా దీనపోషా సుధీ మానసావాస పద్మాలయేశా
నమస్తే నమస్తే నమస్తే నమః.

క॥ రాత్రింబవ లీరీతిని, గోత్రాధ్యక్షుండుఁగంటఁ ♦ గూర్కను సుఖ మే
మాత్రంబెరుఁగక నిష్ఠన్, గోత్రోద్ధరు గుణగణంబు♦గొనియాడుచుఁదాన్. ౧౭౪

తే॥ నడుచునప్పుడుఁగూర్చున్న♦యెడనిరంత, రముభుజంగశయానుధ్యా♦నముననైదు
రోజులతనిష్ఠఁగడపిన♦రాజుఁగూర్చి, యలరిపురుషోత్తముండిట్లు♦తలఁచెమదిని. ౧౭౫

క॥ ఈతఁడు ననుదలఁచుచుఁ గడుఁ, బూతుండై చెలఁగెనింకఁ ♦ బొడసూపిధరా
నేతనుగని యిష్టార్థో, పేతునిఁగాఁ జేతు నణతు ♦ బిమ్మటననుచున్. ౧౭౬

వ॥ ఇట్లు చతుర్భుజుండుఁ గృతనిశ్చయుండై సన్యాసివేషంబు ధరించి చను దేర నృపుం
డోం నమో విష్ణవేయనుచు నమస్కరించి యర్ఘ్యపాద్యాదులం బూజించి
యిట్లనియె. ౧౭౭

తే॥ అయ్య నాభాగ్యవశమున ♦ నక్షిగోచ, రుండవైతివి తపములు ♦ పండెనేఁడు
పుండరీకాక్షుదర్శన♦పుణ్యమొకటి, కాదు సకలశుభంబులుఁ ♦ గందుముందు. ౧౭౮

వ॥ అంతఁ బరివ్రాజకుం డిట్లనియె. ౧౭౯

తే॥ మనుజనాయక నేజ్ఞాన ♦ మార్గమునను, జరిగినది జరుగుచున్నది ♦ జరుగనున్న
దియును సర్వంబు నెరుఁగుదుఁ♦దెల్పుచుంటి, వినుమదంతయు నవధాన♦మునననరేంద్ర!

సీ॥ అగు రేపుమధ్యాహ్న♦మందు బ్రహ్మకును దు,ర్లభమైన విష్ణు ద♦ర్శనమునీకు
తాపసద్విజుఁడు నీ♦ధర్మపత్నియును బ్ర,ధానికరంబాఖ్య ♦ తంతువాయుఁ
డీవు నీవైదుగు ♦ రేగదరేని పి,తామహ వృషవంది ♦ తంబునిఖిల
సురపూజితంబగు ♦ వరనీలగిరి దర్శ,నముగల్గు హరిదర్శ ♦ నంబుఁగల్గుఁ
తే॥ అందుచే నందఁగలవు స♦నందనాది, పరమహాను లకందని♦పరమపదమ
టంచువచియించి యంతలో♦యతివరుండ,దృశ్యతంజెందముద్వార్థిఁ♦దేలినృపుఁడు.

వ॥ తపస్వికిఁ గని యిట్లనియె. ౧౮౨

చ॥ ఇటుల వచించి యేగినయ♦తీశ్వరుఁ డెవ్వఁడు చిత్రమాయె నె
చ్చటఁ బరికింపఁగన్పడఁడు ♦ స్వామియథార్థముఁ దెల్పవేయనన్
జటిలుఁడుఁ దెల్పెనిట్టు నృప♦సత్తమవిన్వరుషోత్తముండు నీ
యటమటఁ జూచివచ్చి యిటు♦లంతయుఁ జెప్పిచనెన్ యతీశుఁడై. ౧౮౩

తే॥ వింటెనృప భక్తజనుల పా♦లింటివాఁడుఁ, సాధుపాపాపనోదన ♦ క్షముఁడతండుఁ
గావునను రేపుమధ్యాహ్న♦కాలమందుఁ, దప్పకుండఁగ నీకిచ్చు♦దర్శనంబు. ౧౮౪

ఉ॥ శైలవరంబు నెక్కి-ఫణి♦శాయినిఁ గాంచితరించుమాయనన్
నీలగళావనీశుఁడు వి♦నిర్మలత ద్వచనామృతౌఘసం
క్షాళితమానస జ్వరప్రి♦కర్దముఁడై కనుసట్టిసంతసం
బోలవణారి యాకమల ♦ జోదరుకైన నెఱుంగశక్యమే. ౧౮౫

ఆ॥ పణవగోముఖాది ♦ వాద్యముల్ మొరసె నా, విభుని హృదిముదంబు ♦ వెల్లివిరిసె
నగుచుఁ బాడుచాడు♦చొగినృపుండు సెలంగె, హరినిఁజూతునంచు♦నాత్మఁబొంగె.

వ॥ తదనంతరంబ. ౧౮౭

తే॥ పద్మనాభునిఁ బాడుచుఁ♦బగలుఁగడిపి, రాత్రిగంగానదీ తీర♦రమ్యతలము
నందునిద్రించి నిద్రలో♦నరిగదాబ్జ, శార్ఙ్గదరధరుఁడును జతు♦శ్శ్రయుఁడునగుచు.

క॥ హరముఖసురవరయుత కిం, కరసేవితుఁడైన తమ్మి♦కంటియెదుటఁదా
నరుదుగ నృత్యము సల్పఁగ, నరుసముఁ బడినట్టు స్వప్న♦మందునఁగాంచెన్. ౧౮౯

వ॥ మఱియు. ౧౯౦

తే॥ పద్మనాభునినీప్సిత ♦ ప్రదునిఁగాఁగ, దత్కృపాపాత్రమునుగాఁ ♦ దననుస్వప్న
మందతానెంచిమేల్కాంచిముందువిప్రుఁ, గాంచి స్వప్నవిధంబువ♦చించుటయును

క॥ వినివిప్రుఁడబ్బురముపడి, జననాయకదర్శనంబొ♦సంగెనుహరి నీ
జనిధన్యత్వమునొందెను, దనసాయుజ్యంబొసంగుఁ ♦ దప్పక నేఁడే ౧౯౨

సీ॥ అనితెల్పునాభూసు♦రాగ్రణిపలుకుల,కలరిరత్నగ్రీవు ♦ డఖిలదాన
ములఁజేసిదీనుల ♦ నలరించి గంగాబ్ధి,సంయోగమందున ♦ స్నాతుఁడగుచు
విధ్యుక్తముగ దేవ ♦ పితృతర్పణంబులు గావించిహరిగుణ ♦ గానమొనర
గానంబుసేయుచుఁ ♦ గనుటెప్పుడాహరి,ననుచుండ మధ్యాహ్న ♦ మగుడునంతఁ
తే॥ దోరముగదివిదేవదుం ♦ దుభులుమొరసె, వసుమతీశ్వరు పైపూల ♦ వానకురిసె
విప్రుఁడిదె గిరిఁ గనుమని ♦ విభునిఁగరసెఁ, గంటిమంటి ననిపతిమి♦న్నంటిమురిసె.

వ॥ అప్పుడు శతకోటి ప్రభాకరకరాధికప్రభాకరంబును నతిమనోహరంబును గానక రాజిత తుంగశృంగ విరాజితంబును స్ఫురదింద్రనీల దృషద్బద్ధ సోపాన విలసితంబును నిందూపలలసత్సుందరకందరంబును బద్మరాగమణి ప్రభాజాలవిలసిత కుట్టిమస్థలంబులును గల్గి కీలామాలా జాలాలవాలంబగు కీలియుంబోలె వెలుఁగుచు రెండవయినుండు వడువున దుష్ప్రేక్ష్యంబై నిల్కడనలవరించుకొనిన మించులపిండు చాడ్పునఁ గన్నులకు మిఱుమిట్లుఁగొలుపుచునుండు నీలాచలేంద్రంబతికష్టంబుగ నెట్టకేలకుంగని యానందంబునఁజిందులుఁద్రొక్కుచు విస్మయంబు నందుచు సపరివారంబుగ నీపుణ్యానగంబున కెఱఁగుమని తపోధనుండెఱిఁగింప నట్లచేసి కృతార్థుండనై తిథన్యత్వంబు నొందితిఁబావనుండనై తిఁబరమపదంబుఁగంటె మంటిననుచుఁగళత్రామాత్యకరంబద్విజులతో విజయముహూర్తంబున నప్పర్వతాధిరోహణంబొనచె. ౧౯౪

క॥ అమరాహత దుందుభినిన, దములువినుచుఁ బోయిపోయి ♦ తచ్ఛైలవరా
గ్రిమశిఖరంబున నానా, ద్రుమరాజిపరీతవజ్రి ♦ రుచిరతలమునన్. ౧౯౫

క॥ హాటకభిత్తులవజ్రిక,వాటములన్ దనరిహారిని ♦ వాసంబై బల్
దీటగు దేవాలయమున్, హాటక శిఖరప్రదీప్త ♦ మగుదానిఁ గనెన్. ౧౯౬

సీ॥ అందువిరించిను ♦ రాధిపముఖసుర, వరులచేఁబూజింపఁ ♦ బడెడువాని
మణివిచిత్రితరుక్మ ♦ మయదివ్యసింహాస, నమున శ్రీతోడఁగ ♦ న్పట్టువాని
చండప్రచండవి ♦ జయజయపుణ్యాశీ, లాదికోపాసితుం♦డయినవాని
నాలుగుభుజముల ♦ నందకాద్యాయుధ, వరములచేఁజాల ♦ మెరయువాని.
తే॥ తనపరీవారయుతుండై ము♦దంబుమీరఁ, గాంచితులకించి పులకించి ♦ కళవళించి
"పాహిమాంపాహిమాంభక్త♦వరద" యనుచుఁ, బాదములమీదఁబడిలేచి♦పరమభక్తి

మ॥ అనిరుద్ధున్విధిపూర్వకంబుగను రేఁ♦డర్చించియావాహనా
సనపాద్యాదుల వేదమంత్రములచే ♦ స్నానంబు సేయించి చం
దన వస్త్రంబులొసంగి పుష్పములచే♦తన్ బూజఁగావించి ప్రీ
తినిధూపంబిడి భక్ష్యభోజ్యములతో ♦ దివ్యాన్న మర్పించుచున్. ౧౯౭

ఆ॥ విప్రవర్యుతోడఁ ♦ గప్రింపుటారతు, లిచ్చివిడెమొసంగి ♦ యింతితోఁబ్ర
దక్షిణంబుఁజేసి ♦ తనరెండు కేళ్ళుజో, డించి మ్రొక్కి హరిను♦తించెనిట్లు. ౧౯౯

వ॥ దేవా! నీవు సాక్షాద్భగవంతుఁడవు పురుషుండవు ప్రకృతికంటెఁ బరుండవు నొక్కరుండవు కార్యకారణంబులంబట్టి భిన్నుండవు మహత్తత్త్వాదులచేఁ బూజితుండవు మఱియు నీబొడ్డుఁదమ్మివలన నలువన్ బుట్టించి సృష్టిక్రమంబు నడిపించుచు నేత్రంబువలన రుద్రుంబుట్టించి సంహారంబు నేయించుచుందువు. పురాణాదులునులోకాత్యంత

స్థితిసంచారంబులును నీ వలననగుచుండును. నీవుచేతనాశక్తిం బ్రవేశించి జగంబుల సచేతనంబులుగాఁ జేయుచుందువు నిజంబుగ నీకుజన్మాంతంబులును వృద్ధిక్షయ పరిణామంబులు లేకున్నను భక్తరక్షణ ధర్మసంస్థాపనంబులకై జన్మకర్మంబులుఁద దనురూపగుణంబులును దాల్చుచుందు వో! పురాణపురుషా మున్ను మత్స్యంబవై శంఖాసురుం ద్రుంచి వేదంబుల నుద్ధరింపవేయట్టి నీమహిమంబుఁ దెలియ నాభాషా లలనా శేషులకైనను దరంబుఁగాదనిన నావంటిబుద్ధి హీనులకు శక్యంబగునే యీ వాక్సతీమనస్సునకైన నగోచరుండవగు నిన్ను నుతించుటకు నేనెంతఁయనంతా నన్నుఁ గృతార్థుంజేయవే యనిడగ్గుత్తికతో నానందాతి రేకంబునఁబులకితగాత్రుండై పలుకుచున్న రాజోత్తముంగాంచి పురుషోత్తముండిట్లనియె -౨౦౦

ఆ॥ ఈవుచేసినట్టి ♦ యీస్తోత్రరత్నంబు, చే నెవండునాడు ♦ చిత్తమలరఁ
జేయునతనికి దయ♦చే భక్తిముక్తుల, నిచ్చిదర్శనంబు ♦ నిత్తు నేను. ౨౦౧

క॥ బలిదైత్యాంతకుఁడిట్టులఁ, బలికినపలుకులకు మోద♦భరితుండై భూ
పలలాముఁడు భక్తిని నా,నలుగురుతో నారగించె ♦ నైవేద్యంబుల్. ౨౦౨

సీ॥ అంతసువర్ణమ ♦ యంబప్సరో బృంద, సంసేవ్యమతి సౌఖ్య♦సంయుతంబుఁ
గింకిణీజాలవి ♦ కీర్ణమైయొప్పువి, మానంబురానందు ♦ మహిళతోడ
బ్రాహ్మణమంత్రిక♦రంబులతో మొక్కి, పురుషోత్తమునకునా♦గరుడగమను
నాజ్ఞనధిష్ఠించి ♦ యందరుఁగనుచుండ, నల్లనిదేహంబు ♦ నాల్గుచేతు
తే॥ లబ్జచక్రాదులను మకు ♦ టాంగదాను, లలరఁగనునంగనాజన ♦ మెలమిఁగొల్వ
నఖిలసుర మానులకునైన ♦ నందరాని, విష్ణులోకంబుఁజెం చెఁ బృ♦థ్వీధవుండు.

వ॥ ఇట్లైదుగురు విమానంబారోహించి పద్మనాభ నిభాకారులై పోయి పరమపదంబు నొందుటంగని ప్రకృతిజనులాశ్చర్యమగ్నులై యాపరమ భాగవతపంచకంబును బ్రశంసింపుచుండిరంత. ౨౦౪

క॥ దుందుభిరవములు శ్రవణా,నందముగా మ్రోసె నప్డు ♦ నరహరిభజనా
నందమునఁ జొక్కు విప్రు, రందరుఁడోకఁడడఁపలేక ♦ రాజవిరహమున్. ౨౦౫

క॥ హరి నైవేద్యముఁ దినుచున్, నిరతంబానీలశైల ♦ నిలయునిసేవల్
జరుపుచుఁ జతుర్భుజుండై, స్థిరపదమునుజేరెఁ గొన్ని ♦ దినములలోనన్. ౨౦౬

ఆ॥ ఆవిచిత్రమప్పు♦డందఱు వీక్షించి, విస్మయంబునొంది ♦ విష్ణుమహిమఁ
గలసి చెప్పికొనుచు♦గంగాసరిత్సింధు, సంగమమున మునిఁగి♦చనిరి పురికి. ౨౦౭

శా॥ నీలగ్రీవ నృపాలు భాగ్యమున హా! ♦ నేనెంతవర్ణింపఁగా
నేలీలన్ మునులైనఁ గాంచని పదం ♦ బీస్థూలదేహంబుతో

వాలాయంబుగఁ గాంచఁగల్గె ఘారికా♦వాసంబుఁబూజ్యంబునౌ
నీలగ్రీవముఁ గాంచువారలఘు దే? ♦ నిర్వాణము న్గాంచుటల్. ౨౦౮

ఆ॥ నీలశైలమహిమ ♦ నిఖిలంబువినువాఁడు, దీనిమహిమరక్తిఁ♦దెలుపువాఁడు
పీరలిద్ద రఘువి♦దూరులై శాశ్వత,మైన పరమపదము ♦ నందఁగలరు. ౨౦౯

తే॥ దీనిస్మరియించు నంతను♦దివిరి వినిన, యంతదుస్స్వప్న దోషంబు♦లడఁగుమఱియుఁ
గొలదికాలంబునంద ము♦కుందుఁ డీ దు,రంతసంసార నిస్తార ♦ మనఘ! సేయు.

శా॥ సౌమిత్రీ పురుషోత్తమాఖ్యఁదగు నీ♦శైలంబునందుండువాఁ
డాద్రిముండంబుధిజాత సీత క్రతువా♦రంభించె ముల్లోకముల్
పేర్మిన్ బావనత న్వహింప స్వకథా♦పీయూషపానంబుచే
నామోచ్చారణచే మనోవ్యథలు నా♦నాదోషముల్ పాపుచున్. ౨౧౧

క॥ ఓరఘువర మనరాముఁడుఁ, గారణకారణుఁడు భక్త ♦ కలుషాద్రిసునా
సీరుఁడు నీలాచల సంచారునిఁగాఁ దెలియుమయ్య ♦ స్వాంతమునందున్. ౨౧౨

తే॥ మాటలిటులాడుచుండఁగ ♦ మఖహయంబు, ఖురనిపాతవిచూర్ణిత♦కుతలయగుచు
శీఘ్రగతి నీలశైలంబుఁ ♦ జేరుటయును,జూచి శత్రుఘ్నుతో నిట్లు♦సుమతియనియె.

చ॥ ఎవనిపదప్రసాదపోతమున ♦ నెల్లరు దాటిరో మున్భవాంబుధిన్
బ్రవిమలభక్తి నాపతిత♦పావనమూర్తికి మ్రొక్కుమయ్య దు
ర్భవములఁ ద్రోలి పాపములఁ ♦ బాపుచుముక్తి నొసంగునాతఁడం
చువివరమొప్పఁ బల్కె రిపు♦సూదనుఁడానుడి కుబ్బియాత్మలోన్. ౨౧౪

క॥ గంగాతటినీసాగర, సంగమమున స్నాతుఁడగుచు ♦ సచివాగ్రణితోన్
జంగునఁజని నీలాచల, శృంగాగ్రమున న్వసించు ♦ శ్రీశునిభక్తిన్. ౨౧౫

క॥ సేవించి మ్రొక్కి పూజలఁ, గావించి కృతార్థకతను ♦ గాంచితినంచున్
భావించి మదిని సేనల, రావించి ప్రయాణమయ్యె ♦ రాజులతోడన్. ౨౧౬

—♦ సుబాహు మహారాజు చరిత్రము ♦—

సీ॥ మఖతురంగము క్షణ♦మాత్రమచ్చటఁబచ్చి, కనుమేసి నృపులతోఁ♦గదలినుదుటఁ
జామరయుతమునై ♦ చందనచర్చిత, కనకపట్టంబొండుఁ గ్రాలుచుండ
నరిఁగిసుబాహు భూ♦వరపరిపాలిత, చక్రాంకపురమున ♦ వక్రగతినిఁ
జేరనానృపుని కు♦మారుఁడు దమనుఁడు, వేటకుఁబోవుచు ♦ వీతిఁజూచి

తే॥ భటునిఁగని పల్కె నెవరిదో♦భద్రహయము, ఫాలమందునఁజూడుమా♦పట్టమొకటి
క్రాలుచున్నది పైయక్ష♦రాలుఁజదివి, తెలసికొనిరమ్మటంచును ♦ దెలుపనతఁడు.

క॥ సరగున నరిగితురంగము, శిరమునఁ గడుమెరయు జూలు ♦ జేపట్టుకనా
హరిఁ దిగుచు కొనుచు రా సుం, దరవర్ణసమూహమిట్లు ♦ దమనుఁడు సదివెన్.

వ॥ సకలోర్వీరమణ ప్రకాండమకుటాం ♦ చద్రత్న నీరాజితాం
ఘ్రికబంధోద్భవుఁడార్యసత్తముఁడు వై ♦ రిక్షోణినాథేభసిం
హకిశోరుండగు రామచంద్రహయమే ♦ థాశ్వంబు దీనిన్ సము
త్సుకతన్ శూరులుఁబట్టుఁడున్న ధన ♦ రాసుల్ దెండు కాకుండినన్. ౨౧౯

క॥ శత్రుఘ్నపాల వనానిల, మిత్రుఁడు లవణాంతకుఁడు సు ♦ మిత్రాసుతుఁడా
శత్రుఘ్నుఁడు వచ్చెడివాఁ, డ్క్షత్రియవరులార యీమ ♦ ఖహయము వెంటన్.

క॥ శూరుల మే మేము ధను, ర్ధారుల మే మేమటంచుఁ ♦ దలఁచుచునుండే
శూరమ్మన్యులు వెరవక, పౌరుషములు నిల్పుకొనుచుఁ ♦ బట్టుఁడు హయమున్. ౨౨౦

తే॥ సకలవీరశిరోమణి ♦ సకలవైరి, మదహరుండగు లవణారి ♦ మఖహయంబుఁ
గడఁగి విడిపింపఁగలవాఁడుఁ ♦ గానసతని, పదములందున మొదటనేఁ ♦ బడుట మేలు.

వ॥ అనుచుఁ జదివి కోపోద్దీపితమానసుండై దమనుండిట్లనియె. ౨౨౩

శా॥ ఏమేమీ భళి రామభూపునకు నో ♦ రెట్లాడెఁ దా నొక్కఁడే
భూమిన్విల్లునుబట్టు శూరుఁడట భూ ♦ పుల్ శూరులే లేరుగా
యీమానోక్తులు నాదుతండ్రి సుఖియై ♦ యిందుండఁగానానె యా
రాముండొందెడుఁగాక తత్ఫలము మ ♦ త్ప్రక్షిప్త బాణంబులన్. ౨౨౪

తే॥ ఇప్డు నావాడియగు కోల ♦ లేపురేగి, పూలతోనున్న మోదుగు ♦ పోలె లక్ష్మ
ణానుజన్మని రక్తధా ♦ రావృతినిగఁ, జేయవే శాత్రవులుఁ జూడఁ ♦ జితగతుల.

సీ॥ మత్తీక్ష్ణశరములు ♦ మదకలభకపోల, ములఁ జేయుఁగాక చె ♦ క్కులుగ నేఁడు
రక్తప్లుతతురంగ ♦ రాజిని రామాను,జుండుఁ దాఁ గండ్లారఁ ♦ జూచుఁగాక
రథములు రిపుమనో ♦ రథములతోఁ గూడఁ ♦ జిదురుపలై యిలఁ ♦ జెడునుగాక
తలపుత్తెలందు ర ♦ క్తముఁబట్టి యోగినుల్, కుతుకబంటిగాఁ ♦ గ్రోలుఁగాక
తే॥ పలలమును దిని నక్కలుఁ ♦ జెలఁగు గాక, చండకోదండదండప్ర ♦ సారితాంబ
కములు రిపుసేనలను బెల్లుఁ ♦ గలఁచుచుండఁ గనుల నాభుజబలమును ♦ గాంత్రిగాక.

క॥ దమనుండిటువల్కుచు న, శ్వముఁ దననగరమున కంపి ♦ సంతసపడుచున్
దమసేనానాయకుఁ గని, సమితంబుగ సేనఁ గూర్పు ♦ మనుచు వచించెన్. ౨౨౮

ఆ॥ రథగజాశ్వసుభటఁ ♦ రాజిని సేనాని, సిద్ధపరుపఁ దాను ♦ యుద్ధమునకు
సిద్ధుఁడగుచునుండఁ ♦ జేరిర చ్చోటకు సంతలోన నాహ ♦ యానుచరులు.

తే॥ వచ్చిముఖపత్రి చిహ్నిత ♦ వాజిరాజ, మెక్కడెక్కడనింతలో ♦ నెటకుఁబోయె
ననుచు నన్యోన్యమునుమాట♦లాడుచుండ, నంతలోనఁబ్రతాపాగ్ర్యుఁ♦డరుగుఁదెంచి.

వ॥ సజ్జీభూతంబై వీరశబ్దశబ్దితంబగు కటకంబుఁగని యీ రాజపుత్రునిచేఁ దురంగంబు గ్రహింపనోపుఁగాకున్న బలానుగుండై యుద్ధోన్ముఖుండై ట్లగునని విచారింపుచు గొందరివలన నిజమెరింగి రాజకుమారునికడ కొక సేవకునంప నాతఁడరిగిదమనుం గాంచి యిట్లనియె. ౨౩౦

ఉ॥ భూవరపుత్రపాకహర ♦ ముఖ్యసురార్చితపాదు లోకవి
ద్రావణరావణాంతకతు ♦ రంగముఁబట్టిన శూరుఁడెవ్వఁడా
పావనసప్తియేదికడు ♦ సాహసమీవ యొనర్చినావెచాల్
గావుమటంచుమ్రొక్కినను ♦ గాచును నాలవణాంతకుండు నిన్. ౨౩౧

క॥ ఈరీతిఁబలుక సేవకుఁ, డారాసుతుఁడాగ్రహమున ♦ నదలింపుచ రే
వీరుండుండిన మీలో, మీరినన్ దెచ్చికొనుఁడు ♦ మీయశ్వంబున్.

ఉ॥ సేవకుఁడానుడుల్వినివి♦శేషకృథన్ గడు నవ్వి కొంచులో
నావసుధేశుఁజేరఁజని ♦ యంతయుఁదెల్పమహాబలుండు రో
షావిలనేత్రుఁడై శరమ♦హాస్త్రయుతంబు సువర్ణనిర్మితం
బావరకూబరాఢ్యచతు ♦ రశ్వనిబద్ధరథంబు నందునన్. ౨౩౩

వ॥ కవచధారియైయధిష్ఠించి గజారూఢులును, దురంగారోహకులును, ఖడ్గపాణులైన భటులు వెంటరామహా వేగంబున రెండవరుద్రుండువోలె దుర్నిరీక్షుండై వచ్చు ప్రతాపాగ్ర్యభూపవర్యునిన్ జిరకాలంబునకు సంగరంబు సమకూరెనని డెందంబునఁ బొంగుచు నరుదెంచు నగణ్యంబగు భటసమూహముంగాంచి, తనబలంబా యత్తంబు సేసి దమనుండుఁగవచియు ఖడ్గియునై శరశరాసనంబులఁదాల్చిరథారూ ఢుండై గజయూథంబుపై కురుకుసింహకిశోరంబువడువునఁ జనునంత నిరువాగును దలఁపడి పోరుచుండిరందు. ౨౩౪

ఆ॥ రథికవరులతోడ ♦ రథికవరుల్ హస్తి, పకులతోడ హస్తి ♦ పకులు నాశ్వి
కాళితోడ నాశ్వి♦కాళిభటుల తోడ, భటులుమారుకొనిరి♦భండనమున. ౨౩౫

ఉ॥ కట్టలుకన్ గజంబులను ♦ ఖండనచేయుచు రెండురెండుగాఁ
దట్టస మొప్పగుజ్జములఁ ♦ దద్దయుముక్కలుగానొనర్చు-చున్
బొట్టలుసించి లోమెదడు ♦ పోవులువెట్టుచుఁగాల్బలంబులన్
గుట్టలుఁగాఁగఁదేరులను ♦ గూల్చుచునుండఁగఁజూచియుగ్రుఁడై. ౨౩౬

వ॥ ప్రతాపాగ్ర్యుండు సారథింగని కంటివే దమనుఁడాకొన్నపులి విధంబున వచ్చు చున్నవాఁడతనికెదురుగ మనరథంబుఁదోలుమనిన నాతండట్లసేయ దమనుంగాంచి యిట్లనియె. ౨౩౭

ఉ॥ ఓరి! నృపాత్మజాత విన♦వో! దశకంఠమహాప్రతాప వి
స్ఫారదవాగ్నినీరదు నృ♦పాలకసేవ్యుని రాముఁడన్మహా
వీరుని వీతిఁబిన్ననయి ♦ బేలతనంబునఁ బట్టి నీ పురిన్
జేరిచినట్లు కాదు ననుఁ ♦ జేరి జయించుట లింకఁ దెల్పెదన్. ౨౩౮

క॥ నీపాలిట యముఁడని నన్నోపాపఁడ! తెలిసికొ మ్మ♦హో! నినుఁ జూడన్
గోపావేశం బడఁగెను, నా పాపలతోడఁ గూడి ♦ యాడఁగఁ జనుమా! ౨౩౯

ఆ॥ ఏ నృపాలసుతుఁడ? ♦ వెక్కడ నుండెడివాఁడ? వీవు పిచ్చి♦వాడ! వొఱుక
లేక పట్టినావు♦ లే యిపు డైనను, విడచి పుచ్చి హయము ♦ వేగఁ జనుము. ౨౪౦

ఆ॥ ఇటులఁ బలుకు మాన♦వేశ్వరు నుడులకు, నరవరాత్మజుండు ♦ నగుచు నతని
బలము సరకుఁ గొనకఁ♦బలికెఁ బ్రతాపాగ్ర్య! జరుపుకొనుము పేరు♦సార్థకముగ.

క॥ బాలక్రీడకుఁ బొమ్మని, మేలము లాడితివి కాదె? ♦ మీవార్లెన్నన్
బాలుఁడనో? వృద్ధుఁడనో?, యాలమునను గనుఁడు నాదు♦నాటల భూపా!. ౨౪౨

క॥ మాటలతో నేమీ యీ, ఘోటకమును విడచెద నను ♦ కొంటివె? బలె నా
యాట లటుంచుము నిన్నొక, క్కాటాడించెదను జూడు ♦ మఱపులికేలా? ౨౪౩

క॥ పట్టితి నశ్వంబును నేఁ, గట్టడఁ జేసితిని దానిఁ ♦ గట్టగఁ బురి ని
ప్పట్టున విడుతునె బొందిని, బట్టుగ ప్రాణంబు లున్నవఱకు నృపాలా!. ౨౪౪

తే॥ ఇటులఁబల్కి సుబాహు భూ♦మీశసుతుఁడు, ధనువు సజ్యంబుఁజేసి శ♦తశరములను
వింట సంధించి కాతరుల్ ♦ భీతినొంద, దరము పూరించి విడచె నా♦శరశతంబు.

క॥ తన బాణములఁ బ్రతాపా,గ్ర్యనరేశుఁడుఁ జేయ ఖండ♦ఖండంబులుగాఁ
గనలుచు దమనుఁ డమర్త్యులు, తన కరలాఘవముఁ గాంచి ♦ తద్దయుఁ బొగడన్.

ఉ॥ కంకగరున్నిబద్ధ శర♦కాండము లంబరమెల్లఁ గప్పుచున్
గంకటమున్ బగిల్చి యొక ♦ కాండమునన్ హృదయంబునన్ స్వనా
మాంక శరంబు గ్రుచ్చి మఱి♦ యట్టి శరంబుల రెంట బాహువుల్
గ్రుంకఁగఁజేసి తీక్ష్ణ మగు ♦ కోలల నేసలఁ గాల్చుచుండగన్. ౨౪౭

సీ॥ ధరణీశసుతుని బ్ర♦తాపంబునకుఁ బ్రతాపాగ్ర్యుఁడుఁ బ్రకుపితుం ♦ డగుచు దమన!
నిలు మంచు నీరైదు ♦ ములుకుల నదలించి, నిగుడింప నవి నడు ♦ నెత్తినాట
శాఖాదశకయుక్త ♦ శాఖిచాడ్పున నుండి, యురుయష్టిఘాతంబు ♦ సరకుఁ గొనని
కలభంబు విధమునఁ ♦ జెలరేఁగి దమనుఁడు, కాలాగ్నిహోత్రి సం♦కాశ రుక్మ
తే॥ పుంఖబాణత్రిశతములఁ ♦ బూన్చి వింట, విడువ రొమ్ముఁ బగల్చుచు♦వీపు గుండ
దడిసి నెత్తుట నవి యథస్థలిని జేరఁ, బో యెరామాత్యనాపరాజున్ముఖులమాడ్కి. ౨౪౮

వ॥ అంతటఁ బ్రతాపాగ్ర్యుండు మహోగ్రుండై శరసహస్రంబులఁ బఱపుచు నాల్గింట
హయంబులను రెంట ధ్వజంబును నొక్కట సారథి శిరంబును గూల్చి మఱియు
నాల్గు వాఁడితూపులు రాజపుత్రు హృదయంబునం గీలించి యొక్కట గుణయుక్తం
బగు చాపంబు ఖండించి సింహనాదంబు సేయ నా దమనుండు హయరత్న శోభితం
బగు వే ఱొక్క రథం బధిష్ఠించి చాపంబు సజ్యంబొనర్చి ప్రతాపాగ్ర్యుం గని
యిట్లనియె. ౨౪౯

తే. మానవేశ్వర! యద్భుతం ♦ బైన నీదు, విక్రమంబును గంటి నా ♦ విక్రమంబు
నస్మదురుచాపవిక్రాంతి♦నదురుఁగొనక, కనుమని దశేషువులఁగార్ముక♦కమునఁగూర్చి

ఉ॥ నాలుగు వాఁడి కోలలను ♦ నాలుగుగుఱ్ఱముల న్వధించి వే
నాలుగు నారసంబుల వి♦నాశ మొనర్చి రథంబునొక్క మే
ల్వాలుగుఁదూఁపుచే నృపుని ♦ వక్షము బ్రద్దలుగా నొనర్చుచుఁ
గోల నొకంట సారథిని ♦ గూర్చి చెలంగుచు నొత్తె శంఖమున్. ౨౫౧

చ॥ అదిఁగని మేలటంచుఁ గొని♦యాడుచు నుండుట కందటాత్మ లోఁ
బొదలఁగఁ గిన్క నుగ్రుఁడయి ♦ భూపతి వేఱొక తేరునెక్కి తా
నెదురుగఁబోయి యోయి కను ♦ మిప్పుడు నాదుప్రతాప మంచు వే
భిదురనిభాంబకౌఘముల ♦ బెల్లుగఁ గప్పెను నద్భుతంబుగన్. ౨౫౨

ఆ॥ స్యందనంబులందు ♦ హరులందుఁ గరులందు, సైన్యమందు నెచట ♦ సందులేక
తోఁచె బాణవితతి♦తోరంబుగాఁ బర, బ్రహ్మ మంతటను మె♦ఱయువిధమున. ౨౫౩

క॥ శితబాణకోటిచే నా, కుతలాధిపు తనయుమేన ♦ గుప్పచుఁగాల్కె
ల్వ్రేత నాడకుండ నొనరిచి, కుతుకముఁదనవారుఁ బొందఁ♦గోయనియార్చెన్. ౨౫౪

క॥ ఇటులఁ బ్రతాపాగ్ర్యుండెదఁ, బటుతర రోషంబు గదురఁ ♦ బరహృదయము లొ
క్కట భేదించుచు నెన్నియొ, దిటముగఁ బ్రాణానిలముల♦దీయుచు నుండన్. ౨౫౫

చ॥ కని తన దేహ మంబులను ♦ గప్పుటఁ గన్గొని రోషయుక్తుఁడై
ధనువునఁ దీక్ష్ణబాణములఁ ♦ దద్దయుఁగూర్చి దురంతవిక్రమం
బున దమనుండు వైరిశర♦పుంజములన్ దన వాఁడికోలలన్
దునుముచు వాని ఛత్రమును ♦ దున్కలు తున్కలుఁ జేసి యిట్లనెన్. ౨౫౬

ఉ॥ వీరుఁడవైతివేని పృథి♦వీవరనాయక! యీ ప్రహారమున్
నేరుపునన్ సహింపుమిఁక ♦ నిన్ను రథంబుననుండి యిప్పుడే
ధారుణిఁ గూలఁజేతు నది ♦ తప్పిన గర్వసముచ్చయంబునన్
గూరిన నా ప్రతిజ్ఞ విను♦కూటువ మెచ్చఁగఁజేయుచుంటినేన్. ౨౫౭

ఆ॥ హేతువాదములను ♦ నెప్డుఁ జేసెడివారు, వేదదూషణంబు ♦ విహితముగను
జేయు పాపమతులు ♦ చెందెడి యా మహా, ఘోరనరకమందుఁ ♦ గూలువాఁడ.

క॥ ఈ లాగునఁ బల్కుచుఁ దాఁ, గాలాభముఁ దీక్ష్ణతరముఁ ♦ గడు దుస్సహమున్
జ్వాలాభీలం బగుచును, గ్రాలెడి శర మొకటిఁ గూర్చి ♦ కార్ముకమందున్. ౨౫౯

శా॥ ఆకర్ణాంతము లాగి వక్షమున ల♦క్ష్యంబుంచి వీడంగ నా
లీకంబుల్ విభుఁ డెన్ని యో వఱప నో♦లి న్వాని ఖండింపుచున్
వీఁక న్బోయి తదీయవక్షమును వే♦ భేదించి లోదూర ఘో
రాకారంబున నేలఁ గూలెను బ్రితా♦పాగ్ర్యుండుఁ బెన్మూర్ఛచేన్. ౨౬౦

వ॥ ఇట్లు చేష్టలుఁ దక్కి పడియున్న ప్రతాపాగ్ర్యభూపాలుని సారథి దూరంబునకుం గొంపోవ బలంబు భగ్నంబై పిరాగ్రెసరవేష్టితుం డగు శతృఘ్ను మఱుంగు సొచ్చుటయు దమనుండు విజయంబునొంది శతృఘ్నురాక కెదురు సూచుచుండె నంత. ౨౬౧

—♦ శపథంబుఁజేసి పుష్కలుఁడు సంగరంబున కరుగుట ♦—

సీ॥ శతృఘ్నుఁ డతిక్రుధా♦సహితుఁడై పండులు, పటపటఁ గొఱుకుచుఁ♦గటములదర
ఎవఁడురా నా భయ♦మిసుమంత లేక మ,దశ్వంబు బంధించి ♦ యతిబలాఢ్యుఁ
డైన మన ప్రతా♦పాగ్ర్యుని నిర్జించి♦నట్టివాఁడన భటు♦లనిరి భూప
వినుము, సుబాహు పృ♦థ్వీపాల తనయుండు, దమనుఁ డన్వీరుఁ డిం♦తయు నొనర్చె

తే॥ ననుఁడు కదనస్థలికి శతృ♦హంతవచ్చి, గండముల్దెగి కొండల ♦ పిండుకరణి
నల్లమడువులం బడియున్న♦నాగములను, నాశ్వికులతోడఁ జచ్చిన♦యశ్వములను.

క. విఱిగిన రథజాలంబులఁ, దొఱఁగెడు రక్తంబుఝురుల♦దోర్లెడు నరులన్
బరికించి రోషవశ దు,ర్భరుఁడై కనుపట్టెఁ బ్రళయ♦వారిధి వోలెన్. ౨౬౩

తే॥ వితతభయదపరాక్రమో♦పేతుఁ డగుచు, నెదుటఁ గన్పట్టు రాసుతు♦నెలమిఁ గాంచి
యధికకోపాకులేక్షణుఁ♦డై స్వయోధ, వరులఁ గన్గొని యిటుల దా♦శరథి పలికె.

చ॥ మనమొన నస్త్రశస్త్రముల ♦ మర్మము లెల్ల నెఱింగి ధైర్యమున్
గొని చని శూరవర్యు రణ ♦ కోవిదు రాజతనూజు నేఁడు మా
ర్కొనఁగ సమర్థుఁడైన నర♦ కుంజరుఁ డుండిన వాఁడు వచ్చుగా
కన విని లేచి పుష్కలుఁడు ♦ హర్షము నందగ నంద ఱిట్లనెన్. ౨౬౫

ఆ॥ నిఖిలమును జయించు ♦ నీ మహాబల మేడ! దమనుఁడేడ? ధనువు ♦ దాల్చినాఁడ
నీ ప్రతాపమహిమ♦ నే జయించెడివాఁడ, నానతీయుఁ డించుకంత యేఁడ. ౨౬౬

క॥ అని కీ సేవకుఁ డుండఁగ, మన హయము హరించి యెవఁడు ♦ మను నా రఘురా
మునిఘనప్రతాపమే యా, పనులన్నియుఁ జక్కఁ బెట్టుఁ ♦ బావనచరితా. ౨౬౭

ఉ॥ ఏను బ్రతిజ్ఞ సేతు విను ♦ మెప్పుడు రామపదాంబురుట్సుధా
పానపరాఙ్ముఖుల్ కనెడు ♦ పాపముఁ దల్లి పదాల కన్న నీ
భూనదు లెక్కుఁడంచుఁ దల♦పోయుచుఁ దల్లులఁ దూరు పుత్రికల్
పూను నఘంబుఁ గాంతు నృప ♦ పుత్రు జయింపక యుంటినేని నేఁ. ౨౬౮

తే॥ ఇపుడు మద్బాణనిర్భిన్న♦హృదయుఁడగుచుఁ, గ్రిందఁబడిభూతలమలంక♦రించుగాక
యనెడు నుడువుల కా లవ♦ణాంతకుండు, మెచ్చి కదనంబునకు సెల♦విచ్చుటయును,

వ॥ ఇట్లు శత్రుఘ్ను ననుమతి వడసి, పుష్కలుండు సకలసైన్యంబులతో రథారూఢుండై వచ్చుటం గని దమనుండును రథారోహణం బొనర్చి చతురంగబలములతో నెదుర్కొనె నప్పుడు భూతలంబున రణంబు సేయు తలంపున వచ్చిన శక్రదైత్యుల వడువునఁ జూపఱులకుఁ గనుపట్టి రప్పుడు పుష్కలుండు దమనుం గని యిట్లనియె.

ఉ॥ భూమిప నందనా! దమన! ♦ పుష్కలనాముఁడ నన్నెఱుంగు దే
రామపదాంబుజామలని♦రంతరసేవనషట్పదుండ నా
రాముని తమ్ముఁడౌ భరత ♦ రాట్తనయుండఁ బ్రతిజ్ఞఁ జేసి ని
న్నీ మహదస్త్రపంక్తుల జ♦యింపగ వచ్చితి రమ్ము పోరికిన్. ౨౭౦

క॥ అను మాటలు విని నవ్వుచు, ఘనబలుఁడగు రాసుతుండు ♦ కడునిర్భయుఁడై
యనెఁ బుష్కల నా విధమును, వినిపించెద నించుకంత ♦ విను విశదముగన్. ౨౭౧

సీ॥ శూరుఁడైన సుబాహు♦సూనుండ దమనుండ♦జనకభక్తి హ్యాతాఘ♦చయుఁడ వింటె
శత్రుఘ్నభూపాలు ♦ సప్తిని గట్టిన ♦ దిట్టను నేనని ♦ తెలియుమింక
నరయ జయంబు దై♦వాధీనమగుఁ గాదె ♦ యనినట్ల క్రియ సేయ ♦ నగునె చెపుమ
బలముగలాఁడెవో ♦ వడయును జయము బ♦లము లేక భూమి నలంకరించుఁ

తే॥ గాన నా బలమును జూడు ♦ కదనమందు, ననుచు నిశితంబు లరిజీవ♦హారములైన
శరముల శరాసనంబున ♦ సంఘటించి, నిండు తెగఁదీసి విడువ నా♦కాండసమితి. ౨౭౩

ఉ॥ గుంపులు గుంపులై చని య♦కుంఠితవేగమునన్ నభంబునన్
బొంపిరివోయి భానుఘృణి ♦ పుంజములన్ నెఱిఁగప్పి తేరులన్
దుంపులొనర్చి కుంతముల ♦ దున్కలుఁ జేసి గజాళిఁ జేరి బల్
చెంపల గోడలన్ దవిలి ♦ జేగురుపూసినయట్లు సేయఁగన్. ౨౭౪

తే॥ దమను పౌరుషమంతయుఁ♦దనరఁ జూచి, పటుశరచ్ఛాయఁ బొడముచీఁ♦కటులఁ జూచి
హస్తపాదంబులను గడ్గి ♦ యాచమించి, పావకాస్త్రంబు విడిచె నా♦భరతసుతుఁడు.

చ॥ అది ప్రళయాగ్నిచాడ్పున మ♦హార్చుల నంబర మెల్లఁ గప్పి త
త్ప్రదరములెల్లఁ ద్రుంచి కల♦భంబుల నా శలభంబులట్లుగాఁ
బడఁగఁ జేసి తేరులను ♦ భస్మమొనర్చి యరాతిసేనలన్
జెదరఁగఁ జేసి బూదిగను ♦ జేసెఁ దురంగములన్ క్షణంబునన్. ౧౨౬

ఆ॥ చంద్రనిభము లగుచుఁ ♦ జంద్రకాంతుల మించు, నెల్లిగముల నెల్ల ♦ దుల్లఁ జేసి
మన్నుమిన్ను దిక్కు ♦ లన్నియుఁ దానయై, పేర్చి సైన్యమంత ♦ నేర్చుచుండ. ౧౨౭

సీ॥ ఒకచోట సెకల కో♦ర్వక పాఱు మణిరత్న♦కనకంబులను మోయు ♦ కలభవితతి
యొకక్రేవ వహ్నిద♦గ్ధకళేబరంబయి సాదులతోఁ గూలు ♦ సప్తిజాల
మొకవంక శుచిశిఖా♦ప్రకరంబు లలమిన ♦ నారోహకులతోడ ♦ నడఁగు రథము
లొకచక్కి మంటల♦కోర్వక పరుఁగిడఁ ♦ గాళ్లు రాకను గాలు ♦ కాల్బలంబు
తే॥ నగుచు సమయించుచున్నట్టి♦యఖిలసేన, నిఖిలశస్త్రాస్త్రవేదియా♦నృపసుతుండు
గని మహాగ్రహుఁడై పెల్లుకలఁగి వింట, వారుణాస్త్రంబు సంధించి ♦ వదలుటయును.

క॥ ఆ వారుణ మనివారణ, మై వాజి రథేభభట స♦మాకులమా సే
నావారము జలధారల, నా వారిదముల విధాన ♦ నలముచు ముంచెన్. ౧౨౯

ఉ॥ తేరులు నీటివెల్లువలఁ ♦ దేలఁ దొడంగెను దొప్పఁ దోఁగుటన్
వారణముల్ స్వశాంత మగ♦సర్పహరుల్ నడవంగలేక యా
పూరములోనఁ గొట్టుకొని ♦ పోవుచునుండె భటావళుల్ కడున్
నీరములో వడంకుచును ♦ నిల్చె నెటో వలిగాలి పెంపునన్. ౧౩౦

ఆ॥ రాలు గురియుచుండె ♦ రాపిడిఁ బడలేక, బలములోనఁ గొంత ♦ పాఱుచుండెఁ
గాలుఁ జేతులాడ♦కయుఁ గొంతనిలుచుండెఁ, బఱగఁ గేక లలమెఁ♦బయలునిండె. ౧౩౧

క॥ అదిగని భారతి రోషా, స్పదుఁడై కనులెఱ్ఱచేసి ♦ వాయవ్యాస్త్రం
బదరుచు నరివోసి తెగన్, వదల నట మహాప్రచండ♦వాతము వొడమెన్. ౧౩౨

క॥ ఆ కరువలితాకునకును, దేఁకువ సెడి కరులు హరులుఁ ♦ దేరులు వడిఁ గొ
ట్టుకపోయి యొకటితో వే,ఱొకటిలడీకొనుచుఁ గూలు♦చుండె మునీంద్రా. ౧౩౩

క॥ ముదరఁగ హరు లంతంతకు, ముదిరపటల మెల్ల మూల♦మూలల దూరెన్
జెదరి శిరోజము లాడఁగ, గుదులుగ బేతాళు లట్లు ♦ కూలిరి భటులున్. ౧౩౪

ఆ॥ వాయుహతినిఁ దనదు ♦ బలము లడంగుట, కల్గి యతఁడు బర్వ♦తాస్త్ర మంప
గాలిఁ జొఱఁగనీక ♦ గ్రావంబు లెన్నియో, వెడలి రిపుల తలలఁ ♦ బడుచునుండె.

క॥ తనబలములు నగముల క్రిం,దను బడి పోవుటకు భరత ♦ తనయుఁడుఁ గిన్కన్
గొని వజ్రాస్త్రము విధి నేర్పునను బ్రయోగించి గిరుల ♦ రూపఱఁ జేసెన్. ౧౩౬

—♦ దమనుఁడు మూర్ఛనొందుట ♦—

తే॥ బాణమంత్రితమైన యా ♦ వజ్రి మప్పు, డతని వక్షస్థలిని మోఁ్రియు♦చరిగి గాఁడ
నంత వివశాత్ముఁడై దమ♦నాభిధుండు, బాధచేఁబడె శరవిద్ధ♦వక్షుఁడగుచు. ౩౮౭

సీ॥ అంతట నయవిదుం♦డైన సారథిబాధఁ, గుందు నా దమనుని ♦ గ్రొసుదూర
మునకుఁ దాఁగొనిపోవఁ♦గని యోధు లతిభీతిఁ, బరుగిడి రదియంతఁ ♦ బతికిఁదెల్ప
రామాజ్ఞను దలంచి♦రణనయ విదుఁడైన, పుష్కలుఁడేరినిఁ ♦ బొలియఁజేయఁ
జాలక జయమొంది♦చనె జయజయశబ్ద,ములతోడ సురదుందు♦భులును మొఱసె
తే॥ సాధువాక్యంబులు సెలంగె♦సకలజనులు, హర్ష మొందిరి యా లక్ష్మ♦ణానుజుండు
సుమతి మొదలగు మంత్రులుఁ♦జూచి యతని, వేవిధంబులఁ♦బొగడిరి విమలచరిత.

వ॥ అని తెల్పి శేషుండు వెండియు వాత్స్యాయనున కిట్లనియె. ౩౮౯

క॥ విను మునివర యా నరపతి, ఘనభీతిని రక్తసిక్త ♦ గాత్రింబరులై
తన భటులు సుతునిచందం,బును దెలుపఁగ దుఃఖవశతఁ♦బొగులుచు ననియెన్.

చ॥ భటవరులార తెల్పుఁడెటు ♦ బట్టెఁదురంగము నా సుతుండుఁ దా
నెటుల మెలంగె నాలమున ♦ కెందరు వచ్చిరి సేనయెంత పి
మ్మటఁ గదనోన్ముఖుం డగుచు ♦ మత్సుతుఁడెట్లు రణంబొనర్చె ను
ద్భటబలుఁడైన వీనిఁగల♦పన్ దగినట్టి బలుం డెవండొకో. ౩౯౧

వ॥ అనుటయు సేవకు లిట్లనిరి. ౩౯౨

ఆ॥ పుడమిరాయ! నీదు ♦ పుత్రుఁడు జన్నంపు, మావుఁజూచి పిదప ♦ మావునుదుటఁ
గట్టినట్టి బిరుదు ♦ పట్టమొక్కటిఁజూచి, యూఁచియూఁచితలమ♦హోగ్రుఁడగుచు.

క॥ సరకుఁగొనక రఘువర్యుని, గరువంపుతనానఁ దానిఁ ♦ గట్టినయంతన్
దురగానుచరుం డనదగు, పరివారముతోడ రాఁగఁ ♦ బ్రిథనోన్ముఖుఁడై. ౩౯౪

తే॥ అతనితోఁబోరి పెనుమూర్ఛ♦నందఁజేసి, జయముఁగొని నీ తనూజుఁడు♦సంతసమునఁ
జొక్కుచుండఁగ నంతలో శూరుఁడైన, భరతపుత్రుఁడు చనుదెంచె ♦బవరమునకు.

ఉ॥ అప్పుడు గొప్పయుద్ధము మ♦హాస్త్ర పరంపరఁ గల్గె నందునన్
జెప్పెడిదేమి నీ కొడుకు ♦ చెందుచునుండె జయంబుఁగాని యొ
క్కప్పుడుఁ బుష్కలుండు భిదు♦రాస్త్రము వైవఁగ దానిచేతఁ దా
నొప్పఱి మూర్ఛఁజెందెను ర♦ణోర్విఁదొలంగఁగఁ జేసె యాతయున్. ౩౯౬

క॥ భటు లిటు లనుటయు నత్యు,త్కటశోకామర్షములను ♦ గలఁగి నృపుం డు
ద్భటుఁడై మెఱసెను బర్వపు, తటినీనాయకుఁడువోలె ♦ స్థగితాంగుండై. ౩౯౭

వ॥ ఇట్లుండి సేనానాయకుం గాంచి యిట్లనియె. ౩౯౮

—♦ సుబాహుండు సకలసైన్యంబుతో కదనంబున కరుదెంచుట ♦—

శా॥ సేనానీ! మన సేన యుద్ధమునకున్ ♦ సిద్ధంబు సేయింపుమా
సూనుంగొట్టిన క్రూరునిం గెడపి నా♦సూడిప్డు తీర్తుం జుమా
యీ నాగాసుర వైరివచ్చినను డా♦యన్ నేను వీడంజుమా
నానాస్త్రంబుల నుగ్గుసేతు రిపులన్ ♦ నా శౌర్యముం జూడుమా. ౨౯౯

వ॥ అనుటయుఁ జమూనాయకుండు సత్వరంబునఁ గాలబలపరిఖ్యాంబును హతదుర్జన కోటియు నగు చతురంగబలం బాయత్తంబు సేసి తానును సజ్జుండై యెఱింగింప నా సుబాహు భూపాలుండు గనకమయ రథారూఢుండై గదాయుద్ధ విశారదుండగు సుకేతుం డను సోదరుండును సకలయుద్ధ విచక్షణుండగు చిత్రాంగుండను కుమారుండును విచిత్రరణవిశారదుండగు విచిత్రుండను తదనుజుండును మఱియు సకలశస్త్రాస్త్రకోవిదులును మహాధనుర్ధరులగు శూరులు తమ తమ రథంబు లెక్కి యసంఖ్యాంబగు చతురంగబలంబులతోఁ దన వెంటఁ జనుదేరఁ దత్పదన్యాసంబునఁ బుడమి గ్రక్కదల మహాటోపంబున బయలుదేరఁ దత్సేనాకలకలం బాకర్ణించి శత్రుఘ్న బలం బాయోధనోన్ముఖంబై నడచె నప్పుడు సుబాహుండు సమరాంగణ సమీపంబున శరపీడితుండై రథంబునఁ జేష్టలు దక్కి మూర్ఛ మునింగియున్న దమనుం గని దుఃఖితుం డగుచుఁ బల్లవంబుల వీఁచుచుం దన కోమలహస్తంబున నీటిచే నతని గాత్రంబు మెల్లన నిముడుచుండఁ గొంతవడికిఁ దెలివొంది మెల్లనఁ గండ్లు విచ్చి చూచి దిగ్గున లేచి. ౩౦౦

మ॥ అరరే నా ధను వెక్కడెక్కడ కనుం ♦ డా పుష్కలుండెందు డా
గె రణంబందున మత్శరాహతుఁచే ♦ గీడ్పాటుఁదాఁ జెందెనే
పరసేనల్ గనరా వవేవి యను నా ♦ వాక్యంబు లాలించి యా
ధరణీశుండుఁ గవుఁగిలించెను బ్రమో♦దస్వాంతుఁడై పుత్త్రకున్. ౩౦౧

॥ క్షతదేహుండగు దమనుం, డతిభక్తిని నిజజనకప♦దాంబుజముల కా
నతకంధరుఁడై మ్రొక్కినఁ, బతి కుతుకముఁ బొందుచు దల♦వాయిం బలికెన్.

॥ నీనేర్పు పెంపున ♦ నిఖిలారులకు నభే♦ద్యంబయి మనయభి♦యాతివితతిఁ
బోఁగొనుటకు మంచి ♦ వెరవగు క్రౌంచ మ♦నం దగువ్యూహంబొ♦నర్పుమనఁగ
నతఁడట్ల విరచించి ♦ యగ్రంబున సుకేతుఁ ♦ డుండునట్లుగఁ జేసి యుభయపార్శ్వ
ములయందు రాజపు♦త్రుల నుండ నియమించి ♦ చిత్రాంగునిం గంఠసీమ నిల్పి,
॥ పుచ్ఛమందున సుభుజభూ♦భుజుని జేర్చి, నడుమఁ జతురంగబలముకు విడిదిఁ జేసి
యిట్లు సజ్జంబొనర్చుట ♦ నినుఁడుఁ గాంచి, మించియుద్ధంబునకు నుద్య♦మించెనపుడు

— శత్రుఘ్నుండు సుబాహు వృత్తాంతంబు సుమతి నడుగుట —

తే॥ వాగ్విచారజ్ఞులౌ బుధవరులగోష్ఠి, నెఱపు శత్రుఘ్నుఁ డతి భయంకరముగాఁగ
గారుమబ్బులకరణిని గ్రమ్మివచ్చు, బలములఁ గని సుమతితోఁ బలికె నిట్లు.

మ॥ సుమతీ! నేఁడు తురంగ మే పురమునన్ జొచ్చెన్ సరిద్రాష్ట్రరం
గములట్టుల్ గడు మ్రోయుచుం దరలి వీఁకన్ యుద్ధ సన్నద్ధతన్
గుములై వచ్చెడిసేన లెవ్వరివి నాకుం దెల్పుమా తెల్పినన్
సమరోత్సాహకులైన మద్భటుల కాజ్ఞాపించెదన్ బోరికిన్. ౩౦౪

వ॥ ఇట్లు మిత్రతాపననిపుణుం డగు శత్రుఘ్నుండు నుడువ విని సుమతి యగు సుమతి
యిట్లనియె. ౩౦౫

సీ॥ వినుమయ్య శత్రుఘ్న వివరింతుఁ జక్రాంక, యను పేరఁ దనరెడి యనుపమాన
పురమిదియ సమీపమున నున్న దిందున్న, జనులు మాధవకథాసక్తమతులు
దురితవిదూరు లీ పురి నేలువాఁడు సు, బాహుభూపాలుండు పరమధర్మ
విదుఁ డన్యసుందరీ విరతుఁ డాత్మీయదా, రాభిరతుఁ డచ్యుతార్చనాప్ర
తే॥ సక్తచిత్తుం డనన్యవిచారుఁ డెపుఁడు విష్ణుభావంబుచే భక్తి విప్రవరుల
శ్రీలఁ దన్పెడి మేటి గోనాలపేట, యసమశూరుఁడతండు దయాకరుండు.

క॥ అరిఁ గొను పష్ఠాంశమునే, పఱిఁగొను దుష్టులను సుతుల వడువునఁ బ్రజలన్
నెఱిఁగొని పోచును విద్యల, నెఱుఁగును బూజ్యులను గనిన నెఱఁగు మహీశా!

ఆ॥ సుతపరాభవంబుఁ జూచి సహింపక, సుతులతోడఁ బౌత్రవితతితోడ
వచ్చుచున్నవాఁడు బవరాన కమితవహా, బలముతోడ నస్త్రబలముతోడ.

క॥ మనదెస లక్ష్మీనిధిముఖ, మనుజేశులు గలరు శూరమాన్యులు వీరిన్
బనుపుము పోరాటంబున, కను నుడులకు శత్రుహంత యనియె భటులతోన్. ౩౧౦

మ॥ జతనం బొప్ప సుబాహుసైనికులు క్రౌంచవ్యూహముం బన్ని నా
రు తగన్ బక్షముఖాదులం గలరు వీరు ల్వారి భేదించు నా
యతశౌర్యుం డిట నెవ్వఁడట్టి ఘనబాహాశక్తిచే మించు వాఁ
డెవ్వఁడో వాఁడు గ్రహించుగాక యిదిగో నే నిచ్చు తాంబూలమున్. ౩౧౧

వ॥ అనిన విని మహావీరుండును నఖిలశస్త్రాస్త్రవిద్వీరపరివృతుండు నగు లక్ష్మీనిధి
యిట్లనియె. ౩౧౨

శా॥ సౌమిత్రీ! విను భార్గవుండు మును క్రౌంచం బెట్లు భేదించెనో
యా మాడ్కిం బొనరింతు నేఁడిది నిజం బంచేఁగి యా వీటకం
బామోదంబున వంద నీతనికి సాహాయ్యంబుఁ బోగల్గువాఁ
డే మాన్యుం డనఁ బుష్కలుండు వతుఁడై యే నంచు లేచె న్మతిన్. ౩౧౩

క॥ అంతట రిపుతాపుండు స,నంత బలులు నీలరత్న ♦ నరపతి ముఖ్యుల్
స్వాంతమున బొంగు చాలవ, గొంతకు ననుమతినిఁ బడసి ♦ రరుగుట కనఘా. ౩౧౪

ఆ॥ శత్రుసూదనుండు ♦ సర్వాయుధంబులుఁ, దాల్చి రథము నెక్కి ♦ ధాత్రిఁ కదలఁ
జాతురంగబలము ♦ చను దేరఁ దన వెంటఁ, దరలె వారి వెన్కఁ ♦ దపసిరాయ. ౩౧౫

వ॥ ఇట్లుభయసేనలుఁ దలకొనునపుడు మహాప్రళయంబునఁ దరంగపరంపరలచే జగం
బుల ముంచి విలయంబొనర్ప నుద్యమించు రెండు సముద్రంబుల వడువునఁ
జూపఱులకుం గనుపట్టుచుండె నట్టియెడ. ౩౧౬

శా॥ ఢంకాఢాంకృతు లశ్వహేషలు ధను♦ష్టంకారముల్ దంతిరా
ఘీంకారంబులు హేతిఘట్టనభవ♦ త్క్రేంకారముల్ భేరికా
భాంకారంబులు ఘోరశంఖభవబఁ♦ భారావముల్ శూర రా
ఘ్యాంకారంబులు రెండు సైన్యముల నో♦జః మ్రోసె మిన్నంటుచున్. ౩౧౭

తే॥ సుభుజబలదర్పితాశేష♦శూరు లచట, నరులఁ బొడువుఁడుఁ జీల్చుఁడు♦నఱకుఁడనెడు
నుడులుఁగడుఁ బెడఁగై వినఁ♦బడుచునుండెఁ,బుష్కలాదుల కెదసూడుఁ♦బొదలుచుండె.

—♦ సుకేతు లక్ష్మీనిధుల యుద్ధము ♦—

వ॥ అప్పుడు వ్యూహాముఖంబున నున్న సుకేతుంజూచి పరితాపనిధి యగు లక్ష్మీనిధి
యిట్లనియె. ౩౧౯

ఉ॥ ఏను విదేహసూనుఁడ న♦హీనపరాక్రమశోభితుండ ల
క్ష్మీనిధినామధేయుఁడ న♦శేషకళాఢ్యుఁడ నం చెఱుంగుమా
దానవహారియా ఖలవి♦దారుని రాముని వారువంబు నూ
దాని నొసంగు మిప్పు డటు ♦ తక్కిన నంతకుఁజూడ నంపెదన్. ౩౨౦

క॥ ఆ నుడువులఁ జెవిఁబెట్టక, పూని ధనువు, దాని సజ్య♦ముగ నొనరిచి జాం
బూనదమయపుంఖశితా, న్యూన శరము లేసె సుభుజ♦సోదరుఁ డవియున్

తే॥ గగన భూమధ్యదేశంబుఁ గప్పి యెచట, సందు లేకుండనుండ దు♦స్సహములగుచుఁ
గాంచి లక్ష్మీనిధియును ద♦త్కాండములను, దిపిరి తన శరములఁగొట్టి తెఱపిచేసె.

చ॥ అతిశితపర్వశోభిత ఖ♦రాంబక షట్కము నేయఁగా నదిక్
క్షితిపతి భాత్రువక్షమును ♦ జీల్చుచు వీపును దూఁటిపోయి శో
ణితమునఁదోఁగి క్రిందఁబడ ♦ నిశ్చలుఁడై యతఁ డాగ్రహించి విం
శతిశితమార్గణంబులను ♦ జానకివక్షము గ్రుచ్చెఁదూంట్లుగాన్. ౩౨౧

ఉ॥ ఇద్దరు బాణభిన్నతను ♦ లిద్దరు రక్తపరిప్లుతాంగులే
యద్దిర కుండలీకృత శ♦రాసను లిద్దరు వాసవాజ్ఞచే
దద్దయుఁ జేరి మబ్బుల వి♦ధంబున మార్గణధారలన్ సదా
యిద్దరు వృష్టి ముంచు ఘను ♦ లిద్దరుఁ బుష్పితకింశుకాభులే. 3౨౪

వ॥ ఇట్లు సుకేతు లక్ష్మీనిధు లిర్వురుం దరకసంబులనుండి శరంబులఁ దిగుచుటయుఁ గొనయంబునం జేర్చుటయు విడుచుటయు నేరికిం గానరాకుండఁ దమ తమ కరకౌశలంబు లేర్పడఁ బోరుచుండఁ దద్బాణంబులచేఁ దలలు తెగి కాలు ద్విరదంబులును బరులు దెగిపడు హరులును శకలంబులై వికలంబులగు రథంబులును దెగి క్రిందఁ బడియును రోషంబున నోఁడులు గఱచుచుండు కిరీట కుండలాలంకృతంబులగు భటుల శిరంబులును గల్గి భూచరులకు దురవగాహంబై ఖేచరుల కద్భుతావహంబై పిశాచముల కానందదాయకంబై రణాంగణం బొప్పియుండె నప్పుడు.

సీ॥ అరిమర్దనుఁడు వీరుఁ♦డైన లక్ష్మీనిధి, జ్యాలత శితశరా♦ష్టకముఁ జేర్చి
మావుల నాల్గింట ♦ మడియంగఁజేసి య,త్యున్నతంబగు ధ్వజ♦ మొకటఁ గూల్చి
నగుచుఁ జాపంబుఁ దు♦న్కలుఁజేసి యొక్కట, మించి సారథి తల♦ద్రుంచియొకట
నది గనుంగొని వీరు ♦ లాశ్చర్యమొంద నొ,క్కట సుకేతుని రొమ్ము♦గాఁడనేయ
తే॥ హతరథుండును హతయంత ♦ హతహయుండు,నై మహాగదనాతండు♦హస్తమందు
దాల్చి వచ్చుటకు విదేహ ♦ తనయుఁ దల్గి, బెగ్గడిల వైరు లరదంబు♦డిగ్గనుఱికి.

క॥ సకలాయసనిర్మితమున్, సకల రుచిపురస్కృతము ర♦జత చిత్రిత పా
వక వజ్రతుల్యగదచేఁ, బ్రకటబలుం డగు సుకేతు ♦ వక్షము నేసెన్. 3౨౭

ఆ॥ ఆ ప్రహారమతని ♦ కర్భకుఁడుఁ బ్రసూన,దామమునను మత్త ♦ దంతిఁగొట్ట
నట్టుఁగాగ నవ్వ♦చా సుకేతుఁడు నృపుఁ,బల్కె ఘన గభీర♦భాషణముల. 3౨౮

ఆ॥ ఏను నీబలంబు ♦ నెఱిఁగితి దీనిచే, నాబలంబుఁ జూడు ♦ నరవరేణ్య
శూరవరుఁడవైన♦చో గదాహతికిని, నిలుమటంచుఁ గొట్టె నిటలమందు. 3౨౯

వ॥ అంత లక్ష్మీనిధియును. 33౦

మ॥ లపనాగ్రంబుననుండి వెల్లువగఁ గీ♦లాలంబుఁ గ్రమ్మన్ గడున్
గుపితుండై తన కాలరూపగదఁజే♦కొంచేగి తన్మూర్ధమున్
జపలంబొందఁగ నేయ నాతఁడుఁ గుర్రిథన్ ♦ స్కంధంబునేసె న్గదన్
నృపు లిద్ద ర్జయకాంక్ష నిట్టు కదనో♦ర్విం బోరి రత్యుగ్రులై. 33౧

ఉ॥ ఈవిధ మొప్పఁబోరుచు జ♦య్యైషులు సర్వరణంబులందున
న్గోవిదులు స్పరస్పర మ♦నూనపరాక్రముల్ సుశోణిత

స్రావిగదాశయుల్ రుధిర ♦ సంప్లుత సర్వమలీమసాంగులై
వావిరి నొక్కచందమున ♦ భండనమందునఁ బొల్చి రెంతయున్. ౩౩౪

తే॥ అపుడు లక్ష్మీనిధి మహోగ్ర♦హమున గదను,గొని సుకేతునిఁ బ్రహరింప♦జనుచునుండ
నతఁడు తన గదతో నెదు♦రరుగుదెంచు, నంతలో వైచె గద వి దే♦హాత్మజుండు.

క॥ అది యొడిసిపట్టి యాతం, డదియే వక్షమున వైచె నటమటి నాతం
డది తప్పించుక నేర్పునఁ, బొదలుచు భుజయుద్ధమునకుఁ ♦ బూనె మునీంద్రా.

పంచచామరము॥ నృపోద్యమంబుఁజూచి గహ్వ♦రీధవానుజుండుఁ గ్రో
ధపూరితాత్ముఁడౌచుఁబోయి ♦ తద్దయుం భుజంబులన్
ద్విపంబుతో ద్విపంబుఁబోరు ♦ తీరున న్వెనంగఁ నా
నృపాలుఁ డట్లు పోరుచుండె ♦ నిశ్చలత్వమొప్పఁగన్. ౩౩౫

వ॥ ఇట్లు పోరుచుండ. ౩౩౬

క॥ పిడికిట లక్ష్మీనిధి తనుఁ, బొడువఁగ రొమ్మునను గనలి ♦ భూపత్యనుజుం
డుడుగక తలఁ దన బలిమిన్, బిడికిటఁ బొడిచెను నతండు♦ బిమ్మటఁబోవన్. ౩౩౭

వ॥ ఇట్టిరువు రవష్టంభ పరాక్రమ విజృంభమాణులై విక్రమించి పెల్లురేఁగి యొకరి నొకరు సరకుఁగొనక మల్లఁజఱచి యాోఁడులుఁ గొఱుకుకొనుచు రెండు బెబ్బులుల చందంబున రెండు సింగంబుల విధమున రెండేనుఁగుల చాడ్పునఁ బెనంగుచు వజ్రసీకాశంబులగు పిడికిండ్లఁబొడుచుకొనుచు దారుణంబులగు తల స్పర్శనంబులఁ జఱచుకొనుచుఁ జపేటంబులఁ గలంచుచుఁ గాలఁదాఁచుచు శ్రమంబులఁ జూచు ముష్టాముష్టి దంతాదంతి నఖానఖిఁ గచాకచిం దుములంబుగఁ బోరుచుండు నప్పుడు. ౩౩౮

క॥ తఱిఁగని సుకేతుఁడా నృపు, చరణంబులు వట్టి తిగిచి ♦ చయ్యన బలిమిన్
గిరగిరఁద్రిప్పుచు జనుల, చ్చెరువొందగ విసరివైచెఁ క్షితిఁగుతిలపడన్. ౩౩౯

ఆ॥ కెరలి యట్ల యా సు♦కేతునిపదములు, జనకసుతుఁడు సురలు♦జయయనంగఁ
బట్టి పడఁగద్రొబ్బెఁ బది పది మారులుఁ, ద్రిప్పి త్రిప్పి దంతి♦పృష్ఠమునను. ౩౩౦

ఆ॥ అతఁడు పుడమిఁగూలి♦యంతలోఁ దెలివొంది, యటుల జనకసుతుని♦యంజలొడిసి
పట్టి త్రిప్పి త్రిప్పి ♦ వైచె నాకసమునఁ, జూచు సురలు భీతి ♦ నుడివడంగ. ౩౪౧

చ॥ కొదుకక కొంత సేపిటుల ♦ గోలుమసంగి పరస్పరంబు వా
ర్పదము పదంబున న్మఱియుఁ ♦ బాణిని బాణిని మోము మోమునన్
హృదిహృదిఁజేర్చి పెన్గొని వ♦ధేచ్ఛుల నిద్దరు పోరి పోరిలో
ముదమరి నేలఁగూలి పెను ♦ మూర్ఛ మునింగిరి మానిచంద్రమా. ౩౪౨

క॥ ధన్యుఁడు లక్ష్మీనిధి బల్, ధన్యుఁడు రాజానుజుండు ♦ ధరలోఁ గన నెం
దన్యులు వీరికి నృపమూ, ర్ధన్యులు సములే యటంచుఁ ♦ దలచిరి యోధుల్. 383

వ॥ అంత, 384

సీ॥ క్రౌంచకంఠస్థుఁడై ♦ క్రాలు చిత్రాంగుండు, సకలాస్త్రములఁదాల్చి స్యందనంబ
ధిష్ఠించి కోలమ♦ధ్భిసిబోలెఁ దత్సైన్య, మునుజొచ్చి మేఘగ♦ర్జనముమాడ్కి
శింజిని మ్రోయించి ♦ శితబాణకోటులఁ బఱపుచు సకిరీట ♦ భటశిరంబు
లెన్నియో కూల్చుచు ♦ నెదురులేని పరాక్రము, క్రమంబునఁబొల్చు♦మనుజవిభుని
తే॥ పుత్రునీక్షించి రోషించి♦ పుష్కలుండు, మణివిచిత్రిత మరికోటి ♦ మథనదక్ష
మైనచాపంబు మ్రోయించు♦చరిగి యతని, కభిముఖుండయినిల్చెన♦య్యవసరమున.

క॥ మును తారక యుద్ధంబున, ఘన బాహాబలులు శక్తి♦కర తారకులే
యనువునఁ దోఁచిరొ యిపుడా, యనువునఁ గనుపట్టి రిద్ద ♦ రఖిలజనులకున్. 386

క॥ కరముల రెంటను శరములఁ, బరగించెడి నేర్పుకల్గు ♦ భరతసుతుఁడు స
త్వరముగఁ జిత్రాంగుని శిత, శరముల గిరి నంబుదంబు ♦ చాడ్పున ముంచెన్. 387

ఆ॥ అందు కాగ్రహంబు ♦ నంది చిత్రాంగుండు, చాపమునకు నారి ♦ సంఘటించి
తెలిపిలేకయుండఁ ♦ దీక్ష్ణశరంబులఁ, గరములాడకుండఁ ♦ గప్పె నతని. 388

ఆ॥ తివిరి శరధినుండి ♦ తిగుచుటఁగోల నా, కోలఁగార్ముకమునఁ ♦ గూర్చుటయును
దాని విడుచుటయును ♦ గానరాకుండఁగ ♦ నుక్కుమిగిలిపోరి♦రొక్క మొగిని. 389

తే॥ కుండలీకృతచాపులు♦ద్దండమూర్తు, లిద్దరును వారిసేనల ♦ నుద్దవిడినిఁ
బడుభటాళులఁ దక్క క♦న్పడ దిఁకేమి, చాగురే వారిహస్తకౌ♦శలమదేమొ.

సీ॥ అప్పుడు పుష్కలుం ♦ డతికృద్ధుఁడై బాణ ♦ శతముల విపుల వ♦క్షంబు గురిగ
నేయఁగఁ జిత్రాంగుఁ♦డెలమి నా ముల్కుల క్షణములోఁ దిల లంత♦శకలములుగ
ఖండించి పుష్కలాం♦గంబులఁజొఱ శాత, సాయకంబులను బె♦ల్లేయుచుండ
భారతి కోపించి ♦ భ్రామకాస్త్రంబేయ, నాతఁడు రథముతో ♦ నభ్రమందు
తే॥ సుడిని యవసంబు కడుఁదిరి♦గెడు విధానమునుండె గిరగిరఁదిరుగుచు♦నొకముహూర్త
మద్భుతంబయ్యె నందఱ ♦ కది యతండు, స్వస్థతను జెందఁగల్గెఁ గ♦ష్టమున భువిని.

ఉ॥ సంగరశూరుఁ బుష్కలుని ♦ శస్త్రవిదుత్తముఁ డాఢ్యుడైన చి
త్రాంగుఁడుఁజూచి కోపవివ♦శాంగుఁడునై యిటుపల్కె నిప్పుడీ
సంగరమందు శూరులు మ♦జాయన మద్రథ మంబరంబునన్
బొంగరమట్లు త్రిప్పితివి ♦ పో నిను మెచ్చఁగవచ్చుఁ బుష్కలా. 391

ఆ॥ ఇంచుకంత నిల్చి ♦ యీక్షింపు మస్పత్ప, రాక్రియంబుఁగూడ ♦ నాకచరుల
పూజలం గ్రహించి ♦ పుష్కరచారివై, యుండఁగలవు సుమ్ము ♦ నిండుభీతి.

క॥ మనుజాధిపతనయుం డి,ట్లనుచుఁ బఱపఁ బరమ దారు♦ణాస్త్రంబులు నా
ఘనశస్త్రగ్రథితుండై, ఘనపథమున నతఁడుఁ దిరిగెఁ ♦ గడుఁ బక్షిక్రియన్. ౩౫౪

క॥ సరథుఁడు సహాయుఁడు సధ్వజుఁ డరుదుగను ససారథియును♦నై భారతితో
బిఱబిఱ గిరగిరఁ దిరుగుచు, స్థిరతను గను తఱి మఱొక్క♦ చిల్కును విడిచెన్. ౩౫౫

తే॥ మఱలనట్లనెయాతఁడుఁ ♦ దిరుగుచుండె,భూపుఁడాత్మజు పని కెదఁ♦బొంగుచుండె
సుభుజసేనలఁ గేకలు ♦ నభమునిండె, నంతఁబుష్కలుఁడని స్థిరుం♦డగుచునుండె.

వ॥ ఇట్టు పుష్కలుం డెట్టకేలకు స్వస్థతంజెంది సునిశితాంబకంబుల సూతాశ్వధ్వజంబులతోఁ జిత్రాంగుని శతాంగంబు నుఱుముఁజేసె నాతండు మఱల మఱొక్క రథం బాయత్తంబుఁ జేసిరా నదియుం బొడిసేసె వేఱొక్క స్యందనంబుతో నరుగ దానిం దుత్తుమురు సేసె, నిట్లు పదియరదంబులు నుగ్గుసేయ నా చిత్రాంగుండు రత్నచిత్రితంబును దృఢాంగంబును నగు శతాంగం బధిష్ఠించి వచ్చి సత్వరంబున. ౩౫౬

ఉ॥ భారతివక్షమందుఁ గడు ♦ వాఁడిశరంబులు గాఁడనేయ దు
ర్వార క్రుధంబుచే నతఁడు ♦ బంచినకోలలు వాని రొమ్మునన్
దూరుచుఁ దాఁవిశోణితము ♦ దూఁటుచు వీపు నధస్థలంబునన్
జేరెను గూటసాక్ష్యములు ♦ సెప్పెడి దుష్టుల పూర్వులట్టులన్. ౩౫౭

తే॥ అపుడు జిత్రాంగుఁడతి క్రుద్ధుఁ♦డగుచు బాణ, పంచకంబునఁబుష్కలు♦ఫాలమదర
నేయ నందుల కతఁ డాగ్ర♦హించి యొక్క, శితపృషత్కముధనువునఁ ♦జేర్చిపలికె.

చ॥ తెగలుగఁ బుచ్చనేల రణ♦ధీర ! శరంబులఁ దద్వృథాశ్రమం
బగు శపథంబొనర్తు విని ♦ యంతటఁ బోరున కుద్యమింపు మా
శుగమిదె దీన నీశిరము ♦ క్షోణినిఁ గూల్పకపోతినే న్సతిన్
సుగుణవతిన్ వృథా విడుచు ♦ శుంఠకునౌ నరకంబు నాకగున్. ౩౬౦

వ॥ ఇట్లు పుష్కలుండు పలుక విని మతిమంతుండగు చిత్రాంగుం డిట్లనియె. ౩౬౧

ఉ॥ ఈ నిఖిల ప్రపంచమున ♦ నెక్కడఁ జూచినఁ బుట్టినట్టి యీ
ప్రాణులకెప్డు మృత్యువు ని♦రంబగుట న్మదిఁ జచ్చిపోదు నం
చేను భయంపడన్ భవదు♦దీరితమా శపథంబు సత్యమే
మానుగ నౌనుగాక విను♦మత్సముదీరిత వాక్య మొక్కటిన్. ౩౬౨

సీ॥ నావధకై వచ్చు ♦ నీవిశిఖము మధ్య, మందున ఖండింప ♦ నైతినేని
నిఖిలవీరాభిమా♦నిని నగు నేఁ జేయు, పరమప్రతిజ్ఞను ♦ బరఁగ వినుము
తీర్థయాత్రలకేఁగఁ ♦ దివురుపుణ్యులబుద్ధి,ని మఱల్చిపోకుండ ♦ నిల్పువాఁడు
వసుధ నేకాదశీ ♦ వ్రతము కన్నను మిన్న,యగు వ్రతంబులు కల♦వనెడువాఁడు
తే॥ పొందు పాపంబు ననువచ్చి♦పొందుగాక, యనుచు నతఁడూరకుండెఁ జే♦ధనువుపట్టి
యంతధనువునఁ జేర్చి శి♦తాంబకంబు,ననిమెఁ బుష్కలుఁ డా రాజ♦తనయుఁజూచి

ఉ॥ రాముని పద్ద్వయం బెదఁది♦రంబుగ నిష్కపటత్వబుద్ధిచే
నేమమునన్ భజింపఁగను ♦ నేర్చితినేని స్వభార్యఁ దక్క నే
భామలనైనఁ దల్లులుగ ♦ స్వాంతమునందుఁ దలంతునేని యి
ష్టా మహనీయ సత్యమున ♦ నయ్యెడు మద్వచనంబు సత్యమే. ౩౬౪

క॥ ఈలాగుఁబలికి భారతి, కాలానలతుల్యమైన ♦ కాండము విడఁగా
నాలోన రాజసుతుఁ డా,భీలంబగు బాణమొండు ♦ విడిచె మునీంద్రా. ౩౬౫

ఆ॥ భూపసుతునిశరము ♦ పుష్కలుశరమును, సరిగఁజేసె రెండు ♦ శకలములుగ
నంత నుభయసేన ♦ లందు హాహారావ, ములు చెలంగె మిన్ను♦ముట్టనపుడు.

ఆ॥ పడియె భూతలమున ♦ బాణపరార్ధంబు, పుణ్యసహితమగుచుఁ ♦ బూర్వఖండ
మరిగి తమ్మితూఁడు ♦ తెఱఁగునఁ జిత్రాంగు, కంధరంబు వేగఁ♦గత్తిరించె. ౩౬౬

మ॥ సకిరీటంబు సకుండలంబగుచు శీ♦ర్షంబొప్పె నీ ధాత్రిఁ దా
రకనాథుండు పగల్ వెలుంగునటు వీ♦రవ్రాత మార్తి న్వికా
వికలై పాఱెరి పుష్కలుండును మహా ♦ వీరాఢ్యమహా వ్యూహమం
దు కడంకన్ జొత్తె స్వారిభీకర మహా ♦ దోర్వీర్యముం జూపుచున్. ౩౬౭

—♦ సుబాహుండు పుత్రుం గాంచి విలపించుట ♦—

వ॥ తదనంతరంబున సుబాహుం డరుదెంచి చంద్రబింబంబుమాడ్కి మనోహరంబును గుండల శోభితంబును బుష్కలేషు క్షతస్రవద్రక్తంబును నగు పుత్రుని మొగంబు గాంచి కంపమాన హృదయుండై కన్నీరుఁ గార్చుచు శిరస్తాడనంబుఁ జేసికొనుచు సందష్టాధర పల్లవంబును గుటిల భ్రూయుగయుతంబును నగు తన్మస్తకంబు ముద్దుఁగొనుచు దుఃఖభారంబున నోడ లెఱుంగక క్రిందఁబడి దొరలుచు లేచుచు గూర్చొనుచు నిట్లు విలపించె. ౩౬౮

ఉ॥ హా రణశూర ధీరవర ♦ హా తనయా సుకుమారగాత్ర యీ
తీరున ధూళిధూసరిత ♦ దేహుఁడవై పడియుండి యెంత నేఁ
జీరినఁ బల్కవేమి సర♦సీజములన్ హసియించుఁ గన్నులన్
గూరిమిఁ జూడవేమి నను ♦ కోపమ నాయెడ,నాదు పాపమా. ౩౭౦

క. మధురాలాపంబుల బహు, విధముల నలరింపుచుందు ♦ వే మున్నిట్టా
విధమున స్మేరాస్యుఁడవై, కథలను నలరింప వేమి ♦ కారణము? సుతా. ౩౨౧

తే॥ శుభ్రవర్ణంబు చామర ♦ శోభితంబు, భర్మమయపత్రరాజిత ♦ ఫాలయుతము
నైన శత్రుఘ్నుయజ్ఞాశ్వ ♦ మదిగొ దానిఁ, గొనుముతడయక నిద్ర మేల్కొనుము పుత్ర!

మ॥ అడుగో చూడు ప్రతాపవంతుఁడు బ్రతా ♦ పాగ్ర్యాచలానాథుఁ డ
ల్లడుగో శాత్రవహంత పుష్కలుఁడు వ్యూ ♦ హం బల్లకల్లోల మొ
క్కఁడ సేయంగఁ దొడంగె వీని శరవే ♦ గం బాపఁగారాదె నే
ర్పడగన్ నీ శరపఙ్క్తి నిట్టి తఱి న ♦ ర్థంబే యుపేక్షింపగన్. ౩౨౩

క॥ చతురంగబలంబు భయా, న్వితమై రక్షకుఁడవైనఁ ♦ నినుఁజేరెడుఁ జూ
చితివే యా శత్రుఘ్నుని, శితశరముల కీవు లేక ♦ చిక్కులువడనే. ౩౨౪

తే॥ ఇప్డు కాపాడఁదగు దక్షుఁ ♦ డెవఁడు నన్ను? నీవు కాకున్న వైళంబ ♦ నిద్రవీడి
నిల్వఁబడి తేని పుత్రక ♦ నిక్కమముగ, జయరమావాప్తి కింక నే ♦ క్షముఁడఁగానె?

సీ॥ ఉర్వీశుఁ డీ రీతి ♦ నొడలెఱుంగక పుత్ర ♦ వాత్సల్యమునఁ బెల్లు ♦ పనవి పనవి
యేడ్చుచుఁ గరముల ♦ హృదయంబు భేదించు ♦ కొనుచుండ నపుడు ద ♦ మనవిచిత్ర
లరదంబులెక్కి యు ♦ ద్ధరుఁ దండ్రిపదముల ♦ కెఱఁగి యిట్లని రను ♦ వెఱఁగి జనక!
బ్రతికియుండఁగ మేము ♦ బహువిధంబుల నిట్లు ♦ విలపించు టేలనో ♦ తెలుపుమయ్య
తే॥ నీ సుతుండొందె మరణం బ ♦ నీకమందు, నిట్టి మృతిఁగోరెదరు కాదె ♦ యెల్లశూరు
లితఁడు ధన్యుఁడు గీర్తివ ♦ హించె నంప, శయ్యఁబన్నుండె యుద్ధభూ ♦ స్థలినిఁజూడు.

క॥ అదరును బెదరును నెఱుఁగక, సదమదమును జేసి రిపుల ♦ సందష్టరద
చ్ఛదుఁడును సకిరీటుండయి, పొదలుచు నున్నాఁడు వీనిఁ ♦ బోలుదురె యొరుల్.
వ॥ అని పలికి మఱియు నిట్లనిరి. ౩౨౮

సీ॥ తండ్రి మే మొనరింపఁ ♦ దగినకార్య మదేదొ, తెల్పుఁడు మీకోర్కెఁ ♦ దేటపడఁగ
నా యనాయకలవ ♦ ణాంతకసైన్యంబు, నంతయుఁ దునిమెద ♦ మనఘ యిపుడ
యనుజుఁజంపిన పుష్క ♦ లుని గిరీటలసచ్ఛి,రంబును ద్రెంచి ర ♦ థంబు నుండి
పడఁద్రోయఁగలమిట్లు ♦ పరితపింపఁగ నేల, నిసుమంత యనుమతి ♦ నీయుమనిన
తే॥ వీరమాన్యులునైన కు ♦ మారవరుల, నుడుల కెడలోని దుఃఖంబు ♦ విడిచి నృపుఁడు
ప్రథనదుర్మదులైనట్టి ♦ వారితోడఁ, గనకచిత్రితరథ మెక్కి ♦ కదలెనంత. ౩౮౦

క॥ రిపుతాపుండగు దమనుఁడు, రిపుతాపుని, నీలరత్న ♦ పృథ్వీశుని ద్వి
ట్తపనుఁడు విచిత్రుఁ డెదురై, గిరి పయోదములట్లు లోహ ♦ రిన్ వానతఱిన్. ౩౮౦

వ॥ మహాబలుండగు సుబాహు భూపాలుండును జాపధరుండై ధనుర్విద్యావిశారదు

లగు వీరశిరోమణుల లెక్కఁగొనక శూరకోటిసేవితుం డగు శత్రుఘ్ను నెదు
ర్కొనె నప్పుడు. ౩౮౧

మ॥ ప్రతిఘూపూరితుఁ డాత్మసైన్యహనన ♦ వ్యాపారహేతుండు స
త్సుతనాశంకరుఁడౌ సుబాహునృపు సం♦స్ఫోటోద్యమం బెల్ల మా
రుతి వీక్షించి వలాహకం బుఋము తీ♦రున్ బెల్లు గర్జింపుచున్
బతి శత్రుఘ్నున కడ్డమై నిలచె దీ♦వ్యత్కాలరుద్రుండునాన్. ౩౮౨

—♦ హనుమంతునిచే సుబాహుండు మూర్ఛనొందుట ♦—

క॥ ఈ తీరున గర్జింపుచు, వాతూలాత్మజుఁడు రా, సు♦బాహునృపుఁడు ప్ర
స్ఫీతరుషావిలనేత్రా, స్వాతుండై పలికె నిట్లు ♦ పెల్లుగ నగుచున్. ౩౮౩

ఉ॥ స్రుక్కక జన్యమందు రణ♦శూరుని మత్సుతుఁ జంపి పుష్కలుం
డెక్కడ నున్నవాఁడు వధి♦యింతు సకుండలమౌ శిరంబు ని
ప్డెక్కడ వాహపాలకు డ♦హీనబలుండగు లక్ష్మణానుజుం
డెక్కడ? రాముఁ డెక్కడ? వ♦చింపు త్వరన్ బవమానసందనా!. ౩౮౪

తే॥ సమరమందున వీరి ప్రాణ♦ములఁ దీయ, నరుగు దెంచితి నంచు న♦న్నాత్మఁదెలియు
మనెడునుడి విని హనుమంతుఁ♦డనియె ఘనగభీరనినదాభవాక్కుల♦విభునిఁ గాంచి.

మ॥ అవనీశా! లవణాసువాతపవనా♦హారుండు శత్రుఘ్నుఁ డా
హవరంగంబున నున్నవాఁడు పని నీ ♦ కా వీరుతో నేమి? యు
త్ప్రవణుం డా రఘువీరుసేవకుఁడ న ♦ న్భంజించినన్డేఁగుమా
బవరంబందున నిల్చితేని విను నీ ♦ ప్రాణాల కేఁ జాలనే. ౩౮౬

సీ॥ ఈరీతిఁబల్కి మ♦హీధరశిఖరంబు, వడువున నున్నట్టి ♦ వానరేంద్రు
నెదఁ బదిశరములఁ ♦ నేయభూపాలకుఁ, డాకచేతఁ గపి యవి ♦ యొడిసిపట్టి
నలుపుచుఁ దిలబీజ♦ముల మాడ్కి నొనరించి, తోఁకఁ దదగ్రిథమును ♦ వీకఁజుట్టి
గగనస్థలిని జేర్పఁ♦గడు భీతి భూపతి, ఖరశరంబులఁ బెక్కు♦ పఱపి పఱపి
గీ॥ పట్టుఁదప్పింప రథమిలఁ♦బడియెనంత, నూల్గొనుచుఁ గొంతవడికి మ♦హోగ్రవృ
వాఁడిముల్కులఁగపిఁబొమ్మఁ♦గాఁడనేయ నాశుగక్షత క్షతజాప్లు♦తాంగుఁడగుచు

చ॥ పవనజుఁ డాగ్రహించి నర♦పాలశతాంగము కేతుయంత్రసైం
ధవ సహితంబుగాఁ దనదు ♦ దంష్ట్రల గట్టిగఁబట్టి యప్పుడం
బువలెఁ బెటుక్కున న్విఱచి ♦ ముక్కలుసేయఁగఁ జూచునంత మా
నవ గగనేచరాళుల మ♦నంబుల కద్భుత మయ్యెఁ దాపసా. ౩౮

తే॥ నరపతి యంతకుమున్నా, యరదంబున నుండి యుఱికి ♦ యతివేగమునన్
మఱియొక యరదంబున సు,స్థిరుఁడై కూర్చుండి వింటఁ♦జేర్చి శరములన్. 3౮౯

తే॥ పుచ్ఛమందునముఖమందు♦భుజములందు,నూరువులయందుఁబదముల♦నురమునందు
గుదులుగుదులుగనంతటఁ♦గ్రుచ్చె మేన, బాణసంధానవిదుఁడును♦ బాహునృపుఁడు.

ఉ॥ ఏమవిధాన భాసిలి క♦పీందుఁడు మేను విదిర్చి క్రొంచు నీ
మేదిని క్రుంగఁ బాదముల♦మెట్టుచుఁబోయి మహోగ్రమూర్తియై
పాదముచేతఁ బెల్లగసి ♦ వక్షముఁ దన్నిన ఱేఁడు మంత్రి పుం
బూదిని జల్లినట్టు పడె ♦ ముక్కున నోటను నల్లఁగ్రక్కుచున్. 3౯౦

ఉ॥ అప్పుడు వానరేంద్రుఁడు మ♦హోగ్రహపూరితుఁడై రణంబునన్
గుప్పుచు రాలు వృక్షములుఁ ♦ గోయని యార్చుచు గంతుగొంచు బల్
కుప్పలుఁగాగ భూస్థలినిఁ ♦ గూల్చుచునుండ గజాశ్వవీరులన్
జొప్పఱి రాజవీరు లది ♦ చూచుచు నుండిరి భీతచిత్తులై. 3౯౧

క॥ అంత సుకేతుఁడు జనకా, నంతాధీశాత్మజుం డ♦నంతక్రోధ
స్వాంతులు శరసంపూర్ణా, శాంతములుఁగఁ బోరఁదొడఁగి ♦ రాశ్చర్యముగన్. 3౯3

ఉ॥ ఒప్పఱి మూర్ఛమున్గి క్షితి♦నున్న నృపాలునిఁ జూచి యంతలోఁ
గుప్పుచు ముల్కులన్ భటులఁ ♦గూల్చెడి పుష్కలుఁజూచి భీతులై
యెప్పుడెఱుంగ మింతవఱ ♦ కిట్టి సమీకము లయ్యొ నేఁటి కీ
తిప్పలు వచ్చెనంచు నలు♦దిక్కులఁ బాఱిరి రాజసైనికుల్. 3౯౪



—♦ సుబాహుండు స్వప్నంబున రామాదులఁ జూచుట ♦—



తే॥ పాఱిపోవుచు నున్నట్టి ♦ బలముఁగాంచి, దమనుఁ డంబుధి సేతు వి♦ధమున నాపె
నంతఁబెనుమూర్ఛలోనున్న ♦యవనిపతియు,స్వప్న మొక్కటిఁగాంచెనా♦స్వప్నమందు.

క॥ రాముని మేచకజలద,శ్యామునిఁ గమలాయతాక్షుఁ ♦ జతురాననము
ఖ్యామర బ్రహ్మాండశత,స్తోమవినుతు సకలభోగ ♦ సుఖచయవిరతున్. 3౯౬

క॥ భాసుర సరయూతీరని, వాసుని హరిణాజినైక ♦ వాసుని నిగమా
భ్యాసుని మునివర విప్రవి, భాసుని ఘను హరిణశృంగ ♦ భాసునిఁగాంచెన్. 3౯౭

ఉ॥ తీరుగ నారదుండు బృహతిన్ ♦ మెలయింపుచుఁ బాడుచున్నటుల్
చారుతరంబుగా నచట ♦ సౌరవధూజన మాడుచున్నటుల్
చేరి శ్రుతుల్ ప్రమూర్తులయి ♦ చెల్మిని రామునిఁ గొల్చుచున్నటుల్
కోరినవెల్ల భక్తులకుఁ♦గూర్చుచు రాముఁడు దీక్ష నున్నటుల్. 3౯౮

చ॥ కని తెలివొంది భూవిభుఁడు ♦ కన్నది నిక్కమయౌనుగాక నే
మునివరు శాపమూలమున ♦ బుద్ధినిఁ బాసితి లక్ష్మణానుజ
న్మని చరణాంతి కంబునకుఁ ♦ బోయెదఁగాల్నడ నిప్పుడైన నం
చనుజుని బుత్రులన్ భటుల ♦ నందఱినిన్ బిలిపించి యిట్లనెన్. ౭౯౯

సీ॥ సోదర సుతులార ♦ సారిది వినుం డెల్ల, ♦ వారలు శ్రీరాము వాహరత్న
మును దెచ్చె దమనుఁడు ♦ మొదటితప్పది నేను, రామాశ్వమని విని ♦ రణముసేసి
తదియు రెండవతప్పు ♦ కోదమసింగముఁబోలు, పుత్రుని గోల్పోతి ♦ బుద్ధిలేక
రామచంద్రుఁడు పరం♦ధాముఁడు కార్యకా, రణములకు బరుండు ♦ప్రభువు సర్వ
తే॥ జంగమ స్థావరాత్మక ♦ జగములకును, మానుషాకృతి నున్నాఁడు ♦ మహిని నాత
డింతకసితాంగ మునిశాప♦మింతఁజేసెఁ, జ్ఞానధనశూన్యత ముఁడము♦ర్ఖ యుఁడనైతి

ఉ॥ ఏనొక పుణ్యతీర్థమున♦ కేగితిఁ దత్వమెఱుంగ మున్నటన్
మానుల ధర్మవేత్తలను ♦ మాన్యులఁ జూచితి నందులో హరి
ధ్యానపరున్ దపస్వి నసి♦తాంగుని జూచి నమస్కరించి నా
కానతి యిమ్మ పాస్యుని మ♦హాత్ముని దేవునటంచు వేడితిన్ ౮౦౧

వ॥ ఇట్లు ప్రార్థింప నాయం దనుగ్రహించి యా తపోధనుం డిట్లనియె. ౮౦౨

తే॥ రాము సాకేతపతిఁ బర ♦ బ్రహ్మముగను, జిన్మయునిగాగ నెఱుఁగుము♦ సీతనఁతని
నియతి సేవించి యోగులు ♦ నిస్తరింత్రు, దుస్తరాపార సంసార ♦ తోయనిధిని.

క॥ స్మరియించునంత నెంతటి, దురితంబులనైన నడఁచుఁ ♦ దొలగక మదిలో
నిరతము నిల్పినమాత్రమె, సరగున సాకేతవిభుఁడు ♦ సంస్మృతి వాపున్. ౮౦౪

వ॥ అని సెలవీయఁ బరిహాసంబును జేయుచు నే నిట్లంటి. ౮౦౫

మ॥ ఎవఁడా రాముఁడు మర్త్యమాత్రుఁడ♦కదా యీధాత్రి నా సీతయున్
ధవుతో నెప్పుడు హర్షదుఃఖముల నొం♦దం జూచి నామేకదా
భవకృత్యంబులు చెందునే యభవు ని♦ష్పాటా యకర్త న్నదా
భవదుఃఖాదులు లేని దైవమునుఁ జె♦ప్పనాదె మౌనీశ్వరా! ౮౦౬

వ॥ ఇటుల నుడువు నన్నుంగాంచి మునివర్యుం డిట్లనియె. ౮౦౭

శా॥ శ్రీరామున్ సుగుణాభిరాముని మదిన్ ♦ జింతింప కిట్లాడు దే?
యా రాముండు మనుష్యుఁడే? తెలిపినన్ ♦ హా యిట్టులే పల్కుటల్
కూరా! తత్త్వ విమూఢతన్ మెలఁగుమా ♦ క్షోల్పోయి జ్ఞానంబుఁ బో
పోరా యంచు శపింప భీతిని క్షమిం♦పుం డంచుఁ బాదాలపై. ౮౦౮

తే॥ పడిన నాయందు దయయుంచి ♦ పలికెనిట్లు, రాఘవునియజ్ఞమున కంత ♦ రాయమీవు
వన్న హనుమంతుఁడరుదెంచి ♦ నిన్నుఁగాలఁ,దన్ని నప్పుడురాముత ♦ త్త్వంబుఁగనుము.

ఉ॥ అంతియకాని రాముని మ ♦ హాత్మ్యమని బ్రహ్మాను 7గా స్వబుద్ధిచే
నెంతయుఁ గాంచ లేవని ము ♦ నీంద్రుడు సెప్పెను గానఁ బోయి నే
మంతువు చేసినాడ నిదె ♦ మావు ధనంబిదె నీదెరాజ్య మం
చెంతయు భక్తిమ్రొక్కలిడి ♦ యిచ్చెద నన్నియు శత్రుఘాతికిన్. ౪౧౦

వ॥ ఇట్లొనర్చి యతని యనుగ్రహంబు వడసి సవనహయంబుతో నయోధ్యకుంజని యాగదీక్ష నున్న శ్రీరామచంద్రపాదార్చనం బొనర్చి కృతార్థుండ నయ్యెద నిదియ నా తలంపనిన నామాటల కలరి దమనాదులు శ్రీరామభద్ర దర్శనలాలసుండగు తండ్రిం గని యిట్లనిరి. ౪౧౧

—♦ సుబాహుఁడు సవనాశ్వము శత్రుఘ్నునకు సమర్పించుట ♦—

మ॥ అనఘా! నీపదపంకజార్చనల క ♦ న్యం బేమియుంజూడ మీ
వనినట్లే యగుఁగాక తత్క్షణమె మీ ♦ యాజ్ఞన్ మణిస్తోమచం
దన ముక్తాఫలచారు చామరలస ♦ ద్గంధర్వ రాజంబు దం
తినరస్యందన వాహవిత్తములతోఁ ♦ దెప్పింతు మర్పింపుమా. ౪౧౨

క॥ ఇవి యవి యననేలను మన, భవనంబునఁగల సమస్త ♦ వస్తువులను మే
ల్పవడంబుల మమ్ముల నా,లవణారి కొసంగుమా వి ♦ లంబం బేలా? ౪౧౩

తే॥ వెనుకముందును జూడకో ♦ జనక! యీనృ,పాసనంబును గూడ స ♦ మర్పణంబు
సేయుమాయన మోదంబుఁ ♦ జెందిమదిని, మఱలన నెనందనులతోడ ♦ మనుజవిభుఁడు.

క॥ నానాశతాంగపరివా, రానూన బలంబుతోడ ♦ నఖిలాస్త్రధరుల్
మాను గరం డిప్పుడ రా,మానుజ దర్శనము సేతు ♦ నందఱతోడన్. ౪౧౪

సీ॥ అనిసుబాహుఁడువల్క ♦ వినిశూరుతాదమనుఁడు,సుచిత్రుఁడును కే ♦ తుఁడుబురంబుఁ
జేరి సువర్ణవి ♦ చిత్రపత్రోల్లస, ద్వీతినిఁ గొని ముందు ♦ వెన్కభటులు
చామరంబు లసిత ♦ చ్ఛత్రంబులు ధరించి, నడువఁగాఁబోయి యా ♦ నరవరునకు
నెఱిగింప సంతోష ♦ భరితాంతరంగుఁడై, తనుజాత పౌత్ర సో ♦ దరులతోడఁ

తే॥ గాలినడఁబోయి యందు న ♦ ఖండవైభ, వమునఁగొల్వుండుశత్రుఘ్న ♦ పాదములకు
మ్రొక్కి తెచ్చిన సర్వంబు ♦ మ్రోలనునిచి,నరవరుండిట్టులనియె వి ♦ నమ్రుఁడగుచు.

ఆ॥ నిఖిలదుఃఖములకు ♦ నిలయమహా ధనమందు; నిరతమతుల కిదియ ♦ నిరయ మనుచు
నస్థిరంబులైన ♦ యర్థముల్ రామున; కిచ్చి నేఁదరింప ♦ నెంచినాడ. ౪౧౫

వ॥ ఇట్లు సవినయంబుగఁ బల్కు కువలయేశుం గాంచి సకల వానరవీరసేవితుండును భయలేశ విరహితుండును జామరవీజితుండును నగు శత్రుఘ్నుండు సింహాసనంబున నుండి దిగ్గున లేచి యాలింగనం బొనర్చి, సుబాహుం డతని దృఢంబుగఁ గౌఁగిలించుకొని పరిహర్షాతిశయంబున గద్గదస్వరుండై యిట్లనియె. ౪౧౮

ఉ॥ భూవరకోటిచే వినతిఁ ♦ బొందఁగ నర్హములై తనర్చు నీ
పావన పాదపద్మముల ♦ భాగ్యవశంబునఁ గంటి నేఁటికిన్
దావలమైతి నీ కృపకు ♦ ధన్యుఁడనైతి సుతానుజాళితోఁ
దావకసప్తిఁ బట్టుట కె ♦ దన్ క్షమియింపఁగదే దయానిధీ! ౪౧౯

చ॥ ఎఱుఁగ సమస్త దేవతల ♦ కీశ్వరుఁ డా రఘురాముఁడంచు ము
న్నెఱుఁగ జగత్స్థితిప్రలయ ♦ సృష్టులకుం బ్రభవుండటంచు ని
ప్డెఱిఁగితి వీరె మత్సుతులు ♦ నెల్ల ధనంబు లివే గ్రహింపుమీ
స్థిరముగ నీవు రాముఁడును ♦ జెప్పినయట్టుల నేను జేసెదన్. ౪౨౦

తే॥ రఘుకులోత్తమ పాదసా ♦ రసమిళుందుఁ, డైన హనుమంతుఁ డేడియా ♦ యనఘుకృపను
జూడఁగల్గితి శ్రీరాము ♦ సుగుణధాము; సకలముకు హేతువగు సాధు ♦ సంగమంబు.

క॥ మారుతి యనుగ్రహంబునఁ, బౌఁజుని శాపంబు గెంటి ♦ పద్మాక్షుండౌ
శ్రీరఘువరుఁ గనఁగంటి న,పారంబగు ఫలము జనికిఁ ♦ బడసెద నింకన్. ౪౨౨

ఉ॥ ఆ రఘురాముఁ గాంచక మ ♦ దాయువు మిక్కిలి సెల్లెఁ గాలమా
చేరువయయ్యె నింక నృప ♦ శేఖరు నెన్నఁడుఁ జూచువాఁడ నో
శూరవరేణ్య యొక్కపరి ♦ చూపుము తచ్చరణారవిందముల్
నేరము లెంచకయ్య యిక ♦ నీ స్వజనంబునఁ జేర్పుమయ్య నన్. ౪౨౩

సీ॥ రాయియై యుండి శ్రీ ♦ రాముని పదరజ, స్స్పర్శ నహల్య పా ♦ వనతఁ జెందె
జానకీపతి బాణ ♦ సంస్పర్శనమున వా,యస మున్నతపదంబు ♦ నందఁగల్గెఁ
నని ననేకులు రాఘ ♦ వానన కమలంబుఁ, జూచి తత్పదమును ♦ జూఱఁగొనిరి
రామనామధ్యాన ♦ రతు లెల్లరును యోగి, గమ్యమౌ పదమునుఁ ♦ గాంచి రెలమి

తే॥ దాశరథి యుండుట నయో ♦ ధ్య ధన్యయయ్యె,
నందుఁగలవారు రామచం ♦ ద్రానననామృ
తజము నెప్పుడుఁ గనికని ♦ తనివిదీర,
నమితసౌఖ్యంబు లందిరి ♦ యట్ల నన్ను
ధన్యతను నీవు బొందింపఁ ♦ దలఁచు టెపుడొ. ౪౨౪

వ॥ ఇట్లు సుబాహు భూపాలుండు సవినయంబుగఁ బల్కుచు సవనవాహంబుతోఁ బూజ్యంబగు రాజ్యంబును ధనకనక వస్తువాహనంబుల నొసంగి మీ కింకరుండ నిఁకేమి సెల వన శత్రుఘ్నుం డిట్లనియె. ౪౨౫

ఆ॥ పిన్నవాని నిట్లు ♦ పెద్దలు వల్కుట, తగునె నాకుఁ బూజ్యు♦తముఁడ వీవు
నీదె రాజ్యమింక ♦ నీనందనుండైన, దమనుఁడేలుఁగాక ♦ ధర్మమిదియ. ౪౨౬

క॥ నరపతులకు నెవ్వాడు సం,గర మొనరించుట విధాయ♦కముఁ గాదె యిఁకన్
మఱలింపుము సర్వంబును, మఱుమాటాడకు మదాజ్ఞ ♦ మన్నింపవలెన్. ౪౨౭

సుగంధి॥ ఓజ రామభద్రుఁడెప్పు ♦ డోలి వాఙ్మనస్సులన్
బూజనీయుఁ డెట్లొ యట్ల ♦ పూజితుండ వైతి వో
రాజవర్య వీతివెంట ♦ రమ్ము లెమ్ము వేగ నీ
రాజనంబు మీర సప్తి♦రాజముఖ్యసేనతో. ౪౨౮

మ॥ అని శత్రుఘ్నుఁడు వల్క భూమివిభుఁ డ♦త్యంతప్రమోదంబునన్
దన సద్మంబున కేఁగి పుష్కలుఁడు యు♦ద్ధం బందునన్ మిత్తి నా
తను బొందించిన యాత్మసూతికిని గృ♦త్యంబు ల్విధిన్ సర్వముం
జనఁగాఁ జేసి సువేత్త యయ్యును జనా♦చారంబుచే నేడ్చెఁదాన్. ౪౨౯

వ॥ ఇట్లు క్షణమాత్రంబు దుఃఖించి శ్రీరామచంద్రపాదారవిందంబుల ధ్యానింపుచు జ్ఞానంబుచే శోకం బపనయించి ఖడ్గకవచాదినృపపరికరంబులన్ దాల్చి సన్నద్ధుండై రథారోహణం బొనరించి చతురంగంబులతో నరుదెంచు సుబాహుభూపాలుం జూచి శత్రుఘ్నుండు ప్రియాణోన్ముఖుండై ఫాలపత్రచిహ్నితంబగు నశ్వంబు విడిచెనని శేషుండు వాత్స్యాయనమునీంద్రునకుం జెప్పె. ౪౩౦

శా॥ కుంభీంద్రాద్ర్యసుపాటనైకచతురా ♦ కుంభీనసేట్కుండలా
జంభద్వేషణకుంభికుంభిరిపుకా♦శప్రోల్లసద్గాత్ర! ని
ర్దంభోపాసనకృత్సమస్తజనమం♦దారాగమావ్యాస దో
స్తంభప్రక్రమవిక్రమక్రమచణా ♦ తారేట్శిరోభూషణా. ౪౩౧

(నిరోష్ఠ్యకందము)♦—

ఖరకరకృశానురాత్రిం, చర నయనా! క్రూరరాత్రి♦చరహరణా శ్రీ
ధరసఖ గజకృత్తిధరా, సరసిజజని హరిహయాది ♦ సన్నుతచరణా. ౪౩౨

(కవిరాజవిరాజితము)♦—

హర! సితశైలవి ♦ హార! బిలేశయ ♦ హార! యహార్య♦శరాస! మహే
శ్వర! కరుణాకర! ♦ శత్రువిభీకర! ♦ సాధుజనాదర! ♦ భక్తవశం

కర! విబుధావన! ♦ కష్టవిమోచన! ♦ కారణ కారణ! ♦ కాలభయం
కర! వృషకేతన! ♦ కర్బురసూదన! ♦ కాలవిషాదన! ♦ కామహరా!. ४३३

—♦(గద్య)♦—

ఇది శ్రీమద్గౌతమాన్వయపవిత్ర లక్ష్మీనారాయణార్యౌరసపుత్రి శ్రీచింతలపాటి
వంశక్షీరపారావారరాకాసుధాకరాయమాన శ్రీసూర్యనారాయణార్య
దత్తపుత్ర శ్రీరామచంద్రకరుణాకటాక్షవీక్షాసమాసాదితానవ
వద్యోభయకవిత్వవిద్యావధాన
రామమూర్తి శాస్త్రికవ్యభిధానప్రణీతంబైన రామాశ్వమేధంబునందు
తృతీయాశ్వాసము.



శ్రీ

గణాధిపతయే నమః.

శ్రీరామభద్రాయ కరుణాసముద్రాయ నమః.

# రామాశ్వమేధము

## చతుర్థాశ్వాసము



కంఠ! కాళ హరిదర
నీకాశ సమాన దేహ! ♦ నిఖిలావన వ
ల్మీకాశ్రియహార! బుధా
నీక స్తుత! నందివాడ ♦ నిలయ! మహేశా! ౧

వ॥ అవధరింపు మనంతర వృత్తాంత శ్రవణ తత్పరుండగు వాత్స్యాయన మునీంద్రుండు ఫణీంద్రుం గాంచి యయ్యశ్వం బెటు వోయె? నెయ్యెడలఁ దిరిగె నని యడుగుటయు నాతం డిట్లనియె.

తే॥ వినుము మునివర పత్త్రికో♦భితలలాట, మగుచుఁ దేజఃపురంబున ♦ కశ్వ మరుగ
నరిగి నెంటను లవణాభి♦యాతి మదిని, బురమహావైభవమున క♦బ్బురముఁ జెంది ౩

వ॥ మంత్రిం గాంచి యిట్లనియె. ౪

క॥ సుమతీ! యీ పురరాజం, బమితానందంబుఁ గూర్చె ♦ నహా! యీ ప్రాకా
రమహాగోపుర ప్రాసా, దము లీ గృహసౌధసంప♦దలు శ్లాఘ్యంబుల్. ౫

సీ॥ బ్రాహ్మణగృహములఁ ♦ బావనపావక, భవధూమజాలంబు ♦ పఱగుచుండె
యతిపూరితంబు లా♦యతములౌ మఠములు, నెన్నియో కన్పట్టు ♦ చున్నవవిగొ
కాంచననిర్మిత ♦ కలశశతంబులు, గోపురాగ్రంబులఁ ♦ గొమరు మిగిలె
భాగీరథీదేవి ♦ పరమర్షి సేవిత, యగుచు నిచ్చటఁ బాఱు♦చుండె.

గీ॥ నేమహీపాలవర్యుని ♦ దీపురంబు, ధర్మపరిపాలనాసక్తిఁ ♦ దనరు నతని
పుణ్యచరితంబు నిపుడాను♦పూర్వముగను, దెల్పుమా తెల్లముగ ననఁ♦ దెల్పె నతఁడు.

క॥ ఆహితమతివై వినుమో, లవణాంతక పరమమంగ♦ళకరంబులు వై
ష్ణవచరితంబులు మఱియును, నవి విన నెటువంటి బ్రహ్మ♦హత్య లడంగున్. ౭

ఉ॥ శ్రీరఘురామపాదసర♦సీరుహషట్పదుఁ డధ్వరక్రియా
పారగుఁ డధ్వరావభృథ♦వార్యవగాహపవిత్రగాత్రుఁడున్
వారితదుర్హృదుండు వరి♦వస్సితుఁ డార్తజనాప్తుఁడున్ శుభా
చారుఁడు సత్యవంతుఁ డను ♦ సార్థకనాముఁ డతండు భూవరా!. ౮

## —♦ సత్యవంతుని చరిత్ర ♦—

పంచచామరము॥ ఋతంభరాఖ్య ధారుణీత♦లేంద్రవర్యుఁ డెన్ని యో
వ్రతోపవాస చర్యల న్స♦భక్తి గోసపర్యలన్
సతంబుఁ జేసిచేసి గోప్ర♦సాద మంది యప్పు డీ
సుతున్ నృపాలశేఖరున్ వి♦శుద్ధచిత్తుని న్గనెన్. ౯

వ॥ అనిన శత్రుఘ్నుం డిట్లనియె.

చ॥ క్షితితలనాథుఁ డెవ్వఁ డెటు ♦ చేసెను గోపరిచర్య నిష్ఠతో
సుతు నెటుఁ గాంచఁగల్గె మధు♦సూదన సేవకుఁడంటి వట్టిసూ
నృతమతి సచ్చరిత్రము నె♦ఱిఁగ వివరింపుము విందు నెందునన్
శ్రుతము హరించుఁగాదె జన♦యూథమహాఘశిలోచ్చయంబులన్. ౧౧

వ॥ ఇట్లు నుడువు శత్రుఘ్నుంజూచి మతిమంతుం డగు సుమతి తదుత్పత్తిక్రమం బిట్లు
సెప్పందొడంగె. ౧౨

సీ॥ వినుమా ఋతంభర♦విశ్వంభరుఁడు గళత్రంబులు పెక్కులు ♦తనకు నున్న
నొక కళత్రంబున ♦ నొందక సంతతి, వందురుచుండ జా♦బాలి యనెడు
తాపసశ్రేష్ఠుఁడు ♦ దైవయోగంబున, రా మ్రొక్కి యతని న,ర్చనలఁదన్పి
యనె వినయంబున ♦ మునినాథ వంధ్యుఁడ, దానతీర్థతపోవ్ర♦తముల నేది
తే॥ సేయఁగా వంశధరుఁ బుత్రుఁ♦జెందవచ్చు, నెనరుచే నన్నుఁదిలకించి ♦ నిర్ణయించి
యొకటి సేయఁగదే యిద♦మిత్థ మనుచు, నను నృపాలుని గన్గొని♦యనెనతండు. ౧౩

తే॥ మూఁడు పుత్రార్థికినుపాయ♦ములుధరిత్రి, నవిస్వభూగోశివానుగ్ర♦హములుసూవె
కావునను దేవతనువగు ♦ గవినిబూజఁ,దనిపిపడయుము సంతాన♦మునునృపాల ౧౪

వ॥ మఱియు నాగోపృచ్ఛ ముఖశృంగపృష్ఠంబుల ముప్పది మూఁడుకోట్ల దేవతలుంద
రది తెలిసి తృణదానాది సపర్యల దానిం దనుప దేవ పితృదేవతలు తృప్తినొందెద
రందుచే సకలేప్సితంబులు సిద్ధించుఁగావున శ్రద్ధాభక్తులతో నిత్యం బాధేనువు
నర్చింపు మంతియకా దది బాలతృణంబులు మేసవుచుండ నావలకుఁ దోలు
వాఁడును గట్టిచేఁ గొట్టువాఁడును నీఁగలఁ దోలనివాఁడును దనపూర్వులతో హస్త
శూన్యుండై ఘోరనరకంబునన్ గూలు, మఱియు వినుము. ౧౫

తే॥ కట్టఁబడి యింటఁ దప్పిచేఁ ♦ గందు గోవు, పుష్పవతియై గృహంబునఁ ♦ బొదలు కన్య
దేవతాశననిర్మాల్య ♦ మో వసుంధ, రాధిపా! పూర్వపుణ్యము ♦ నడఁచు నిజము. ౧౭

ఉ॥ పచ్చికమేయు ధేనువును ♦ బాఱఁగఁదోలినవాని పూర్వుల
త్యుచ్చపదస్థులయ్యుఁ దప ♦ నోన్ముఖులై తపియింతు రిష్టిచే
నుచ్చుచు గోవు నోవ్వఁగను ♦ నూకువఁ గొట్టినవాఁ డబాహ్యుఁడై
చొచ్చి పరేతరాట్పురము ♦ సొంపఱి సమ్మెట దెబ్బల న్బడున్. ౧౮

తే॥ ఆల మునరిన యీఁగలఁ ♦ దోలు నెవ్వఁ, డతనిపితరు లధోగతు ♦ లయ్యుఁ బెలుచ
సంతసంబున నృత్యంబు ♦ సల్పుచుంద్రు, కొంచకసుతుండు మము్ముద్ధ ♦ రించు ననుచు

—♦ జనకుండు నారకుల ముక్తి నొందించుట ♦—

వ॥ అందు కత్యద్భుతంబును బురాతనంబును నగు నొక యితిహాసంబు గల దది విను మొకప్పుడు బ్రిహ్మణ్యుండగు జనకభూపాలుండు యోగమార్గంబునఁ బ్రాణంబుల వాయునంతఁ గింకిణీ జాలశోభితంబును సువర్ణమయంబును నగు నొక దివ్యవిమానం బరుదేర నందధిష్ఠించి సేవకులచే నూహ్యమానుండై చనిచని మధ్యమార్గంబున సంయమినీనగర ప్రాంతంబుఁ జేరె. నందు నిరయకోటుల బాధింపంబడు మహాపాపులు జనకాంగపవనస్పర్శంబున నిరయాగ్నిదాహజంబగు పీడ శమించి తమ దేహంబులకు సౌఖ్యంబులు గలుగుచుండ సంతసింపుచు నా జనకుండు సనుటఁజూచి తద్వియోగంబు సహింపక కరుణ వుట్ట నిట్లాక్రోశింపం దొడంగి రెట్లనిన, ౧౯

శా॥ ఓ పుణ్యాత్ముఁడ! పోకుపోకు మిటు ర ♦ మ్మో మహాత్మా! తనూదాహ కృ
త్తాపంబంతయుఁ బాసె నీదు శుభగా ♦ త్రి స్పర్శవాతంబుచే
నీ పాపాత్ములఁ బ్రోవవే కన వె యం ♦ చిట్లాడు నా నారకా
లాపంబు ల్విని పేర్మి మ లో నిగుడఁ దె ♦ ల్లంబోయి యుండె న్గడున్. ౨౦

సీ॥ అంత నారకుల న ♦ త్యంతంబు బాధింపఁ, గట్టడి సేయుచుఁ ♦ గాలుఁ డచటి
కరుదెంచి జనకధ ♦ రాధీశుఁ గరుణాబ్ధిఁ; బుణ్యు విమానస్థుఁ ♦ బోలఁజూచి
నవ్వ చిట్లనియె నో ♦ నరవర యెందుండి, వచ్చెద వీవు పా ♦ వనుఁడ వఖిల
ధార్మికోత్తముఁడవు ♦ తగదయ్య నీవంటి, వారు వచ్చుట కతి ♦ పాతకులకు
తే॥ ప్రాణఘాతుకులైన దు ♦ ర్మార్గులకును, నెలవు సుమ్మిది మఱియు దు ♦ ర్నీతిపరులు
పరులకెప్పుడు ద్రోహంబు ♦ నెఱపువారుఁ, బరధనాపహారుల్ వచ్చి ♦ పడుదు రిటకు.

క॥ నిరతముఁ దను భజియించెడి, పరపత్నిని ధర్మనిరతఁ ♦ బాపములేకన్
నిరసించి విడుచు జడుఁ డీ, నిరయంబునఁ గూలు మేది ♦ నీతలనాథా. ౨౧

క॥ ధనలోభలోభితుండై, తనమిత్రుని ద్రోహబుద్ధిఁ ♦ దనరఁగ వంచిం
చిన నీచుఁడు మల్లోకం,బున నాచే నమితకష్ట♦ములఁ బడుచుండున్. ౨౩

తే॥ వాఙ్మనఃకర్మములను దం♦భమున బలిమి,నైన ద్వేషంబుచేఁ బరి♦హాసవశత
నైన రాముని స్మరియింప♦నట్టి మూర్ఖుఁ, బొదివి బంధించి నీటిలో ♦ముంపఁజేతు.

సీ॥ నారకక్లేశ ని♦వారకుండగు నింది, రేశుని స్మరియింపఁ ♦ డెంతవరకు
భవదూరుఁడౌ రాము♦పావన శ్రీనామ, మెలమి జిహ్వా నటింప ♦ దెంతవరకు
మానవాంగంబుల ♦ మానవనాథ స,ర్వాఘంబు లుండు పో♦యంతవరకు
మది నదితెలియని ♦ మాధవదూరులౌ, పాపులఁ దెత్తురి మ♦ద్భటులు చెలఁగి

తే॥ కనరు మీవంటి పుణ్యులఁ♦గండ్లనైన, వింటివా కావునను బెక్కు♦విభవములను
స్వర్గమున ననుభవింపుము ♦ త్వరగఁదరలు,మీ విమాన మధిష్ఠించి ♦ యెల్లగతుల.

ఆ॥ ఇటులఁ బల్కువిని మ♦హీంతలనాథుండు, సదయహృదయుఁడగుచు♦ నెదుట శ్యామ
లాధినాథుఁగాంచి ♦ యనె దుఃఖులను గాంచు, చెట్లు పోదుఁ జెపుమ♦యిచటు వాసి.

వ॥ మఱియు మదంగవాయు స్పర్శంబున శీతలదేహాల మైతి మని యాక్రోశింపుచున్న వారిట్టివారి నెట్లు విడచిపోనేర్తు నీ వనుకంపాయుతుండవై యీ సకల నిరయ వాసుల విడచెదవేని వీరితోఁ బుణ్యపురుషుల కాలయం బగు స్వర్గంబున కేగెద నను జనకాలాపంబుల కులికి వేఱువేఱుగ నారకుల పాపంబులు వినిపింపు తలంపున సమవర్తి యిట్లనియె. ౨౭

సీ॥ వీఁడు మిత్రునిభార్య ♦ విధవను బొందిన, ద్రోహి వీనిని దప్త♦లోహశంకు
వందునఁ బదివేల ♦ హాయనంబులు బాధ,నొందింపవలె మీఁదఁ ♦ బందిగాగఁ
బుట్టించి యటమీఁదఁ♦బుట్టింతుఁ గుంటి మా,నవునిగా వీఁడు భూ♦నాథ పరుల
దారలఁగని బలా♦త్కారముగాఁబట్టి, యాలింగన మొనర్చి♦నట్టి జడుఁడు

తే॥ కాన నూర్వత్సరములు బల్♦కష్టములను, ననుభవించుఁ బరద్రవ్య♦మపహరించి
పొట్టనించెను వీనినిఁ ♦ బూయశోణి, తంబునను నుంతుఁ జేతులఁ♦దఱిగి వెలుచ.

తే. అతిథి క్షుత్తున రాత్రి రా♦నతని వాక్కు, చేతనైనను మర్యాద ♦ సేయఁ డితఁడు
భ్రమర పీడితుఁడగుచు నూ♦ర్వత్సరంబు, లంధతామిస్రమునఁబొందు♦నధిక బాధ.

ఉ॥ ఈతఁడునూ పరోన్నతి స♦హింపక నింద లొనర్చె సిగ్గు లే
కాతఁడు దానిఁబ్రీతిఁ జెవు♦లారగ మిక్కిలి నాలకించె నీ
పాతకు లంధకూపమున ♦ బాధల నొందుచు నేడ్చుచుందు ర
ల్లాతఁడుఁ గూలు రౌరవము ♦ నందున మిత్రుని బాధసేయుటన్. ౩౦

తే॥ కావునను మున్ను చేసిన ♦ కలుషఫలము, లానఁగాఁజేసి నే వీరి♦ననుపువాఁడ
రాజశార్దూల కడుఁ బుణ్య♦రాశివీవిఁ, కిచ్చటఁజరింపఁదగదయ్య♦యేగుమయ్య. ౩౧

వ॥ ఇట్లు పాపాత్ములగు జీవుల వేర్వేర నిర్దేశించి యూరకొనిన దండధరునిం జూచి రామభక్తుండును గరుణాపూరితేక్షణుండును నగు జనకుం డిట్లనియె. 3౨

తే॥ నిరయదుఃఖవిముక్తి యీ♦నరులకెటులఁ, గలుగు నేపుణ్యమున ననుసౌ♦ఖ్యంబుఁ గాంతు రెఱుఁగఁ జేయవె వేఁగ దిR♦నేంద్రతనయ, యనుచు వేడు నృపాలుతో♦ ననియె నిట్లు. 33

ఉ॥ ఏ రొకమారు విష్ణుఁ బ్రభ♦విష్ణునిఁ బూజలఁ దన్పినట్టి వా
ర్గా రొకనాడుఁ గేశవుని ♦ గాథల వీనుల విన్నవారునుం
గా రిపు డిట్టి నీచకలి♦కారుల కెట్టు విముక్తి కల్గు నీ
నారక మోచనంబు జన♦నాయక యిష్టమ యేని తెల్పెదన్ 3౪

తే॥ బ్రహ్మహత్యాది ఘోరపా♦పముల నడఁచు, రామచంద్రుని నామంబు♦ రామరామ రామయంచునొకప్డు ని♦ర్వ్యాజఫణితిఁ, బొద్దున స్మరించినా వట్టి♦ పుణ్యమిప్డు. 3౫

ఉ॥ వీరి కొసంగితేని పృథి♦వీవర ! ముక్తిని జెందు టబ్రమే
నారకు లందరంచు దిన♦నాయకసూనుఁడు వల్క నంత నా
భూరమణుండు మున్ను కడుఁ ♦ బుట్టినదాదిగ భక్తిచేత నా
శ్రీరఘురామనామఫల♦సిద్ధి నొసంగితి నిప్డు డే ననన్. 3౬

పంచచామరము॥
బుతంభరావనీశ నీ కి♦కేమి చెప్పవాఁడ నా
క్షితీశుఁ డిట్లు వల్కునంతఁ ♦ జిత్రమొప్ప నారకుల్
గతాఘులై పవిత్రదివ్య♦గాత్రముల్ ధరించి సం
స్తుతింపుచున్ నృపావతంసుఁ♦జూచి పల్కి రందరున్. 3౭

క॥ అయ్యా! నీ పుణ్యంబున, నియ్యెడ దుఃఖముల కెల్ల♦నిరవగు నిరయం బొయ్యన వెడలఁగ నేర్చితి, మయ్యా శ్రీపరమపదము ♦ నందెద మింకన్. 3౮

వ॥ ఇట్లు దయాసముద్రుండగు నా జనకభూపాలునిం బ్రశంసింపుచు సూర్యసంకాశ దేహులగు నారకులు సకల బృందారకాలంకృతంబగు నాకంబున కరిగి రని బుతంభరుం గూర్చి తెలిపి జాబాలి తిరిగి యిట్లనియె. 3౯

—♦ జనకుని పూర్వవృత్తాంతము ♦—

చ॥ నృపవర! ధర్మవిద్వరు దిR♦నేంద్రసుతుం జనకుండు వల్కె నీ
వెపుడఘకారులైన నరు♦లీపురిఁ జేరుదు రంతె కాని పు
ణ్య పరిచితుల్ నరోత్తములు ♦ నక్షుల నైనను గానరంటి వే
నెపమున వచ్చితిచ్చటకు ♦ నిక్కము నా కెఱిగింపవే యనన్. ౪౦

వ॥ యముం డిట్లనియె. ౪౧

సీ॥ భూనాథ నీవంటి ♦ పుణ్యాత్ముఁ డెందైన, వెదకినఁ గలఁడె యీ♦విశ్వమందు
రఘునాథపద్ద్వయ ♦ రాజీవమధుమధు, వ్రతుఁడవు పరమపా♦వనుఁడ వీవు
దుష్టభేదినియు సం♦తోషకారిణియైన, త్వత్కీర్తిజాహ్నవి ♦ పావనరుల
మలయుతులను బవి♦త్రులఁ జేసెనైన దు,ష్కృతము నీ యందున♦ నించుకంత
తే॥ యమ్యో వినిపింతు విను నీవొ♦కప్పుడావు,పసిరికను మేయుచుండ నా♦వలకుఁ దోలి
నాఁడ వా కారణమున నీ♦నరకములను, జూడనైతివి నీ వింత♦ వాఁడవయ్యు. ౪౨

ఉ॥ పొమ్ము నృపాలవర్య నిజ♦పుణ్యసమార్జిత సర్వభోగముల్
సమ్మతి నొందుమయ్య ♦ చని స్వర్గమునందున నాదుప్రోలు మా
ర్గమ్మున రాక తక్కినను ♦ గస్తులు వీరల కెట్లడంగు దుః
ఖమ్ముల నొందు నన్యులను ♦ గాంచి సహింపరు కాదె సజ్జనుల్. ౪౩

ఆ॥ ఇటులనుడువుచుండు ♦ నినజున కతిభక్తి,నందనము లొనర్చి ♦ పడసి యాజ్ఞ
నప్సరః ప్రదీప్త ♦ మైనవిమానంబు,నెక్కిచనియె జనకుఁ♦డింద్రపురికి. ౪౪

కం॥ భూవర యెవ్వారలకును,గోవులు పూజ్యంబు లట్టి ♦ గోమాతృకలన్
గావరమునఁ దెగడెడి దు,ర్భావుఁడు నిరయంబు నందుఁ ♦ బడుఁ గల్పంబున్. ౪౫

తే॥ కావునను ధేనుపూజను ♦ గడకఁ గడు వి,శుద్ధచిత్తుఁడ వగుచు నో ♦ క్షోణినాథ
చేయుమా యది పరితుష్టిఁ ♦ జెందెనేని,పుణ్య ధర్మపరాయణుఁ♦బుత్రు నొసఁగు.

వ॥ అనుటయు నా ఋతంభరభూపాలుం డో మునీంద్రా! యే నియమంబున నేవిధిని నా గోవు నర్చింపవలె సమగ్రంబుగ నాకెఱింగింపవే యన జాబాలి యిట్లనియె.

క॥ వ్రతియగు పురుషుఁడు నియతిన్, బ్రతిరోజును గోవువెంట ♦ వనికిం జని జా
గ్రతతోఁ గాపాడుచు నా,యతనమునకుఁ జేరుచుండ ♦ నగు సాయమునన్. ౪౭

ఆ॥ మఱియు సుతునిగోరు ♦ పసనుజుఁడు యవలను, ధేనువునకు మేపి ♦ దాని పేడ
లోని యవలఁ గడిగి ♦ పూని పక్వమొనర్చి,భక్షణంబు సేయ♦వలయు నెప్రుడు. ౪౮
తే॥ ఆవుపానీయ మెప్పుడుఁ ♦ ద్రావుచుండుఁ,దాను బానీయ మప్పుడ ♦ త్రావవలయు
నున్నతస్థితి నదియెప్పు ♦ డుండునప్పు,తడయు కతఁ డుండ నగు నీచ♦తలమునందు.

ఉ॥ ఈఁగలఁ బారఁదోలు చొగి ♦ నెప్పుడు బాలతృణంబు మేపుచో
నీగతి గోవు తుష్టి మది ♦ నెంతయుఁ బొందఁగఁ జేయుఁ దా మహా
భాగుని ధర్మతత్పరు నృ♦పాల కుమారు నొసంగునంచు నా
జోగి వచింప నా క్షితిభు♦జుండును నంతట గోవ్రతస్థుఁడై. ౫౦

వ॥ ప్రత్యహంబును దృణాద్యర్పణంబున నా ధేనువుం బరితుష్టి నొందింపుచుఁ దత్కరీపక్వయవాన్నంబుఁ దినుచు సపర్యలన్ దనుపుచుండ బహుదినంబులు గడచె నంత నా మొదవొక్కనాడు. ౫౧

— ♦ ఋతంభరునకు గోహత్యాదోషము వచ్చుట ♦ —

సీ॥ శత్రుఘ్న వినుము ఘోర♦సము వని నిర్భయమ్ముగ మేయుచుండ నా♦భూమిపాలుఁ
డా వనసంపద ♦ నతికుతూహలమున, నొగిఁ గాంచు చేమఱి♦యుండు నంతఁ
బంచాస్యమొక్కటి ♦ పఱతెంచి యంభా య,టంచు నార్చెడి తన♦ యంబఁబట్టి
చంపుటఁగని గుండె ♦ ఝల్లుమనఁగ భువిఁ,బడి యేడ్చి యేడ్చి జా♦బాలి కడకుఁ
తే॥ జని పదంబులఁబడుచు నో♦సంయమీంద్ర,మీ యనుజ్ఞను మొదవును♦ మేఁపుచుండ
నెట్టువచ్చెనో సింహ మే♦ నెఱుఁగ దాని,మడియఁజేసెను నాదుక♦ర్మంబదేమొ. ౫౩

ఆ. ఏమిసేతు నయ్య ♦ యీపాప మెటుఁబాపి, కొందునయ్య సుతుని ♦ జెందఁగల్గు
వ్రతసమాప్తి యెట్టు♦జతపడునయ్య యం,చడలు నృపతిఁ గూర్చి♦యనియె మౌని.

క॥ గోయక బ్రాహ్మణజీవము, వాయఁగ నొనరించునట్టి ♦ పాపికి స్వర్ణ
స్తేయికిఁ గృతఘ్నుకైనను, బ్రాయశ్చిత్తములు కలవు ♦ పార్థివ వింటే. ౫౫

క॥ వ్రతదానంబుల నియతుల, నతులిత కృచ్ఛ్రాదికముల ♦ యమనియమములన్
గ్రతువుల మఱి సత్క్రియలను, హితమతిఁజేయంగ నడఁగు ♦ నే పాపంబుల్. ౫౬

ఆ॥ గోవుఁజంపినట్టి ♦ క్రూరమానవునకుఁ, బద్మనాభు దూరు ♦ పాపునకును
వీరలిద్దరికిని ♦ వెదకిన నెందైన, లేవు పాపసమితి ♦ పోవు విధులు. ౫౭

వ॥ బుద్ధిపూర్వకంబుగ గోవులకు దుఃఖంబుఁ గలిగించు నీచుండు బదు
నలుగు రింద్రుల కాలంబు నరకంబున నుండు నొక్కమారైనను హరినింద
సలుపు దౌర్భాగ్యుండు పుత్రపౌత్ర పరివృతుండై నిరయంబునఁ గూలుం గావునఁ
దెలిసి యీరెంటినిం జేయఁదగ దవి చేసెనేని యెన్నటికిని నరక విముక్తి నొందఁ
డజ్ఞానంబున నీకు గోహత్యాదోషంబు సంభవించెఁగావున దానికిఁ బ్రాయ
శ్చిత్తంబుఁ గల దందు కొక యుపాయంబుఁ దెల్పెద విను మని జాబాలి
యిట్లనియె. ౫౮

తే॥ రామభక్తుఁడు సుగుణ వి♦రాజితుండు,శత్రుమిత్రుల యందున ♦ సమధిషణుఁడుఁ
బూజ్యుఁడైనట్టి ఋతుపర్ణ♦భూమిపాలు,నాశ్రయింపుము నిష్కృతి♦నతఁడు దెల్పు.

ఉ॥ మున్ను నృపాల నీ వతని ♦ భూముల నాక్రమణంబు సేయఁగాఁ
గ్రన్ననఁ బాఱఁదోలెను బ♦రాజితుఁ జేయుచు నిన్ను దెంచుచున్
గన్నడ సేయువాఁడతఁడు ♦ గాఁడు సుమీ రిపుభావ మూన కీ
వన్నరనాథుఁజేరి విధ♦మంతయుఁ దెల్పుము పొమ్ము భూవరా! ౬౦

ఆ॥ అతఁడెట్లుఁ దెల్పు♦నట్లొనర్పు మటంచు, భూసురుండుఁ దెలుప♦భూతలేంద్రుఁ
డేగి రామభక్తుఁ ♦ ఋతుపర్ణునిం గని, పల్కెనిట్లు దీన♦వదనుఁ డగుచు. ౬౧

వ॥ నరేంద్రా యెఱుంగమి నాకు గోహననజనితం బగు నఘంబు సంక్రమించె నదెట్లడంగు జాబాలి యను తపోధనుని యాజ్ఞచే నీ కడ కరుగుదెంచితి నన ఋతుపర్ణుం డిట్లనియె. ౬౨

భుజంగ ప్రయాతము.

ధరానాథ సచ్ఛాస్త్ర ♦ తత్త్వజ్ఞులం దెం,దరో యుండఁగా నే వి♦ధానన్ సరింగా
ని రాజాధము న్నాఘు♦సిన్ జేరి తో యు,ర్వరానాయకా నాత♦రంబానె తెల్పన్. ౬౩

ఉ॥ ఐనను దీనమానసుఁడ♦వై యిటు వల్కితి వీవు కావునన్
నే నెటులో వచించెదను ♦ నేర్చిని భంగిని నించుకంత నీ
కా నుడులందు శ్రద్ధకల♦దా విను మాదర భావమూని యో
మానవనాథయంచు బుధ♦మాన్యుఁడు తా ఋతుపర్ణుఁ డిట్లనెన్. ౬౪

క॥ త్రికరణశుద్ధిగ రాఘవు, నకళంకస్వాంతయుతుఁడ ♦ వై యర్చనలన్
వికసన హృదయునిఁగా ద♦ప్పక సేయుము నామమెప్పుడుఁ ♦ బఠియింపు మెదన్,

సీ॥ సంతుష్టుఁడగుచు నీ♦స్వాంతమందలి కోర్కె, లన్నిటి నిచ్చుధ♦రాధినాథ
యజ్ఞానకృతధేను♦హత్యాఘ మడఁచు నా,తని పూతనామంబుఁ♦దలఁచు చెపుడు
ధేనుపాలనము ♦ మానుగఁజేయుము, బంగార మొసఁగుము ♦ బ్రాహ్మణులకుఁ
బాపంబునశియించు ♦ భద్రింబు లొనఁగూడు, సంచాతఁడు వచింప♦హర్షమంది,
తే॥ యా ఋతంభరుఁడఖిలాఘ♦హారణనిపుణ, మైన శ్రీరామనామ మ♦త్యంతభక్తిఁ
బఠనఁజేసి పవిత్రుఁడై ♦వ్రతము మఱలఁ, జేయఁదొడఁగెను రాముని♦ జేర్చిమదిని.

క॥ భూతహితైకరతుండగు, భూతలనాథుండు విపిన♦భూమి మొదవుఁదా
నేతఱి నేమఱక భయో, పేతుండై మేపుచర్వ♦విధుల భజించెన్. ౬౭

వ॥ ఆగోవు సంతసించి యిట్లనియె. ౬౮

ఆ॥ పుడమిఱేడ నీదు♦పూజలకెనఁ గడు, సంతసంబుఁగల్గె ♦ స్వాంతమందు
నున్నకోర్కెఁ దెల్పు ♦ మన్నసత్పుత్రిని, రామభక్తు నుగుణ♦ధాము నొకని. ౬౯

క॥ ఇమ్మా నా మనవిని గై♦కొమ్మా మా యమ్మ యంచు ♦ గోర నృపతి తా
సమ్మతిఁ బితృపూజారతుఁ, ♦ బొమ్మిచ్చితినంచుఁ బల్కి♦పోయె సురభియున్. ౭౦

వ॥ అంత నిలాకాంతుండు దన కాంతయందు సకాలంబునఁ బుత్రింగాంచి సత్యవంతుండను నామం బొనర్చి క్రమంబునఁ జౌలోపనయనాదులను జేసి పరమానందంబు నొందుచుఁ బితృభక్తి పరాయణుండును శక్రతుల్యపరాక్రముండును నగు నా పుత్రునియందు రాజ్యభారం బంతయునుంచి తపోవనంబున కరిగి యందు భక్తియుక్తుండై హృషీకేశు నారాధించి విధూతాఘుండై పరమపదంబు నొందెనని చెప్పి సుమతి మఱియు నిట్లనియె. ౭౧

—♦ సత్యవంతుఁ డశ్వమును శత్రుఘ్నున కర్పించుట ♦—

సీ॥ శత్రుఘ్న! వినుమయ్య! ♦ సత్యవంతుం డని, ఖ్యాతిఁగాంచిన యీ ధ♦రాధినేత
తన ధర్మమెప్పుడుఁ ♦ దప్పకపూజల, విశ్వనాథుని రఘు♦వీరుఁ దనుపఁ
బరితుష్టుఁడై రమా♦పతినిజపాదాంబు జార్చనాచంచల ♦ మధికతరముఁ
బుణ్యకోటులచేతఁ ♦ బొందని సద్భక్తి ♦ నొసఁగె నంతట నృకు♦లోత్తముండు
తే॥ దాశరథి సచ్చరిత్ర మీ ♦ధరణియందుఁ ♦ బ్రచురముగఁజేసి జనులను బావనులుగఁ
జేసె శ్రీశుని రాము భ♦జింపనట్టి, పాపులను బట్టి శిక్షించె♦ భయదముగను ౭౨

క॥ ఎనుబదివత్సరములపై, ♦ నెనిమిది సంవత్సరంబు ♦ లేకాదశి భూ
జనములచేఁ జేయించెను, తననామము సార్థకముగఁ ♦ దగఁజేసికొనన్. ౭౩

తే. అనఘ శత్రుఘ్న! చూడ నెం♦దైనసాటి, కలరె యీ సత్యవంతున♦కిలను విను క
మలదళాక్షపదాంబుజ ♦ తులసిమాల, విడువదెన్నఁడు వసుమతీ♦విభుని గళము.

చ. ఇతరులఁజెప్పనేలను ము♦నీందుఁల కెల్లను బూజ్యుఁడార్యుఁడం
చితమతి రామనామజప♦శీలుఁడు వింటె హతాశుభుండు ని
ర్వృతదురితుం డతం డెఱిగి ♦ శీఘ్రముగా ధనరాశిఁగొంచుఁదా
హితమతిఁదెచ్చి వీరి నిపుఁ♦డిచ్చును రాజ్యముతోడ భూవరా. ౭౪

వ॥ అనుచిట్లు సుమతి శత్రుఘ్నునితోఁ బలుకుచుండ సకలాలంకారశోభితం బగు సవనాశ్వంబు పురీమధ్యంబుఁజేరె నంత పురజనము సత్యవంతుంగాంచి యిట్లనియె.

తే. ఎవరిదోకాని సవనాశ్వ♦ మవనినాథ, గాంగజలతుల్య వర్ణంబుఁ♦గల్గి ఫాల
భాగమందున సౌవర్ణ ♦ పట్టమొకటి, గ్రాల మన పురిమధ్యను ♦ గానఁబడియె.

క॥ అనవిని ధరణీశుం డి,ట్లనె నగుచో జనములార ♦ యశ్వమెవరిదో
కనిరండ టంచుఁ బలుకఁగ, జని యెఱిగి వచించి రిట్లు ♦ జననాథునితోన్. ౭౫

తే॥ అయ్య! యని మనరాముని ♦ యజ్ఞహయము, వీరితోవచ్చె నాతని♦పిన్నతమ్ముఁ
డాతనికి బాసటగవచ్చె ♦ నంబురాశి,నొక్కయడుగుగఁదాటిన ♦ మొక్కలుండు.

తే॥ అక్షరద్వయపరిమిత♦మై మనోభి, రామమై యొప్పు శ్రీరామ♦నామము విని
హర్ష వారిధిలో నోల♦లాడి నృపుడుఁ, బల్కెనిట్టుల గద్గద♦స్వరము గదుర. ౭౬

శా॥ ఏ సాకేతపురీశు రామునెపుడే ♦ హృద్వీథిఁ జింతింతునో
యా సాకేతపురీశు రాఘవుని య♦జ్ఞాశ్వంబు శత్రుఘ్నుతో
శ్రీసామీరి నృపాది భక్తతతితోఁ ♦ జేరంగ విచ్చేసె నా
యాసం బించుక లేక దర్శనము నా ♦ కబ్బెన్ గృతార్థుండ నేన్. ౭౭

వ॥ ఇట్లు నుడువుచు నమాత్యుంగాంచి యిట్లనియె. ౭౮

ఆ॥ మంత్రివర్య రమ్ము♦మన సర్వధనములఁ, గొంచు రఘుకులాబ్ధి♦కుముదమిత్రు
సప్తిపాలనంబు ♦ సలుపుచు శ్రీరామ, చంద్రుసేవఁ జేయఁ♦జనెను వాఁడ. ౮౩

తే॥ పలుకుచిట్టుల సైనిక♦ప్రతతితోడ, సత్యవంతుఁడు వెడలె నా♦సమయమందు
జయజయధ్వని వాద్యని♦స్వనము లలరఁ, జేరె నాపురి సౌమిత్రి♦సేనతోడ. ౮౪

ఉ॥ అంతట సత్యవంతుఁ డరి♦హంతపదంబులఁ బుత్రమంత్రిసా
మంతులతోడ వ్రాలి హను♦మంతుని గౌఁగిటఁ జన్ని పొంగుచున్
స్వాంతమునందు విత్తమును ♦ సర్వముఁ బంక్తిరథావనీట్సుతో
పాంతమునందుఁ బెట్టి విన♦యంబున ♦ నర్పణఁజేసె రాజ్యమున్. ౮౫

తే॥ అంతలవణాంతకుం డనం♦తాధినాథు, జానకీనాథు భక్తునిఁ♦గా నెఱింగి
రక్తిఁ గౌఁగిటఁ జేర్చి త♦ద్రాజ్యమతని, పుత్రుఁడగు రుక్మకొసగె నో♦మునివరేణ్య.

వ॥ సత్యవంతుండును సుబాహుఁడు మొదలగు రాజన్యుల నాలింగనం బొనర్చి మా శ్రీరామచంద్ర చరణార్చనారతులఁ బొడఁగంటి సకలాఘంబుల గెంటి కృతార్థతఁ గంటి మంటినని యుప్పొంగుచుండు నంతఁ దురంగంబు వీరభట పరివృతమై దూరంబుగాఁ జనుటయు శత్రుఘ్నుండును సత్యవంతునితో ప్రీతి ననుగమించె నప్పుడు రథగజాది చతురంగబలంబులతోఁ బుష్కలాది యోధవర్గంబును నడుచుచుండె నంత. ౮౭

—♦ విద్యున్మాలి యను రక్కసుఁడు సవనాశ్వం బపహరించుట ♦—

క॥ స్వీయుఁడు వీఁ డాతఁడుఁ బర, కీయుఁడు నా భేదమేమి ♦ గీల్కొనని తమం
బేయెడఁ దోఁచె రజంబు వి, హాయసమును గప్పె రసిత♦హ్రాదిను లొప్పెన్. ౮౮

తే॥ మదికి భయమగునట్టి స♦మ్మర్దమునన, మేధ్యపూయాదికంబు లు♦మేయరక్త
వర్షముగురియుచుండె న♦భ్రములు దివిని, భీతిచే వ్యాకులముఁ జెందె♦వీరగణము.

సీ॥ కనులకుఁ జీఁకట్లు♦గ్రమ్మె నింతటిలోని, దేమి చిత్రమటంచు ♦ నెంచువారు
నెదియో తురంగమం ♦ బెదియో మతంగజం, బెదియో రథంబంచు ♦ నీఁగువారు
నశ్వరతురగమే ♦ మైనదియో యింత, కని యెటు చనలేక ♦ యడలువారు
దుర్గంధమున కెడ ♦ తొలఁగుద మనిపోయి ♦ యొకరిపై నొకరుఁగా ♦ నొఱగువారు

ఆ॥ నగుచునుండ రావ♦ణాసురునిసఖుండుఁ, బాప జగమునందు ♦ వఱలువాఁడుఁ
బొలసుదిండ్లతోడఁ♦గలసి విద్యున్మాలి, యనెడు దైత్యుఁ డశ్వ♦మపహరించె. ౯౦

క॥ వీరాళులు భయమందఁగ, నారూఢుండై విమాన♦మం దా దైత్యుం
డీ రీతి ప్రీతిఁ గొని చనెఁ, బొఱలె జీకటులు తెల్ల♦వాఱె దిక్కుల్. ౯౧

క॥ వీరులు శత్రుఘ్నాదులు, వారువమేదేది కానఁ♦బడ దెట ననుచున్
జీరు చొకరొకరి నాహా, కారముల నొనర్చి రపుడు ♦ గలగన్ బడుచున్. ౯౨

ఆ॥ క్రూరదనుజుఁ డెవఁడో • ఘోటకహరణంబుఁ, జేసె నిప్పు డేమి • సేతు మనుచు
గాఢచింత నుండఁ • గామగమగు విమానంబులోఁ దోఁచె • నాకవైరి. ౯౩

వ॥ దుర్ముఖులుఁ గరాళాస్యులు లంబదంష్ట్రులు భయానకు లగు రక్కసులు పెక్కండ్రు రథవిమానారూఢులై సైన్యహరణోత్సుకులై కనుపట్ట నపుడు యోధులు శత్రుఘ్నుం గాంచి యిట్లనిరి. ౯౪

క॥ నాకవిమానం బందున, నాకరిపుం డెపుడు వచ్చె • నాఁడో నృప పెం
జీఁకటులలోన మముఁ జీ, కాకుఁబఱచి సవనసప్తి • గైకొని చనియెన్. ౯౫

తే॥ రాజశార్దూల యిపుడు తు • రంగమంబు, నొందుమార్గంబుఁ గనుమయ • థోచితముగ
ననుచుఁ దెల్పిన శత్రుఘ్నుఁ • డాగ్రహమునఁ బండ్లుఁ గొఱుకుచు మునిరాయ • పలికె నిట్లు.

తే॥ అస్మదీయాశ్వమును బట్టి • నట్టి క్రూర, రక్కసుం డెవ్వఁడో సుఖ • రంబులైన
మత్సరంబుల నతని వి • మాన మిపుడ, పరియలై తునకలై నేలఁ • బడెడుఁ గాక.

ఉ॥ సైనికులార నా శితపృ • షత్కములన్ బలలాశి శీర్షమీ
రౌనఁ దాటిపండువలె • నాహవభూస్థలిఁ గూలుఁగాక మీ
సేనల నన్నిటిన్ ద్వరగ • సిద్ధము సేయుఁడు సాధనంబులన్
బూనుఁడు రండురండనుచుఁ • బుద్ధిమదగ్రిజుఁడైన మంత్రితోన్. ౯౮

క॥ రక్కసుఁ డతిబలవంతుం, డొక్కఁడు గాఁడతఁడు పెక్కు • లుండిరి వారిన్
జక్కడఁచునట్టి శూరుల, నిక్కడఁ గలవారిలోన • నెఱిఁగింపు మొగిన్. ౯౯

వ॥ అనుటయు సుమతి యిట్లనియె. ౧౦౦

సీ॥ అరితాపనుండు శ • స్త్రాస్త్రసంయుక్తుండు, మనపుష్కలుఁడు మందుఁ • జనును గాక
తన తీక్ష్ణశరములఁ • దద్వ్యానభంగం బొనర్చు లక్ష్మీనిధి • నడుచుఁ గాక
పావనిఁ గూర్చి చె • ప్పఁగ నేల వెఱుఁగఁ, రక్కసులను దోఁక • నొక్క మొగిని
జుట్టి నేలను బెట్టి • కొట్టఁగలఁడు ము, ఖ్యముగ నాతఁడు ముందుఁ • గదలుఁ గాక
తే॥ వీరులును యుద్ధకర్మ వి • శారదు లగు వానరుల్ రిపుతాపను • బాహునృపులు
నాప్రతాపాగ్ర్యుఁడును యుష్మ • దాజ్ఞఁ బూని, యేఁగెదరు గాక దనుజుల • యేపుమాప.

ఆ॥ నీవు నస్త్రశస్త్ర • నిఖిలాయుధములతోఁ, స్యందనంబు నెక్కి • సకలరాక్ష
సాధములజయింప • నరిగి జయంబు నొం, దెదవుఁ గాక నేఁడు • దితిజమథన. ౧౦౨

క॥ రక్కసులను బిరుతివియక, బెక్కండ్రు నడంచువారి • వే పనుపు మిఁకన్
దక్కినవారల ననదల, నెక్కువగాఁ బంపునంత • నేమి ఫలంబో. ౧౦౩

సీ॥ అను మంత్రిపలుకుల • కలరి శత్రుఘ్నుండు, యుద్ధకోవిదులైన • యోధులెవరో
వారలా రాక్షస • వీరుల వధియింప, బ్రీతిన సేయుఁడు మీరు • బలము కొలఁది

జన్యంబుసేయ వేఁ ♦ జనుఁడని నుడువంగ, సరగున లేచి పు♦ష్కలుఁడు ముందు
పలికె నిట్టుల భూమి♦పాలకశార్దూల, వినుము యూథపులార ♦ వినుఁడు మీరు
తే॥ మత్సరాసన నిర్గత ♦ మార్గణములఁ, బొలసుదిండిని బెనుమూర్ఛఁ ♦ బుచ్చి కీర్ణ
భ్రమరకాకులముఖునిఁగాఁ ♦ బఱపకున్నఁ, జేయుచున్నాఁడ శపథంబు♦ వేయునేల.

క॥ క్రతుభుక్కులఁ దిట్టిన మ, ర్త్యులకుఁ గన్యాస్వమునను ♦ బ్రతుకు జడులకున్
యతినింద సలుప నేదు, ష్కృతమగునో యగును నాకు ♦ సిద్ధం బదియే. ౧౦౫

వ॥ నా శరవిసరంబుల నాశరవిసరంబు లసువులఁ బాయఁజేసి నా వచనం బనృతం బయ్యెనేని మఱియు నా శపథంబు వినుండు శివకేశవులకును శివాశక్తులకును భేదంబుఁ గలుగజేయువాని పాపంబు నాకగుఁగాక నా యీ శపథంబుల శ్రీరామచంద్రుని పాదారవిందముల యందలి భక్తియే సత్యంబుఁ గావించుఁగాక యనుచుండ లక్ష్మీనిధి యిట్లనియె. ౧౦౬

సీ॥ వినుఁడు శాత్రవులకు ♦ విముఖుఁడ నైతినేఁ, శ్రుతినిందకు నుపేక్షఁ♦జూచువాని,
దానంబుఁ గొనిన మొ♦దవునప్డు మూఢుఁడై, యర్థలోభంబున ♦ నమ్మువాని
మ్లేచ్ఛకూపస్థ స♦లిలముఁ గ్రోలి తదఘ, హననవిధిని జేసి♦కొననివాని
బ్రాహ్మణుఁడై దుష్ప్ర♦వర్తన కల్గి ప, యస్తక్రలాక్షాదు ♦ లమ్మువాని
తే॥ పాపముల నొందువాఁడ నా♦ప్రతిన యిది య
టంచు నుడువఁగ హనుమంతుఁ ♦ డనియె రామ
పదసరోజంబులను మదిఁ ♦ గుదురుపఱచి
కడు స్మరింపుచు శుభవచః♦కలనఁ బెరసి. ౧౦౭

ఉ॥ ఏ రఘువీరు యోగు లెద ♦ నెప్పుడు ధ్యానము సేయుచుందురో
యే రఘువీరు పాదముల ♦ కెప్పుడు మర్త్యులు మ్రొక్కుచుందురో
యే రఘువీరుఁ డార్యనుతుఁ ♦ డెప్పుడు సర్వదిగీశ పూజ్యుఁడో
యా రఘువీరుఁ జేర్చి మది ♦ నన్నది సత్యముఁగాక తప్పునే. ౧౦౮

ఉ॥ ఒక్కఁడు వీఁడు దుర్బలుఁడు ♦ వ్యోమవిమానచరుండు నాకు నీ
రక్కసుఁ డొక్కలెక్కయె పు♦రందరుతో విబుధాలయంబు పెం
పెక్కఁగఁ దోఁకఁజుట్టి యది ♦ యెక్కడనో పడవేయలేనె మీ
రక్కజమందిచూడఁ బ్రళ♦యాబ్ధుల నాల్గిటి సింకఁ జేయనే. ౧౦౯

తే॥ ఇంతియేకాదు సుందు మా♦యినకులావ, తంసుఁడౌ రామభద్రుని♦దయయు నాదు
తల్లి శ్రీజానకీదేవి ♦ దయయె యున్న, లెక్కయే సేయ నా కెంత♦లేసిపనులు.

ఆ॥ అస్మదుక్త మనృత ♦ మగునేని రాముని, పాదములకు దూర♦మౌదుఁ బాలు
ద్రావుబుద్ధిఁ గపిల ♦ గోవును గాపాడు, చుండు శూద్రు దురిత మొందువాఁడ.

క॥ ముట్టిన వాసనఁజూచినఁ, బట్టుగ నరకమున నేది ♦ పడఁద్రోయునో పల్
గట్టఁగలేకను నాలుక, నట్టి సురన్ ద్రావువాని ♦ యఘ మగు నాకున్. ౧౧౨

ఆ॥ ఇటులఁబల్క వీరు ♦ లెల్లఁగి యోధులు తమ, బలముకొలది శపథ ♦ ములను జేయ
వినుఁడు నా ప్రతిజ్ఞ ♦ వీరులార యటంచు, నంత శత్రుహంత ♦ యనియె నిట్లు.

అంబురుహము॥ రక్కసు పుత్త్రి విమానము నుంచి శ♦రంబులన్ ధరణీస్థలిన్
జెక్కులుముక్కలు జీలికలై పడఁ ♦ జేయ నేరక యుంటినేన్
రొక్కముఁ గోరి యబద్ధపుసాక్ష్యము ♦ రోయక న్వచియింప నే
యెక్కుడు పాపమువచ్చునో నా కది♦యే యగున్ నిజ మంటినేన్. ౧౧౪

ఆ॥ స్వర్ణహరణమునను ♦ వచ్చెడు పాపంబు, బ్రహ్మ నిందవలనఁ ♦ బడయు దురిత
మాడి తప్పువాని ♦ యఘ మంతయును నన్ను, జెందుఁ బలికి నట్ల ♦ సేయకున్న.

వ॥ ఇట్లు శపథంబులుసేయు శత్రుఘ్నుం గని యోధు లిట్లనిరి. ౧౧౬

క॥ ధన్యుఁడ వో రామానుజ, యన్యుఁడు నీ కన్నఁ గలఁడె ♦ యధికుఁడు భువిలో
మాన్యుఁడ వౌదువు రాణ్మా, ర్ధన్యుఁడ వీ వన్నమాట ♦ దబ్బఱ యౌనే. ౧౧౭

ఉ॥ మున్ను మధుక్షపాచరుని ♦ పుత్త్రకుఁ డా లవణుండు శౌర్య సం
పన్నుఁ డమర్త్యమర్త్య సుర♦వైరివిపత్ప్రదుఁ డట్టి వాని నీ
వెన్నక త్రుంచినాఁడ వితఁ♦డెంత తలంపఁగ నీదు ముందరన్
గ్రన్ననఁ జంపి రక్కసుని ♦ గాంచుము సద్యశ మో నృపోత్తమా. ౧౧౮

వ॥ అని వీరయోధులు తమ తమ సేనల నాయత్తంబు సేసి సాయుధులై చేసిన శప
థంబులు సత్యంబులు సేయ రాక్షసుల కెదురుగాఁ జని రని వాత్స్యాయనమునితో.
శేషుండు వెండియు నిట్లనియె. ౧౧౯

—♦ శత్రుఘ్నునిచే విద్యున్మాల్యుగ్రదంష్ట్రలు మడియుట ♦—

తే॥ నిఖిల రత్నప్రభాసమ♦న్వితము లస్త్ర,శస్త్ర సంపూరితములు బ్ర♦శస్తతురగ
భాసురము లగురథముల ♦ భటులఁ జూచి, కామయానస్థితుండు ర♦క్కసులఱేఁడు.

వ॥ మేఘ గంభీర భాషణంబులఁ దర్జింపుచు నిట్లనియె, ౧౨౧

చ॥ భటవరులార రావలదు ♦ భండనమందున నన్ను గెల్తురే
యటమట లేలఁ బొందు స్వగృ♦హంబుల కెందుకుఁ జచ్చెద ర్మహా
నటుఁ డిపు డేగుదెంచి మది ♦ నాటఁగఁ జెప్పిన వీతి నిత్తునే
పొటపొట రాల్తుఁగాక శిర♦ము ల్శరపఙ్క్తులచే ధరాస్థలిన్. ౧౨౨

క॥ మును మీ రామునిచేఁ జచ్చినరావణ సఖుఁడ వీర♦శిక్షకుఁడను నా
తని ఋణ మీఁగుటకై నే, వినుఁ డందరు వచ్చినాఁడ ♦ విద్యున్మాలిన్. ౧౨౩

తే॥ రాముఁ డెక్కడ నతని గా♦రాబుతమ్ముఁ, డైన శత్రుఘ్నుఁ డెక్కడ♦నహహ యాత్రఁ
డఖిలశూరశిరోమణి ♦ యట గళంబుఁ, దఱిగి రక్తంబు నురుగుతో ♦ ద్రావు దిపుడు.

వ॥ ఇట్లు పలుకు విద్యున్మాలి పలుకులు విని యోధాగ్రేసరుం డగు పుష్కలుం డిట్లనియె. ౧౨౫

తే॥ ఓరి రాత్రించ♦రాధమ యుద్ధమందు, వీరభటుఁ డెన్నఁడైన నీ ♦ విధముగా వి
కత్థనంబులు వలుకునే ♦ కాండవృష్టిఁ, బఱపి తన బలశౌర్యముల్ ♦ నెఱపుఁగాక.

ఉ. రావణు పుత్త్రమిత్త్రముఖ ♦ రాక్షసవర్గముతోడఁ జంపి యీ
భూవలయంబునందు యశ♦ముం గడియించిన రాము జన్నపు
మ్మావు హరించి యేగ వశ♦మా దనుజాధమ నీ శిరంబు ర
మ్మా వసుధన్ బడం గలదు ♦ మా లవణాంతకు వాడి కోలలన్. ౧౨౭

ఆ॥ అవని జీవశూన్య♦మై పడియున్న నీ, మేను నక్క లలమి ♦ మిడిసి పడుచుఁ
దినెదుఁగాక యేలఁ♦దీండ్రించెదవు రామ,భక్తు నెదుటఁ బ్రేల♦వలదు దుష్ట. ౧౨౮

క॥ నిర్జించి రిపుల యోధులు, గర్జింతురుగాని మున్న♦గర్జింప రిటుల్
గర్జించు నతని గన్గొన, వర్జింతురు శూరవరులు ♦ వసుధాస్థలిలో. ౧౨౯

వ॥ ఇట్లు వలుకు రణదుర్మదుం డగు పుష్కలుం గని రక్కసుఁ డిట్లనియె. ౧౩౦

మ॥ అటులా డింభక చూడు నా బలము నీ♦వంచు న్మహాశక్తినిన్
బటు బాహాబల మొప్పఁ దా విసరివై♦వన్ బద్ధఘంటారవా
ర్భటితో మీదకు వచ్చు దానిఁ గని మా♦ర్గంబందు నేసె న్మహో
త్కట బాణంబులు మూఁడు బాలుఁ, డది ము♦క్కల్భూమి మూఁడై పడన్. ౧౩౧

సీ॥ విష్ణుశక్తిత్రయి ♦ విధమున మెఱయుచు, శకలములై యున్న ♦ శక్తిఁ జూచి
పరతాపనుం డగు ♦ పలలాశి లోహ ని,ర్మితముఁ దీక్ష్ణాగ్రముఁ ♦ ద్రిశిఖ లొప్ప
జ్వలనసమానమై ♦ వఱలు త్రిశూలము, వైవ మండుచుఁ బైకి ♦ వచ్చుదాని
శరములఁ దిలలంత ♦ శకలంబులుగఁ జేసి, మఱల భారతి శిత♦శరము లేయ

ఆ॥ నవి పలాశిహృదయ♦మందున రాగముఁ, గలుగఁజేసి చొచ్చెఁ ♦ గమలనయన
భక్తజనుల హృదయ♦పంకజముల మనో, హరములైన హరిగు♦ణాళి మాడ్కి.

క॥ ఆశరవీరుఁడు పెల్లుగ, నాశరవేధకు శుగార్తుఁ♦డై యధిక క్రుధా
వేశంబున ముద్గరమును, దాశరథితనూజుఁ జంపు♦తలఁపున వైచెన్. ౧౩౩

ఉ॥ వైచిన ముద్గరాయుధము ♦ వ్రచ్చి యురంబునుగాడఁ బుష్కలుం
డేచిన బాధచేఁ జలన ♦ మెంతయు నొందు చొకింత మూర్ఛయుం
దోచినఁ దేరుమీదఁ బడి ♦ తోడన లేచి నిశాచరేశ్వరా
చూచితి నీ పరాక్రమము ♦ శూరుఁడ వౌదువు రాక్షసాళిలోన్. ౧౩౪

తే॥ నీ ప్రతాపంబు మెచ్చితి ♦ నేడు దనుజ, నా ప్రతిజ్ఞను జూడుము ♦ నారసముల
వక్షమును గాడనేసి పు♦ష్పకమునుండి, పుడమిపైఁ దలక్రిందుగఁ ♦ బడఁగఁజేతు.

ఆ॥ అనుచు నిట్లు నిశిత♦మగ్ని తేజస్కంబు, నరిదురాసదంబు ♦ నగుచు నుండు
చుండు దండిబాణ ♦ మొండు కోదండంబు, నందుఁ దొడిగి విడుచు♦ నప్పు డతఁడు.

తే॥ దీనికిఁ బ్రతిక్రియను సేయ ♦ దివురుసంత, లోనమోఘశరం బెద ♦ లోన దూరి
దూటిచనఁబెనుమూర్ఛ చేఁ♦దూలి దైత్యుఁ, డావిమానంబునందుండి♦యవనిఁబడియె.

వ॥ ఇంతకుమున్న వీరభట ప్రాణహరణ నిపుణంబు లగు శస్త్రాస్త్రంబులచే నొప్పు ధనుర్ధరశ్రేష్ఠుం డగు లక్ష్మీనిధితోఁ బోరాడుచున్న యుగ్రదంష్ట్రుండు పుడమిం బడియున్న యన్నం జూచి శాత్రవులవలని భయంబున వేఱొక విమానమునందుఁ జేర్చి యరయుచు బలవదగ్రగణ్యుం డగు పుష్కలుం గాంచి యిట్లనియె. ౧౩౮

ఉ॥ ఎన్నఁగవచ్చుఁ గాని నిను ♦ నేమరుపాటున నుండ నేను మా
యన్నను నిట్లు చేసితి వ♦హా యెటకేగెద వీవు దుర్మతీ
నన్ను జయించి వీఁకఁ గద♦నంబున నొందుము సజ్జయంబు నీ
వెన్నడుఁ గోరఁబోకుము జ♦యేచ్ఛ మనంబున నుండ నే నిటన్. ౧౩౯

ఆ॥ ఇటులఁ బల్కుచుండఁ ♦ బటుకోపభీషణ, నయనుఁడగుచు భరత♦నందనుండు
దశశితాంబకముల ♦ దనుజుని వక్షంబు, వగులనేసె నతఁడు ♦ బమ్మరిలఁగ. ౧౪౦

తే॥ అందు కత్యాగ్రహము నొంది♦యాశరుండు, బండ్లు పటపటఁ గొఱుకుచు♦భరతుపట్టి
పేరురంబునఁ బిడికిట ♦ బిట్టు పొడిచె, వజ్రనిర్ఘాతపాతరా♦వంబుఁ దోప. ౧౪౧

సీ॥ పరమాస్త్రవిదుఁ డగు ♦ భార్గతి యా ప్రహా, రమునకుఁ దలకక♦రామచంద్రు
స్వాంత మందుంచి తీ♦క్ష్ణములైన వత్సదం, తశిలీముఖంబుల ♦ దైత్యు నొంప
వ్యథనొంది యతఁడు జ్వా♦లాభీల మతిదారు,ణంబు జాజ్వల్యమా♦నంబు నగు త్రి
శూలంబువైవఁ ద♦చ్ఛూలఘాతంబునఁ, గశ్మలమును బొంది ♦ కఠినమూర్ఛ

తే॥ మునిఁగి రథమందు నొఱిగిన♦పుష్కలుఁగని, యనిలనందనుఁడాగ్రహ♦వ్యగ్రుఁడగుచు
సుడియవశమానె నాబారిఁ♦బడితివొక్క, తన్నులోఁ జంపెదను జూడు♦తడయకసుర.

వ॥ ఇట్లుగ్రదంష్ట్రుం గూర్చి పలికి తన కెదురుగా మూగుచున్న రాక్షసబలంబుల నొక్క గంతుఁ గొని. ౧౪౩

క॥ కొందఱ నఖములఁ జీల్చును, గొందఱఁ జెంపలను వాయఁ♦గొట్టును బండ్లన్
గొందఱఁ గొఱుకును దోఁకన్, గొందర బిగఁజుట్టి నేలఁ♦గొట్టు న్మొట్టున్. ౧౪౪

తే॥ బయలునకునేగి కరువలి♦పట్టి యపుడు, పొలసుదిండులతోడ నా ♦ పుష్పకములఁ
గరములను బట్టి తాళాలు♦గాఁగఁబెట్టి,దముగ వాయించి నుగ్గుగా♦ ధరణిఁగూల్చు.

సీ॥ అవనీతలంబున ♦ నడగియుండఁగఁ బూన, నచ్చటనుండు వా♦తాత్మజుండు
ఆకాశమునకేగి ♦ యందుండఁజూచిన, నచ్చటనుండు వా♦తాత్మజుండు
ఏమూలకైనను ♦ నెగిరిపోఁజూచిన, నచ్చటనుండు వా♦తాత్మజుండు
పదచారు లగుచును ♦ బాఱిపోఁజూచిన, నడ్డమై చను నని♦లాత్మజుండు
తే॥ ముందుఁజూచిన మారుతి ముందయుండు, వెన్కఁజూచిన మారుతి ♦ వెన్కనుండు
బ్రక్కఁజూచిన మారుతి♦ప్రక్కనుండు, నెందుఁజూచిన మారుతి♦యందయుండు.

వ॥ ఇట్లందఱ కన్నిరూపులై రక్కసులఁ జేరికిఁ గొనక యుక్కుమిగిలి కరంబుల గళంబుల నొక్కుచుఁ బదంబుల వదనంబులఁ ద్రొక్కుచు నఖంబుల వక్షంబుల వ్రచ్చుచు నగచేతులఁ బక్షంబులఁ ద్రెంచుచు మోకాళ్లఁ గెడపుచు మోచేతులఁ బొడుచుచు మడమల నడచుచుఁ బదుగుర నూర్గుర నల్లఁద్రావుఁడుల బాహుమధ్యంబున జిక్కం బట్టి చిదుముచుఁ జపేటంబులఁ బండ్లురాల్చుచు వాలంబునం జుట్టి గిరగిరందిప్పి నేలంబెట్టి కొట్టుచుఁ దన యిరుచేతుల రక్కసుల తలలువట్టి యొండొంటం బగులఁ గొట్టుచుఁ బారావారంబు బాడబంబు చందంబునఁ గమలాకరంబు మదగజంబు మాడ్కి శుష్కకాననంబు దావానలంబువిధంబున మారిమసంగిన వడువున దహింపుచుఁ గలంపుచు నేర్చుచు రూపుమాపుచుండఁ జూచి యుగ్రదంష్ట్రుండు నిష్పిష్యమానోగ్రదంష్ట్రుండై పావనింగని యిట్లనియె. ౧౪౮

మత్త॥ సేనలం బొలియించి వానర♦జేసి తౌ ఘనకార్యముం
బ్రాణముల్ క్షణముంటివే నిటఁ ♦ బాయఁజేసెదఁ జూడుమా
హీన దానవకోటులన్ మడి♦యించిన ట్లనుకొంటివో
పూనినాడఁ ద్రిశూల మీ వెటఁ♦బోకు శూరుఁడ వైతివేన్. ౧౪౯

తే॥ అనుచు శూలంబు వేవైవ♦నది మహోగ్రవహ్ని కీలలఁగ్రక్కుచుఁ ♦ బైకిరాఁగ
లోహమయమైనదాని న♦లోలుఁడగుచు, నోటితోఁబట్టి పొడిసేసెఁ బాటవమున.

వ॥ ఇట్లు శూలంబు నుగ్గుఁజేసి హనుమంతుండు వెండియు. ౧౫౦

క॥ కొంచకఁ జని రక్కసు మెడ, వంచుచు మోకాళ్ళఁ గ్రుమ్మి ♦ వడిచెంపలు వా
యించిన వ్యథితుండై గా,వించె నతఁడు మాయ లోక♦భీకరముగ దాన్. ౧౫౧

క॥ ఎవరో తనవా ర్పెఱవా,రెవరో తెలియంగరాని ♦ దేర్పడెఁ దమ మ
ష్టవనీధరశిఖర సమా,నవిషమ శిల లెలమిఁ బడియె ♦ నరభటులపయిన్. ౧౫౨

క॥ ఊఱుములు మెఱుపులతో జల,ధరము లసృక్పూయమలయు♦తజలంబుల బల్
గురిసెను విషమంబుగఁ బ,య్యెర పీవఁదొడంగె యోధు♦లిటునటుఁదూలన్. ౧౫౩

ఆ॥ శిలలచేతఁ దలలు ♦ శిథిలంబులై కొంద,రధిక తమము దృష్టి ♦ నాపఁ గొంద
రమితరజము కండ్ల ♦ నలమఁగఁ గొందఱు, తెఱపిఁగనక భటులు♦పారిగిరపుడు.

క॥ మెండుగ మొండెంబులు పడు, చుండెను నాకసమునుండి ♦ యుడుగక తోచెన్
కుండలయుత శీర్షంబులు, నుండి రెదుటఁ గీర్ణకేశు ♦ లొక్కట నగ్నుల్. ౧౫౫

వ॥ మఱియు విరూపు లతిదారుణు లతిభయంకరాకారులు నగు రక్కసులు పెక్కండ్రు ముందుఁ గనుపట్టుచుండ మహోత్పాతంబు సంభవించె నని తలంకుచు సైనికులు వ్యాకులచిత్తులై పలాయనం బొనర్చుచుండి రది గని శత్రుఘ్నుం డరుదెంచి రథంబున నుండి. ౧౫౬

శా॥ స్వాంతం బందున రాఘవుల్ నిలిపి తా ♦ సమ్మోహనాస్త్రంబుచే
భ్రాంతిం బొందఁగఁ జేసి రక్కసుల సు♦స్ఫారోగ్రబాణాళిచే
ధ్వాంతంబు న్నిలలుల్ గబంధము లసృ♦గ్ధారల్ నిమేషంబులో
నంతంబొందఁగఁ జేసి ముంచె శితబా♦ణాసారమం దస్రిపుల్. ౧౫౭

క॥ మెఱసెను దిశ లమలములై, పరివేష విహీనుఁ డయ్యెఁ ♦ బద్మాప్తుండున్
విరిసెను మెఱుపులు ధారా,ధరములు బలువిడి యథాగ♦తంబుగఁ దొలఁగెన్. ౧౫౮

క॥ నఱుకుఁడు బ్రద్దలు సేయుఁడు, పరుల ననెడు నుడులచేత ♦ వ్యాకులమౌ నా
శరభరితవిమానం బు,ప్పరమున సౌమిత్రిగాంచి ♦ పటురోషమునన్. ౧౫౯

ఆ॥ శాతకుంభపుంఖ ♦ శరములు నూరులు, వేలుఁ బఱపి దాని ♦ భిన్నముగ నొ
నర్ప భగ్నమైన ♦ నాకపురీఖండ, మనఁగ నా విమాన ♦ మవనిఁబడియె. ౧౬౦

ఉ॥ అప్పుడు యాతుధానుఁడు మ♦హాగ్రహ మూని శరాళి విల్లునన్
జొప్పడఁ గూర్చి వే విడువఁ ♦ జొచ్చి యురంబును దూటి రక్తమున్
జిప్పిలఁ జేసి తద్రుధిర ♦ సిక్తము నౌచు రణాంగణంబునం
దొప్పెఁ గడుం బలాశి ముద ♦ మొందుచుఁ గో యని యార్చుచుండఁగన్. ౧౬౧

ఉ॥ ఆ లవణాభియాతి పవ♦నాస్త్రము నేయఁ దదస్త్రజాతవా
తూలముచేత దానవులు ♦ దూలి విమానమునుండి భూత భే
తాళము లట్లు కూలు చొగి ♦ తద్దయుఁ దోచిరి కీర్ణకేశులై
వేలుపుసూడు దానిఁగని ♦ వెంటనె పాశుపతంబు వైవఁగన్. ౧౬౨

క॥ భూతప్రేతపిశాచ, వ్రాతము భేతాళచయముఁ ♦ బ్రభవించి క్రుధన్
జేతులఁ బుఱ్ఱలఁ గత్తెర, లాతురత ధరించి యట్ట♦హాసం బొప్పన్. ౧౬౩

ఆ॥ బ్రతికియున్నవారిఁ ♦ బట్టి కంఠంబులఁ, గత్తరించి నల్లఁ ♦ గడుపునిండఁ
ద్రావుచుండఁ జూచి ♦ రాముని తమ్ముఁడు, తద్భయంబు వాపఁ ♦ దలచి మదిని.

సీ॥ నారాయణాస్త్రము ♦ నారియందున గూర్చి, విడుచునంతటఁ బోయి ♦ వివిధభూత
ప్రేతదైత్యపిశాచ ♦ భేతాళులను రూపు, మాపఁగఁ గని త్రియా♦మాచరేంద్రుఁ

దరివిదారణచణ ♦ మగు త్రిశూలముఁ గేలఁ, గొనివడిఁ దనుఁ జంపఁ ♦ గోరి రాగ
నంత నా శత్రుఘ్నుఁ ♦ డర్ధచంద్రశిలీము, ఖములచే బాహువుల్ ♦ గత్తరింప

ఆ॥ ఛిన్నహస్తుఁడగుచు ♦ శిరముచేఁ జంపెదఁ, జూడు చచ్చినా వ♦ వాఁడుగాచు
ననుచు నెదురువచ్చు ♦ నసురుని తల శిత, కాండమునఁ దరిగె స♦కుండలముగ.

క॥ అదిగాంచి యుగ్రదంష్ట్రుఁడు, మదిఁ గినియుచు ముష్టిచేత ♦ మడియించెద నం
చెదురుగ రా రాఘవుఁడొక, ప్రదరంబున నతనిశిరముఁ ♦ బడవైచె ధరన్. ౧౬౬

వ. అంత హతశేషులగు దానవు లనాథలై భయంబున శత్రుఘ్నుంగూర్చి నమస్క
రించి పవనహయంబు సమర్పించి చని రంతట మనోహరంబులగు శూరవీరనాదంబు
లతో వీణానినాదంబులును శంఖారావంబులు నంతటఁ జెలంగె నని తెల్పి వెండియు
శేషుం డిట్లనియె. ౧౬౭

—♦ శత్రుఘ్నుం డారణ్యకమునిని దర్శించుట. ♦—

తే॥ మానవాదహృతంబగు ♦ మఖహయంబు, మానవాదు లొసంగిన ♦ మణులఁ బడసి
మానవాగ్ర్యుఁడు భరతసం♦భవునితోడ, మానవాధిపుఁ డానంద ♦ మగ్నుఁడయ్యె.

క॥ నెత్తుటఁ జొత్తిల్లిన భటు, లత్తఱిగునఁ గనుపడు జన♦కాత్మభవుండున్
దత్తబడలు లవణాంతకు, నత్తఱి గొనియాడి రాహ♦వామితమోదున్. ౧౬౮

క॥ చదిసిన విద్యున్మాలి, ప్రి, మదవార్ధిని దేలి రా య♦మర్త్యులు భయముల్
వదలి మదిని, విమలుండై, పొదలెరవి, యమలము లగుచుఁ ♦ బొల్పొందె నదుల్.

స్వాగతము॥ వాతముల్ సురభి ♦ వంతము లొచున్
జేతముల్ ముదముఁ ♦ జెందఁగ వీచెన్
నేతలెల్లరు న♦నిన్ జయలక్ష్మి
స్వీతులైరి కడు ♦ వెల్గెఁ గకుప్పుల్. ౧౭౦

వ॥ అంతట నఖిలయోధులు రథారూఢులై సన్నద్ధు లగుచు శత్రుఘ్నుం గాంచి
యిట్లనిరి. ౧౭౧

సీ॥ స్వర్గమందుండుట ♦ సంభవింపకపోయె, విబుధుల కెవ్వాని ♦ భీతివలన
నట్టి విద్యున్మాలి ♦ యనుజునితో విధి, బలమున నీచేతఁ ♦ బొలిసె నేడు
విధివశంబున రామ♦విభుని యజ్ఞాశ్వంబుఁ బడయఁ గంటివి నిరు♦పద్రవముగ
దైవబలంబున ♦ ధరణి నంతట జయలక్ష్మిని బొందెదో ♦ లవణమథన

ఆ॥ జరుపఁగూడ దిచట ♦ సమయవిలంబంబు, విడువు మో మహాత్మ ♦ వీతిననుచు
సకల యోధవరులు ♦ సమయోచితంబుగ, నుడువ బాగటంచు ♦ విడిచె హయము,

వ॥ అంత హయంబును సకల శస్త్రాస్త్ర కోవిదు లగు రాజులు చతురంగంబులతో వెంట రా నదీ-వీదిజ్ఞుఖంబై చనియె, నో వాత్స్యాయన మునివర్యా! మనోహరంబును బాపరాశిప్రదాహకంబును నైన శత్రుఘ్న చరితం బింక నెఱింగించెద సావధానుండవై విను మని శేషుం డిట్లనియె. ౧౨౪

క॥ వారువము వెంట రఘుకుల, వీరుఁడు చను చచటి మౌని♦విసరంబులకున్
గూరిమి మ్రొక్కుచు రేవా,తీరంబున నుటజ మొకటి ♦ తిపురుగఁ గాంచెన్. ౧౨౫

తే॥ అది పలాశపలాశ బ♦ద్ధాభిరామ, మమలతాపసలోకస♦మాశ్రియంబు
శీతకరజాంబు కల్లోల ♦ సిక్తమగుచు, నొప్పుచుండుట కబ్బుర♦మొంది మదిని.

వ॥ మంత్రిం గాంచి యిట్లనియె. ౧౨౭

తే॥ ఓ విచార చతురవర♦యో ప్రధాని, పుణ్యదర్శనమై కడుఁ♦బొల్చునట్టి
యాశ్రమం బే తపస్వికి ♦ నాశ్రయంబు, దీని వివరింపుమయ నాకుఁ♦దెలియునటుల.

క॥ అన విని ప్రగ్గడ నృపతిం, గని విశదస్మేరగీః ప్ర♦కలనఁ బెరయుచున్
విన నందరు వినయంబునఁ, దన సౌహృద మెఱుకపడఁగఁ♦ దగనిట్లనియెన్. ౧౨౯

శా॥ నానాశాస్త్రపరాయణుండయి మహా♦నందంబునం జొక్కు నీ
మౌనిశ్రేష్ఠుని దర్శనంబు నొనరిం♦పన్ బంచబంగాళమై
యేనఃపుంజ మడంగుఁ బోయి కని మా♦సేందార్థింఘ్రి పద్మంబులం
దానం జేసి శిరంబుఁ జెప్పు మన నా♦ద్యంతం బెఱింగించుఁ దాన్. ౧౩౦

సీ॥ అతఁడు శ్రీరాము ప♦దాంభోజ మధుమధు, పత్రితుఁడు శ్రీరాము సే♦వారతుండు
వేదవేదార్థక ♦ వేత్త యత్యుగ్రిత, పఃపరిపూర్ణుఁడుఁ ♦ బావనతముఁ
డారణ్యకాభిఖ్యుఁ ♦ డా మునిదర్శన, మొనరించి ధన్యత♦నొందు మనిన
సంతసంబును జెంది ♦ సౌమిత్రి సుమద సు,బాహుపుష్కల ప్రతా♦పాగ్ర్యసుమతి

తే॥ జనకపుత్రులు వెంటరాఁ♦జని తదీయ, పాదములమీఁదఁ బడి మది♦పరమభక్తి
నివ్వటిల మోడ్పుఁ జేతుల♦నిలచియున్న, వారి నర్ఘ్యాదులను దన్పి♦ ఫలము లొసఁగి.

ఉ॥ ఘ్నాపతులార మీర లెట ♦ సంగతులై రిట కేల వచ్చినా
రే పనిమీఁద వేగ వచి♦యింపుఁడనన్ విని మంత్రిపల్కె నో
తాపసవర్య రామవిభు ♦ తమ్ముఁ డితం డతఁ డధ్వరక్రియా
పాపకుఁడై హయంబు విడు♦వన్ జనుదెంచితి మేము దానితోన్. ౧౩౨

వ॥ అనుటయు నారణ్యకుం డిట్లనియె. ౧౩౩

శా॥ ఔరా మానవు లెంత మూఢులో రమా♦ధ్యక్షున్ స్థిరైశ్వర్యదున్
శ్రీరామున్ భజియింప కన్యసురలన్ ♦ సేవించెదర్ సర్వసం

భారంబు ల్గొని యల్పపుణ్యములు నీమక్లేశముల్ నశ్వరం
బై రాణించు పదంబు లిచ్చు క్రతువుల్ హా సేయుదుర్ బేలలై. ౧౫౪

క॥ స్మరియించు మాత్రమున నే, దురితమహాపర్వతములఁ దొల్చు మహత్త్వం
బెఱి వదలి యోగసువ్రతా, ధ్వరనియమంబులను గష్టపడెదరు పందల్. ౧౫౫

తే॥ మాయురే చూడు డీ భువి మనుజతతుల, మతివివంచితమైన మూఢతను సులభ
సాధ్యమైనట్టి రామభజనముమాని, యాచరింతురు దుర్లభమైన క్రియల. ౧౫౬

ఆ॥ తలఁచినంత ఘోరకలుషంబుల నడంచి, ముక్తి నొసగు రామమూర్తి భక్తి
నిఖిలదుఁడు సకామ నిష్కాము లగు యోగి, వరులచే యజింపఁబడునుగాదె.

సీ॥ మున్ను నే నాసాయమును దత్త్వవేత్త వి,జ్ఞులలో నెవండని తెలియఁగోరి
బహుతీర్థములకేగి పలువురఁ బ్రార్థింప, నెఱిఁగింపఁడయ్యె నా కెవఁడు దాని
యపు డదృష్టాతిశయంబున దివినుండి, తీర్థయాత్రల కరుదెంచువాని
యోగిసేవిత పాదయుగళు దీర్ఘాయువు, నైన లోమశమహామౌనిఁ గాంచి

తే॥ భక్తి వందన మొనరించి స్వామి దుర్ల,భంబు నద్భుతమగు మానవత్వ మబ్బె
ఘోరసంసార వారిధి తీరభూమిఁ, జేరుటకు మార్గ మెద్దియో చెప్పుమయ్య.

క॥ క్రతుదాన హోమజప స,ద్వ్రతముల నెద్దాన ముక్తిఁ బడయఁగ నగు సం
సృతి వారిధి సంతారకుఁ, డెతఁ డమరులలోన నాకు నేర్పడఁ జెపుమా. ౧౫౯

తే॥ సర్వశాస్త్రార్థపారగ సంయమీంద్ర, త్వత్కృపాతిశయంబున దాని నెఱిఁగి
యీమహాఘోరసంసారమేఁ దరింతుఁ, దెల్పవే యని మిగులఁ బ్రార్థించుటయును.

వ॥ అంత నా రోమశుండు మద్వాక్యంబులు విని దయాళుం డగుచు నేకాగ్రమనస్కుం
డవై పరమశ్రద్ధతో విను మని యిట్లనియె. ౧౬౧

మ॥ వ్రతముల్ దానము లధ్వర క్రియలుఁ దీర్థంబుల్ యమంబు ల్మఱిన్
గుతలం బందున నెన్నియో కల వికన్ గూర్చు న్సురావాసమున్
క్షతపాపౌఘ మభీప్సితప్రదము సంసారాబ్ధి సంతారకం
బతిగుహ్యం బెఱిగింతు నింకొకటి నీ వాలింపుమా శ్రద్ధతోన్. ౧౬౨

ఆ॥ నాస్తికునకు శఠున కశ్రద్ధ గలిగిన, మానవునకు భక్తిహీనునకును
నిందకునకు బుద్ధినిల్కడ లేనట్టి, వారలకును జెప్పవలదు సుమ్ము. ౧౬౩

క॥ కామక్రోధ రహితునకు, రాముని భక్తునకు శమవిరాజితునకు దుః
ఖామయ నాశన కారక, మై మను నేఁ జెప్పు దాని ననువుగఁ జెపుమా. ౧౬౪

ఉ॥ రామునికన్నఁ జూడఁ గనరా డితరుం డగు దేవుఁ డెందు శ్రీ
రాముని కన్న లేదు వ్రతరాజము భూతలమందు జానకీ

రామునికన్న లేదు సుక♦రం బగు యోగము భక్తమానసా
రాముని కన్న లేదు ముని♦రాయ మఖంబు నిజంబు వింటివే. ౧౯౫

తే॥ సర్వకాముఁడగు రాము ♦ సంస్మరించి, యతనిమంత్రంబు జపియించి♦యర్చనలను
జేసి సంపత్సమృద్ధులఁ♦జెంది మించి, యిహకాముష్మికంబుల ♦ నందు జనుఁడు. ౧౯౬

క॥ శ్రీరాముఁడు సంసారో, త్తారం బగు భక్తి నిచ్చు ♦ ధ్యాతలకు దయన్
గోరి జపించిన శ్వపచుఁడు, చేరును దత్పదము, బుధులఁ ♦ జెప్పఁగనేలా. ౧౯౭

తే॥ అఖిలశ్రుతిశాస్త్రముల రహ♦స్యంబు నీకు, నెఱుకపఱచితి నిష్ఠాను♦సరణి మెలఁగు
మొకడ దేవుఁడు శ్రీరాముఁ♦డొకటియే వ్రతము తదర్చనమిదియె త♦త్త్వంబునమ్ము.

వ॥ మఱియు నా రామచంద్రుని పావననామస్మరణం బొకటియే శాస్త్రసమ్మతం బని యెఱింగి సర్వవిఘ్నంబుల నతని భజియించితివేని తుచ్ఛం బగు సంసారసాగరంబు నీకు గోష్పదం బగు ననిన శ్రోత్రానందంబుగఁ దద్వాక్యంబు విని మఱల నిట్లంటి.

—♦ లోమశుం డారణ్యకునకు శ్రీరామమానసపూజావిధానంబుఁ దెల్పుట ♦—

తే॥ ధ్యాన మెటు సేయవలెను రా♦మార్చనంబు, సేయు టెట్లది సర్వజ్ఞ ♦ చెప్పుమయ్య
విని కృతార్థతనొందెద ♦ ననిన లోమ,శుఁడు విచారించి నాతోడ♦నుడివెనిట్లు. ౨౦౦

మ॥ ఘనసంసారమహాజ్వరాపహృతియా♦త్మాబ్జాధిపుం డెట్లుతు
ష్టిని జెందంగల వాఁడటంచుఁ గద నీ♦చేఁ బ్రశ్న చేయంబడెన్
వినుమా మిక్కిలి సావధానముగ నో ♦ విప్రేంద్ర శ్రీరాము ప
ద్వనజంబు ల్మది నిల్పి తేటపడ స♦ర్వం బే నెఱింగించెదన్. ౨౦౧

సీ॥ శ్రీమదయోధ్యాపు♦రీ మధ్యసర్వకా, మప్రదంబై చిత్ర ♦ మంటపములఁ
దనరారు కల్పపా♦దపమూలమునఁ దమో, హారణ ప్రవీణశో♦భాంచితంబు
మరకతాంబుజ రాగ♦వరనీలఘట్టిత, విలసదష్టాపద ♦ పీఠమందు
పురుహూతముఖ సుర♦పూజితుండును బూర్ణి,మారజనీశధి♦క్కారవక్త్రుఁ
తే॥ డష్టమీచంద్ర సదృశ ఫా♦లాంచితుండు, భర్మమకరాభకుండల ♦ భ్రాజితుండు
విద్రుమసమరదనచ్ఛవి♦ విలసితుండు, సోమకరనిభద్విజరాజి♦శోభితుండు. ౨౦౨

వ॥ మఱియు ఋగాదిసకలనిగమ శాస్త్రాలవాలజపాకుసుమసంకాశరసనావిలసితుండును గంబుగ్రీవుండును సింహాసమానోన్నత మాంసలస్కంధుండును హీరమయముద్రికా కేయూరకటకాంకితాజానులంబదీర్ఘబాహుండునులక్ష్మీనివాసశోభితవిశాలవక్షస్స్థలుండును శ్రీవత్సాదివిచిత్రాంకిత మనోహరోదరనాభియుతుండును మణిమయ కాంచీ విశేష శోభాయమాన శుభకటీవిరాజితుండును విమలోరుజాను శోభితుండును హలకులిశాంకుశ వజ్రపద్మ యవరేఖాంకిత యోగిధ్యేయ కోమలచరణ

విభ్రాజమానుండును నవదూర్వాదళ శ్యామసుందర దేహుండును నగు శ్రీరామ
చంద్రు నాసీనుం గావించి మనఃకల్పిత చందనాదులచేఁ జలింపని నియమంబునఁ
బూజించి తన్నామంబు స్మరించుచుంటి వేని సంసారమహాసాగరంబుఁ దరింతు
వెద సంశయం బించుకంత వల దైహికాముష్మికంబుల సంవెద వని తెలుప విని
నే నిట్లంటి. ౨౦౩

—◆ రామాయణ సంగ్రహము ◆—

తే॥ యోగివర్య మునీంద్ర యిం◆కొకటిఁ దెలియఁ, గోరుచుంటిని దెల్పుఁడు◆గురువులెందు
సేవకుల కఖిలంబును ◆ జెప్పవారు, గాదె మిక్కిలి దాక్షిణ్య ◆ కలితు లగుట. ౨౦౪

ఉ॥ ఎవ్వఁడు రాముఁ డీ వెపుడు ◆ నెవ్వని ధ్యాన మొనర్తు వట్టివాఁ
డెవ్వనియింట మర్త్యుఁడయి ◆ యెందులకై జనియించె నాతఁడె
ట్లెవ్విధి సంచరించె భువి ◆ నెట్టిది వానిచరిత్ర మయ్య నా
కవ్విధమంతఁ దెల్పి మది◆యందలి సంశయమెల్లఁ బాపవే. ౨౦౫

వ॥ అనుటయు. ౨౦౬

తే॥ పరమశోభన మగు నాదు◆వాక్యము విని, చిత్రమగు రఘువరుని చ◆రిత్ర మఖిల
లోకపూజితుఁడైన యా◆లోమశుండు, దెలిపె నిట్టుల విను మని◆ తేటపడఁగ. ౨౦౭

ఆ॥ ఎఱిగి లోకతతులు ◆ నిరయమగ్నములౌట, యశము నింప లోక◆మందుఁగోరి
యుద్ధరించుమార్గ ◆ మూహించి యోగీశ్వ, రేశ్వరుండు భార్గ◆వీశ్వరుండు. ౨౦౮

క॥ నాలుగువిధములుగా వన, మాలి జనించెను మరీచి◆మాలికులమునన్
దాలిచె రాముం డందునఁ, బోలఁగ లక్ష్మీకళతు ◆ పూర్ణాంశంబున్. ౨౦౯

క॥ ఆ రాముఁడు సజ్జనహృద, యారాముఁడు సుగుణసంప◆దభిరాముఁడు శ్రీ
మీరన్ లక్ష్మణసఖుఁడై, తేరెన్ సకలాగమముల ◆ ధీకుశలతచేన్. ౨౧౦

ఆ॥ కోపియైన కౌశి◆కునియాజ్ఞ మీరంగ, లేక దశరథుండుఁ◆గాకపక్ష
ధరులు బాలురైన◆తనయుల నంపె న, ధ్వరముఁగాయ మౌని◆వరునితోడ. ౨౧౧

సీ॥ అంత ధనుర్ధరు ◆ లతిధీరులును దాంతు, లగు రామలక్ష్మణు◆లా మహర్షి
వెంటఁబోవుచు లోక◆కంటకయగు తాట, కనతని యనుమతి ◆ నినజుపురికిఁ
బంపి మారీచసు◆బాహుల నధ్వర, విఘ్నకారులఁ గ్రూర ◆ విశిఖములను
దూలించి జన్నంబుఁ ◆ బాలించి పదతల, స్పర్శచే రాతిని ◆ బడఁతిఁ జేసి

తే॥ గట్టువిల్తుని విల్లు భ◆గ్నంబొనర్చి, తన పదాఱవయేట సీ◆తను నయోని
జాత నాతేండ్ల దాని దా◆శరథి పెండ్లి, యాడి కృతకృత్యుఁడై మించె నతఁడు మఱియు.

వ॥ జనకజతోడ నిచ్చటను ♦ సౌఖ్యమహాంబుధిఁ దేలుచుండ హా
యనము లిరాఱు నిండె విభుఁ ♦ డాతనిఁ దా యువరాజ్య పట్టభ
ద్రునిగ నొనర్పఁబూన మది♦రోసి విదేహసుతాధవుండుఁ గా
ననమున కేగఁ గైక తన♦నందనుఁ డీ భువి నేలఁ గోరఁగాఁ. ౨౧౩

క॥ సత్యభంగమునకు ♦ జంకుచు దశరథుఁ, డెట్టుఁ బలుక లేక ♦ నెఱయుచుండ
బెఱిగి రాముఁ డిరువ♦ దేడవ యేట ల,క్ష్మణుఁడు సీత రాగఁ♦జనియె వనికి. ౨౧౪

సీ॥ మూణ్ణాళ్ళు జలపాన♦మును జేసి నాల్గవ, దినమున నాకులుఁ ♦దిని వసించి
చిత్రకూటంబును ♦ జేరి యైదవదిన,మం దందుఁ గొన్నినా♦ళ్ళధివసించి
యచ్చ టచ్చటఁ గొన్ని♦యబ్దము లడుపుచుఁ, జని పదుమూడవ ♦ సమమునందుఁ
బంచవటిని నివ♦సించి శూర్పణఖ ము,క్కుఁ జెవులుఁగోసి నృ♦కుంజరుండు

తే॥ జానకీయుతుఁడై వని ♦ సంచరించు,చుండ రావణుఁ డను రాక్ష♦సుండు రామ
లక్ష్మణులు శాల లేని కా♦లమున వచ్చి, యవనిజ హరింప గమకించు♦నవసరమున.

ఉ॥ ఓ కరుణామహోదధి ర♦ఘూత్తమ గమ్ము సురారి నన్నుఁ గొం
చేకత మేగె నంచును మ♦హీజ యలందురఁ రావణుండుఁ బే
రాకట సుక్కు శ్యేనము భ♦యంబున వందురు బక్షికన్వలెఁ
బీక నదల్చి పట్టి వినుఁ♦వీథిని బోవ జటాయు వడ్డమై. ౨౧౫

ఆ॥ పోరిపోరి ఖడ్గ♦ధారఁ జెక్కలుఁ దెగి, పడియె నంత మరలఁ ♦ బఙ్క్తిముఖుఁడు
భూమిజాతఁ గొంచుఁ♦బోయి లంక నశోక,వనమునందు నునిచెఁ♦బ్రిమద మెసఁగ.

వ॥ అంతఁ బదియవ మాసంబున మార్గశిరశుద్ధ దశమినాఁడు సీతా వృత్తాంతంబు సంపాతి యంగదాదులకుఁ దెలుప హనుమంతుండు మహేంద్రాద్రినుండి శత యోజన పరిమితం బగు సముద్రం బేకాదశినాఁడు దాఁటి యా రాత్రి సీతాన్వేషణంబు సేయుచు వేకువ సీతాదర్శనం బొనర్చి ద్వాదశియందు శింశుపా వృక్షంబున నుండి యా రాత్రి సీతతో సంభాషించి త్రయోదశి వనభంగము నక్షాదివధయును గావించి చతుర్దశినాఁ డింద్రజిత్ప్రేషితబ్రహ్మాస్త్రబద్ధుఁడై పూర్ణిమయందుఁ బుచ్ఛలగ్నాగ్నిచే లంక నదహించి మఱల మహేంద్రాద్రిం బ్రవేశించె మఱియు. ౨౧౬

సీ॥ మునివర్య విను సర్వ♦వనచరు ల్మార్గశీ,ర్షాసిత ప్రతిపత్తు♦నందు బయలు
దేరి మధువనంబుఁ ♦ జేరి యా షష్ఠి నా, డది పాడుఁ జేసి మ♦ఱుదినమందు
జానకీవృత్తంబు ♦ సర్వంబుఁ బ్రత్యభి,జ్ఞాన పూర్వంబుగా ♦ సరవిఁ దెలుప
రాముఁ డష్టమ్యుత్త ♦ రాఫల్గుని తార,నర్కు డంబరమధ్య♦మందు నుండ

తే॥ నప్పుడు విజయాఖ్యసుముహూర్త ♦ మందుజలధిఁ, దాటి దైత్యునిజంపి నేఁ ♦ దరలువాఁడ
నను చుఁ బ్రతిన యొనర్చుచు ♦ యామ్యదిశను, దరలె సుగ్రీవముఖసఖుల్ ♦ తన్నుఁ గొల్వ.

వ॥ ఇట్లు వెడలి యేడురోజులకు సాగరప్రాంతంబుఁ జేరి యందు సకలసేనల విడియించి పౌష శుక్ల పాడ్యమి మొదలు తదియవఱకు సేనలఁ గాపాడుచుండు నంత.

తే॥ తైషమాసచతుర్థి వి ♦ భీషణుండు, రామచంద్రునిఁ జేరె నా ♦ రాముఁ డబ్ధిఁ
దాటఁ బంచమినాడు మం ♦ త్రం బొనర్చి, జరిపెఁ బ్రాయోపవేశుఁడై ♦ పరమదీక్ష.

వ॥ ఇట్లు నాల్గుదినంబు లుపవసించి సముద్రదర్శనంబునఁ దద్బంధన క్రమం బెఱింగి దశమి మొదలు త్రయోదశి వరకు సేతుబంధనంబుఁ గావించి చతుర్దశినాడు సువేలాద్రియందు సైన్యంబు నిల్పి పూర్ణిమాది తృతీయాంతము మూఁడహంబులు సకల సైన్యంబులతో సాగరం బుత్తరించి లంక నరికట్టెనంత. ౨౨౩

క॥ తదియతిథి మొదలుగా నెనిమిది దినములు ప్లవగసేన ♦ మిహిరజు నాజ్ఞన్
వదలక పురి నలువంకలఁ, బొదివి విడిసి యుండె నరులు ♦ పొగులఁగ మదిలోన్.

సీ॥ ఋషివర్య పుష్యకృ ♦ ష్ణైకాదశీ దినం, బందున శుకసార ♦ ణాగమనము
సైన్యసంఖ్యానంబు ♦ శార్దూలకృత కపి, సారవర్ణనము నా ♦ బారసితగ
నమవసవరకు మూ ♦ డహములంతన సైన్య, సంఖ్యానమును రణో ♦ త్సాహ మమరఁ
జేసె రావణుఁడంత ♦ జిష్ణుపౌత్రిని దాత్య, మొనసెను మాఘాద్య ♦ దినము నందు

ఆ॥ జనకజాతవిభుని ♦ శాంబరీమూర్ధాద్యదు, లందఁ జూచె నేడ ♦ హంబు లుభయ
సైనికులకు రణము ♦ సంకులంబుగ సాగె, నాగబంధనంబు ♦ నవమిజరిగె. ౨౨౪

క॥ హరిపాశమోక్షణమునకు, హరులు నిరుత్సాహు లగుచు ♦ నడలుచు నుండన్
హరివసి రాముని చెవిలో, గరుడాగమనంబుఁ దెల్పి ♦ కరుపలి చనియెన్.

వ॥ ఏకాదశీ ద్వాదశుల ధూమ్రాక్షువధయు, త్రయోదశినా డకంపనుని నిధనంబును, శుక్లచతుర్దశి మొదలు కృష్ణపాడ్యమి వరకు మూఁడు రోజులు నీలునితోఁ బోరి ప్రహస్తుండు మడియుటయు, నీ విదియ మొదలు చతుర్థి వఱకు రామునితో సంగరం బొనర్చి రావణుండు పలాయితుఁ డగుటయు, బంచమి మొదలష్టమి వఱకుఁ గుంభకర్ణ బోధనంబును, నతఁడు మూఁడహంబులుఁ గుడిచి నవమి మొదలు చతుర్దశివఱకు నాఱు ఘస్రంబులు రామునితోఁ బోరి పెక్కువానరులఁ బ్రమింగి చచ్చుటయు నమవస దుఃఖంబువలన రణాభావంబును ఫాల్గుణ శుద్ధ పాడ్యమి మొదలు చతుర్థివఱకు నాల్గురోజు లింద్రజిన్ముఖు లగు నైదుగురు రక్కసులు బోరి జర్ఝరితాంగులై పలాయితు లగుటయుఁ, బంచమి మొదలు సప్తమివఱకు నతికాయుం డాయోధనం బొనర్చి లక్ష్మణునిచేఁ గూలుటయు, నష్టమి మొదలు ద్వాదశివఱకు నైదహంబులు బవరంబుఁ జేసి కుంభనికుంభులు గూలుటయు, మీద

మూడుదినంబులకు మకరాక్షుండు సమయుటయు, ఫాల్గుణ కృష్ణవిదియ యందింద్ర జిద్విజయంబును, దదియ మొదలు సప్తమివఱకు నోషధ్యానయనవ్యగ్రతచే యుద్ధశూన్యంబునుం జరిగె. మఱియుఁ బ్రఖ్యాతబల పౌరుషుం డగు నింద్రజిత్తు త్రయోదశివఱకుఁ బోరి లక్ష్మణునిచే మృతి నొందుటయుఁ,జతుర్దశినాఁడు రావణుండు హోమదీక్ష నందుటయు,నమావాస్యనాఁడు యుద్ధంబునకు వెడలుటయు, జైత్రశుద్ధ పాడ్యమి మొదలు పంచమివఱ కైదు దినములు రావణుండు రణంబొనర్చుచుండఁ బ్రసిద్ధులగు ననేక రక్కసులు బొలియుటయు షష్ఠి మొద లష్టమివఱకు దురం బొనర్చి మహాపార్శ్వుఁడు మడియుటయుఁ, జైత్రశుక్ల నవమినాఁడు రావణ ప్రేరితశక్తిచే లక్ష్మణుండు మూర్ఛ నొందుటయుఁ గోపావిష్టుం డగు రాఘవునిచే రావణుండు పలాయితుం డగుటయు లక్ష్మణునికై హనుమంతుండు ద్రోణాద్రిం దెచ్చుటయు దశమినాఁడు పగలు రణవిరామంబును, రాత్రి యుద్ధంబున బహురాక్షస మరణం బును నేకాదశినాఁ డింద్రప్రేరితుండై మాతలి రథంబుఁ దెచ్చి శ్రీరామునకు సమ ర్పించుటయు, ద్వాదశి మొదలు కృష్ణచతుర్దశి వఱకుఁ బదునెనిమిది దినంబులు రాముండు గోపావిష్టుండై రావణునితోఁ దురం బొనర్చి బ్రహ్మాస్త్రంబున నతనిఁ గూల్చుటయు, విజయప్రాప్తియుం గలిగె నిట్లు మాఘశుద్ధ ద్వితీయ మొదలు చైత్ర కృష్ణచతుర్దశివఱకు నెనుబదియేడు దినంబులతో రణంబు ముగిసె నిందు డెబ్బదిరెం డహంబులు యుద్ధంబు జరిగెఁ బదియేనుదినంబులు సంగ్రామంబులేని యూఱట రోజులుగా నెఱుంగుము. మఱియు వినుము.

సీ॥ అమవస నా రావ♦ణాదుల కగ్నిసం, స్కారముల్ విధ్యుక్త♦సరణి జరిగె
మాధవమాసాది♦మదినంబునను రాముఁ,డాయోధనస్థలు ♦ లంద యుండె
నయ్యె లంకారాజ్య ♦ మం దభిషిక్తుఁడు, విదియయందునను వి♦భీషణుండు
తదియరోజునను సీ♦తాశుద్ధియును నాక,వాసులచే వర♦ప్రాప్తిఁ గలిగె
తే॥ నిట్లు చిరకాలమునకు లం♦కేశుఁ దునిమి, నిరపరాధను బుణ్యను ♦ నిఖిలలోక
వంద్య దుఃఖిత యగు సీతఁ ♦ బడసి రాముఁ, డా చతుర్థిని బుష్పకం బధివసించె.

క॥ పరమ ప్రీతిని సీతకు, జరిగినకథ నుడువు చాక♦సంబునఁ జనిష
త్సరములుఁ బదునాలుగు చను, మరుసటి పంచమిని జేరె ♦ మఱల మునీంద్రా. ౨౨౯

క॥ ఆదినము భరద్వాజుని, యాదరమును బడసియుండి ♦ యనుజుని భరతున్
సాదరముగఁ గని షష్ఠిని, మోదమున నయోధ్యఁ జేరెఁ ♦ బురజను లలరన్. ౨౩౦

తే॥ వసుమతీదేవ విను జటా♦వల్కలాభి, రాముఁ డయ్యును నవి మాని ♦ రాజసమున
జనకసుత తోడ నా సప్త♦మిని దశరథ, రాముఁ డరిదిగఁ బట్టాభి♦రాముఁ డయ్యె.

క॥ పదునాలుగు నెలలును బైఁ, బదిదినములు పంక్తిముఖుని ♦ భవనమునందున్
ముదమరి గడపెను మైథిలి, పదునాల్గు యుగంబులట్లు ♦ పతివిరహితయై. ౨౩౧

క॥ నలువది రెండవయేట, దలకొనియె రాజ్యభరముఁ ♦ దాల్పఁగ రాముం
డలనాటికి నాగటిచాల్, పొలతికి ముప్పదులమీఁద ♦ మూఁడేండ్లు సుమా. ౨౩౩

చ॥ అనుజులతోడ రాముఁడు న♦యంబున రాజ్యము సేయుచో నగ
స్త్యుని నుడి నశ్వమేధమును ♦ జొప్పడ సేయఁ దదశ్వ మాశ్రమ
మ్మునకును వచ్చు యోధులు ప్ర♦మోదముతోఁ జనుదెంతు రీ గృహం
బునకుఁ దదీయ సత్కథను, బోలఁగఁ దెల్పెదవయ్య వారితోన్. ౨౩౪

తే॥ వారితోడ నయోధ్యను ♦ జేరఁగలవు, చేరి కని రాము మదిలోనఁ ♦ జేర్పఁగలవు
చేర్చి తరియింతు వపుడ సం♦సృతి మహాబ్ధి,నంచు లోమశమౌని నా♦కానతిచ్చె.

వ॥ మఱియు, ౨౩౬

తే॥ అడుగఁ దగినది నీకిఁ కే♦మైనఁ గలదె,యన భవత్కృప నద్భుతం♦బైన రామ
చరితమంతయుఁ దెలిసె ద♦చ్చరణసార,సముల సేవింతు నీ ప్రసా♦దమునఁ జేసి.

మ॥ అని నే మ్రొక్కఁగ సంతసించి చనె రా ♦ మానుగ్రహ ప్రాప్తిచే
తను దత్పాద సపర్యఁజేసి కడునే ♦ ధన్యత్వము న్గంటి నా
యన పాదంబు లనారతంబు మదిలో ♦ ధ్యానింపఁగాఁ గంటి నా
తని చారిత్రముఁ బాడఁగంటిని యథా♦ర్థం బింతయు న్గంటి నేన్. ౨౩౭

క॥ పరులను నాకెందరినో, పరమపవిత్రులుగఁ జేయు ♦ భాగ్యమొదవె నీ
వరగానంబున ముని నుడి, స్మరియించి తదీక్ష నెపుడు ♦ సంతసపడెదన్. ౨౩౮

సీ॥ రామచంద్రుని పాద ♦ రాజీవములఁ జూడ, నిచ్చగల్గుటను నే♦నీ ధరిత్రి
ధన్యుఁడ విప్రమూ♦ర్ధన్యుఁడఁ గృతకృత్యుఁ,డను సభాగ్యుఁడను బా♦వనుఁడనైతి
గాన సంసారసా♦గర తితీర్షులకెల్ల, విధముల సేవ్యుఁడీ ♦ విశ్వమందు
వందనీయుఁడు రామ♦భద్రుఁ డొక్కఁడనుండు, మీరలెందుకు వచ్చి♦నారు తురగ

తే॥ మేధ మొనరించునట్టి యా♦మేటి యెవ్వఁ,డట్టి ధర్మస్వరూపుని ♦ యమలచరిత
మంతయును దెల్పిపొందుమా♦యంబువెంట,నెద స్మరింపుఁడు రాముని♦పదము లెపుడు.

క॥ అను మునితిలకుని నుడువులు, విని శత్రుఘ్నాదు లపుడు ♦ విస్మితులగుచున్
మనమున రఘువీరుని పద,వనజముల స్మరింపు చనిరి ♦ బాడబవరుతోన్. ౨౪౦

—♦ ఆరణ్యకముని విష్ణులోకంబున కేగుట ♦—

ఆ॥ తపసిరాయ నీదు ♦ దర్శనంబుననే ప,విత్రితులము రామ♦విభుకథా సు
ధారసంబు నీవు ♦ ద్రావఁగాఁ జేయఁ బ,విత్రితముల మింక ♦ విమలచరిత. ౨౪౨

సీ॥ సర్వంబు బ్రహ్మర్షి♦సత్తమ విను మమ్ముఁ, దెలుపుమన్నది మీకుఁ ♦ దెలుపువార
మఖిల సంభారంబు ♦ లలవరించి యగస్త్యు, వాక్యంబున సవంబు ♦ బ్రహ్మహత్య

పోవుటకై సేయఁ♦బూనె శ్రీరాముఁడు, హయముతో మేము మీ♦యాశ్రమంబుఁ
జేరితి మను మనో♦హారియు సురసాయ,నాభ మా నుడి విని ♦ యమివరుండు

ఆ॥ సంతసించి రామ♦చంద్రుని పాదార,విందములను జూచు ♦ విధము దొరికె
నిట్టి నన్నుఁగనుట ♦ నెంతయు నా తల్లి, ధన్యయయ్యె ధన్య♦తముఁడనైతి. ౨౪౩

క॥ ఇప్పుడు నిష్కంటకమై, యొప్పెడు రాజ్యంబుఁ గలిగె ♦ నోదవెను విత్తం
బిప్పుడు ముదమొందిరి సుర, లిప్పుడు హుతవహుఁడు దృప్తి ♦ నెంతేయుఁ జెందెన్.

తే॥ ఎప్పుడే రామచంద్రుని♦హృదయమందు,ధ్యానమొనరింపుచుంటినో♦యట్టిప్రభు వ
యారె మన్నేత్రగోచరుం ♦డహహ కాఁగ, లందు నావంటి సుకృతిక♦లండె భువిని.

ఆ॥ కాంచి నాదు భక్తిఁ ♦గరము సంతోషించి, నన్నుఁ గౌఁగలించి ♦ నాదు కుశల
మడుగు రామవిభు ప♦దార్చనారతుఁడౌ ప్రి,భంజనాత్మజునకు ♦ భద్ర మగును.

క॥ అను మాటలు హనుమంతుఁడు, విని మునిపదయుగళి వ్రాలి♦ వినయముతో నేఁ
హనుమంతుఁడఁ గల నంతిక,మున భక్తపదార్చకుఁడను ♦ బుధసేవకుఁడన్.

ఆ॥ పవనసూతి యిట్లు ♦ పలుకుచునుండఁగ, మోదభరితుఁడగుచు♦మునివరుండు
పరమరామభక్తిఁ♦ బరవశుఁ డగు వాయు, తనయుఁగౌఁగలించు♦కొనియెఁ బ్రేమ.

ఆ॥ ప్రేమ నందు వారు ♦ ప్రేమ వినిర్భిన్న, లిరువురును మహాత్మ♦తరనసిక్తు
లుభయు లైరి యొక్క ♦ మొగిని వార్ స్థగితులు, చిత్రలిఖితు లట్లు♦చిత్రమేమొ.

వ॥ ఇట్లుండి కొంతవడికిఁ దెలిసి సుఖోపవిష్టులై చిత్రకథలచేఁ గొంత ప్రొద్దుఁ బుచ్చు
చుండు నంత హనుమంతుండు శ్రీరామపాదారవిందధ్యానపరవశుం డగు
నారణ్యకమునిం గాంచి యి ట్లనియె. ౨౫౦

క॥ చలదభియాతుఁడు దశరథ, కులదీపాంకుర మితండు ♦ గూరిమి తమ్ముం
డల ఖరవైరికి నీపద,ములకును శత్రుఘ్నుఁడిదిగో ♦ మ్రొక్కెడుఁ గంటే. ౨౫౧

తే॥ అఖిలలోక భయంకరుఁ♦డైన లవణ, దనుజుఁ బరిమార్చి తపసులఁ♦దన్పె నితఁడు
సమరమున వీరులజయించి♦చాలయశముఁ,గనినపుష్కలుఁడితఁడువం♦దనమొనర్చె

సీ॥ బహుగుణాఢ్యుఁడుమహా♦బలుఁడురాఘవునకు,బ్రాణప్రియుఁడితండు♦రాముమంత్రి
సకలధర్మవిదుండు ♦ సర్వజ్ఞుఁడైనట్టి, సుమతిగా మది నెఱుం♦గుము మునీంద్ర
అరివంశవిపినదా♦వానలుఁడును రామ, పాదాంబుజాతష♦ట్పదుఁడు నీదు
పాదపద్మంబులఁ♦బడె సుబాహుఁడు మహా, యశుఁడుదారుఁడితండు♦యమివరేణ్య

తే॥ ఇతఁడు సుమదుండు వింటె మ♦హేశ్వరీ ప్రి,సాదలబ్ధుఁడు ఘోర సం♦సారవార్ధి
తరణుఁ డౌ రాము సేవింపఁ♦దరలె నిదిగో, సత్యవంతుఁడు రిపులక♦సాధ్యుఁడితఁడు

క॥ పావనతురగముఁ బట్టియు, సేవకుచేఁ దెలిసివచ్చి ♦ శీఘ్రమె రాజ్య,
శ్రీవిభవంబుల నర్పణఁ, గావించెను మొన్న నిన్నఁ ♦ గని కేల్మోడ్చెన్. ౨౫౪

క॥ అన విని మారుతి నాలిం,గన మొనరిచి యాదరమునఁ ♦ గమ్రఫలాదుల్
గొనివచ్చి యిచ్చి స్వాగత,ము నొసంగి తపస్వి మునిఁగె ♦ మోదాంబుధిలోన్.

వ॥ అప్పుడు, ౨౫౬

మ॥ అరుసంబొప్పఁ దదాశ్రమంబున నమా♦త్యాదుల్ నివాసంబుఁ జే
సి రహిన్ నర్మదఁ గల్యకృత్యములు వా♦సిన్ జేసి హృద్వీథిఁ ద
చ్చరితంబున్ గొనియాడుచుండుతఱి నా ♦ శత్రుఘ్నుఁ డారణ్యకున్
నరయానంబునఁ బంపె నొంటరులు వెం♦టనాగ్ర సాకేతమున్. ౨౫౭

ఆ॥ భానువంశభూమి♦పత్యుషితం బగు, నా యయోధ్య దూర ♦ మందుఁ గాంచి
దాశరథిని జూచు ♦ తమకంబునను వే ప,దాతియగుచుఁ బోయెఁ ♦ దాపసుండు.

వ॥ ఇట్లు చని సకలసుజనశోభితంబును నతిరమణీయంబును నగు నయోధ్యం బ్రవే
శించి నే నిన్ని దినంబులకు మా శ్రీరామచంద్రుని పదారవిందంబులఁ జూడఁ
గంటి, మంటి, నావంటి పుణ్యుం డీ పంటవెలందియం దెందైనన్ గలండే యని
యుబ్బి తబ్బిబ్బై చనిచని ముందు, ౨౫౯

సీ. సరయూనదీతీర ♦ వర మంటపంబునఁ, గృష్ణాజినమున వ ♦ సించువానిఁ
గటి మృగశృంగంబుఁ ♦ గలవాని మృదులదూ,ర్వాదళ శ్యామగా♦త్రంబువానిఁ
బుండరీకచ్ఛవిఁ ♦ బొల్చు లోచనములు, కలవాని దీక్షచే ♦ మెలఁగువాని
వ్యాసాది మునిబృంద ♦ పరివృతుం డగువాని, వీరసేవితుఁ డౌచు ♦ వెలయువాని
తే॥ భరతలక్ష్మణులకు మధ్యఁ ♦ బరగువాని, నీప్సితార్థంబు లెల్లర ♦ కిచ్చువానిఁ
బలుకు పలుకున కమృతంబు♦లొలుకువాని, రామభద్రునిఁ జూచె నా♦రణ్యకుండు.

తే॥ చూచితలయూచిరోమాంచ♦శోభితాంగుఁ, డగుచు నేటికిబలెమదీ♦యాంబకములు
సఫలతను బొందె శాస్త్ర సం♦జ్ఞాతృతయును, సార్థకత్వంబునొందెని♦స్సంశయముగ.

క॥ శత్రుఘ్నుఁడు నన్నంపి ప, విత్రునిగాఁజేసె నట్టి ♦ విమలుఁడుఁ గలఁడే
ధాత్రిని నైతిని మత్య♦ద్గాత్రుఁడ శ్రీరామపాద♦దర్శన గరిమన్. ౨౬౨

క॥ ధర మత్సముఁ డెఁకఁ గలఁడే, పరుల కగమ్యము విచార♦పరు లగు యోగీ
శ్వరులకు దూరం బగు రఘు, వరుని సమీపంబు నాకుఁ ♦ బరగ లభించెన్. ౨౬౩

క॥ ఇనవంశజు చరణము లొ, య్యన మద్దృగ్గోచరంబు ♦ లగునట్టులఁ జే
తు నటంచు బొంగి నుడువుచు, మునికులతిలకుండు రామ♦మూర్తినిఁ గాంచెన్

వ॥ అంత, ౨౬౫

తే॥ స్వీయ తేజంబుచేఁ బ్రకా♦శించు భూమి, సురవ రేణ్యుఁ దపోమూర్తి♦ధరుని గాంచి
రామచంద్రుఁడు భక్తిసం♦భ్రమము లెదను, బొదల దిగ్గున లేచి వే♦పోయి యపుడు

మ॥ పరమాహ్లాదము గల్గె నా మదికి నో ♦ బ్రహ్మణ్య దేవా సమా
దరభావంబున మీరు వచ్చుటఁ బవి♦త్రం బయ్యె నా గాత్ర మీ
హరిమేధంబు ఫలించె నంచెరగెఁ బా♦దాబ్జంబులన్ దేవక
ర్బుర మాళిస్థమణి ప్రదీపిత పదాంభోజద్వయుం డొయ్యనన్. ౨౬౮

ఆ॥ ప్రణతుఁడై పదాలఁ ♦ బడియున్న రాము భు, జాంతరంబు వట్టి ♦ యవని దేవుఁ
డెట్టకేల కతని ♦ నెత్తుచుం దాఁ గ్రుచ్చి, కౌఁగిలించుకొని యెఁ♦ గడుముదమున.

ఉ॥ ఆ మునినాథుఁ బట్టి విన♦యంబునఁ గర్బురరత్న సుప్రభా
శ్రీమహితాసనంబు నను ♦ జేర్చి నీటను దత్పదంబులన్
రామవిభుండుఁ గడ్గి యను♦రాగముతోఁ దలదాల్చెఁ దీర్థ మే
నీ మహినైతిఁ బావనుఁడ ♦ నెల్లర తోడ నటంచుఁ బల్కుచున్. ౨౬౯

తే॥ చందన మలంది క్షీరముల్ ♦ చాల నిచ్చు, ధేనువు నొసంగి యా దేవ♦దేవసేవి
తాంఘ్రుఁ డిట్లని పలికె న♦య్యా! మదీయ, వాజిమేధంబు సంపూర్తి♦ వడయఁ గలదు.

ఉ॥ ఇప్పుడు బ్రహ్మహత్యఁ జని♦యించిన పాప మడంగు నంతయున్
దప్పక నశ్వమేధ మిఁకఁ ♦ ద్వచ్చరణంబునఁ బూతమై చనున్
జెప్పెడి దేమి ధన్యతను ♦ జెందితి నే నను రామునిన్ స్మితం
బొప్ప ముఖంబునందు మధు♦రోక్తి వచించె మునీంద్రుఁ డిట్టులన్. ౨౭౧

ఆ॥ పరమ సాత్త్వికుఁడవు ♦ బ్రహ్మణ్యుఁడవు నీదు, వంటి నృపతి యిట్లు♦ పలుకుటరుదె
వేదవేత్తలైన♦ విప్రులు నీ మూర్తు, లనుట నిజము భూత♦లాధినాథ. ౨౭౨

చ॥ మనుకులదీప నీ వెపుడు ♦ మంగళ దాయకమై తనర్చు బ్రా
హ్మణ యజనాదికంబు నన♦యం బొనరింపుచు నుంటివో మహిన్
జనపతు లప్డు పూజలను ♦ సల్పఁగలా ద్విజహత్య పోవఁగా
ననెదు సవం బొనర్చుటలు ♦ హాస్యముగా నది తోచె నా మదిన్. ౨౭౩

తే॥ శాస్త్రములలోన నొకటియుఁ♦జదువనట్టి, శుంఠ నీ నామమును మన♦శ్శుద్ధి నుడువఁ
గల్గినంతనె తరియించి♦ కలుష జలధిఁ, బడయు మునులకు గమ్యమా♦ పరమపదము.

క. దురితహారంబగు శ్రీ రఘు, వరు నామము నెంతవఱకుఁ ♦ బఠియింపఁడో భూ
సురహత్యాసమదురితము, లరచుచుఁ దామంత వరకు♦ నచ్చట నుండున్. ౨౭౪

తే॥ కలుషగజములు నీ నామ♦గర్జనంబు, విని గతేమి నివాసంబు♦ మనకిఁ కెక్క
డని పలాయనమొనరించు ♦ నధిక భీతి, సకల వేదేతిహాసాల ♦ సార మిదియ.

తే॥ తలఁచినంతనె కలుషముల్ ♦ దొలఁగు నిన్ను, గనినయంత నెపుణ్యముల్ ♦ గల్గు కథలు
వినిన యంతనె యపుడు ప ♦ వితుఁడగును, బ్రహ్మహత్యాఘు మెటునీకు ♦ వచ్చురామ.

పంచపది

తే॥ మధురమైనట్టి రామనా ♦ మంబు వాక్కు
చేతఁ దా నెంతవఱకు వ ♦ చింప లేఁడొ
యంతవరకుండుఁ బాపుల ♦ కఘభయంబు
త్రిపథగాతీరమున నున్న ♦ ఋషుల ముఖము
వలన నిది వింటి మున్ను నేఁ ♦ దొలియుగమున. ౨౭౮

చం॥ ఇలఁగలవారిలోన నిపు ♦ డెంతయు ధన్యుఁడ నైతి రామ నీ
సులభముఁగాఁగ నా కనులఁ ♦ జూచితి సంసృతి భీతివాసె నం
చలఘుఁడు మౌని పల్కు విని ♦ యచ్చటి తాపసు లప్డు సాధువా
క్కులను వచింపుచొక్కు మొగిఁ ♦ గూరిమితోఁ గొనియాడి రమ్మునిన్. ౨౭౯

క॥ అత్యాదరమున ద్విజ విను, మత్యాశ్చర్యంబు జరిగె ♦ నటఁ గౌసల్యా
పత్యముఁగని యారణ్యకుఁ, డత్యానందంబు దోప ♦ నను మౌనులతోన్. ౨౮౦

ఆ॥ మౌనివర్యులార ♦ మానసహర మగు, మద్వచస్సు వినుఁడు ♦ మాదృశుండు
భాగ్యవంతుఁ డెవఁడు ♦ వసుధఁగలం డిప్డు, పుట్టలేదు ముందుఁ ♦ బుట్ట బోడు. ౨౮౧

సీ॥ పరఘువరుపద ♦ సారసస్థపరాగ, మామూన్నాయమృగ్యమై ♦ యలరు నెపుడు
నే రాముఁ డమరన ♦ రేంద్రాదిమకుట ర,త్నప్రభాపూరమా ♦ ద్యత్పదుండొ
యా రామచంద్రుఁ డ ♦ త్యంతహర్షంబున, నతుఁడొచు నాకు స్వా ♦ గతమొసంగె
నాపాదసలిలపా ♦ నముఁ జేసి నేఁ బవి, త్రతను జెందితి నంచు ♦ దలఁచినాఁ డ

తే॥ టంచుఁబరవశుఁడై పల్కు ♦ నంతలోన, బ్రహ్మరంధ్రంబు వగిలి వి ♦ వరమునుండి
వెలుగు వెలువడి రాముని ♦ గలసెనపుడు, మునికులోత్తము యత డెంత ♦ పుణ్యుఁడొక్కొ.

క॥ సరయూతీరమున మనో, హరమగు మంటపమునందు ♦ నఖిలజనంబుల్
పరికింపుచుండ మౌనీ,శ్వరుఁ డొందె నగమ్య మైన ♦ సాయుజ్యంబున్. ౨౮౩

మ॥ జను లీ చిత్రముఁ గాంచుచుండ దివి నో ♦ జన్ మ్రోసె వీణాధ్వనుల్
ఘనతూర్యధ్వను లొప్పెఁ బెల్లు గురిసెన్ ♦ గల్పప్రసూనంబు లీ
ముని ధన్యాత్ముఁడుఁ జూచుచుండ రఘురా ♦ మున్ జెందె నంచందరా
మునినాథున్ గొనియాడుచుండిరి మదిన్ ♦ మోదంబు సంధిల్లగన్. ౨౮౪

క॥ విని యా చరితము వాత్స్యా, యనముని భోగీంద్రుతోడ ♦ హర్షాత్ముండై
యనె నిట్టుల కౌసల్యా, తనయకథాశ్రవణగాథ ♦ తత్పరమతియై. ౨౮౫

చ॥ జనకసుతామనోహరుని ♦ సచ్చరితామృత మెంత ద్రావినన్
దనివి జనింప దించుక పృ♦దాకుకులేశ్వర నా మనంబునన్
గనుచు రఘూద్వహు న్విడచె ♦ గాత్రి మయారె త్రియామిదగుప్తిజా
మునివరుఁడప్డు చిత్రముగ ♦ మోక్షమునుం గన నెంత ధన్యుఁడో. ౨౮౬

ఆ॥ ఎచటికేగెఁ దురగ ♦ మెచ్చట నెట్టెట్లు, మెలఁగె నెచ్చటెట్లు ♦ వెలిగెరామ
చంద్రియశము నాకు ♦ సర్వంబు నెరిగింపు, మఖిల ధర్మవిదుఁడ ♦ వగుదు వీవు.

వ॥ అనుటయుఁ బ్రహృష్టాంతరంగుండై ఫణీశ్వరుండు దత్తద్గుణ కథోదయంబగు రామ
చరితంబు సర్వంబుఁ జెప్పం దొడంగె నెట్లనిన, ౨౮౮

ఆ॥ బాగుబాగు మంచి ♦ ప్రశ్నఁ జేసితి రామ, విభుని గుణములెంత ♦ వినిన నింక
విననివాఁడువోలె ♦ వినఁగోరుచుండును, విసువుపుట్ట దెట్టి ♦ వెఱ్ఱికైన. ౨౮౯

సీ॥ సైనికవరులతో ♦ సవనాశ్వరాజంబు, పోవుచు మునిబృంద♦సేవితములు
హృదయరంజకములౌ ♦ రేవాసరిత్తీర, భూములఁ దిరుగుచుఁ ♦ బోయి పోయి
ఆ ధునీమధ్య న♦గాధజలంబున, మునిగిన శూరులు ♦ కని మహాద్భు
తము నొంది పడయు మా ♦ ర్గ మదే దెవం డీ జ, లంబులో దిగి తేగ♦లండు దీని

తే॥ అని సముద్విగ్నమానసు ♦ లగుచు వార, లంద రాలోచనముసేయు ♦ నంతలోన
వీరశతములతో రఘు♦వీరుఁ డచటి,కరిగి హయరక్షకులఁ గాంచి ♦ యనియె నిట్లు.

ఉ॥ అందరు గుంపులై యిట♦భయంపడు చేదియొ పల్కుచున్న వా
రెందరిగెన్ రఘుక్షితిత♦లేశ్వరు కర్బురపత్రిపోల్లస
త్సుందరసప్తి తోయమునఁ ♦ జొచ్చి మునింగెనొ మానికొంచు వే
యెందులకైనఁ బోయెనొ వ♦చింపుడు తత్క్షణమే యుదంతమున్. ౨౯౧

క. అని శత్రుఘ్నుఁడు పలుకఁగ, విని వీరులు నుడివి రిట్లు ♦ వినయముదోపన్
మన వీతి మునిగె నీ నది, వినుము ముహూర్తంబు గడచె ♦ వెలువడ దింకన్.

తే॥ వచ్చెదము మేము మీతోడ♦వసుమతీశ, వేగఁ జనితెండు మీరలా ♦ వీతినసుచు
నంబుసంతరణోద్యతు ♦ లైన వారిఁ, గాంచి దుఃఖించి మంత్రిని♦గాంచి యనియె.

మ॥ వినుమో మంత్రి యెవం డగాధజల మ♦న్వేషింప దక్షుండు సా
వనవాహం బెటు లభ్యమౌ నెవఁడు వా ♦ ర్వం బే యుపాయంబునన్
గను యజ్ఞంబు సమాప్తి నెట్లు గను వీఁ♦కన్ నాకు సర్వంబు నో
యనఘా తెల్పుము సేయఁగాఁ దగిన కా♦ర్యంబు న్వచింపం దగున్. ౨౯౪

చ॥ అన విని మంత్రి పల్కె సమ♦యానుగుణంబుగ హర్ష మొంద నో
మనుకులదీప వింటె జల♦మధ్యమునుండి రసాతలంబుఁ జే

ర నతులితాత్మశక్తి యలరా♦ర్మన భారతికిన్ సమీరనం
దనునకు నీకుఁగావున జ♦నందగు ముప్వురు మీరు సప్తికై. ౨౯౫

క. మనరాముని హయమేధం, బనువగు మీ మువురివలన ♦ నను మంత్రి సుదుల్
విని వెంటనె శత్రుఘ్నుఁడు,హనుమత్పుష్కరులతో మ♦హానది మునిగెన్. ౨౯౬

ఆ॥ మునిగినంతలోన ♦ ముందరఁగనె నవే, కోపవనవిరాజి♦తోర్వి యగుచు
మెరయుపురముఁగనియె♦వరమణిస్తంభంబు, నందుబద్ధమగు హ♦యంబుఁగనియె.

ఉ. చూచె మఱిన్ గడానిపని ♦ జొక్కుటమూ మగరాలమేడలోఁ
బూచిన తంగెడట్ల వర♦భూషణకాంతుల నొప్పు దానినల్
దాచును బోలు కలు జడ♦దానిజొకాటపు కత్తెలిమ్ముగన్
వీచఁగ నుండుదాని బల♦భిన్మణిశయ్యఁ బరున్న బిత్తరిన్. ౨౯౮

వ॥ ఆ సమయంబున. ౨౯౯

తే॥ రాణి గన్గొని కొందరు♦రామ లిట్టు, లనిరి యమ్మరొయతి సూక్ష్మ♦తనులుమువురు
మాంసపుష్ట కళేబరుల్♦మనుజులిపుడు,చేటుమూడెను గాఁబోలు♦చేరి రిటకు. 300

తే॥ చేకురెను మంచి మాంసంబు ♦ నీకుఁదినఁగ, వీరినెత్తురు నీకు ల♦భించెఁద్రావ
ననెడు చేటుల నుడువుల♦కతివనన్వెఁ, దనదుముఖమున బొమలున♦ర్తనము సలుప

సీ॥ అంతలో శౌర్య వీ♦ర్యసమన్వితులు శర,స్త్రాణసంశోభి మ♦స్తకులు సకల
సన్నాహసహితు లీ ♦ శత్రుఘ్నముఖులు రా, నిదియేమివింత వీ♦రెటుల నిటకు
రాఁగల్గిరని యెల♦నాగలు తమలోన ♦ నొకరితో నొకరు చె♦ప్పికొనుచుండ
విని వారి విభవము ♦ ల్గని మదియబ్బుర, పాటొందుచును బోయి ♦ పాదములకు

తే॥ మొక్కి స్వకిరీట మాణిక్య♦రుచిరసత్ప, దాంబుజను జేయఁగా రాణి♦యనియెనిట్టు
లెవరయా మీ ర్ధనుర్ధరు ♦ లెట్టులిటకు, వచ్చినారంతయును భయం♦పడక చెపుడి.

క॥ సురవరులైనను మత్పురిఁ జొరలేరెటొ వచ్చిరా యు♦సురులుండంగన్
మఱిలరు వచింపుడీ చా, మరశోభిత తురగ మే క్షు♦మానాథునిదో॥ 303

తే॥ స్వర్ణపట్టం బొకటి దీని♦ఫాలమందుఁ, గ్రాలు నను నట్టి నాయకు♦రాలి మోహ
నాక్షరాన్విత వాక్కుల♦కాంజనేయుఁ,డనియె నిట్టుల నిర్భయుం♦డగుచు నగుచు.

తే॥ సకల దేవశిఖామణి ♦ సకలలోక, భూషణుఁడు సర్వలోక సం♦పూజ్యుఁ డెవ్వఁ
డా మహాధ్వరకర్త శ్రీ♦రామ విభుని,కింకరుల మంచుఁ దెలియుమో♦పంకజాక్షి.

చ॥ అఘు కిసుమంత లేక సవ♦నాశ్వముఁ గట్టితి రేల సర్వవి
ద్యలఁ బరిపూర్తిఁ గంటి మరు♦దారగ మే మఖలాస్త్ర శస్త్రవి

ద్యలఁ గడతేరినా మిపుడ♦తత్ప్రతిరోధకుఁ బట్టికొట్టి మీ
రలు కనుచుండఁ గొందుము తు♦రంగముఁ జూడు బలాత్కరంబుగన్. ౩౦౬

వ॥ ఇట్లను ప్లవంగోత్తముని వచనంబులు విని వివరస్థయు వాక్యరచనావిశారదయు
నగు నయ్యంతుల మిన్న యిట్లనియె. ౩౦౭

చ॥ పదివేలేడులు మంచిపట్టుఁదలతో♦ బల్వాడి వాలమ్ములన్
గదనంబుం బొనరించి నేఁ గొనిన యీ ♦ గంధర్వ మీ ధాత్రిలోఁ
గదలింపన్ గలవాఁడెవండు హరి నే ♦ గైకొందునే రామ స
త్పద సేవాపరురాలఁ గింకరిని ద♦దాత్రిజాధిరాణ్మౌళికిన్. ౩౦౮

మత్తకోకిల॥ యజ్ఞవాహముఁ బట్టి నేడు మ♦హాపరాధ మొనర్చితే
నజ్ఞురాల క్షమింపుఁడీ తెలి♦యంగ నైతిని నాకు స
ర్వజ్ఞుఁ డార్తజనావనుం డగు ♦ రాఘవుండు శరణ్యుఁడో
ప్రాజ్ఞులార భరించినా ర్గద ♦ బన్నముల్ దురగార్థమై. ౩౦౯

పంచచామరము॥ ధరాసుతాధవుండు నాడు ♦ తప్పులన్ క్షమించి యా
దరంబుగన్ గనన్ సుపర్వ ♦ దైత్యు లెవ్వరేని పొం
దరాని మేల్వరంబు నిచ్చె♦దన్ బిరాన సత్తముల్
వరింపుఁ డయ్యలార వ్రీడ♦బాసి సంతసంబునన్. ౩౧౦

వ॥ అనిన హనుమంతుం డిట్లనియె. ౩౧౧

క॥ శ్రీ రఘువరుకృపచే నో, సారసముఖి మాకుఁ గలదు♦సర్వంబైనన్
వరమొక్కటిఁ గోరెద మెదఁ,గరమిష్టంబదియ మాకుఁ♦గాదనకిమ్మా. ౩౧౨

తే॥ ప్రతిభవంబునఁ బతి రామ♦భద్రుఁడుగను, మేము తత్పద సేవచే♦ మెలఁగునటులఁ
జేయుమనవినియని యెస♦స్మితముఖాబ్జ,యగుచుమధురంపునుడులన♦య్యన్నుమిన్న

చ॥ పరమ ప్రియము మీరు కోరినది యా♦బ్రహ్మర్షిముఖశ్రేణికిన్
ఖరదైత్యాంతకు భక్తు లీప్సితము కా♦కన్యానునే యైన నా
వరమొక్కండుఁ గొనుండు మీకుఁ గడులా♦భప్రాప్తి యా నెంత మీ
ర్పరిహాసం బొనరించినన్ రఘువర♦స్వాంతప్రమోదంబుగన్. ౩౧౪

సీ॥ వీరమణిన్నృపుండు ♦ వీరమణి పరీతుఁ డుగ్రరక్షితుఁడు ముం♦దున్నవాఁడు
బట్టునాతండు మీ ♦ వారువంబును దజ్జ, యార్థము మీరీమ♦హాస్త్రరాజ
మును గొనుఁడాన్నృపా♦లునితోడ శత్రుఘ్ను, పోరి జయంబును ♦ బొందు మీవు
నస్త్రసంస్పర్శచే ♦ నతఁడుఁ బవిత్రుఁడై యెదరామచంద్రుని♦ నెఱుఁగఁగలఁడు

తే॥ ఎరిగి హరి నిచ్చి పదముల ♦ కెఱఁగఁగలఁడు, కాన మద్రిపుభంజన ♦ మైనయస్త్ర
వరముఁ గొనుఁడనరాఘవా♦వరజుఁడుత్త, రాముఖంబునవిధి దాని♦గ్రహణ మొందె.

వ॥ ఇట్లద్భుతంబగు నయ్యస్త్రంబుఁ బరిగ్రహించి శత్రుకర్శనుండునుదుష్ప్రధర్షుండును వైరివారణాంకుశంబును నగు శత్రుఘ్నుండు యోగినికి నమస్కరించి తురంగసహితుండై పుష్కర హనుమంతులతో జలంబున మునిఁగి రేవాతీరంబున సుఖంబుగ వసించెను దత్సైనికులు హయాన్వితులగు వారిం జూచి ప్రహృష్టాంతరంగులై సాధువాక్యంబులఁ బ్రశంసింపుచుండ హనుమంతుండు వరప్రాప్తి మొదలుగాఁగల వృత్తాంతంబంతయు వినిపింప విని యందరమితానందంబు నొందుచుండి రనుటయు.

చ॥ మనసిజదర్పభంగ ముని ♦ మానససారసభృంగ సజ్జనా
వనకరుణాంతరంగ ఘన♦పాపతమిస్రపతంగ భేత్సుర
ఘ్నన మృగరాణ్మరాళదర♦కాశనిభాంగ వృషేట్తురంగ జీ
వనధినిషంగ పాణితల ♦ బాలకురంగ కృతాంతకాంతకా. ౩౦౭

క॥ భవహర పాదార్చారత, భవహర శరణాగతార్తి ♦ భయహర రిపువై
భవహర దైత్యారితనూ, భవ హర గిరిరాట్తనూభ♦వాహృదయేశా. ౩౦౮

మాలిని॥ హృతజన పరితాపా ♦ యీడితోద్యత్ప్రతాపా
నతవిమతకలాపా ♦ నాగరాట్తల్పరోపా
హృతసనదవలేపా♦హృద్య శుభ్రస్వరూపా
హతమునిజనపాపా♦నాకకుత్కీలచాపా. ౩౦౯

## గద్యము

ఇది శ్రీమద్గార్త్యాన్వయ పవిత్ర లక్ష్మీనారాయణార్యౌరసపుత్ర శ్రీ చింతలపాటి వంశ క్షీరపారావారరాకాసుధాకరాయమాణ సూర్యనారాయణార్య దత్తపుత్ర శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షాసమాసాదితానవద్యోభయ కవిత్వ విద్యావధాన రామమూర్తిశాస్త్రి కవ్యభిధాన ప్రణీతంబైన రామాశ్వమేధంబునందు
చతుర్థాశ్వాసము.



శ్రీ

గణాధిపతయే నమః

శ్రీరామభద్రాయ కరుణాసముద్రాయ నమః

# రామాశ్వమేధము

## పంచమాశ్వాసము



రాజీవజని సునా
సీరాది సుర మకుటవిరచిత మణి గణ రు
గ్గ్రాజితపదయుగ ఫణి
హారా ! శ్రీ నందివాడ యానందేశా. ౧

వ॥ అవధరింపు మంత వాత్స్యాయనుండు శేషునిం గని యయ్యా! యనంతరం బెట్టు జరిగెఁ దద్వృత్తంబు సర్వం బెరింగింపు మన నాతం డిట్లనియె. ౨

— వీరమణి మహారాజు చరిత్రము —

క. పావనసత్త్రీయు వీణా, రావములు మృదంగతూర్యరవములు సెలఁగన్
దేవ వినిర్మితమై తగు, దేవపురముఁ జేరె దుత్రిగతిన్ ముక్తంబై. ౩

వ॥ ఆ పట్టణంబు నందలి గృహంబులు స్వభావంబుచే రజతమయ కుడ్యరచనా విశేషంబుల విమలంబులై నాగసేవితం బగు వింధ్యాద్రిని హసింపుచుండు. విచిత్రమణిస్థగితంబులై మాణిక్య గోపురంబు లలరారుచుండుఁ బ్రతిగేహంబునను మనోహర లగు పద్మినులు ముఖపద్మదళేక్షితలై మనుజులచిత్తంబు లపహరింపుచుందురు. ప్రతి నికేతననిబద్ధప్రసిద్ధపద్మరాగంబు లంగనాజనాధరోష్ఠస్పర్ధచేఁ గట్టంబడినవా యనునట్టు కనుపట్టుచుండు. సకలాగారంబులఁ బంజరనియంత్రితంబులై హంసలు మేఘుంబుల వలని భయంబులుఁ దొలఁగి మానససరోవరంబును మానసంబునఁ దలంపకుండు. నిరంతరంబుఁ జంద్రశేఖరుం డచ్చట నివసించు కతంబునఁ జంద్రికానిరస్తధ్వాంతం బగుచు నచ్చటివారికి శుక్లకృష్ణ పక్షభేదంబు లేక నొక్కరీతి నుండు, నట్టి సకలవైభవాస్పదంబగు నప్పత్తనలలామంబున కధీశ్వరుండై వీరమణి నృపాలశేఖరుండు రాజ్యంబు సేయుచుండు, నతనికి మహాబలయుతుండగు రుక్మాంగదుండను కుమారుండుఁ గలఁడతం డొక్కనాడు మహిళా

జనంబులతో వనవిహారంబు సల్పుచుండ నవ్వనంబునకు రాజన్య శిఖామణి యగు రామచంద్రుని సవనతురంగం బరుదేరఁజూచి పరమాశ్చర్య మగ్నులై పల్ల వాధరలు వల్లభుం గాంచి యిట్లనిరి. ౪

తే॥ నేలఁగల క్షత్రియులలోన ♦ లీలఁ దీని, నేలఁ గలవాఁడ మూఁడులో♦కాల వీర నేలఁగలవాఁడు వార్ధులు ♦ వేలగాగ, నేల నేలంగఁ గలిగిన ♦ నేలఁ గనుము. ౫

క॥ ఇది మన సాహిణమున నున్నదియా చెప్పంగ నేల ♦ నానార్థంబుల్ బొదలును మనపట్టణమునఁ గొదువ యొకటి గలదె చూడఁ♦గుతుకం బయ్యెన్.

ఉ॥ ఈ మహిలోన నెందయిన ♦ నిట్టి తురంగముఁ గాంచినామె గం గామలదేహముల్ ముఖము ♦ నందున బంగరురేకు పట్టుఁబోల్ కోమలపుచ్ఛముల్ ఘుసృణ♦కుంకుమకాంతిని మీరు జూలునున్ వ్యోమభవంబు మించు గమ♦నోద్ధతి కల్గి వెలింగెఁ జూచితే. ౭

క॥ క్రన్ననఁ జని పట్టుఁడు మా, కన్నుల కుత్సవము సేయుఁ ♦ గలిగించె నటం చన్నులమిన్నలు వలుకఁగఁ, బన్నుగ నతఁ డొక్క కేలఁ♦బట్టె హయంబున్. ౮

తే॥ ఆ హయోత్తమ ముఖబద్ధ♦ మగుచు సంస్ఫు,టాక్షర శ్రేణిచేఁ దన♦రారు కనక పత్రి మా రాజతనయుండుఁ♦ బారఁజదివి, నవ్వు చిట్లనె మహిళాజ♦నంబు వినఁగ.

సీ॥ శౌర్యసంపదల మ♦జ్జనకునితో సముం, డీ క్ష్మాతలంబున, ♦ నెనఁడుఁ గలఁడు మఖభుగ్గనుజయుక్త♦మణిమాళివిలసత్ప,దాంబుజుండుఁ బినాక♦హస్తుఁడెపుడు ద్వారమందుండి మా♦తండ్రి నేమరకఁ గా,పాడుచుండుట రామ♦భద్రనృపతి యెరుఁగఁడుఁ గాబోలు ♦ నెరిగిన నీ క్రతు,వొనరింప నతఁ డేల ♦ నుత్సహించు

తే॥ భళిర కానిమ్ము పిత మహా♦బలయుతుండు, వాజిమేధం బొనర్చు నీ♦వాజితోడఁ గట్టుఁడో భటులార త♦త్క్షణమ దీని, ననుచుఁబల్కెడి పలుకుల♦కబ్జముఖులు. ౧౦

క॥ పరమానందంబున ముఖ, సరసిజములు బొదలఁ జేరి ♦ సరసత మెరయన్ బరిరంభణ సౌఖ్యంబులఁ, గరిగించిరి విభుని మనసు ♦ క్రమమున నంతన్. ౧౧

వ॥ రుక్మాంగదుం డశ్వంబుతో మృదంగాది సకలవాద్యంబులు మొరయ వందిమాగధులు నుతింప మహోత్సాహంబునఁ బత్నీసహితుండై కదలి యంతఃపురంబున వారల డించి జనకుని యంతికంబున కరిగి యిట్లనియె. ౧౨

మ॥ జనకా పుష్కలుఁ డిద్ధబాహుబలుఁడో ♦ శత్రుఘ్నుఁడు న్వెంటరా మన యారామసమీపభూములకు రా♦మక్ష్మాతలాధీశుసా వనగంధర్వము రాగఁ దానిఁగని నే ♦ బంధించితిన్ శాలలో ననుమాటల్ మది కింపుగాఁగ హరుతో ♦ నా రాజవర్యుం డనెన్. ౧౩

క॥ అల్లుఁడవై యిట నుండుటఁ, జెల్లెఁ బరితాపంబు సుఖముఁ ♦ జేకురె నా కి
న్నాళ్ళు తనూజుం డిప్పుడు, బల్లిదుఁడై పడుచుఁదనపు♦పనిఁ గావించెన్. ౧౪

గీ॥ అర్ధనారీశ్వర మహేశ ♦ యజ్ఞజూట, యీ యయోధ్యాపురీనాథుఁ♦డైన రామ
భద్రుమఖవాజి యిటకు రాఁ♦బట్టికట్టె,నరయ కెదముందు వెన్క రు♦క్మాంగదుండు.

వ॥ అనిన శివుం డిట్లనియె. ౧౬

సీ॥ ఓ వీరమణి భూభు♦జోత్తమ నీపుత్రుఁ డా, రామచంద్రు హ♦యంబుపట్టు
కెంతటి యద్భుత♦మేమందు నిపుడు సు,రాసుర మోహనం♦బైన యుద్ధ
మగు వీరకోటిచే ♦ ననయంబు రక్షితుఁ, డైన శత్రుఘ్నుతో ♦ ననఘ నిజము
స్వాంతమం దెవ్వాని ♦ ధ్యానింతు నెవ్వాని, నామ మొప్పనొ నాదు♦నాల్కయందు
గీ॥ అట్టిరాముని యజ్ఞాంగ ♦ మపహరించి, నందనుఁడు గొప్పలోపంబు ♦ నందఁజేసె
నైన మదినెప్డు సేవిత ♦ మైన రామ, చరణకమలంబుఁ గనఁగల్గు♦ సమరమందు. ౧౭

క॥ వచ్చెడివాఁ డరిమర్దనుఁ, డిచ్చటఁగాపున్న నన్ను ♦ నెంచక వీతెన్
మచ్చరమునఁ గొంచేగును, జెచ్చెర హయరక్షణంబు ♦ సేయఁగ వలయున్. ౧౮

క॥ ఖాదం బిడు మశ్వమునకు, మోదంబును గొనుము జన్య♦మున రాముని స
త్పాదంబులఁ గను మతని ప్రి,సాదంబును గోరుమంచు ♦ సర్వజ్ఞుఁ డనన్. ౧౯

వ॥ వీరమణి నృపాలుం డిట్లనియె. ౨౦

ఉ॥ మారమదాపహార శత♦మన్యుముఖార్చిత పాదపంకజా
వారక స్వపరితాపమును ♦ బాలన సేయుట క్షత్రియాళికిన్
దీరమియేకదా రఘుప♦తిక్షితినేత హయాధ్వరంబుచే
మీరఁగనెంచె నందరిని ♦ మే మదిఁ జూచి సహింప నేర్తుమే. ౨౧

గీ॥ శక్తియున్నంతవరకును ♦ స్వపరితాప,రక్షణము సేయుచుండుట ♦ రాజధర్మ
మిప్పుడో రేపొ యీగాత్రి ♦ మేగునదియ,కానియుండదు సత్కీర్తి♦ గాంచవలయు.

గీ॥ శౌర్యఘనుఁడైన పుత్రుఁడు ♦ సర్వమెఱిఁగి, చేసె విడువఁ దురంగంబుఁ ♦ జేతనైన
వరకుఁ బెనఁగెద రామభూ♦పతికినాగ్రి,హంబొదవినఁగనుమునసమ♦యార్హముగను.

క॥ పట్టిన హయమును గొనిచని, పట్టిన రిపుపాదములను ♦ బరులందరు న
న్నొట్టలవియ నగరే చెడఁ, దిట్టరె కాతరుఁడు ఖలుఁడు ♦ దీనుఁడటంచున్. ౨౪

తే॥ ప్రాకృతజనుండుపోలె నా♦పనికిఁ జొరఁగ,నొల్ల రామునితోడ నా♦యోధనంబు
గూడెనేనియు సమయాను♦గుణ్యముగను, జేయఁ దగిన దదేదియో ♦ చేయు మయ్య.

వ॥ ఇట్లు వలికిన వీరమణి నృపాలశేఖరుని పలుకుల కలరి క్షపాకరశేఖరుం డతని
ఘనం బలర మేఘగంభీర భాషణంబుల నిట్లనియె. ౨౬

శా॥ రాజా ముప్పది మూడుకోట్ల సురలే ♦ రానిమ్ము నే నుండ నీ
వాజిన్ విప్పఁగఁ జాలువాఁడు భువి నె♦వ్వాఁడిప్డు శ్రీరాముఁడే
యాజి న్బోరఁగవచ్చి దర్శనము నీ♦యన్ గంటి నేనన్ భక్తిఁ బ
దాబ్జీవంబులఁ గూర్చి మ్రొక్కెదను బో♦రంజాల నా స్వామితోన్. ౨౭

క॥ అనయం బాతని రూపము, మనమున ధ్యానించు నేను ♦ మతి హీనుఁడనై
యనయంబుఁగాదె పోరఁగ, వినయంబున మ్రొక్కువాఁడ ♦ వేయేల నృపా. ౨౮

తే॥ పరులు నాకెవ్వరును దృణప్రాయు లరయ, లేశమైనను జేయఁగా♦లే రపకృతి
యుద్ధమొనరింపు రక్షకుం♦డుండ నేను, కలఁడె హరిఁబట్ట మూఁడు లో♦కాలయందు.

క॥ ఓ వాత్స్యాయన మునివర, యీ వాక్యంబులను నా మ♦హేశుఁడు వలుకన్
భూవర్యుం డాలించి ముదావేశంబునఁ జెలంగె ♦ నాహవకాంక్షన్. ౩౦

— ♦ వీరమణినృపతి ససైన్యంబుగ రణంబున కరుదెంచుట ♦ —

వ॥ అంత నతిబలాన్వితులు హయానుచరులును నగు రామభూవిభుని సేనాచరులు హయంబుఁ గానక. ౩౧

ఉ॥ వారువ మే దెసం జనె నె♦వండు హరించె హరించి కాలునిన్
జేరఁదలంచె నెవ్వఁడిఁక ♦ శీఘ్రమ రండు చనుండు తత్పథం
బారయుఁడంచుఁ బల్కుతరి ♦ నా లవణారి బలాన్వితంబుగాఁ
జేరి తురంగమం బెది వ♦చింపుఁడు సైనికులార వేగనాన్. ౩౨

ఆ॥ వాజి వెంట వచ్చు ♦ వారిట్లనిరి రాజ, యెందుఁజనెనొ యడవి ♦ నెవఁడు దీని
నాహరించినాడొ♦యరయంగఁ దగు ప్రియ,త్నంబు సేయవలయుఁ♦దడయ కిపుడు.

క॥ అనుమాటలు శత్రుఘ్నుఁడు, విని సుమతింబల్కె స ప్తి♦విధ మే మను దే
జనపాలుఁ డుండు నిట యీ, తని బల మే మాత్ర మెవఁడు ♦ దాని హరించెన్.

వ॥ అనుటయు సుమతి యిట్లనియె. ౩౫

సీ॥ దేవనిర్మిత మగు ♦ దేవపురం బిది, వైరులకెవ్వా డె♦వ్వారికైనఁ
గైలాసమువలె దు♦ర్గమ్యంబు శత్రుఘ్న, యిందుండి యీ రాజ్య♦మేలువాఁడు
వీరకోటి కిరీట ♦ వివిధరత్నప్రభా, జాలలసత్పాద♦సరసిజుండు
వీరమణి క్షమా♦విభుఁ డతిశూరుఁ డ,త్యంత తేజః ప్రభా♦వాఢ్యుఁడతఁడు.

తే॥ శివుని సద్భక్తివశునిఁగాఁ ♦ జేసినాఁడు, చేసి వాకిట నాతనిఁ ♦ జేర్చినాఁడు
చేసి నాకెవ్వఁడీడని ♦ చెలఁగినాఁడు, చెలఁగి నయవిదుఁ డను ఖ్యాతి ♦ చెందినాఁడు.

మ॥ ఇతఁడే వీతిని బట్టెనేని కదనం బి♦ద్దే తటస్థించు స
త్ప్రతిజూటుండును భక్తపక్షమునఁ దా ♦ వచ్చున్ రణక్రీడకు

నృతిమంతుల్ మనసైనికు లకటకము ♦ నర్పిక్షింప యత్నింప నా
నతి నిమ్మించుము మంత్రిదెల్ప ననె సే♦నానాథులన్ గాంచి తాన్. ౩౮

ఉ॥ వింటిరె సైనికు లెలియఁ ♦ బెగ్గడ పల్కిన పల్కులెల్ల మీ
దంటతనంబు లొప్ప రిపు♦తండ విభీకరమైన వ్యూహమున్
గంటను బన్నుఁడంచుఁ గడ♦క న్వచియించి రఘూద్వహుండు ని
ష్కంటకవృత్తి మంత్రి తను, ♦ జక్కఁగ మంత్రిమొనర్చునంతలోన్. ౩౯

తే॥ వారిజాక్ష జనార్దన ♦ శౌరియంచుఁ, దోఁచె రణమును జూచు కౌ♦తుకముఁ బొదల
ఘోరసంసారదావాగ్ని ♦ నారదుండు, నారదుఁడు గానవిద్యావి♦శారదుండు.

క॥ వచ్చిన ముని కెదురుఁగఁజని, యచ్చుగ నర్ఘ్యాదివిధుల ♦ నర్చనలిడి తో
డ్తెచ్చి తగు పీఠ మొసఁగి వి,యచ్చరమునితోడ లక్ష్మ♦ణానుజుఁ డనియెన్. ౪౦

క॥ మునిరాయ మామకీయస, వనతురగంబెందుఁజనెనొ ♦ పరిపరిగతులన్
గనుపింపదాయె వెతకిన, ఘనమాని యెవండు దీనిఁ ♦ గట్టెనొ చెపుమా. ౪౧

వ॥ అనుటయు నారదుం డిట్లనియె. ౪౨

సీ॥ ఇది దేవపురము న♦రేంద్ర యీ నగరాధి,పతి వీరమణి యను ♦ ప్రథితబాహు
బలయుతుం డీతని ♦ పట్టి రుక్మాంగదుఁ, డనువాఁడుఁ బట్టె నీ ♦ యశ్వరాజ
మతిదారుణంబౌ మ♦హాయుద్ధమిఁక నీకు, వారితో జరుగు న♦వార్యముగను
బలశౌర్య వీర్యసం♦పన్నులు విరులుఁ, బడఁగలరయ్యా నీ ♦ బలమునందు

తే॥ అందుచే శత్రునిర్భేద♦మైన వ్యూహ, మొందురచియించి జాగ్రత♦నుండు జయము
నొందెదవు చాల కష్టంబు♦నొంది మీఁద, రాము నెవఁడు జయించు నీ♦భూమిలోన.

వ॥ ఇట్లు తెలియం బలికి తదనుమతిం జని మున్ను దేవదానవయుద్ధంబు వోలె నతిదారు
ణం బగు రణంబుఁగాంచు తలంపున గగనంబున నుండె నంత నక్కడ. ౪౪

తే॥ శూరలోకశిరోమణి ♦ వీరమణియు, శూరు సేనాధిపుని రిపు♦వీరుఁ బిలువఁ
బంచి వచ్చిన యతనితోఁ ♦ బల్కె నిట్టు, వారిదారావగంభీర♦భాషణముల. ౪౫

శా॥ సేనానీ! పటహాదిరావములు ని♦స్సీమోద్ధతిన్ మ్రోయ నా
స్థానీయంబున నెల్లరు న్వినఁగ వే ♦ సాటింపఁగాఁ బంపుమా
ధ్వానంబు ల్విని లక్ష్మణానుజు జయిం♦పన్ బోవు వార్గాక యం
చా నాగాభరణార్చనారతుఁడు జ♦న్యాకాంక్షతోఁ బల్కఁగాన్. ౪౬

మ॥ పతిమాటల్ విని సైన్యనేత పటహ♦ధ్వానంబు లొప్పన్ గడున్
బ్రతివీథిన్ బ్రతియింట సాటె వినుఁడో ♦ రాజాజ్ఞ నుండో మహో
ద్ధత శత్రుఘ్నునితోడఁబోరఁగను నం♦దర్ రండు రాకుండినన్
సుతుఁడంచున్ హితుఁడంచు భ్రాతయనుచున్ ♦ జూడండు శిక్షించెడున్. ౪౭

తే॥ పటహరవములు చెవిలోనఁ ♦ బడినయంత, సమరసంతోష మెదలోన♦సందడింపఁ
గనక కవచవిభూషిత♦ గాత్రు లగుచు, వెడలి రథపునిఁ గన నృప♦వీరవరులు. ౪౮

మ॥ తలపాగ ల్ధరియించి మేనునఁ దను♦త్రాణంబు లొప్ప న్నిని
ర్మలగాంగేయ లసచ్ఛతాంగములతో ♦ మా ర్లేరు మా కా హారుల్
గలనం బందుఁ గలంగఁ జేతు మనుచున్ ♦ గర్వంబునన్ మన్ను శే
డులు రాఁజొచ్చిరి రాడ్గృహంబునకుఁ గో♦టుల్కోటు లత్యుగ్రతన్. ౪౯

క॥ స్యందనములఁ గొంద ర్మఱిఁ, గొందరు గుఱ్ఱముల నెక్కి ♦ కుతలముఁ గదురన్
గొందఱు కాల్నడ నేగి ర,మందగతిన్ వసుమతీశ ♦ మందిరమునకున్. ౫౦

సీ॥ కార్తస్వరాంచిత ♦ కవచశిరస్త్రాణ, హారశోభితుఁడు రు♦క్మాంగదుండు
కనకమయోష్ణీష ♦ కవచము ల్దాల్చి త,దనుజుఁడు మేటి శు♦భాంగదుండు
వివిధశస్త్రాస్త్ర కో♦విదుఁడైన వీరసిం,హాఖ్యుఁడు భూమిపా♦లానుజుండు
బాహుబలాఢ్యుఁడు ♦ బలమిత్రుఁ డను భూమి, నేత జామాత వి♦ఖ్యాతయశుఁడు
తే॥ ప్రధనమందున వీ ర్వసో♦నిధి శరధులు, బాహుబలమందు వీరు సు♦పర్ణరథులు
రాజవీరులలో మహా♦రథులు వీరు, రథులు విలునేర్పునను దాశ♦రథులు వీరు. ౫౧

వ॥ ఇట్లీ నలువురు ఖడ్గాదిసకలాయుధంబులు ధరియించి రాజమందిరంబున కరిగిరి సేనానియగు రిపువీరుండును జతురంగంబుల సజ్జంబుఁ జేసి నృపాలున కెరింగించె నంత వీరమణియు సర్వశస్త్రాస్త్రపూరితంబును మణిస్థగితంబును దృఢోచ్చ్రరథాంగం బగు శతాంగం బధిష్ఠించె నప్పుడు. ౫౨

క॥ వీరమహార్ణవమున శం,ఖారవము వినంగఁబడియెఁ ♦ గాతరజనులన్
బ్రేరణ సేయు విధంబున, భేరీధ్వని సెలఁగె శుభని♦వేదనకరమై. ౫౩

క॥ అందరు గృతస్వస్త్యయనులు, నందరు భూషణవిభూషి♦తావయవులు వా
రందరు శస్త్రాస్త్రాన్వితు, లందరు విభునాజ్ఞ నేగి ♦ రరిభీకరులై. ౫౪

తే॥ శంఖభేరీనినాదముల్ ♦ శైలగుహలఁ, జేరి దిక్కుల నిండి యా ♦ ఘోరరణముఁ
జూడఁగా రండు రండని ♦ సురలఁజీరఁ, బోయెనో యనునట్లుఁ ♦ బోనెదివికి. ౫౫

క॥ సేనాకోలాహల మా, క్ష్మానాథుండైన వీర♦మణి గన్గొని య
న్యూనానీకోత్సాహతఁ, దా నేగి సమీకభూమి♦తలమున నిల్చెన్. ౫౬

తే॥ అంత రథపత్తి సంకుల♦మైన సైన్య,మబ్ధి వడువున సేనల ♦ నాక్రమించి
ముంపఁదొడఁగినఁగాంచియ♦ద్భుతమునొంది,యనిమొసుమతినిగనిలక్ష్మ♦ణానుజుండు.

ఉ॥ వచ్చినవాఁడు వీరమణి ♦ వాజి హరించిన మేటి కంటివే
యచ్చెరువంద వ్యోమచరు ♦ లశ్వరథాదిబలంబుతోడ నన్

జెచ్చెర గెల్తునంచు నెటు ♦ సేయుటకర్జము వైరిసేనలోఁ
జొచ్చి కలంపఁగాఁ దగిన ♦ జోదు లిట న్వచియింపు మెవ్వరో? ౫౮

వ॥ అనిన సుమతి యిట్లనియె. ౫౯

సీ॥ అనఘ యీతండు మ ♦ హాసైన్యపరివృతుఁ, డబ్జశేఖరసప ♦ ర్యారతుండు
బోరఁగా వచ్చె నీ ♦ భూపాలుతోఁబోర, సకలాస్త్రవిదుఁడుఁ ♦ బుష్కలుండుమఱియు
యుద్ధకోవిదులు బ్రి ♦ సిద్ధబలాధికు, లన్యులు నీలర ♦ త్నాది నృపులు
తగుదు రీవు శశాంక ♦ ధరునితో, నృపునితో, ద్వంద్వయుద్ధంబునఁ ♦ దగను బోర,
గీ॥ ననఘ యిటు సేయ నీకు జ ♦ యంబుఁగల్గు, నైన నెటు సేయవలయునో ♦ యట్లసేయు
మయ్య యన విని లవణాభి ♦ యాతి వీర, భటులఁ గన్గొని రణకాంక్షఁ ♦ బలికె నిట్లు.

చ॥ భటవరులార ఘోరరణ ♦ పండితులార వినుండు నాకు నే
డెటుల జయంబుగల్గుఁ బృథి ♦ వీశుని యధ్వర మెట్లు సాగునో
యటుల మెలంగఁగా వలయు ♦ నందరు మీర లటన్న వారు లో
నటమట మింతలేకఁ జని ♦ రప్పుడు సంతస మొప్పఁబోరికిన్. ౬౧

ఆ॥ శౌర్యవంతులైన ♦ శత్రుఘ్నసైనికుల్, వైరిసేనతోడఁ ♦ బోరునపుడు
ఋషివరేణ్య తోఁచి ♦ రెలమి మధ్యాహ్నమి, హిరులమాడ్కి దుర్ని ♦ రీక్ష్యులగుచు.

ఆ॥ తివిరి వింట శరముఁ ♦ దిగుచుట విడుచుట, లేరుపడక నారి ♦ నేరుపేమొ
భటుల హరులకరులఁ ♦ బరులశిరంబులు, దెగుట పడుట యొకటి ♦ తెలియనయ్యె.

వ॥ ఇట్లు రథికసారథులతో రత్నమయస్యందనంబులును, నారోహకులతో హయగజంబులును మ్రగ్గుట విని రుక్మాంగదుండు మహాకోపంబున నత్యంతరూక్షకషాయితాక్షుండై మణిమయంబును సకలాయుధసన్నద్ధంబును నగు రథంబెక్కి ప్రావృడ్ఘనంబు వోలె శరవర్షంబుఁ గురియింపుచు నదల్చుచు వీరుల శరభిన్నగాత్రులఁ జేయుచు నందరి హాహాకారంబులచేఁ బరుగిడఁజేయుచు బలయుతశ్రీలఁ దనతో సములగు శత్రుఘ్నపుష్కలులం గని యిట్లనియె. ౬౪

— ♦ రుక్మాంగదుఁడు మూర్ఛనొందుట. ♦ —

ఉ॥ రమ్మిటకో మహాబలప ♦ రాక్రమ పుష్కల! లక్ష్మణానుజా!
రమ్మ బలాధికుండ సమ ♦ రంబునకున్ నృపనందనుండ ధై
ర్యమ్ముఁ దొలంగ పారెడి భ ♦ యార్తులకోటులతోఁ బనేమి వై
శమ్మ జయమ్ముఁ గాంచుడు బ ♦ లంబును జూపుడు నాకుఁ బోరిలోన్. ౬౫

క॥ అనుటయు రుక్మాంగదుఁ గ, న్గొని నవ్వుచుఁ బుష్కలుండుఁ ♦ గొని శితశరముల్
గనుమా నా బల మని రొ, మ్మునఁ గాడఁగనేసెఁ జూచి ♦ పొగడఁగ దివిజుల్. ౬౬

తే॥ అది గణింపక వేగ రు♦క్మాంగదుండు, వాఁడిముల్కులు పదివింటఁ♦బరగఁగూర్చి
భరతపుత్రుని నడిరొమ్మున ♦ బగుల బిట్టు, విడిచెఁగని వైరివీరులు♦వెఱపుఁజెంద.

క॥ ఇద్దరు రణసంరబ్ధకు, లిద్దరు విజయాభిలాషు ♦ లిద్ధాంపహులు వా
రిద్దరు సమశౌర్యులునై, తద్దయుఁ నొప్పిరి కుమార♦తారకు లనఁగన్. ౧౮

సీ॥ పదిబాణములు వింట ♦ భారతి సంధించి, యందు నాల్గింట వా♦హములఁ గడపి
రెంట సారథిని నొ♦క్కంటధ్వజంబును, గూల్చి తదగ్రిధరక్షు♦కులను రెంటఁ
బరిమార్చి యొకతీక్ష్ణ ♦ బాణంబునను రాజ, సూనుని యురమునఁ♦జొన్ప నతఁడు
విరథుఁడై యధ్వర♦విధ్వంసి వహువున, నుగ్రుఁడై మఱల వే ♦ రొక శతాంగ

గీ॥ మంధధిష్ఠించి సుదృఢ గు♦ణాంచితంబు, స్వర్ణచిత్రితమౌ శరా♦సనముఁ దాల్చి
సకలశూరాగ్రగణ్యుఁ బు♦ష్కలునిగాంచి, యనియెదృఢముగనిట్లురు♦క్మాంగదుండు.

ఉ॥ ఎక్కడ కింక నేగఁగల ♦ వింత పరాక్రమ మీవుఁజేసి పెం
పెక్కిన నా పరాక్రమము ♦ నించుకఁ జూడుము నిల్వు మాజిలోన్
నిక్కము సుమ్ము నమ్ము నిను ♦ నింగిని జేర్చెద నీదుచుట్టముల్
వెక్కసపాటుఁజెందఁ గడు ♦ భీతిని నీవు కలంగఁ బుష్కలా! ౨౦

తే॥ అనుచుఁదపనీయ రత్నపుం♦ఖాంచితంబు, భ్రామకం బను నత్యుగ్ర♦బాణ మొకటి
మంత్రిపూర్వముగాగ న♦మర్చివింట, విడచెఁ బుష్కలు రథముపై ♦ వీరులలర. ౨౧

క. శరవాతంబున భారతి, యరదం బెంతయును నెంత♦యాపిన నది వే
యరిగి యొకామడదూరము, గిరగిరగిర బొంగరంబు ♦ క్రియఁ దిరిగె ధరన్. ౨౨

తే॥ ఎట్టకేలకు స్వస్థాన ♦ మేగుదెంచి ♦ పూన్కినొకముల్కి వింటను ♦ బొందుపరచి
కదియరమ్మని కాంచనాం♦గదుని బిల్చి♦పల్కె భారతి మది నీసుఁ♦బదిలపరచి. ౨౩

శా॥ వీరాగ్రేసర సర్వదేవతలు సే♦వింపంగఁజెన్నొందు నా
స్వారాట్పట్టణ మిందృతుల్యు లగు మీ♦ర్వాసంబు సేయన్ దగున్
గారెప్డు న్నివసింప యోగ్యులు మహిన్ ♦ గారుణ్య మేపార నా
సౌరావాసముఁ జేర్తు నిన్నుఁ జనుమా ♦ త్వన్నాయకుల్ జూడఁగన్. ౨౪

క॥ అని గగనప్రాపకమై, తనరు మహాస్త్రంబు విడువఁ ♦ దచ్ఛరవేగం
బున ననులోమంబుగ రథ, ము నభస్థలికేగి యంత ♦ ముల్లోకములన్. ౨౫

తే॥ దాటి యినమండలముఁ♦జేరఁ, దదగ్రిథంబ, హస్కరకరార్చులనుసూత♦హరులతోడ
నమ్యోదగ్ధము దగ్ధదే♦హంబుతోడ, భగుణనెదనిల్పి పొగులుచుఁ ♦ బడియెనతఁడు.

చ॥ ఖరకరతప్తమై కరము ♦ కాయము గాయము నొంద మూర్ఛచే
ధరఁబడియుండఁజూచి ప్రవి♦దారణభూరి మహారవంబులన్

బరఁగెఁ దురంగరక్షకులుఁ, ♦ బారిరి పొంది జయంబు రాజు లం
దరు భరతాత్మజుండుఁ బ్రియ♦దంబును గాంచిరి మానిసత్తమా. ౭౭

ఆ॥ మూర్ఛమునిఁగియున్న ♦ పుత్రుని వీక్షించి, వీరమణి నృపుండు ♦ తేరుమీద
నున్న రిపుని జూచి ♦ యుగ్రుఁడై యెదురేగ, విపినగిరులతోడ ♦ విపుల వడఁకె. ౭౮

క॥ శూరులు హర్షము నొందిరి, భీరువులు గలంగి రపుడు ♦ భీతిని నృపుఁడున్.
సారము లగు నక్షయ తూ, ణీరంబుల రెంటి వింటి♦నిన్ ధరియించెన్! ౭౯

వ॥ ఇట్లు సమస్తాయుధోపేతుండై చని తోఁకఁద్రొక్కిన త్రాఁచువలె నిశ్వాసంబులుఁ
బుచ్చుచుఁ బుష్కలుం జేరి యిట్లనియె. ౮౦

—♦ హనుమంతుఁడు వీరమణితోఁ బోరవల దని పుష్కలుతోఁ జెప్పుట ♦—

తే॥ రమ్ము పుష్కల నిల్వు దు♦రమ్మునందు, నీదు ప్రాణంబుల హరింతు♦నిశ్చయముగ
ననుచువచ్చుచునున్నధ♦రాధినాథుఁ,గాంచిహనుమంతుఁడెదమహా♦గ్రహముగదుర

ఆ॥ మేనుఁ బెంచి తోక ♦ మెలయింపుచును ఘన, స్తనిత విధముగా న♦దల్చి వీక
సరకుఁగొనకఁ బగఱ♦నరపతి కెదురుఁగఁ, బోవుచుండునంతఁ♦బుష్కలుండు. ౮౨

శా॥ వైరిక్రోధనుశోణదృష్టిని జగ♦త్ప్రాణాత్మజుం జూచి మే
ఘారావాభగభీరవాక్కులను జ♦న్యక్షోణి మ్రోయింపుచున్
ధీరత్వంబునఁ బల్కె నిట్లు వినుమో ♦ ధీరాగ్రణీ! యోగుమా
యీ రాజన్యుఁడనంగ నెంత బల మూ♦హింపన్ గడున్ స్వల్పమా. ౮౩

ఉ॥ పోరఁగ వచ్చినావె బలె ♦ మూఁడుజగంబులు గూడి మొత్తమై
చేరఁగలేదు రక్కసుఁడుఁ ♦ జీరఁగనైన నొకండు లేఁడు నీ
బీరముఁ జూపఁగాఁ దగిన ♦ వీరుఁడెవండు గలండు వీట నీ
వీరమణిక్షితీశ్వరుని ♦ వీచ మడంపఁగ నేను జాలనే. ౮౪

తే॥ అనఘ నీరాఁక యిపుడు భా♦వ్యంబుఁ గాదు,కనుము రామకృపాపాంగ♦కలన నెంత
దుస్తరంబైనఁగాని నే♦నిస్తరించి, వత్తు సంగరమున బుద్ధి♦వలదు నీకు.. ౮౫

క॥ దాశరథి కృపాప్లవమున, నాశర పాథోధి దాట♦నైతివొ యట్లా
దాశరథి కృపన్ నే న, క్లేశమునఁ దరింతు నెంత ♦ క్లిష్టంబైనన్. ౮౬

తే॥ దుస్తరంబైన కార్యంబుఁ♦దోచునపుడు, హృదయమున రాఘవుని సంస్మ♦రించునట్టి
వారి దుఃఖమహాంబుధి ♦ వట్టిపోవు, నంజనీప్రియసుత సంశ♦యంబు లేదు. ౮౭

క॥ కనుకను బొమ్మా శత్రు,ఘ్నుని సవిధంబునకు మదిని♦గూరిమి నిడి నే
నును వీరమణి క్షితినా,థుని నిప్డు జయించి వత్తుఁ♦దురమునఁ దృటిలోన్ ౮౮

వ. ఇట్లు పుష్కలుండు నుడువు వీరాలాపంబులు విని శాత్రవవీతిహోత్రప్రమాపణ నిపుణుండగు జగత్ప్రాణనందనుం డిట్లనియె. ౮౯

సీ॥ వత్స వీరమణి భూ♦పాలుని విషయమై సాహసమును జేయఁ ♦ జనదు వినుము
దాత శరణ్యుండు ♦ ధైర్య శౌర్యబలాన్వితుండు ఫాలాక్షభ♦క్తుండు సుమ్ము
బాలుఁడ వీ వాతఁ ♦డాలము సందు ముక్కాకలఁ దేరిన ♦ కడిఁదిజోదు
అఖిల శస్త్రాస్త్ర వి♦ద్యాదక్షుఁడాఢ్యుండు, భక్తప్రియుండగు♦పరమశివుఁడు.

తే॥ భక్తులు వసించు కైలాస♦పత్తనంబు, వదలి యీతని బురికిఁదా♦వచ్చినాఁడు
వచ్చుటయ కాదు పూజల♦మెచ్చినాఁడు, మెచ్చుటయ కాదభయదాన♦మిచ్చినాఁడు.

తే॥ అట్లు కావున నో భర♦తాత్మజాత, యీ రసాధిపుతో నేను ♦ బోరువాఁడ
నితర శూరుల నెల్ల జ♦యించి మించి, మంచి కీర్తిని గణియింపు♦మా ధరిత్రి.

వ॥ అనినఁ బుష్కలుం డిట్లనియె. ౯౨

చ॥ శివు వశుఁ జేసి వీటను వ♦సింపఁగఁ జేసెను గాని యాతఁ డా
శివుని మనోంబుజాతమునఁ ♦ జేర్పఁగ నేరఁ డెవాని సేవచే
శివుఁడు మహత్పదంబునను ♦ జెందఁగఁ గల్గెనో యెవ్వఁ డట్టి రా
ఘవుఁడు మదీయ హృత్కమల ♦ కర్ణికఁ బాసి చనండు మారుతీ. ౯౩

తే॥ జంగమస్థావరాత్మక ♦ సర్వవిశ్వ, మెచ్చట రఘూద్వహుండుండు ♦ నెలమి నచట
నుండు గావున భూపాలు♦నోర్చి జయముఁ, గొందు నెదసంశయంబును♦గొనకచనుము.

ఆ॥ వీరసింహ ముఖ్య ♦ వీరులు పెక్కండ్రు, కలరు వారితోడఁ ♦ గదనమునకు
నరుగు మనెడి మాట ♦ లాలించి వానర, సింహుఁడేగ వీర♦సింహుకడకు. ౯౪

—♦ పుష్కలుఁడు వీరమణిని మూర్ఛ నొందించుట. ♦—

వ॥ అప్పుడు, ౯౫

సీ॥ లక్ష్మీనిధి మహాస్త్ర♦లక్షణ సంవేది, కదన దక్షుఁడు శుభాం♦గదునితోడ
స్వప్రతాప బలాతి♦శయుఁడగు సుమదుండు, బలనందనునితోడ, ♦ బవరమునకుఁ
దొడఁగి రప్పుడు బుష్క♦లుఁడు రుక్మఖచితమై, యమరు శతాంగమం♦దధివసించి
వీరమణి నృపాల ♦ వీరున కెదురుగ, నరుగ నాతం డిట్టు ♦ లనుచుఁ బలికె

తే॥ బాలకా రాకు రాకుము ♦ బవరమందుఁ, గ్రూర కోపనుఁడను నన్నుఁ ♦ జేరవశమె
పొమ్ము ప్రాణంబులను గాచి♦కొమ్ము ముందు, నిల్చి సమరంబు సేయఁగా♦నీ తరంబె.

క॥ నీవంటి పిల్లవాండ్రను, నావంటి ధరాధిపతులు ♦ నలచరు ప్రేమం
గావం జూతురు తప్పక, నే వంకకు నైనఁగాని ♦ యేగుము వత్సా. ౯౬

క॥ కంటివెదుట నుండకు మి, ట్లంటి నటంచనక వేగ ♦ మరుగుము సుతునిన్
గంటిడి మూర్ఛిలఁజేసితి, *వొంటమియే యున్నఁ జిత్త ♦ మొల్లదు కొట్టన్. ౯౯

క॥ అనుమాటలు విని పుష్కలుఁ, డనె నే బాలుఁడనే మ♦హావృద్ధుఁడవే
ఘనుఁడవు విలునేర్పున నై, నను క్షాత్రము విడువ మనకు ♦ న్యాయమె చెపుమా.

చ॥ ఎవరు బలాధికు ల్గలరో ♦ వృద్ధులు వారలె సుమ్ము వింటివా
యెవరు విహీన సత్త్వకులో ♦ వృద్ధులె యైనను బాలురే వయో
వివరణమేల నీ సుతుఁడు ♦ వీరుఁడు సత్త్వఘనుండు మూర్ఛలేక
బవరమునందు నిన్ను శిత♦బాణపరంపర నల్ల చేసెదన్. ౧౦౧

తే॥ కావునఁ బ్రియత్నపూర్వము♦గా మెలంగు, మాజిలో రామభక్తుఁడ♦నైన నన్ను
నింద్రపదమున నున్న వాఁ ♦ డెవ్వఁడైన, సాంపరాయకమందున ♦ నొంపఁగలఁడె

వ॥ ఇట్లు నుడువు పుష్కలు నుడువులు విని నృపాలాగ్రణి మందహాసం బొనర్చుచు మఱలఁ గోపంబునఁ జాపంబుఁగొని సజ్యంబు సేయుట న్గాంచి యున్మదుండగు పుష్కలుండు. ౧౦౩

క॥ ఇరువది శితశరముల నా, నరపతి పేరురము నట్ట♦నడుము పగులఁగాఁ
బరపిన నది గని యాతఁడు, పరమక్రోధాతిరేక♦పరవశుఁడయ్యెన్. ౧౦౪

ఆ॥ మఱల మూఁడు వాడి ♦ శరముల నా భూమి,విభుని ఫాలమందు ♦ బిట్టు జొన్పఁ
జెలఁగె నవి త్రికూట♦శిఖరంబులో యన, వ్యథను గృథను భూపుఁ♦ డవశుఁడగుచు.

క॥ భరతాత్మజు హృదయంబును, సరిగాఁగని వత్సదంత♦శరనవకంబున్
బరపిన రుధిరముఁ గ్రోలుచు, మెరసె న్విషధరములట్ల ♦ మేన మునీంద్రా. ౧౦౬

మ॥ అతికోపుండయి పంచెఁ బుష్కలుఁడు నూ♦ రత్యంతతీక్ష్ణంబులై
నతపర్వంబులునై వెలింగెడు మహా♦నారాచముల్ రాజుపై
క్షితిపైఁ గూలె ధనుఃకిరీటరథముల్ ♦ భిన్నంబులై జోడునుం
గతమయ్యెన్ దెగి రక్తప్లుష్టతనుఁడై ♦ గాసిన్బడె న్భూపుఁడున్. ౧౦౭

వ॥ ఇట్లు శరభిన్నకళేబరుండై వీరమణిక్షితీశ్వరుండు వేరొక రథంబెక్కి పుష్కలుం గదిసి యిట్లనియె. ౧౦౮

ఉ॥ వీరవరేణ్య ధీర రఘు♦వీరపదాబ్జమధువ్రతుండ వీ
వారయ ధన్యమూర్తివి మ♦హత్తర కార్యమొనర్చినావు నా
తేరును విల్లు జోడుఁ గడ♦తేర్చితి విప్పుడుఁ జూడు నేనిదే
పోరుచునుంటిఁ బ్రాణములఁ ♦ బోషణసేయము మాటలేటికిన్. ౧౦౯

* ఒంటమి = విరోధంబు.

ఉ॥ కాలుఁడ సుమ్ము ప్రాణములుఁ ♦ గష్టము కాచుకొనంగ నంచు నా
భీలములైన బాణములు ♦ వేలకొలందిగఁ గుప్పి కుప్పి యే
మూలను భూమియందు ములు ♦ మోప నెడంబును లేక చేసి యా
కాలుఁడువోలె హస్తిరథ ♦ కాండపదాతుల రూపడంపుచున్. ౧౧౦

వ॥ మఱియు రథికులతో రథములను హాస్తిపకులతో హస్తులను నాశ్వికులతో నశ్వంబులను వేలకొలంది నురుమాడుచుఁ గాల్బలంబుల కంఠంబులఁ ద్రుంచుచు నిట్లు సేనామహారణ్యంబు దావానలంబు వడువున నేర్చుచుండు నప్పుడు మాతంగ శైల శృంగంబులుఁ గేశశైవలంబును జందనచర్చాకలితముద్రికావిరాజత్పాణి పన్నగంబులును భటశిరఃకచ్ఛపంబులును గరవాలశకలమత్స్యంబులును గరి ఘటాగ్రాహంబులును మేదఃపంకంబును గల్గి రుధిరమహానది ప్రవహింపం దొడంగె నప్పుడు యోగినీగణం బరుదెంచి దురవగాహం బగు నెత్తురు టేరుంగని యాంత్రరజ్జువుల రథశకలంబు లుడుపంబులుగఁ గట్టి ధ్వజపటంబులఁ దెరచాపలుగఁ జేసి తద్ధ్వజంబు లూతకఱ్ఱలుగఁ గొని పాటలఁ బాడుచు ప్లవంబుల నడిపించుచు మధ్యమధ్య భూతప్రేత పిశాచంబుల నెక్కించుకొనుచు నిట్లు విహరించి కొంతవడికి విరమించి పుఱ్ఱెలనిండ నెత్తురుంబట్టి పొట్టనిండఁ ద్రావుచు మాంసంబుల మెసవుచు మస్తిష్కంబు లానుచుఁ గౌతుకంబున నృత్యంబులు సేయుచు నుచ్చైస్స్వరంబునఁ బాడుచుండఁ బిశాచంబులు దదనుగుణంబుగఁ బ్రాణుల మస్తంబులు మద్దెలలుగఁ జేసి వాయింపన్ దొడంగి రంత నక్కలు పెక్కులు గుంపులుగ వచ్చి పలలంబుఁ గుత్తుకబంటిగ మెక్కి సంతోషంబునఁ గాతరులు భయంపడునట్లుగఁ గూయుచుండె. భీరువు లాపన్నులై మృతకుంజరోదర కోటరంబుల దాగియుండ యోగినులు వారిం బట్టి భక్షింపఁదొడంగి రో వాత్స్యాయన మునివరా పాపులగతి యట్టిదయకదా యిట్లు రణాంగణంబు ప్రళయ కాలరుద్రావాసంబువోలెఁ గనుపట్టె, నంతటఁ దన సైన్య పరాభవంబు వీక్షించి పుష్కలుండు ప్రళయకాలమార్తండుండువోలె దుర్నిరీక్ష్యుండై రిపుసైన్యంబుం గదిసి, ౧౧౧

తే॥ కరుల కుంభస్థలంబుల ♦ నరుకుచుండ, ముత్తియంబులతోఁగూడి ♦ నెత్తురెలమి
బారఁదొడఁగెను జూచెడి ♦ వారల కది, తామ్రపర్ణివిధంబునఁ ♦ దనరుచుండె. ౧౧౨

ఆ॥ భారతీప్రయుక్త ♦ బాణంబు లరివీర, గాత్రములను ఖండ ♦ ఖండములుగఁ
జేయ వారు కీలు ♦ చెడిన బొమ్మలమాడ్కి, గుదులుగుదులుగాగఁ, ♦ గూలిరపుడు. ౧౧౩

క॥ అందరు భిన్ననిజాంగకు, లందరు రుధిరాక్తదేహు ♦ లై కడుబాధన్
జెందుచుఁ బూచిన మోదుగ, చందంబున నుండిరపుడు ♦ సమరతలమునన్, ౧౧౪

ఉ॥ అప్పుడు పుష్కలుండు విప్రు♦లాధిపుఁ బిల్చి మహాగ్రహంబునన్
గుప్పలుగా శరంబులను ♦ గుప్పుచునుండ విభిన్న దేహుఁడై
యొప్పరి వీఁడుఁజూడఁ ♦ గడు నూర్జితుఁ డంచుఁ దలంచి చేతినే
ర్పొప్పఁగ బాణకోటుల మ♦హోద్ధతుఁడై వెసఁ గుప్పెఁబుష్కలున్. ౧౧౫

తే॥ చిక్కి శరపంజరంబున ♦ సుక్కి నెత్తు, రొక్క మొగి మేనఁ గారఁగ♦నోపికచెడి
యెక్కువెట్టను బాణంబు ♦ నెలమి విడువఁ, గక్కసంబయి భారతి కదలకుండె. ౧౧౬

వ॥ ఇట్లు మహార్తమాత్రం బుండి ధైర్యం బవలంబించి ౧౧౭

ఉ॥ శ్రీరఘువీరు భక్తిఁ దన ♦ చిత్తమునన్ స్మరియించి గట్టిగా
నారి బిగించి తీక్ష్ణతర ♦ నారసముల్ పరగించి తచ్ఛరా
సారము వాపి మబ్బు విడ ♦ జానగు భానుని రీతి వెల్గుచున్
భోరున శంఖ మొత్తియనె ♦ భూపతితో భయహీనచిత్తుఁడై. ౧౧౮

సుగంధి॥ చిన్నవానిబోలె నీవు ♦ వీరతాపనుండనా
నన్ను బాణపంజరంబు♦న న్వసింపఁ జేసితౌ
నెన్నవచ్చు నీదుశక్తి ♦ వృద్ధువోట మాన్యతన్
గొన్నవాఁడ నైతి జన్య♦కుంభినీతలంబునన్. ౧౧౯

క॥ కనుమా నాదు పరాక్రమ, మును మూర్ఛిలఁజేతు నిన్ను ♦ మూఁడంబులచే
ననుమాన మేలఁ దప్పిన, వినుమా నా ప్రతిన నేఁడు ♦ విప్రులానాథా. ౧౨౦

తే॥ కలుషసంహారి యని విని ♦ గంగ కరిగి, మూఢమానసుఁడై యందు ♦ మునుగనట్టి
పాపకర్మునిపాపంబు ♦ వడయువాఁడ, నింక సన్నద్ధుఁడవుకమ్ము♦ శంక లేక ౧౨౧

వ॥ అనుటయు వీరమణిన్నృపాగ్రుండు మహోగ్రుండై, ౧౨౨

తే॥ ఖరశరంబులఁ బరప నా♦శరము లతని, వక్షమును వ్రచ్చికొనుచు నా♦వలకుదూసి
మఱి యధఃపతితంబులై ♦ సురిగె రామ, చంద్రభక్తిపరాఙ్ముఖ ♦ జనుల మాడ్కి.

ఉ॥ అంతటఁ బుష్కలుండు దహ♦నాభముఁ దీక్ష్ణమునౌ శరంబు భూ
కాంతుని పేరురంబు గురి♦గా విడువన్ గని రెండు తున్కలన్
వింతగఁ జేయ రే డవియు ♦ భీషణలీల శతాంగమధ్యమం
దెంతయు మ్రోయుచు న్బడియె ♦ నెల్లరు నచ్చెరువందుచుండగన్. ౧౨౪

క॥ మఱియొక శరమును వింటన్, భరతసుతుఁ డమర్చి మాతృ♦భక్తిని నా భీ
కరశరమున నిడి విడువఁగ, నరనాథుఁడు దాని దుంచె♦ నడుమ నడిమికిన్. ౧౨౫

ఉ॥ ఏ విధి నొంతు నీ నృపుని ♦ నే నెటుతీర్తుఁ బ్రతిజ్ఞ నంచు దుః
ఖావిలచిత్తుఁడై మది ని♦జార్తిహరున్ రఘురాముఁ జేర్చి యా

శీవిష ఘోరబాణమును ♦ జిమ్ముఁగ నేగి యురంబు గాఁడఁగా
నా వసుధేశుఁ డస్వవశు♦డై పడె మూర్ఛమునింగి తేరిపైన్. ౧౨౬

—♦ పుష్కలునిచే రుక్మాంగద శుభాంగదులు మూర్ఛిల్లుట ♦—

క॥ ఆహాకారము లొప్పెను, బాహాబలశాలియైన ♦ భారతిసేనన్
హాహాకారము లెసఁగెను, దేహం బెఱుఁగని నృపాల♦తిలకుని సేనన్. ౧౨౭

వ॥ మఱియు సైన్యంబు పలాయనపరాయణం బగుచుండె నంతకుమున్న హను
మంతుండు వీరసింహుం గాంచి యిట్లనియె. ౧౨౮

చ॥ కదలకయుండుమా రణము♦ఖంబున వీరవరేణ్య యెందుఁ బో
యెద వికఁ నీ క్షణంబున జ♦యించెదఁ జూడుమటంచుఁ బల్కినన్
మదిని గలంగి యంబుదము ♦ మాదిరి విల్మ్రోయింపుచున్ శుచిన్
ముదిరసుధారలట్ల శర♦పూగములన్ గురియించె నుగ్రుఁడై. ౧౨౯

క. ఆ నిశితశరంబులుఁ దన, మేనునఁ గాడంగఁ జూచి ♦ మేదురరోషం
బూని మది న్బవనాత్మజుఁ, డా నరపతి రొమ్ము పగుల ♦ నడచెఁ బిడికిటన్. ౧౩౦

ఆ॥ అట్టి వజ్రతుల్య♦మైనట్టి ముష్టిఘాతంబుచేత మూర్ఛ♦ధరణిఁబడిన
పిన్నతండ్రిఁ జూచి ♦ వేగ శుభాంగదుఁ, డపుమూర్ఛఁ దెలిసి ♦ యతని యన్న. ౧౩౧

ఉ॥ దారుణ మూర్తితోఁ బ్రివి♦దారణ మండలమందుఁ జొచ్చి వా
ర్వారిధరంబులట్ల శర♦వర్షముచే భటకోటి ముంచుచున్
భోరున నార్చుచు న్గదన♦భూమిఁ జికాకొనరించి మీఱి సా
మీరినిఁ జేరఁగా నతఁడు ♦ మేనును బెంచుచుఁ బోయి నవ్వుచున్. ౧౩౨

ఆ॥ స్యందనములతోడఁ ♦ జాపధారకులైన, సోదరులను దోకఁ♦ జుట్టి గిట్టి
నేలఁబెట్టి కొట్ట ♦ నెత్తుటఁ దోగి వా, ర్చేష్ట లుడిగి మూర్ఛఁ ♦ జెందిరపుడు. ౧౩౩

క॥ బలమిత్రుఁడు సుమదునితోఁ, గలనం బొనరించి చాల♦కాలము క్రుధచేఁ
నలయింప నతనిఁ గని పుష్కలుఁ డతి వేగమున వచ్చి ♦ సక్రోధుండై. ౧౩౪

తే॥ నిశితపర్వంబులగు శర ♦ నివహముల న,తండు క్షణమాత్రమునను జై♦తన్యరహిత
మైన పెనుమూర్ఛఁగొని పడు♦నట్లు జేసెఁ, గాంచె విజయంబు శత్రుఘ్ను♦కటకమపుడు

సీ॥ చంద్రరేఖావతం♦సకుఁడైన రుద్రుండు, వ్యాళహారము లుర♦మందు గ్రాల
స్యందనారూఢుఁడై ♦ యజగవంబును బెల్లు, మొరయింపుచు ధరిత్రి♦మూర్ఛవడిన
స్వజనంబుఁ గన్గొని ♦ ప్రళయకారకుఁ డట్లు, మును త్రిపురంబులఁ♦ జనెడు మాడ్కి
నపరివారుండును ♦ సగణుండునై చూచు, వారికి భయకరా♦కారుఁ డగుచు

తే॥ నెదను శత్రుఘ్న భటుల జ♦యింపనెంచి, కోపరక్తాక్షువులను గ♦న్గొనుచు వారి
భక్తరక్షణ దీక్షచేఁ ♦ బరగుఁగాన, వచ్చె భూతలి మద్రివంగ ♦ బవరమునకు.

వ॥ అంత రామానుజుండు దన కభిముఖంబుగ నరుదెంచు సర్వదేవ శిరోమణి యగు
నీశానుం గాంచి సన్నద్ధుండై యెదుర్కొనె నప్పుడు పినాకపాణి ధనుష్టంకృతిం
గావించి మహాకోపంబున రామానుజుం గాంచి యిట్లనియె. ౧౩౭

ఉ॥ అక్కట యెంతఁజేసెఁ బర♦మాస్త్ర విదుండగు పుష్కలుండు వాఁ
డెక్కడ కేగె భక్తులను ♦ నెక్కటికయ్యమునందుఁ మూర్ఛలోఁ
జిక్కఁగఁజేసె రామపద♦సేవకు నాతని నీవు చూడ లో
నక్కటికంబు మాని జను ♦ నంపెద నొందెద సౌఖ్య మీ యుధిఁ. ౧౩౮

వ॥ ఇట్లు నుడువుచు వీరభద్రుం గాంచి యిట్లనియె. ౧౩౯

క॥ మనభక్తుల హింసించిన, ఘనుఁడడుగో పుష్కలుండు ♦ గనుమా, జనుమా
తునుమాడి రమ్మలంతిగఁ, గనకు మతం డన్నిటను న,♦ఖండుడు సుమ్మా. ౧౪౦

వ॥ అనుచు నందింగని నీవు మహాబలసంపన్నుం డగు ప్రభంజననందనుని జయింపు
మని పంచి వారికి సహాయంబుగఁ గుశధ్వజ ప్రచండ భృంగి సుబాహు దమన
చండాది ప్రమథగణంబుల నంపునంతఁ బుష్కలుండును మహాగణ పరివృతుండై
వచ్చు వీరభద్రుంగాంచి సక్రోధుండై, ౧౪౧

తే॥ వీరభద్రుని హృది పంచ♦క్రూరభీష, ణాశుగంబులఁ బ్రహరింప♦నతఁడు భిన్న
వక్షుఁడగుచుఁద్రిశూలంబు♦వైవ దాని,మించిశరములక్షణములోఁ,♦ద్రుంచెనితఁడు.

ఆ॥ శూలమట్టులగుటఁ♦జూచి ఖట్వాంగంబుఁ, గొనుచుఁ గొనును నసువు♦లనుచు వీర
భద్రుఁ డాగ్రహమున♦భరతాత్మజుని తలఁ, బగులవైవ మూర్ఛఁ♦బడియెనతఁడు.

సీ॥ పరమాస్త్రవిదుఁడగు♦భారతి మూర్ఛను, దేరి తత్క్షణమున♦వీరభద్రు
కరసంస్థితంబైన♦ఖట్వాంగమును ఖర, శరములఁ దునుమాడఁ ♦ జాలఁగినిసి
భారతిరథమును ♦ బగులంగ నడఁచి ప, దాతినిజేయఁగా ♦ నాతఁ డలిగి
పిడికిటిచే బిట్టుఁ ♦ బొడువ నాతం డట్టు, చేసె నిట్టిరువురు ♦ చేవచెడక

తే॥ బూన్కి మోకాళ్ళచే నూరు♦వులను గ్రుమ్మ,
కొనుచు నన్యోన్యజయవధల్ ♦ గోరుకొనుచు
చలముననుు బాహుయుద్ధంబు ♦ సలుపుచుండ
నాల్గురాత్రిందివమ్ములు ♦ నడచె నందు. ౧౪౨

క॥ ఒకరైనఁ దగ్గ రెప్పుడు, నొకరైన జయంబుగాంచ ♦ రోపికతో వా
రొకరీతిఁ బోరిరి పురాం, తక పుత్రుఁడు బుష్కలుండు♦దక్షత మెరయన్. ౧౪౩

వ॥ అంత మహాబలుం డగు వీరభద్రుండు వీరాగ్రణి యగు పుష్కలుం గొని యాశ్వ సంబున కేగె నక్కడ వారిద్దరు ముష్టాముష్టి బాహాబాహిం గచాకచి నఖానఖిం బోరుచుండు నంతం బుష్కలుండు మహాగ్రహంబున. ౧౪౬

తే॥ వీరభద్రుని బాహువుల్ ♦ బిగ్గఁబట్టి, తనరి గళమున నొకతన్నుఁ ♦ దన్నుఁ గ్రింద బడియుసురుపోకటను బడు ♦ బాధనొంది, లేచి పుష్కలునిం గాలఁ ♦ దాచి తాచి.

క॥ కాలానల సన్నిభమగు, శూలాయుధమునను భరత♦సుతకుం డల రు గ్జాలాంచిత మస్తక మువ, లీల న్నడ నేసె భూస్థ♦లి న్మునివర్యా. ౧౪౮

తే॥ భారతినిబట్టి యీ రీతి ♦ వధ నొనర్చి వీరభద్రుఁడు చెలరేగి ♦ వీరభటులు పాఱ సింహధ్వనిని మహా♦ర్భటిని జేసెఁ బోరుటలు మాని కొందఱు ♦ పుల్లవడిరి.

క॥ కొందఱు చని డెందంబునఁ, గుందుచు నుడివిరి సుమిత్ర ♦ కొడుకుం గని మీ నందను బుష్కలుఁ బశుపతి, నందనుఁడు వధించె భండ♦నంబున ననుచున్. ౧౫౦

క॥ ఆ పల్కులు ముల్కులు క్రియఁ, దోఁపఁగఁ జెవులకు దురంత♦దుఃఖంబునరున్ దాపురమగు శత్రుఘ్నుని, నా పశుపతి చూచి యిట్టు♦లనియె మునీంద్రా. ౧౫౧

శా॥ ఓ రామానుజ యో మహాబలుఁడ యో♦హో యేడ్వఁగాఁ బాడియే శూరు ల్భండనమందు నీల్గుట భువిన్ ♦ జూడన్ యశంబే కదా హారా హారిఁ బెనంగఁడే త్రిభువనా ♦ లుజ్ఝాత లూగించు మా శూరాగ్ర్యుండగు వీరభద్రకునితో ♦ సూనుండు సామాన్యుఁడే. ౧౫౨

క॥ ఆహా యన జనులందరు, బాహాబలశాలి వీర♦భద్రునితో నే సాహాయ్యముఁ గోరకఁ బం,చాహంబులు పోరె నాతఁ♦డల్పుఁడె చెప్పుమా. ౧౫౩

తే॥ వీరభద్రుని చరితంబు ♦ వినుము మదవ, కారి దక్షుని తలద్రుంచె♦ క్షణములోనఁ ద్రిపురదానవ సైనిక♦తతులనెల్ల, నిమిషమాత్రంబునను మున్ను ♦ నిహతిఁజేసె.

క॥ అట్టి బలాధికు భరతుని♦పట్టి మదేభంబు గిన్కఁ ♦ బదపమును వలెన్ బట్టికరంబున నిట్టిటు, నుట్టినిడిన కరణి నొక్క ♦ యూపూగించెన్. ౧౫౫

క॥ కావున నో లవణాంతక ♦ భావంబున వగపువలదు ♦ భరతసుతునికై నీ వింక రమ్మా పోరికిఁ ♦ దావక శూరతనుజూపు ♦ తగ నా యెదుటన్. ౧౫౬

## —♦ శివునిచే శత్రుఘ్నుఁడు మూర్ఛనొందుట ♦—

వ॥ అనుటయు శత్రుఘ్నుండు శోకం బుడిగి కార్ముకంబు సజ్యంబుఁ గావించి కోపో ద్రేకంబునఁ బురహరుని శరపరంపరలఁ గప్పె నందు గొన్ని శరంబులు భక్తరక్ష ణార్థ మరుదెంచిన యా విరూపాక్షుని శరీరంబు భేదించి రక్తంబుఁ బ్రవహింపం జేసె, మఱికొన్ని యాకసంబంతయుఁ గప్పుచుండె నంత నుగ్రుండు మహోగ్రుండై

యట్లు సేయ నా యిద్దరి విశిఖంబులు నీ విశ్వం బంతయు సూదిమోపు నెడంబు లేకుండ నీరంధ్రింబుగఁ గప్పుచుఁ జిత్రకారకులకును జిత్రింబుఁ గొల్పుచుండె మఱియు నా శరంబు లొండొంటిన్ దాకుచుఁ బోరుటఁ జూచి సర్వమోహనంబును, లోకసంహారకారకంబును నగు మహాప్రళయం బాసన్నంబైనదని చూపరులు భయంబు నొందుచుండిరి. కదనవీక్షాసక్తిచే విమానారూఢులై యరుదెంచిన ఖేచరు లుండుటకు సందులేక తొలంగి ఖపురప్రాంతంబున నుండి చూచుచు. ౧౫౭

ఉ॥ ఈతఁడు మూఁడులోకములు ♦ నేర్చి సృజింపఁగఁ బ్రోవఁజాలు వాఁ
డీతఁడు రామచంద్ర పర♦మేశ్వరనాయక సోదరుం డహో
యీతరి వీరిలో విజయ♦మెవ్వఁడు బొందుఁ బరాజయం బప
ఖ్యాతిఁ దలిర్ప నేఁడు బడ♦యంగల వాఁడెవఁడో ధరాస్థలిన్. ౧౫౮

వ॥ ఇట్లు ప్రశంసింపుచుండిరి. ౧౫౯

తే॥ ఇట్టు లేకాదశాహంబు ♦ లిద్ద రొక్క, వడువునను బోరి రంతట ♦ ద్వాదశాహ
మందు లవణారి సవనారి♦నడపనెంచి,విడిచె బ్రహ్మాస్త్రమును గ్రోధ♦వివశుఁ డగుచు.

మ॥ అతఁ డా యస్త్రమెరింగి నవ్వుకొనుచున్ ♦ స్వాంతంబునన్ బల్ కుశ్రిధా
న్వితుఁడై బ్రహ్మశిరోభిధానశరమున్ ♦ వే పంపఁగాఁ బోయి ప
ద్ధతి మధ్యంబున దాని మ్రింగుట సుమి♦త్రాపుత్రుఁ డీక్షించి వి
స్మితిచే నే నిఁక నేమిసేయు దనుచున్ ♦ జింతాబ్ధిలో నుండగన్. ౧౬౧

క॥ హారుఁ డనలాభం బగు శిత, శర మొక్కటి బిట్టు విడువ ♦ శత్రుఘ్నుని పే
రుర మది పగల్ప నాతం, డరదంబునఁగూలె మూర్ఛ ♦ నంది మునీంద్రా. ౧౬౨

తే॥ భటయుతంబుగ నా మహా♦కటక మప్పు, డటమటంబును జెందె నా ♦ యభవునాజ్ఞ
దండిమగలగు చండప్ర♦చండముఖులు, బడఁగఁ జేసిరి శత్రుఘ్న♦భటులనంత. ౧౬౩

ఆ॥ మూర్ఛ మునిగియున్న ♦ పుష్కలు శత్రుఘ్ను, స్యందనంబునందు ♦ సరగఁ జేర్చి
సైనికుల్ కరంబు ♦ సంరక్షణము సేయు, చుండి రదియు వాయు♦సూతి చూచి.

సీ॥ ప్రళయకారకుఁడైన ♦ పరశివుని జయింప, నెంచి రాముని మది♦నుంచి మించి
స్వీయయోధులచేత ♦ శ్రీరామనామంబు, స్మరియింపఁజేసి తా♦స్మరణఁజేసి
తీవ్రింబుగాఁ దోకఁ♦ద్రిప్పుచు రుద్రున, కభిముఖంబుగఁబోయి ♦ యనియె నిట్లు
శ్రీరామభక్తు హిం♦సించి ధర్మమునకు, బ్రతికూలమైన ప్ర♦వర్తనంబు

గీ॥ జేసినాడవు నిన్ను శి♦క్షించువాఁడ, నెప్డు రాముని పాదము ♦ లెద స్మరించు
భర్గుఁడంచును,మున్నుమునుల్ ♦బలుక వింటి,నహహాయిప్డుడంతయునబద్ధ♦మగుటఁగంటి

—♦ హనుమంతుం డీశ్వరుని పరాజయంబు నొందించి యతనిచే వరంబులఁ బడయుట ♦—

క॥ సురమానవ సంపూజ్యుఁడు, స్మరియించిన మాత్రమునను ♦ సకలాఘంబుల్
బరిమార్పఁదగిన యా రఘువరు సేవాపరుల మూర్ఛఁ ♦ బరపితివిక దా ౧౬౬

వ॥ కావున. ౧౬౭

తే॥ రామభక్తి పరాఙ్ముఖ♦రాజమాళి, మూడులోకాలు వనధిలో ♦ ముంపఁజాలు
నిన్నుఁ గని గగనచరులు ♦ నివ్వెరపడఁ, బదిలముగ నుండు రణమునఁ ♦ బడఁగఁజేతు.

వ॥ ఇట్లు నుడువు హనుమంతుం గాంచి శివుం డిట్లనియె. ౧౬౯

ఉ॥ మానవదేవరాక్షస న♦మస్కృతుఁడౌ రఘురాముఁడెవు నా
మానసమందుఁ బాయఁడను♦మాట నిజంబు నిజంబుఁ బల్కితో
వానరసింహ నా కతఁడు ♦ స్వామియ యైనను భక్తుఁగావఁగాఁ
బూనిక నింతచేసితిని ♦ బుద్ధి నెరుంగక కాదు పావనీ. ౧౭౦

ఉ॥ రాముని జన్న మంచు రఘు♦రాముని యశ్వమటంచు మిమ్ము శ్రీ
రాముఁడుఁ బంపెనంచు మది ♦ రంజిల వింటిని గాని చేసితిన్
నీమము రాజుఁబ్రోవ నిది ♦ నిక్కము భక్తుని నిస్త్రపుల్ ననున్
రాముఁడె. ప్రోచుఁగాక యప♦రాధముల౯ క్షమియించి మారుతీ. ౧౭౧

క॥ తన భక్తుల బాధించితి, నని మనమున రాముఁ డించు♦కంత క్రుధంబున్
గొనుఁ గాని నిజముఁ గని యై, ననుఁ గనఁడె దయార్ద్రదృష్టి ♦ నన్ను నరపతిన్.

క॥ ఈ విధమునఁ బల్కఁగ విని, పావనికోపమునఁ బెద్ద♦బండను వైవన్
మావులతో సారథితో, వావిరిఁ దద్రథము భూమిఁ♦బడె శకలములై. ౧౭౩

వ॥ అప్పుడు ఖేచరులు ప్రభంజననందనుం గాంచి యో యాంజనేయ విశ్వంభరా
రథుని రథం బీ రీతిని జూర్ణంబుఁజేసిన వారెవరును లేరు, నీవు మహావీరుండ వని
యగ్గింపుచుండి రా సమయంబున. ౧౭౪

క. విరథుఁడగు శరధిశరధిన్, బరుగునఁ జనుదెంచి నంది♦పల్కొను నా మూ
పురమునఁ గూర్చొని పోరుము, హర యనుచున్ బ్రీతి నాతఁ♦డ ట్లొనరించెన్. ౧౭౫

క. వృషభస్థితుఁడై వచ్చెడి, విషమాక్షుని జూచి కీశ♦వీరుఁడుఁ గ్రుధచే
విషమం బగు శిల నక్కను, విషధరములు చెదరిపార ♦ భేదించె వడిన్. ౧౭౬

తే॥ ప్రస్తరవిపీడితుం డగు ♦ భర్గుఁడలిగి, తీక్ష్ణ మగ్నిప్రభాభంబుఁ ♦ దిత్రిశిఖమైన
శూలమును వైవ నేర్పునఁ ♦ గేలఁబట్టి, పెల్లుచిదురుపలుగఁ దాని ♦ విరిచె నతఁడు.

మత్తకోకిల॥ వానరోత్తముచేత శూలము ♦ భగ్నమై చనఁజూచి యీ
శానుఁ డద్భుతమొంది వెంటనె ♦ సర్వలోక వినిర్మితం

బైన శక్తిని వైవఁగా నది • యక్కజముగ బగిలింపఁ గా
లూనలేకను బిమ్మిటి న్బడి • యుండి యొక్కక్షణంబులోన్. ౧౪౮

మత్తకోకిల॥ లేచి బాధ గణింప కప్డు వ•లీముఖేందుఁడు భూరుహం
బేచి తెచ్చి కపాలధారి ఫ•ణీశభూషిత వక్షమున్
జూచి నూటఁగ వైవ నాహతిఁ • జూక నుండగ లేక నా
తాఁచులన్నియుఁ గ్రిందిలోకము • దాఁగఁబోయెను భీతిచేన్. ౧౪౯

ఉ॥ విచ్చి యురంబు నెత్తురు స్రవింపఁగ నా హనుమంతుఁ జూచి లో
హెచ్చగు కోపమూని ప్రమ•థేశుఁడు వల్కె వనేచరాధమా
యిచ్చట నున్నఁజచ్చెద వి•కెయ్యెడకైనను బారిపొమ్మదే
వచ్చె నటంచు రోకలిని • బట్టి కరంబుల బిట్టువైవఁగాన్. ౧౫౦

క. శ్వసనతనూజుం డా ది,గ్వసనవినిర్ముక్త మగుచు • వచ్చెడి ముసలం
బసమపరాక్రియుఁ గని వే,ద్రైసకు స్వంచించి తొలఁగె • ధీరత మెరయన్. ౧౫౧

వ॥ ఇట్లంజనీనందనుఁడు రామస్మరణంబు సేయుచు ముసలంబును దప్పించుకొన నది భూతలంబు భేదించి రసాతలంబునకు దూటిచనియె. ౧౫౨

ఉ॥ రోకలితీరుఁజూచి మది•రోషము నూని మరుత్సుతుండుఁ దా
వీఁకఁ బెకల్చి తెచ్చి పృథి•వీధర మా హరుమీద వైవ నా
శీకముచేత దాని విద•లింపఁగఁ జూచుతరిన్ దుర్మంబుఁ జే
కాకువడంగవైచె నది • ఖండముఁ జేయఁగఁ జూచునంతలోన్. ౧౫౩

ఆ॥ పవనసూతి పెద్ద • బండవైచిన దాని, హరుఁడు దుంపఁదలఁచు • నంతలోనఁ
బ్లవగుఁ డశ్మవృక్ష•వర్షంబుఁ గురియించె, శివుఁడుఁ గరము లాడ•కవశుఁడయ్యె.

ఉ॥ అంతటఁ బోకఁబావని పు•రాంతకుఁ దోకను జుట్టి మోది కా
సంతభయంబు లేక దుమ•శైలములన్ గురియింప నందియున్
స్వాంతమునందుఁబొందె భయ•మందెఁ బురారి రుషంబుఁగాంచె లో
నెంతయు విహ్వలత్వము ప•యిన్ శకలీకృతుఁడయ్యెఁ జందురేడున్. ౧౫౪

చ॥ మఱల సదా సదాగతికు•మారుఁడు విహ్వలుఁ జేయ నిల్వ దు
ర్భరమయి యా సదాశివుఁడుఁ • బల్కెను నిట్లు రఘూత్తమానుగా
యఱిముఱిఁ జూడ నింతటి మ•హత్తరమా పనిఁ జేయగల్గి నా
వరయఁగ నీవ ధన్యుఁడ వ•హా నినుఁబోలెడివార లుండిరే. ౧౫౫

క॥ దానతపోయజ్ఞంబులఁ, గాను సుమా నేను సులభ•గమ్యుఁడ నిను నా
మానసమున మెచ్చితి నను,మానముతో దోకవరంబు • మానుగఁగొనుమా. ౧౫౬

వ॥ సంతోషితస్వాంతుండై యిట్లు పలుకుచున్న శంకరుఁ గని శ్రీరామకింకరుండు మందహాసంబు సేయుచు నిర్భయంబుగ నిట్లనియె. ౧౮౮

క॥ రాముని సత్కృప విను లో, కేమియు లేదయ్య నాక ♦ హిమాంశాభరణా
కామితఫలదా యైనను, గామితమా వరమొకండు ♦ గల దిమ్ము శివా. ౧౮౯

ఉ॥ పోరున నీ సుతుండుఁ బోరి ♦ పోవునటుల్ పొనరించెఁ బుష్కలుఁ
వీరుఁడు లక్ష్మణానుజుఁ బ ♦ వితుని మూర్ఛను ముంచి తీవు నీ
వారలు మా భటాళి భువి ♦ పైఁ బెనుమూర్ఛను ముంచినారు మా
వారిని దేర్ప ద్రోణగిరి ♦ వైశముగాఁ జని తెత్తు నోషధుల్. ౧౯౦

ఉ॥ అచ్చటఁ బాకశాసన భ ♦ టావళితో బవరంబుఁ గల్గునేఁ
జెచ్చెరవత్తునంచు నిఁకఁ ♦ జెప్పఁగఁజాలను దేవదేవ నే
వచ్చెడు దాక వీరి నిట ♦ శ్వాపద భూతపిశాచ ఢాకినుల్
చొచ్చి కలంచి వ్రచ్చి తినఁ ♦ జొప్పడకుండఁగఁ గావఁగా వలెన్. ౧౯౧

వ॥ అనుటయు సర్వజ్ఞుండు నట్లకాక యని తన ప్రమథగణంబులతో నా మహాశ్మశానంబునఁ గాపుండి యోధుల కాయంబుల కపాయంబు రాకుండఁ జూచుచుండె నంత హనుమంతు డీశ్వరాజ్ఞ వడసి.

—♦ హనుమంతుండు ద్రోణాద్రియం దుండు దేవతలఁ బరాభవించుట ♦—

క॥ ద్వీపముల ననేకము లగు, ద్వీపవతుల నగరములను ♦ వివిధాటవులన్
ద్వీపవతీనాథులఁ దా, నే పఱకఁ దరించి మింట ♦ నేగఁ దొడంగెన్. ౧౯౩

వ॥ ఇట్లు పోయిపోయి పాలేరు నతిక్రమించి ద్రోణాద్రిం జేరి దానిఁ దోఁకం జుట్టి పెల్లగించి శిరంబున నిడికొని రణ ప్రదేశంబునకు రాఁబోవుతరి. ౧౯౪

ఆ॥ పర్వతంబు కదలఁ ♦ బారుట వీక్షించి, పాలకుల్ కరంబు ♦ భయముఁ జెంది
యంద రాగులాడి ♦ యాహారవంబులఁ, జేసిరపు డిదేమి ♦ చిత్ర మనుచు. ౧౯౫

ఆ॥ ఎవ్వఁడీ నగేంద్ర ♦ మెత్తఁగాఁ దగె మన, మీ యుపాయ మడఁప ♦ నే యుపాయ
మనుచుఁ గూడివచ్చి ♦ హనుమంతుఁ గని దీని, విడువు మిప్డు కీశ ♦ విడువవేని. ౧౯౬

క॥ చిచ్చులు గ్రక్కెడి శరములఁ, జచ్చితి వని పలుప నతఁడు ♦ చాలఁ గుపితుడై
చెచ్చెరఁ బదముల నడఁచె వి, యచ్చరనాథుండు రాక్ష ♦ సావళిఁ బోలెన్. ౧౯౭

క॥ కొందఱఁ బాదతలంబులఁ, గొందఱఁ బెడచేత బిట్టు ♦ కొందఱఁ దోఁకన్
గొందఱ శృంగంబునఁ దాఁ, గొందల మొందంగఁ గొట్టి ♦ కూల్చె ధరిత్రిన్.

క॥ కొందఱు నెత్తుటఁ దోగిరి, కొందఱు సాధ్వసముఁ జెంది ♦ కుందిరి యిటు వా
రందఱుఁ గూలిన మిగిలిన, కొందఱు పురుహూతుఁ గూడు ♦ కొనిరి మునీంద్రా. ౧౯౯

సీ॥ క్షతజపరిప్లుత ♦ గాత్రులై వచ్చిన, స్వభటవర్గము సుర♦స్వామిచూచి
యేల యీరీతి మీ♦రందఱు భీతిచేఁ, బదములుఁ దొట్రిల ♦ వచ్చినారు
మిమ్మిట్లు నెత్తురు♦గ్రమ్మఁగొట్టినవాఁడు, దైత్యుఁడో రాక్షసా♦ధముఁడొ తెల్పుఁ
డంత నే నేగి యా♦యధముని బంధించి. వచ్చెద నిజమును ♦ బల్కుడనిన

తే॥ భటులు విని దీనవాక్కులఁ♦బల్కిరిటుల, నయ్య యేమని చెప్పుదు♦మాతఁడెవఁడొ
మర్కటాకృతి నున్నాఁడు ♦ మహితబలుఁడు, ద్రోణగిరిఁ దోకతోఁజుట్టి♦త్రోవఁబట్టి.

క॥ పోఁజూడఁగ మే మాతఁడు, బోఁజూడఁగలేక జముని, ♦ బోఁజూడు మటం
చోజన్ శస్త్రాస్త్రంబుల, బేజార్జేసితిమి చాలఁ ♦ బిఱుసన కతనన్. ౨౦౧

వ॥ అంత నా వానరుండు మహోగ్రుండై మన వారల మోకాళ్ళఁ గ్రుమ్మి మోచేఁ
తులం బొడిచి కాల న్రాచి నేలన్ ద్రోచి చపేటంబుల నడఁచి యిట్లనేకులఁ
గతాసులన్ జేయ మే మతని పదప్రహారంబుల భిన్నగాత్రులమై కాయంబుల
నుండి శోణితంబులుఁ గార మా పూర్వపుణ్యంబున బ్రతికి యీ వర్తమానంబు
మీకుఁ జెప్పుటకై వచ్చితిమని తెలుప నగారి పురారి వడువున రోషంబు వహించి
మహాబల సమన్వితు లగు సురలం గాంచి యిట్లనియె. ౨౦౨

ఉ॥ రండు నిలింపు లిప్పుడు స♦రాసరి ద్రోణనగంబుఁ జేరఁగాఁ
బొండు కపీంద్రు నుద్దవిడి ♦ పొట్టవియన్ బడఁదన్ని కట్టి వే
తెండు మదీయ సన్నిధికిఁ ♦ దేకువ నందఱఁ జంపె నా మహా
ఘుండు వినుండుఁ బట్టఁ బ్రతి♦కూలత నుండినఁ జంపుఁడందరున్. ౨౦౩

తే॥ అనుచు నుడివిన పతినుడు♦లాలకించి, సురలు ద్రుతగతిఁ జని కపిఁ ♦ జూచి యస్త్ర
శస్త్ర తోమర ముద్గర ♦ శక్తి ఖడ్గ, పరశు ముఖ్యాయుధంబులఁ ♦ బరపునంత.

మ॥ హనుమంతుం డవి లెక్కసేయక మహో♦గ్రాకారుఁడై హస్తతా
డన పాదాహతి ముష్టిఘాతములఁ గ్రో♦డంబుల్ విభిన్నంబులై
చనఁగాఁ జేసి చపేటజానుహతులన్ ♦ సర్వాంగముల్ పిండిగా
నొనరింపంగ గతాసులై పడిరి జ♦న్యోర్వీస్థలిన్ నిర్జరుల్. ౨౦౪

క॥ హతశేషు లరిగి వాస్తో, ష్పతికి వృత్తంబుఁ దెలుపఁ ♦ బరమ క్రోధా
న్వితుఁడై సర్వ సుపర్వుల, నతనిం బొరిఁగొనుఁ డటంచు ♦ నంపె మునీంద్రా.

ఉ॥ వచ్చెడివారిఁ జూచి యనె ♦ పావని యో సురలార రాకుడీ
వచ్చినవార లే మయిరొ ♦ వారి యవస్థలఁ జూచినారె మీ
రిచ్చట కేలవచ్చెద రిఁ♦కేగుడుఁ గాదని వచ్చినన్ గటా
చచ్చెద రింతయు న్నిజము ♦ చక్కఁగఁ జెప్పితి జాలిచేత నేన్. ౨౦౫

ఆ॥ అనుచు నెంతఁ జెప్పి♦నను వారు వినక వై, శ్వానరోగ్రకీలఁ ♦ బడఁగఁబోవు
మిడుత లట్ల యతని ♦ మీఁదిమీఁదికిఁ బోయి, పటపి రొక్క మొగిని ♦ బాణతతుల.

వ॥ ఇట్లందఱొక్కసారి పరశు పట్టిస కరవాల శూల ముద్గర తోమర భిండివాల గదా కుంతాద్యఖిలాయుధంబుల నొప్పింప నతండుఁ బ్రళయకాలాభీల మహానలంబు చందంబున మండిపడి దుర్నిరీక్ష్యుండై యందఱ శిలాపాతంబున రూపుమాప హత శేషుం డొక్కం డింద్రుంజేరి యిట్లనియె. ౨౦౯

క॥ ఆ కపిబల మేమో గిరిఁ, దోఁక న్నెకలించి వైవఁ ♦ దు్రంగిరి మన వా
రీ కబురు మీకుఁ జెప్పఁగఁ, బోకహరణ నే నొకండ ♦ బ్రతికితిని జుమీ. ౨౧౦

క॥ ఆ నుడులకు వాస్తోష్పతి, మానసమునఁ దలఁకి దురభి♦మాన ముడిగి వే
దీనతఁ జని వాచస్పతి, కానతుఁడై యిట్టులనియె ♦ నతివినయమునన్. ౨౧౧

తే॥ ఎవఁడయా వాఁడుజూడఁగఁ♦బ్ల వగుఁడగును, ద్రోణశైలంబుఁగొనిపోవఁ♦దొడఁగినాఁడు
వీఁక నే నతిబలుల న♦నేక సురల, శస్త్రపాణుల నంపినఁ ♦ జంపినాఁడు. ౨౧౨

వ॥ అనిన బృహస్పతి యిట్లనియె. ౨౧౩

సీ॥ రావణ కుంభక♦ర్ణ ముఖాదిదైత్యుల, విగ్రహంబునను జం♦పించె నెవఁడు
జంబుమాలిని మహా♦శౌర్యధుర్యుం డగు, నక్షుని జంపిన ♦ దక్షుఁ డెవఁడు
భుజబలంబునఁ బేరుఁ♦బొందిన రాక్షస, కోటులఁ దు్రంచిన ♦ మేటి యెవఁడు
లాంగూలవహ్నిచే ♦ లంకాపురము బూది, యానట్టు చేసిన ♦ యలఘుఁ డెవ్వఁ

తే॥ డాతఁ డీతఁడ హనుమంతుఁ ♦ డనుచు నెఱుఁగు
మమరనాయక రాఘవుఁ ♦ డశ్వమేధ
యాగమును జేయుచున్న వాఁ ♦ డతని వీతి
మారహారుభక్తుఁ డగు వీర♦మణి హరించె. ౨౧౪

క॥ ఆరామచంద్ర యోధులు, గౌరీశునిచేతఁ బొలియఁ♦గా నోషధులన్
వారిన్ బ్రతికింపఁగ నీ, ధీరుం డీ గిరికి నేగు♦దెంచె సురేంద్రా. ౨౧౫

తే॥ అమితవీరులతోఁ బోర♦నరిగి నీవు, వర్షశతములకైన నా ♦ వాయుసుతునిఁ
గలహ మందు జయించుట ♦ కల్లయితఁడుఁ, గోరిన యొసంగి కరుణను♦గోరుకొనుము

—♦ దేవతలు హనుమంతునకు సంజీవి నిచ్చుట ♦—

తే॥ దేవగురుభాషితము విని ♦ త్రిదశనాథుఁ, డాంజనేయుండు రామకా♦ర్యార్థమిటకు
వచ్చెననుచు నెఱింగి లో♦భయమువాసి, సంతసింపుచు ననె బృహ♦స్పతినిజూచి.

ఉ॥ పావని ద్రోణశైలమును ♦ బట్టుకపోయిన దేవతాళికిన్
జీవనమార్గ మెట్టులొ వ♦చింపుము నీ విఁకనో గురూత్తమా

కావున నెట్టులైనఁ గపి ♦ కారుణికుండుగఁ జేసితేని యీ
దేవతలెల్ల సౌఖ్యమునఁ ♦ జేరుదు రొందు ముదంబు రాముఁడున్. ౨౧౮

(భుజంగ ప్రయాతము.)

సునాశీరుపల్కుల్ ♦ సురాచార్యుఁ డాలించి, నాకేశునింద్రున్ ♦ శ్రితానుస్యుఁ గొంచున్
హనూమత్ప్రరుంధ ♦ న్మహాగంబుఁ జేరన్, జనె న్గాంచె ధీరున్ ♦ క్షమ న్గ్రాలువానిన్.

వ॥ ఇట్లు బృహస్పతి ప్రముఖులగు సర్వసుపర్వులు మరున్నందనునకు నమస్కరించి
రంత నిందప్రేరణంబున వక్తయగు వాచస్పతి యిట్లనియె. ౨౨౦

చ॥ తెలియక నీ పరాక్రమము ♦ దేవత లిట్టు లొనర్చినారు కో
సలపతి రామమూర్తి పద ♦ సారససేవ నొనర్చుమేటి వీ
మలకడ కేల వచ్చితివి ♦ మారుతనందన యింత కృత్యమెం
దుల కొనరించి తీవు ఘన ♦ దోర్బల మర్దితదేవ తెల్పుమా. ౨౨౧

క॥ చేతులు మోడ్చుచు నా పనిఁ, జేతోమోదమున మేముఁ ♦ జేతుము నీ వీ
రీతిని భయదాకార స, మేతుఁడు గావలదు చూడు ♦ మింద్రుని దయచేన్. ౨౨౨

ఆ॥ ఇటుల నుడువునట్టి ♦ బృందారకాచార్యు, వచనములకు గంధ ♦ వహునిసూనుఁ
డలరి పలికె నమరు ♦ లార సురాచార్య వినుఁడు వచ్చినట్టి ♦ పనిని జెపుదు. ౨౨౩

ఆ॥ వీరమణి నృపాల ♦ వీరుని రణమందు నీలగళుని చేత ♦ నిహతులైన
యోధవరుల జీవ ♦ యుతుల సేయఁగ ద్రోణ, పర్వతము హరింప ♦ వచ్చినాఁడ.

క॥ బలదర్పితు లెవరైనను, జలమున నా పనికి నడ్డు ♦ సలిపిన నే వా
రలనందర నిపు డంతకు, నిలయమునకు నంపువాఁడ ♦ నిజమిదినుండీ. ౨౨౫

తే॥ బవరమందునఁ బొలిసిన ♦ భటుల జీవ,యుతుల సేయున దీ ద్రోణ ♦ మో తదావ
ధములొమెరిగింపుఁడయ్య మీ ♦ ర్దానినని,నమరులానతులై యోష ♦ ధములనొసఁగి.

క॥ పురుహూతుని ముందిడుకొని, పరమానందంబుతోడ ♦ భయవిరహితులై
సురలోకముఁ జేరిరి యా, కరువలిపట్టియును నేగెఁ ♦ గదనస్థలికిన్. ౨౨౭

సీ॥ సకలామర మనుష్య ♦ సంస్తూయమానుఁడై, సాధువాదము లాక ♦ సమున నిండ
నింతయద్భుతకార్య ♦ మెవఁడు సేయసమర్థుఁ, డనుచుఁ గొందఱుతన్ను ♦ గనుచునుండఁ
జని సదాశివుచేత ♦ సంరక్షితుండైన, పుష్కలు మృతుఁ జేరఁ ♦ బోయి మంత్రి
సుమతిని రావించి ♦ చూడు వీరందరఁ, బ్రతికెంతు నిపుడంచుఁ ♦ బలికి భరతు

తే॥ కొడుకు శిరమును దనువుతో ♦ గూర్చి చిత్త, వాక్ఛరీరంబులను రామ ♦ భజనకాని
యన్య మెఱుఁగనివాఁడ నే ♦ నైతినేని, బ్రతుకునని భేషజం బుంచె ♦ వక్షమందు,

క॥ ఉంచినమాత్రంబుననే, యించుక బాధైన నాత ♦ డెఱుఁగక బల్ని
దిర్రించిన చందంబున జృం, భించి కనుల్ విచ్చిచూచి ♦ భీకరతనుఁడై. ౨౨౯

ఆ॥ ఏడి వీరభద్రుఁ ♦ డేది నా చేధను, వేది శరధి యనుచు ♦ నెదుటఁజూచి
మూర్ఛనొందఁజేసి ♦ పోయె నిష్ఠాతని, బట్టి యముని జూఁడ ♦ బంపువాఁడ. ౨౩౦

క॥ ఈ రీతిఁబల్కఁగా విని, వీరుం డక్షాంతకుండు ♦ వీరవరా నీ
వారయఁ గడు ధన్యుండవు, శూరుఁడవు భవాదృశులను ♦జూడ జగమునన్. ౨౩౧

తే॥ భండనంబున నా వీర♦భద్రుచేత, హతుఁడవై రాముని యనుగ్ర♦హమునఁజేసి
బ్రతికితివి రమ్ము పెనుమూర్ఛ♦వడసినట్టి,నీదు పినతండ్రిఁజూడనో♦నిఖిలవినుత. ౨౩౨

క॥ అనుచుం జని జన్యాంగణ, మునఁ బురహరశరవిపీడఁ ♦ బుచ్చుచు నూర్పుల్
దను వెఱుఁగకున్న శత్రు, ఘ్నునిఁ జేరఁగ బోయి గాలి ♦ కొడు కిట్లనియెన్. ౨౩౩

ఉ॥ రాజవరా ! మహాబల ప♦రాక్రమ ! జన్యధరాతలంబునన్
దేజము వాసి మూర్ఛవడి♦తే యిఁక లెమ్మ బిరాన నంచు నా
యాజితనూజు వక్షమున ♦ నౌషధముంచి వచించె నిట్లు నే
నాజనిబ్రహ్మచర్య సుమ♦హావ్రత మూనితినేని తప్పకన్. ౨౩౪

తే॥ బ్రతుకుఁగా కీతఁ డనుచును ♦ బల్కనంత, నెక్కడెక్కడ శితికంఠుఁ♦డేడి చాటి
పోయెరా వీడి యీరణ♦భూమి ననుచు, నౌడుఁగఱచుచు నా శత్రు♦హంత లేచె.

క॥ అంతటఁ గాలాంతకుచే, నంతము నొందిన భటాళి ♦ హనుమంతునిచే
వింతను గొన జనులందఱు, వంత లుడిగి యొక్కసారి ♦ పడసె నసువులన్. ౨౩౬

వ॥ అప్పు డందఱు రోషపూరితస్వాంతులై యుద్ధోన్ముఖులగుచు దమతమ రథంబులం దధిష్ఠించి గాత్రంబుల రక్తంబులు గారుచుండ శాత్రవాభిముఖులై పోవుచుండి రట్టియెడ వీరభద్రుని బుష్కలుండును, నందీశ్వరు వాయునందనుండును, దిప్ర రఘ్నుని శత్రుఘ్నుండును, జండీశ్వరుని గపిధ్వజుండును దలపడి రందు. ౨౩౭

ఆ॥ కార్ముకంబు మోర్యఁ♦గాఁ జేయు చీశ్వరు, నాలమునకు రమ్మ♦టంచుఁ బోవు
శత్రుమథను జూచి ♦ సమరశూరుం డగు, వీరమణి నృపాల♦వీరుఁ డలిగి. ౨౩౮

క॥ ఎడసొచ్చిరాజ నీవెక్కడ కేగెద విపుడు శివుని ♦ కడకా నిలు నీ
కడఁకంతయు వే చూపుము, కడచనగ జేతుఁ బిదప ♦ ఖరశరములచేన్. ౨౩౯

వ॥ ఇట్లు పల్కుచుఁ దలపడియె, నంత నయ్యిరువు రన్యోన్య ప్రహారణంబుల మునివిస్మయకారకం బగు బవరంబు సేయునప్పుడు. ౨౪౦

ఉ॥ వీరమణిప్రభుండు రఘు♦వీరు శతాధికముల్ శతాంగముల్
భోరన నూవులంతలుగ ♦ ముక్కలుసేయఁగఁ గోపభీకరా

కారముచే నితం డనల♦కాండము నేయఁగ బోయి సైన్యముల్
నీరుగఁ జేయుచుండ నవ♦నీపతి కోపపరీతచిత్తుఁడై. ౨౪౧

సీ॥ వారుణాస్త్రంబున ♦ వారించుటయు దానిఁ, దనవారు శీతార్తిఁ♦ బొనుగువడుట
వీక్షించి లవణారి ♦ యా క్షణంబున మారు, తాస్త్రంబువైచె నా ♦ యస్త్రజనిత
వాతంబునను వారి♦వాహము ల్చెదరి ది,గంతంబులను జేరె ♦ నఖిలబలము
స్వాస్థ్యలిఁగాలూనఁ♦గా లేక నిటునటుఁ, బోసాగె నది చూచి ♦ భూమినాథుఁ

తే॥ డలిగి శైలాస్త్రమునువింటి♦యందుఁగూర్చి, వైవరణభూమిమ్రోయుచు♦ వాయువడఁగె
నది గనుంగొని సౌమిత్రి ♦ భిదురశరము విడుచునంతనె తుము రైరి ♦ వీరభటులు.

కం॥ నెత్తుటఁ గొందఱు యోధులు, జొత్తిలి యవశత్వము♦నను జొక్కుచు నుండన్
జిత్తరమై తోచెను రణ, మత్తరిఁ గనువారి కో మ♦హామునివర్యా. ౨౪౩

శా॥ ఆరేడాగ్రహమంది వైరిజన సం♦హారం బొనర్పంగఁ బ్రా
పై రాజిల్లి మహాద్భుతం బయిన బ్ర♦హ్మాస్త్రంబు సంధింపఁగా
వీరుం డా లవణాంతకుండు మును శ్రీ♦విశ్వామిత్రనీదత్త వి
స్ఫారోదగ్రరిపుప్రమోహన మహా♦స్త్రంబుల్ బ్రయోగించినన్. ౨౪౪

తే॥ వీరమణిభూమిపతిచేత ♦ విడువఁబడిన, బ్రహ్మదైవత శరమును ♦ బత్య రెండు
ముక్కలుగఁజేసిపోయియా♦పుడమి తేని,వక్షమునఁగాడఁగామూర్ఛ♦వడియెనతఁడు.

సీ॥ ఆ మోహనాస్త్ర జ♦న్యములైన శరములు, వేలకొలందిగా ♦ వెడలి ప్రమథ
గణముల నృపు వీర♦గణములఁ బెనుమూర్ఛ, నందింపఁ గొందఱు♦హరునిపాద
ముల మీఁదఁ బడిరి యం♦దులకు ధూర్జటి యల్గి, స్యందనారూఢుఁడై ♦శత్రుమథను
నెదిరింపఁగా నాతఁ ♦ డిష్వధి సజ్జంబుఁ, గావించి రణభూమిఁ ♦ గడఁక నిల్చెఁ

తే॥ నంత నిద్దరుఁ దీక్ష్ణత♦రాంబకముల, నస్త్రప్రత్యస్త్రముల నిశా♦తాయుధములఁ
బ్రథనమాదీపిత దిగంత♦రాళమై ఘు, నారినాశనముగఁజేసి ♦ రమలయశులు.

కం॥ ఆయోధన మీరీతిగ, నే యోధులు మున్నుఁ జేసి ♦ యెరుఁగరు సూనై
తేయామరవర్గములో, వేయేలను వారినే ప్ర♦భీతులఁజేసెన్. ౨౪౭

కం॥ ఆ కదనమందు మిక్కిలి, వ్యాకులితుం డగుచుఁ గరము ♦ లాడకఁ గడుఁ జీ
కాకును బడు శత్రుఘ్ను న,నోకహచరవర్యుఁ డిట్లు ♦ నుడివె మునీంద్రా.

—♦ శ్రీరాముఁడు ప్రత్యక్షంబగుట ♦—

సీ॥ స్వాంతమందున భక్తార్తి♦హరునిరామ,భద్రుని దలంచుమాయంచుఁ♦బలుకనతఁడు
బ్రాణహరణంబు సేయఁబా♦ల్పడియెశూలి, యన్నహానాథవచ్చిన♦న్నరయుమయ్యా.

మ॥ మును నీ సత్కృపఁ దాటగల్గిరిక దా ♦ మోపాది * లేకుండ శు
గ్వనధిన్ భక్తు లనేకు లవ్యయకృపా♦వార్ధీ రణక్షోణిఁ దీ
రని కష్టంబుల నొందు నన్ను మనుపన్ ♦ రావా పరంధామ పా
వననామా యిఁక జాగు వల్దనుచు లోఁ ♦ బ్రార్థింపఁగా నంతలో. ౨౫౦

క॥ ఇందీవరదళతను నర, విందాక్షుని నైణశృంగ ♦ విలసితకటు సా
నందాత్ముని దీక్షితు జన, మందారుని విస్మయంబు ♦ మదిదోఁపఁగనెన్. ౨౫౧

క॥ ప్రణతార్తిహరుని శ్రీరా,ముని గాంచిన యంత దుఃఖ♦ముక్తుం డయ్యెన్
మునినాథ తదనుజన్ముఁడు, హనుమంతుఁడు మ్రొక్కెఁ దత్ప♦దాంబుజములకున్.

తే॥ ఇట్లునతుఁడౌచుఁబల్కెనో♦యినకులేశ, భక్తపరిపాలనము నీకు♦యుక్తమకద
యిష్టు హారశరబాధల♦ నేపుదరిగి, యుండు మముఁగాచు టొక వింత♦యో మహాత్మ!

ఆ॥ స్వామి నీదు పాద♦పద్మ దర్శనమున, దలఁప నిపుడు ధన్య♦తముఁడ నైతి
నీక్షణము భవత్క♦టాక్ష వీక్షణమున, శిక్షనేతుమే వి♦పక్షతతుల. ౨౫౪

వ॥ అంత. ౨౫౫

సీ॥ అభవుఁడుఁ బ్రణతాభ♦యదుఁడు యోగిధ్యాన,గోచరుం డగు రఘు♦కులపయోధి
రాకాశశాంకు శ్రీ♦రాముని పదముల,కెఱగి వినమ్రుఁడై♦యిట్టు లనియె
నో మహాపురుష నీ ♦ వొక్కండ వయ్యును, బ్రకృతికిఁబరుఁడవై ♦ స్వాంశవలన
విధి హరి శర్వాఖ్య ♦ భేదంబులను బొంది, విశ్వంబుఁ బుట్టింపఁ ♦ బెంపఁ దుంపఁ

తే॥ జాలితి వరూపుఁడ వశేష ♦ జగమునకును, బరమకారణ మైతివి ♦ ప్రకృతినాశ్రి
యించుటనుజేసిసకలము♦నీందఱి హృదభి,రామ గుణధామ శ్రీరామ♦రామరామ.

మ॥ పరమేశా యిటు బ్రహ్మహత్య హరియిం♦పన్ జన్నము ల్సేయుటే
పరమాశ్చర్యము, గంగయున్ బ్రథిత మా♦త్వత్పాద శౌచంబు నా
దురితంబుల్ హరియించు నంచు శిరమం♦దుం దాల్చితి నీ్నకునున్
దురితంబం చొకటున్న దే తలపఁగాఁ♦దోచె న్విలాసంబుగన్. ౨౫౭

ఆ॥ అనఘ నీకు గొప్ప♦యపకృతిఁ జేసితి, నిపుడు దాని దయ క్ష♦మింపవలయు
నేమి సేయువాఁడ ♦ నే సత్యపరిపాల, నంబు సేయ నిది యొ♦నర్చినాఁడ. ౨౫౮

సీ॥ నీదు ప్రభావంబు ♦ నేనెఱింగియు భక్త,సంరక్షకై యింత♦సాహసంబుఁ
జేయఁగా వలసె నీ ♦ క్షితినేత పూర్వ, ముజ్జయనీ మహాకాళ ♦ సదనమందుఁ
గడఁగి క్షిప్రాఖ్యాప♦గాజలంబునఁ దోగి ♦ బహునిష్ఠ ఘోరత♦పంబుఁజేసె
నందుకు నే మెచ్చి ♦ యవనీశ నీ కోర్కె, నెరిగింపు మిత్తునే♦నేదియైన

తే॥ విస్మయకరంబు రిపుల క♦భేద్యమైన, రాజ్యమును గోర దేవపు♦రంబు నీకు
రాజ్యమా రామయజ్ఞతు♦రంగమిటకు, వచ్చువర కేను నిన్నుగా♦పాడుచుందు.

* మోపాది = అపాయము.

క॥ అని యీ వరము నొసంగితి, ననఘా సత్యంబు విడువ ♦ నగునే హారితో
మనుజేశుఁ డఖిలసంపద, లనొసంగి భవత్ప్రదార్చ♦లను జేయుసుమా. ౨౬౦

వ॥ ఇట్లు నుడువు మఖధ్వంసి భాషణంబులకు దశముఖధ్వంసి కృపాపరిపూర్ణలోచ
నుండై మేఘగంభీరభాషణంబుల నిట్లనియె. ౨౬౧

తే॥ భక్తపాలన మనునది ♦ పరమ ధర్మ, మది యొనర్చితి వయ్య బా♦గాయె నెపుడు
విబుధవరులకుఁ బరికింప ♦ విహిత మిదియ, కాదె యెఱుఁగవె నీవు దా♦క్షాయణీశ!

క॥ నీ మానస మేను శివా, నా మానసమీవు నీకు ♦ నాకును భేదం
బేమాత్రమైన లే దని, ధీమంతులు తెలియఁగలరు ♦ తెలియరు మూఢుల్. ౨౬౩

క॥ ఏకాకృతి నుండెడి మన, మో కాలస్మయవిదారి ♦ యొరుల మటంచున్
వాకొను నతఁడు కుంభీ, పాకంబునఁ బడి తపించు ♦ బహుకల్పంబుల్. ౨౬౪

తే॥ నీదు భక్తులలో ధర్మ♦నిరతు లెవరొ, వారు నాకును భక్తులో ♦ పార్వతీశ
నాకు భక్తులు భక్తిచే ♦ నీకు నతులు, సేయువారలె సుము సునా♦శీరవంద్య.

సీ॥ ఆ మాట లాలించి ♦ యభవుండుఁ బెనుమూర్ఛ,మునిగిన యా వీర♦మణి నృపాలు
నాతని సూనుల ♦ నంబక పీడితు,లైన సైనికుల న♦నూన ప్రేమఁ
దన కరసంస్పర్శ♦మునఁ దేర్చి సుతపౌత్రి, పరివారయుతు నా నృ♦పాలు రామ
భద్రుని పదములఁ♦బడునట్లు చేసె వా,త్స్యాయన యతఁడెంత♦ధన్యతముఁడొ

ఆ॥ యోగనిష్ఠులైన ♦ యోగుల కేరికిఁ, జూడరాని రాముఁ♦జూచినాఁడు
మ్రొక్కినాఁడు పాద♦ములకుఁ గృతార్థి కృ,తాంగుఁడగుచు ఘనతఁ♦గాంచినాఁడు.

వ॥ ఇట్లు బ్రహ్మాది సురపూజ్యుం డగు వీరమణి నృపాలశేఖరుండు బురహారప్రేరణ
ముచే శత్రుఘ్న హనుమత్పుష్కలాది వీర సేవితుం డగు రాఘవేశ్వరునకుఁ బుత్ర
పౌత్రపశుబాంధవసహితం బగు రాజ్యంబుతోఁ బూజ్యంబగు తురంగంబు
సమర్పించె నంత రాముం డత్యంతోత్సుకు లగు శత్రుఘ్నాదులచే నభినందితుండై
సుహృద్భృత్యసన్నుతుం డగుచు మణిమయస్యందనారూఢుండై యందఱుఁ గను
చుండఁ దిరోహితుం డయ్యె నట్టియెడ. ౨౬౭

ఉ॥ ఎక్కడ కేగె రామ విభుఁ♦డే డిపుడేకద చూచినార మ
మ్మక్క యితండుఁ గన్గొనఁగ ♦ మానవ మాత్రుఁడుఁగాడు నిశ్చయం
బెక్క డయోధ్య జన్యతల ♦ మెక్కడ యెప్పుడు వచ్చె నీశుచే
మ్రొక్కులుఁ గొన్న వాఁడనుచు ♦ మోదము విస్మితి నొంది రందఱున్. ౨౬౮

తే॥ జలములందున మెట్టల ♦ శైలములను, వనములందున నెందైన ♦ వరలువాఁడు
వచ్చె నిట కంచు వేరుగఁ♦బల్కనేల, నంతటను నిండియున్నాఁ డ♦నంతుఁడతఁడు.

వ॥ అనుచు నన్యోన్యాలింగనంబుల నత్యంతహృష్టాంతరంగు లగుచు నుండి రప్పుడు.

తే॥ మురజతూర్య రవంబులు ♦ మొరయుచుండె, ముక్తమై వీతి స్వేచ్ఛగఁ♦బోవుచుండె
సప్తి వెంటను వీరాళి♦చనుచునుండె, గగనచరజాలమంతయుఁ ♦ గనుచునుండె.

తే॥ మున్ను నుడివిన నుడి సత్య♦ముగనుజేసి, సేవకుం డగు రాజుతోఁ ♦జెప్పి రామ
చంద్రమూర్తిని మదిలోన♦సంస్మరించి, చనియె గైలాసమునకు నా♦చంద్రమౌళి.

క॥ వీరమణి క్షితినాథుం, డా రఘుకుల తిలకు పావ♦నాంఘ్రిజలజముల్
చేరిచి చిత్తమునందున, వీరుఁడు శతృఘ్నుతోడ ♦ వెడలె మునీంద్రా. ౨౨౩

క॥ ఈ రాముని చరితము విను, వా రాపత్తుల నఘాళిఁ ♦ బాయుదురొగి సం
సారానూనార్తిని బడ, రా రాముని దయకుఁ బాత్రు♦లయ్యెద రెపుడున్. ౨౨౪

వ॥ అని శేషుండు వాత్స్యాయన మునీంద్రునకుఁ జెప్పె. ౨౨౫

శా॥ సీరాటధ్వజ దాహకక్షమజ్వల♦న్నేత్రా భరాట్పృఖరా
ఘోరేభాస్రపరూతుకృత్తివసనా ♦ కుత్కీలరాడ్జాధవా
సూరాత్మప్రభవస్మయాపహరణా ♦ సూర్యాగ్నినేత్రలోచనా
తారగ్రామనివాస పాపలతికా♦దాత్రా స్రవంతీధరా. ౨౨౬

క॥ అజముఖ్యార్చితచరణా, గజదనుజ మదాపహరణ ♦ గజముఖచరణా
రజనీచరోత్తమాంగా, వృజినాంధతమఃపతంగ ♦ వృషభతురంగా! ౨౨౭

తరళ॥ ఉరగభూషణ భక్తపోషణ ♦ యోగిలోక సుపాలనా
గరళకంఠ సురారిభంజన ♦ కాలగర్వ వినాశనా
చరణపంకజసేవనారత♦సాధులోకసదావనా
తరణిదంత విపాటనక్షమ ♦ తారకాసురభంజనా. ౨౨౮

గద్యము

ఇది శ్రీమద్గౌతమాన్వయ పవిత్ర లక్ష్మీనారాయణార్యారసపుత్ర శ్రీ చింతలపాటి
వంశ క్షీరపారావారరాకాసుధాకరాయమాణ సూర్యనారాయణార్య దత్త
పుత్ర శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షాసమాసాదితానవద్యోభయ
కవిత్వ విద్యావధాన రామమూర్తిశాస్త్రి కవ్యభిధాన ప్రణీతంబైన
రామాశ్వమేధంబునందుఁ
బంచమాశ్వాసము.



శ్రీ

గణాధిపతయే నమః

శ్రీరామభద్రాయ కరుణాసముద్రాయ నమః

# రామాశ్వమేధము

## షష్ఠాశ్వాసము



గిరిజాప్రాణేశ్వర
భాగవతజనాది తేయ • పాదపవరదా
యోగిధ్యేయ పదాంబుజ
యాగమనుత నందివాడ • యానందేశా. ౧

వ॥ అవధరింపు మనంతర కథాశ్రవణ తత్పరుం డగు వాత్స్యాయనమునీంద్రునకుఁ బన్నగకులేంద్రుం డిట్లనియె. ౨

—• యజ్ఞాశ్వ స్తంభనము •—

క. వ్రతివర విను చనెఁ దురగం, బతిబలు లగు భటు లనేకు • లరయుచురా భా
రత ఖండమునకు నావల, కతిదుర్గముగ హేమకూట • మను గిరిఁ జేరన్. ౩

వ॥ అది దైర్ఘ్య విస్తారంబుల నంతటఁ బదివేల యోజనంబులు గల్గి రాజత కాంచనాది శిఖరంబులచే నొప్పారుచుండు నందు సాలతాల హింతాల కృతమాల తమాల మాల సురసాల రసాల సాల తక్కోల కర్ణికార కోవిదార బీజపూర ఖర్జూర మందార నాగ పున్నాగ బిల్వ దాడిమ చంపకాశ్వత్థ వకుల కుటజ శతప్రముఖద్రు విరాజితంబును, జాతికాయూథికా ద్రాక్షైలా లానికా లవంగాదిలతా శోభితంబును మయూర కేకారావితంబును భ్రమరనికరనినదీకృతంబును, సర్వర్తు సుఖదంబును సకలజననయనానందకరం బైన యొక్క యుద్యానంబు గను పట్ట నందుఁ జామరాద్యలంకృతం బగు సవనతురంగంబుఁ బ్రవేశించె. వెంట ససైన్యుండై శత్రుఘ్నుండుఁ జనుచుండె నప్పు డకస్మాత్తుగ నొక చిత్రంబు జరిగె దానిఁ జెప్పెద విను మని యిట్లనియె. ౪

ఆ॥ హయవతంస మప్పు • డంగ సంస్తంభంబు, వలన హేమకూట • పర్వతంబు
మూద్రి దారినెంత • మాత్రింబుఁ గదలక, నిలచియున్నఁ జూచి • నిఖిలభటులు,

క॥ చెలఁగి కశాఘాతంబులఁ, బలువిధములఁ దిప్పలెన్ని ♦ పడినను బాబా
చలియింపకయుండఁగ జని, తెలతెలఁ బోవుచును నిట్లు ♦ తెలిపిరి విభుతోన్. ౬

తే॥ ఏమి మాయయో శత్రుఘ్న ♦ యెఱుఁగమయ్య, పోవుచుండ మనోవేగ ♦ మునను సప్తి
యంగసంస్తంభనంబున ♦ నాగిపోయెఁ, గశలచే నెన్ని గొట్టినఁ ♦ గదలదాయె. ౭

ఆ॥ చేయఁదగినదెదియొ ♦ చేయుము యోచించి, వీరవర్య యనిన ♦ విస్మయాంత
రంగుఁ డగుచుఁబోయె ♦ రామానుజుఁడు వేగ, సైనికాళితోడ ♦ సప్తికడకు. ౮

క॥ అంతటభారతి తనబల, మంతయుఁ గనపరచి దాని ♦ యంజలు క్షితిపై
నెంతఁ బెకల్చినఁ గడకన్, సుంతయుఁ జలియింపదాయెఁ ♦ జోద్యమదేమో. ౯

తే॥ బలవదగ్రేసరుం డగు ♦ పవనసుతుఁడు, వీఁకసైంధవపాదముల్ ♦ దోఁకజుట్టి
భూమిఁ దనరెండు చేతులు ♦ మోపి యెత్త, నెంతఁబెనఁగిన గదల ద♦దేమొకాని.

ఉ॥ అందుకు వాతసూతి హృద♦యంబున విస్మయమొంది పల్కెనే
మందులకేగి ద్రోణగిరి ♦ మానుగఁ దోఁకను జుట్టి యెత్తి తే
మందును నాదు బాహుబల ♦ మంతయుఁ జూపితి హా ప్రియాస మే
నందుట కాని లాభ మిసు♦మంతఁ గనంబడదో నృపాలకా. ౧౧

ఆ॥ హయముఁ జూడఁ గొద్ది, దాయాస మధికంబ, యైన లాభ మించు ♦ కంతయైనఁ
గాంచ మిందు కొక్క ♦ కారణ ముండక, పోదు భటులు వెదుకఁ ♦ బోవ వలయు. ౧౨

క॥ అను హనుమంతుని మాటలు, విని శత్రుఘ్నుండు చాల ♦ విస్మితుఁడై మం
త్రిని గాంచి యనియె నశ్వం, బునకుఁ దనుస్తంభ మెట్లు ♦ పొసఁగె నడవిలోన్.

తే॥ ఏ యుపాయంబుచే వాహ♦మేగఁగలదు, చేయఁదగిన దదెద్దియో ♦ చెప్పు మనిన
మంత్రియనె రాజవర్య యే♦మాత్ర మిచటి, పరిగతుల నేన వేవియు ♦ నెరుఁగనైన.

క॥ సకలజ్ఞాన విచక్షణుఁ, డకలంకు మునీంద్రు నిందు ♦ నరయఁగవలె నో
పికతోడ సర్వదిశలను, సకలం బెరిగించు నతఁడు ♦ శాత్రవమథనా. ౧౫

వ॥ అనుటయు శత్రుఘ్నుండు దాపసాన్వేషణంబునకై భటుల నలుదిక్కులకుం బంచె,
వారును. ౧౬

ఉ॥ దిక్కుల నన్నిటన్ దిరిగి ♦ దీవర మొప్పఁగఁ జూచి వచ్చి మే
మెక్కడఁ గాన మొక్కని ము♦నీశ్వరు నంచును దెల్పి రందులో
నొక్కఁ డొకాము డేగి పురు♦హూతుని దిక్కున జాతివైరముల్
దక్కి మెలంగు జంతువులఁ దద్దఁ ♦ జెలంగు మహాశ్రమంబుఁ దాన్. ౧౭

వ॥ సమీపించి పోయి చూచి, ౧౮

సీ॥ అది జాహ్నవీస్నాన♦హతసకలాఘ జ,నావళులకు సంత♦తాలవాల
మది పంచవహ్ని మ♦ధ్యంబున ఘోరమా, తప మొనర్పఁగఁదపో♦ధనులకు నెల
వది యధోముఖు లౌచు ♦ననిలధూమంబుల,గుక్షి నింపుకొను యో♦గులకు టెంకి
యది ముక్తపత్రిల♦తాంతము మునిహృష్ట,దమునైన హోమధూ♦మమున కిక్క
తే॥ అది యమర్త్యమనుష్య మ♦హామునీంద్ర, సకల విస్మయకృత్తప♦శ్చర్యకలన
మెరయు శౌనకుఁడను మునీ♦శ్వరున కాట,పట్టనుచెరింగి వే పోయి♦పతికిఁదెల్పె.౧౯

చ॥ విని లవణారి మోదమున ♦ వెంటనె వెంటను సైనికుల్ పవిభం
జనసుతపుష్కలాదిబల♦శాలురు రాఁగఁ దదాశ్రమస్థలిన్
జని యనలు న్భజించు ఘను ♦ శౌనకు సంయమినాథుఁ బూతప
ద్వనజములందుఁజేర్చి తల, ♦ భక్తిఁ గృతాంజలి యౌచు నిల్చినన్. ౨౦

ఉ॥ వచ్చినవాఁడు చాల బల♦వంతుఁడు రాముని తమ్ముఁ డంచు లో
నచ్చుగఁ దా నెరింగి విధి♦నర్ఘ్యముఁ బాద్యము నిచ్చి దర్శనం
బిచ్చుటచేతఁ బ్రీతి జని♦యించెను నాకు బుసి న్వసింపుమో
సచ్చరితా యటంచు నరు♦సంబున శౌనకమౌని పల్కఁగాన్. ౨౧

క॥ అనఘా విను త్వాదృశు లగు, జనపాలురు భూతధాత్రి ♦ సంచారముఁ బ్రే
మను జేయకున్నతరి స,జ్జనులను దుర్జనులు బాధ♦సల్పుదురుకదా. ౨౨

తే॥ అన్నివిధముల నీదు ప♦ర్యటన మిష్ట, సర్వమంగళములకు నా♦స్పదము సూవె
ధీర శత్రుఘ్న వచ్చిన ♦ కారణంబు, విశదముగఁ దెల్పుమయ్యా నా ♦ వీను లలర.

వ॥ అనిన శౌనకుం గాంచి హర్షితగాత్రుండై గద్గదస్వరంబున శత్రుఘ్నుం డిట్లనియె.

సీ॥ విను మునివర మనో♦వేగంబునను రాము, సర్వంసహానేత ♦ సవనసప్తి
మీ వాసమునకు స♦మీపంబునను సుశో, భాకరంబైన యు♦ద్యానభూమి
స్వేచ్ఛగాఁబోవుచుఁ ♦ జేర నకస్మాత్తు, గను జిత్రిమొకటి ♦ కలిగె నపుడు
క్షణమాత్రమునను ద♦ద్గాత్రిసంస్తంభన, మయ్యె భటుల్ బుష్క♦లాదులెంత
తే॥ బలిమి చేఁబట్టి పెకలింపఁ♦బాదమించు, కంతయైనను జలియింప♦దాయె మా య
దృష్టమున ఘోరదుఃఖాంబు♦ధిని మునింగి, నట్టి మాకెల్లరకుఁ దరి ♦ వైతి వనఘ.

క॥ తురగస్తంభనహేతువుఁ, ద్వరలో విడివడు విధంబు ♦ దయతోఁ జెపుడో
పరమతపోధన యన నా, దరమున నతఁడొక్కక్షణము ♦ ధ్యానించి మదిన్. ౨౬

తే॥ దాని విధమంతయు నెరింగి ♦ శౌనకుండు, విస్మయోత్ఫుల్లనేత్రుఁడై ♦ పెల్లు వంతఁ
గుందుచుండెడి శత్రుఘ్నుఁ♦గూర్చి విని చెఁ, జిత్రమైనట్టి పూర్వచ♦రిత్రిమొకటి.

సీ॥ శత్రుఘ్న గౌడదే♦శంబునఁ గావేరి, దరి మహారణ్య మ♦ధ్యమున మున్ను
సాత్వకుండను విప్ర♦సత్తముఁ డొకరోజు, క్షీరపానంబును ♦ జేయుచొక్క

దినమున మారుత♦మును భక్షణముఁ జేయు, చొకనాఁడు దిన కేమి♦యును మహోగ్ర
మైనతపంబుఁ బ♦ర్యాయక్రమంబున, సలుపు చిట్లు వ్రతంబు ♦ సలుపుచుండ

తే॥ మిత్తివాతను జేరుచు ♦ మృతిని జెందె, నంతలో సర్వశోభాఢ్య ♦ మగుచు నఖిల
మణివిచిత్రిత దివ్యవి♦మాన మొకటి, యప్సరోజనపూరిత ♦ మగుచు వచ్చె.

వ॥ అంత నా బ్రాహ్మణుం డా విమానం బధిష్ఠించి మహావైభవంబునఁ జని మేరున
గోత్తరభాగంబున బహుతపఃపుణ్యపరిపాకంబునం జేసి సకలసౌఖ్యంబులఁ
దేలుచు మునుల కాలవాలంబై జంబూపలాశపక్వఫలద్రవత్సారసౌవర్ణీకృత
సికతాస్థలం బగు జాంబవతీ నదీ తీరంబున స్వేచ్ఛ నప్సరోగణంబులతోఁ గ్రీడలఁ
దేలుచుండి స్వాభిమాన మదోద్ధతుండై యచ్చటి మునుల కవమానంబు సేయ
వా రందుల కలిగి యిట్లనిరి. ౨౯

క॥ ఎక్కువ సౌఖ్యంబుల మదిఁ, జొక్కుచు హేళనము సేయఁ ♦ జొచ్చితివి మముఁ
దిక్కరి వన మధ్యంబున, రక్కసుఁడవు గమ్ము నిల్వ♦రా దిచట నన. ౩౦

తే॥ అంత విప్రుండు దుఃఖితుఁ♦డగుచు నా తపస్విజన పాదములమీదఁ♦బడి మహోగ్ర
పాప మొనరించినాఁడఁ గృ♦పాళులార, తప్పు సైరించి కావరో ♦ ధన్యులార. ౩౧

క॥ అని మొరలిడు విప్రునితో, ననిరి మునుల్ వనిని రాఘ♦వాశ్వతను స్తం
భన మీవుచేసి యా రాముని కథ వినునంత శాప♦ముక్తి ఘటించుఁ. ౩౨

క॥ అప్పుడు తప్పక మునుపటి, యొప్పగు నీదైన రూప♦మొందెద వనుచుఁ
జెప్పిరి వింటివ యాతం, డిప్పుడు స్తంభనముజేసె ♦ నీ మఖసప్తిఁ. ౩౩

తే॥ దురితహర మగు రామసం♦స్మరణమునను, శాపమోక్షంబుఁ గాంచు నీ♦సాత్వికుండు
గాన మీరట్లు చేయుడు♦తత్క్షణమున, ననిన శత్రుఘ్నుఁడనె విస్మ♦యంబుఁ జెంది.

—♦ శౌనకుండు శత్రుఘ్ననకుఁ గర్మగతుల నెఱిఁగించుట ♦—

క॥ మునివర కర్మల వార్త గ్రహనముగదా యతఁడు స్వర్గ♦మం దుండియుఁ దా
నొనరించిన కర్మంబునఁ, బెను రక్కసుఁ డగుచుఁ గూలె ♦ విపినమునందుఁ. ౩౫

క॥ కర్మలగతు లెట్టివి యే, కర్మవిపాకమున నరక♦కష్టముఁ జెందుఁ
గర్మముల మర్మమెల్లను, నిర్మలహృదయా మహాత్మ ♦ నిజముఁ దెలుపుమా. ౩౬

వ॥ అనిన శౌనకుం డిట్లనియె. ౩౭

క॥ ధన్యుండవు రఘుకుల మూర్ధన్య భవన్మతి శుభాస్ప♦దం బగుట నసా
మాన్యుఁడ వన్నియుఁ దెలిసియు, నన్యహితముఁ గోరి యిట్టు♦లడిగితి కాదే. ౩౮

చ॥ అరయఁగఁ గర్మకాండ గతు♦లన్నియుఁ జిత్రము లయ్య వాటి నీ
కెరుక పడంగఁ జేయ విను ♦ మేవి విన న్నమకూరు మోక్షముం

బరధనసంతతుల్, బసుల ♦ భార్యల బొంగిలి వే తమిస్రమున్
నరకమునందుఁ గూలు రవి♦నందనమర్కరపాశబద్ధుఁడై. 3౯

వ॥ ఇట్లంధతామిస్రం బను మహానరకంబున న్బడి శమనకింకరులు గశలచేఁ గొట్టుచు నాకసంబున కెగురవైచి క్రిందఁబడఁజేయుచు ననేకవిధంబుల ననేకసహస్ర వత్సరంబులు గారింపఁ బాపం బనుభవించి, పాపశేషంబున భూలోకంబున వారాహయోనిం బుట్టి, యందలి దుఃఖంబు లనుభవించి, చచ్చి మఱలదుర్యశోజ్ఞాప కంబై రోగాది చిహ్నితంబగు శరీరంబు ధరించి పెక్కు కష్టంబు లనుభవింపు చుందురు, మఱియు. ౪౦

సీ॥ శత్రుఘ్ను కేవల ♦ స్వకుటుంబపోషణ, మునకు భూతద్రోహ ♦ మునఁ జరించు
నీచుఁడు దామిస్ర ♦ నిరయంబున న్గూలు, వ్యర్థముగా జంతు♦హనన మిలను
నొగి, నేసి, దా రురు♦మృగములు భక్షించు, రౌరవంబున జెందుఁ ♦ గ్రూరబాధఁ
దనపొట్టకొరకు భూ♦తములఁ జంపెడి పాపి, కారియఁబడు మహా♦రౌరవమున

తే॥ ద్విజునితోఁ దండ్రితోడను ♦ ద్వేషమొందు
నతఁడు బదివేలయోజనా ♦ లాయతంబు
నంత విస్తృతి గల్గి బ♦ల్వంతఁ గూర్చు
కాలసూత్రంబునన్ బడి ♦ కందుచుండు. ౪౧

తే॥ ఎన్నికకు నావురోమంబు ♦ లెన్నికలవొ, కాలసూత్రంబునను నన్ని ♦ వేలసమము
లెలమి గింకర బాధఁద♦పించుచుండు, గోవుతో ద్వేషభావంబుఁ♦గొన్న వాఁడు. ౪౨

చ॥ ధరణిపులై జనించి ధర ♦ దండన కర్తృత లేనివారి భూ
సురుల దయార్ద్రదృక్కులను ♦ జూడక దండన సేయువారి సూ
కరముఖదుష్ట భీతికర♦కాలభటుల్ బెనుబాధఁ గుందసే
తురు దురితాపనుత్తికయి ♦ దూషితయోనుల యందుఁ బుట్టెదర్. ౪౩

శా॥ గోవిప్రాళుల వృత్తులన్ ధనములన్ ♦ గోరంతయైనన్ బ్రిమో
హావేశంబున నాహరించు నరు ల♦త్యంతంబు నా ప్రేతరా
డావాసంబున నంధకూపనిరయం♦బం దుండి తత్కింకరుల్
గ్రావంబుల్ పలురొప్పఁ గుందెదరు సం♦రావంబులన్ జేయుచున్. ౪౪

క॥ వరమధురాన్నము రసనా, పరుఁడై తనమిత్రులకు సు♦పర్వుల కిడఁడే
నరుఁ డాతఁడు కృమిభోజన, నరకంబునఁ గూలుఁజుమ్ము ♦ నరవర వింటే. ౪౫

తే॥ ఆపదలులేని సమయంబు♦నందుఁ బ్రేమ, స్వర్ణరజతాదులహరించు♦వాఁడు మఱియు
బ్రాహ్మణద్రవ్యము హరించు♦పాపి పడును, ఘోరనరకంబునందు వో♦క్షువలయేళ.

ఆ॥ గాత్రపోషణంబ♦కాని యే యితరంబుఁ, గాననట్టి మూఢ♦కలుష మతిని
దైలతప్తమగుచుఁ ♦ దనరు కుంభీపాక, మందుఁ ద్రోయుదురు కృ♦తాంతభటులు.

తే॥ పొందఁదగనట్టి సుందరి ♦ పొందుఁగోరి, పడతిగాఁ జేసికొనినట్టి ♦ పాపరతునిఁ
గాలకింకరు లెట్టిగాఁ ♦ గాలినట్టి, యుక్కు కంబంబులను గట్టి ♦ యుక్కడంతుర.

తే॥ స్వాభిమాన మదోద్ధతుఁ ♦ డగుచు వీఁక, వేదమర్యాద నెవ్వఁడు ♦ వీటఁబుచ్చు
వాఁడు వైతరణీనదీ ♦ పతితుఁడగుచుఁ, బూయశోణితములు ద్రావి ♦ పొక్కుచుండు.

క॥ పడఁతిగ నెప్పుడు వృషలిని, బడయుచు గార్హస్థ్యధర్మ ♦ పరుఁడయి తా చే
డ్పడి పడి పూయోదంబునఁ, గడుదుఃఖము నొందుచుండుఁ ♦ గారుణ్యనిధీ. ౫౦

సీ॥ లోకుల వంచింప ♦ లో నెంచి పరమడాం, బికవృత్తిచే విట్టి ♦ వీగువాఁడు
శితకరాత్మజభటుల్ ♦ చెక్కులుఁగాఁ గోయ, వైసనియందునఁ ♦ బడి తపించు
మూఢులై తమశుక్ల♦మును సతీ మణులచేఁ, బానంబు సేయించు ♦ పాపనిరతు
లమిత రేతఃకుల్య ♦ లందులఁ బడుచు రే,తఃపాన తత్పర♦తఁ జరింతుర

తే॥ దొంగతనముల నొనరించు ♦ దుష్టు లిండ్లు, దగులఁబెట్టెడి వా ర్విష♦దాత లెలమి
గ్రామములుఁ బా డొనర్చెడి♦కలుష మతులు,సారమేయాదనంబునఁ♦జేరఁగలరు.

ఆ॥ ధనము మీఁది యాశఁ ♦ దప్పుడు సాక్ష్యంబుఁ, జెప్పువాఁడు బరుల♦సిరుల బలిమిఁ
బుచ్చుకొనెడు వాఁడుఁ ♦ జచ్చి యధోముఖుం,డగుచు వీచినరక♦మందుఁగూలు.

క॥ అందున బహుదుఃఖంబులఁ, బొంది మఱల దుష్టయోనిఁ ♦ బుట్టి రుజలచేఁ
బొందును బహు కష్టంబుల, నెందునఁ గృతకర్మవిధము ♦ లిట్లుండుఁ జుమా. ౫౩

వ॥ రసనా చాపల్యంబునఁ గల్లుఁ ద్రావిన మూఢునిచేఁ బరేత నేతదూతలు సలసలఁ గ్రాగిన లోహరసంబులఁ ద్రావింతురు. మఱియు వినుము, స్వవిద్యాచార దర్పితుండై గురువుల కవమానం బొనర్చిన ద్రోహి చచ్చి ఘోరనరకంబున నధోముఖుండై పడు. ధర్మ నిష్కృతులై విశ్వాసఘాతంబు సేయువారు శూలప్రోత నరకంబునఁ గూలి బహుయాతనల నొందుదురు. పరుషవాక్కులచేఁ బరులకు మనోవ్యథఁ గలుగఁజేయు పిశునులు దందశూకం బను క్రూరనరకంబునఁ బడి యాశీవిషంబులచేఁ గరువంబడి వ్యథ నొందుచుండు రో రామానుజ యిట్టి పాపాత్ములకుఁ దమ పాపంబులం బట్టి నరకంబు లనేకంబు లనుభవనీయంబులై యుండు, వినుము. ౫౪

ఉ॥ రామకథాసుధారసముఁ ♦ ద్రావనివారు, పరోపకారముల్
శేముషియందుఁ జేయఁగ రు♦చింపని నీచులుఁ జచ్చి ప్రేతరా
డ్ధామమునందు నెంతయు వె♦త ల్పడి పుట్టి భరింపరాని పె
న్బాములనొంధఁగాఁ గలరు ♦ పాపపు చిహ్నలతోడ భూవరా. ౫౫

క॥ ఇచ్చట సుఖపడువారు వి,యచ్చరపురినుండి వచ్చి♦నట్టి సుజనులే
యిచ్చట దుఃఖంచెడివా, ర్వచ్చిన వా ర్నే్రితరాట్పు♦రమునుండి నృపా. ౫౬.

వ॥ ఇట్లు నుడువు శౌనకు వచనంబుల కత్యంత కంపమాన హృదయుండై మఱల ధైర్యం బవలంబించి సకల సంశయ నివృత్తికై శత్రుఘ్నుం డిట్లనియె. ౫౭

క॥ మునివర యే పాపంబులఁ,గను నే చిహ్నముల నరుఁడు ♦ గాశ్యపిఁ ద త్త
ద్ఘన దురితంబుల చిహ్నము, లనువుగ నా కెఱుఁగఁ దెల్పు ♦ మనఘ చరిత్రా.

వ॥ అనిన శౌనకుం డిట్లనియె, ౫౯

సీ॥ వినుము శత్రుఘ్న నే ♦ వివరింతుఁ బాపుల, చిత్రంబులైనట్టి ♦ చిహ్నములను
గల్లుఁద్రావినవాఁడు ♦ నల్లని దంతముల్, బొంది దుర్గత్యంత ♦ మందుఁ బుట్టుఁ
దినరాని వస్తువుల్ ♦ దినువాఁడు గుల్మ రో, దర రోగవంతుఁడై ♦ ధరణిబుట్టుఁ
బుష్పవతి గనంగ ♦ భుజియించు నాతఁడు, గృమిలోదరంబుచే ♦ శ్రమ వహించు

తే॥ పిల్లిచేఁ గుక్కచేతను ♦ స్పృష్టమైన, కూడుఁ దినువాఁడు గ్రంథులఁ♦గూడియుండు
దేవతాదులకును నివే♦దింపనట్టి, యన్నమును దిని పొట్టివాఁ ♦ డగుచు మఱియు.

ఆ॥ ఉదరరోగదుఃఖ ♦ మొందును నన్నంబుఁ, బెట్టువారిఁజూచి ♦ పెట్టవల ద
టంచుఁ జెప్పి విఘ్న ♦ మాచరించెడి నీచ, జనుఁ డజీర్ణరోగ ♦ జడతఁ గుందు.

సీ॥ మందోదరాగ్నియై ♦ మహిఁ బుట్టు సంపద, లెల్లఁ గల్గి కదన్న ♦ మిడెడివాఁడు
విషదుండు ఛర్ది రు♦క్పీడితు డగుఁ బాద,రుగ్వంతుఁడౌ మార్గ ♦ రోధకుండు
శ్వాసకాసల నల♦జడి నొందుఁ బిశునుండు, గను నపస్మార రో♦గమును ధూర్తుఁ
డగ్నిదుం డగును ♦ ర,క్తాతిసారామయుఁ, డన్యపరితాపకుం ♦ డగును శూలి

తే॥ అప్పులందున దేవతా♦యతనములను, జెలఁగి విణ్మూత్రముల విస♦ర్జించు పరమ
పాతకుఁడు మూలశంకచే♦బాధ నొందు, దుష్టవాది యగుఁ ఖండి♦తుండు భువిని.

క॥ ధరణిని క్షయ మేహ జలో,దరములు గలవారిఁ దెలియఁ ♦ దగు మ న్వసుధా
వర గర్భపాతనంబును, జరిపించి రటంచుఁ దాము ♦ జరిపి రటంచున్. ౬౩

సీ॥ అప్రతిష్ఠావంతుఁ ♦ డగుఁ బ్రతిమాభంగ, మొనరించునట్టి మ♦హోద్ధతుండు
పక్షపాతము సభఁ ♦ బల్కు నాతఁడుఁ బక్ష,ఘాతరోగంబునఁ ♦ గడుఁ గృశించు
నన్యవినిందకుఁ,డగు ♦ బట్టతలఁవాఁడు, నగుఁ గాణుఁడు బరో క్ష♦హాస్యకారి
యగ్రవర్ణుల హేమ ♦ మపహరించిన పాపి, కుందుచుండును బిప్పి♦గోళ్లు గల్గి

తే॥ యుర్వి రాగి హరించువాఁ♦ డూదపొట్ట, కల్గి చరియించుఁ దామర♦కలుగువాఁడు
మున్ను గంచు హరించిన♦ మూఢజనుఁడు, శీర్షరుగ్బాధఁ దపియించు♦ సీసహర్త.

వ॥ మఱియుఁ దగరంబు హరించిన జనుండుఁ బచ్చని శిరోజంబులుఁ గలవాఁ డగు

నాజ్యహర్త నేత్రరోగంబుఁ గలిగి యుండు, లోహహారి యగు నరుండు బర్బ రాంగుండై జన్మించుఁ, జర్మతస్కరుండు మేదఃపరీవృతుం డగు, మధువు హరించిన పురుషుండు మేషగంధవహుండై యుండు, దైలహారి కండ్వాది పీడితుండై కష్టించు మఱియు. ౬౫

తే॥ వెరవ కామాన్నము హరించు♦వెంగలీఁడు, పండ్లులేకను బహుబాధఁ♦బడుచునుండుఁ
గోరి పక్వాన్నము హరించు♦కుమతి భువిని, బుట్టి రసనామయంబుచేఁ♦బొందు కస్తి.

క. కుడువఁగ రమ్మని విందుల, ముడి మెల్లగ విప్పి విత్త♦ము హరించిన నీ
చుఁడు దుర్గత్యంతంబునఁ, బుడమి నమేధ్యంబులోనఁ ♦ బురుగై పుట్టున్. ౬౭

సీ॥ మేనత్తఁబొందిన ♦ హీనుఁడు దక్షిణాం, గవ్రణంబులచేతఁ ♦ గడుఁ గృశించు
మాతులానిని బొందు♦మనుజుండు వామాంగ,వ్రణములచేఁ గడు♦వగచుచుండుఁ
బెదతండ్రి పినతండ్రి ♦ సుదతులఁబొందిన, కలుషుండు గటికుష్ఠు ♦ గలిగియుండు
మిత్రుని భార్య గా♦మించిన చపలుఁడు, మృతభార్యుఁడై చాల ♦ వెతల డిందు

తే॥ క్షమ స్వగోత్రాంగనాసంగ♦మమును జేసి,నట్టి జడుఁడొందును భగంధ♦రామయంబు
శ్రోత్రియుని భార్యఁబొందిన ♦ సూనరి భువి, నాసికావ్రణియై జన♦నంబు నొందు.

వ॥ మఱియుఁ దపస్వినీ సంగమంబునఁ బ్రమేహవంతుం డగు, దీక్షితస్త్రీభోగంబున దుష్టరక్తస్రుజుండగు, స్వజాతి నారీసంగమంబున హృదయవ్రణి యగు, జాత్యున్నత స్త్రీ గమనంబున మస్తకవ్రణియగుఁ, బశుయోని గమనంబున మూత్ర ఘాతంబు సంభవించు నీదోష చిహ్నంబులు మనుజులకు నరకాంతంబున నల్గుచుండు, సందియంబు వలదు. స్త్రీలకును దత్తత్పురుష సంగంబున నయ్యే చిహ్నంబులు గల్గుచుండు నని శత్రుఘ్నునకు శౌనకుం డెఱింగించి వెండియు నిట్లనియె. ౬౯

గీ॥ దానపుణ్య ప్రసక్తిచేఁ ♦ దపముచేత, వ్రతముచే మఱిఁ దీర్ఘసే♦వనల చేత
రామచరితంబు వినుటచే ♦ రాజవర్య, తత్క్షణం బగు నిఖిలపా♦తకహరంబు. ౭౦

ఆ॥ పంచజనుల సర్వ♦పాప పంకము లడఁ, గింపఁజాలు రామ♦కీర్తి తటిని
రామవిముఖు నధ్వ♦రశ్రిత తీర్థాదు, లేవిచేయ లేవు ♦ పావనునిగ. ౭౧

క॥ కొనియాడఁ బడెడి హరి పావన చరితము మూఢుఁడగుచుఁ ♦ బరిహాసంబుం
బొనరించు నీచుఁడే వడు, వున నరకమునుండి ముక్తిఁ బొందఁడు భూపా. ౭౨

ఉ॥ పొమ్ము రఘూద్వహా తురగ♦మోక్షము సేయఁగ సేవకాళితోఁ
గ్రమ్మర నా వనంబునకు ♦ రాముకథల్ వినుపింపు మంతలోఁ
గ్రమ్మరు వీతి యంచు ముని♦కుంజరుఁ డిట్లు వచింపఁ దత్పదా
బ్జమ్ముల భక్తి మ్రొక్కి నర♦పాలుఁడు సంతస మొందుచున్ జనెన్. ౭౩

క॥ చనునంతట హనుమంతుఁడు, ఘనదుర్గతి బాపుటకును ♦ క్రమ మగు రఘురా
మునిచరితముఁ దురగాంతిక, మున వెలుచ పఠించి కనుము ♦ ముక్తియటన్నన్.

ఆ॥ అంతలో విమాన ♦ మంతరిక్షమునందుఁ, దోచె నతఁడు గేలుఁ♦దోయి మోడ్చి
పల్కె రామభద్ర♦పావనచరితంబుఁ, జెవిని బడుట ముక్తిఁ ♦ జెంది తనుచు.

వ॥ ఇట్లు పల్కి యా సాత్వికుండు. ౭౬

ఉ॥ ఏగెద స్వస్థలంబు సెల♦వీయు మటంచును మ్రొక్కి సర్వసద్
భోగములన్ మనంబునకు ♦ మోదముఁ గొల్పు విమానమందునన్
రాగమున న్వసించి చనె ♦ రాముని తమ్ముఁడుఁ బుష్కలాదులున్
జాగురె యంచు నాతనిఁ బ్ర♦శంస లొనర్చుచు నుండునంతలోన్. ౭౭

క॥ తురగము గాత్రస్తంభముఁ, దొఱఁగి మహీతలమునుండి ♦ తొలఁగుచు వినము
త్కరములచే నాకులమై, పరగు నరణ్యాంబుదాటి ♦ పటుగతిఁజనియెన్. ౭౮

—♦ సురధుని చరిత్రము ♦—

వ॥ అని చెప్పి శేషుండు వాత్స్యాయన మునీంద్రుం గాంచి యిట్లనియె. ౭౯

క॥ పరమతపోధన విను నృప, వరపూరితమైన భరత♦వర్షమునందున్
బరువడిఁ దిరుగుచు నుండఁగ, నరిగె న్వాసంబు లేదు ♦ హాయవరమునకున్. ౮౦

ఉ॥ భారతవర్షమందు హిమ♦వంతము మేరగ శత్రుఘాతియున్
భారతికీశముఖ్య బల♦వంతులు వెంటనురాఁ జరింపఁగాఁ
జేరి నృపుల్ నమస్కృతులుఁ ♦ జేయుచునుండిరి రామచంద్రదో
స్సారము సంస్మరింపు చెద ♦ సప్తిని బట్టఁగ నేర రొక్కరున్. ౮౧

తే॥ అంగవంగ కళింగ దే♦శాధినాథ, సంస్తుతులఁ బెల్లు గాంచుచుఁ, జనుచు నదితి
కుండలంబులు వడుటచేఁ♦గుండలాఖ్య, నొప్పు పురమును జేరె హ♦యోత్తమంబు.

సీ॥ ఆ పురంబున నెవ్వఁ♦డైన ధర్మవ్యతి,క్రాంతిఁ జేసెడివాఁ డొ♦కండు దొరకఁ
డా నగరిని నవ్వ♦హంబు శ్రీరామసం,స్మరణంబు సేయని ♦ జనుఁడు నాస్తి
యా పురిఁ బ్రత్యహం ♦ బశ్వత్థతులసీస,పర్య సేయనివాఁడె♦వఁడు వాలికిక్కి
యా పట్టణమున రా♦మార్చనల్, గాలంబు,నందుఁ జేయని మందుఁ♦డెందుసున్న

తే॥ కాపురం బెల్ల సిరులకు ♦ నా పురంబు, కాపుర మమలమతులకు ♦ నా పురంబు
కాపురము సత్యవంతుల♦కా పురంబు, కాపురము భక్తవరులకు♦నా పురంబు. ౮౩

ఆ॥ అందు జనుల నాల్క ♦ హరినామమే కాని, కలహ మనెడి మాట ♦ కలను లేదు
ధ్యాన మెపుడు మదిని ♦ హరియందు నేకాని, కామఫలములందుఁ ♦ గలను లేదు.

చ॥ పరమధనైకదక్షుఁడు కృ♦పామతి శ్రీరఘురామపాదసం
స్మరణపవిత్రహృష్టమానసుఁడు ♦ సత్యరతుండు మహాబలాఢ్యుఁడౌ
సురథసమాఖ్యుఁ డెన్నలరు ♦ క్షోణివిభుండు ప్రసిద్ధిఁగాంచు నీ
పురవర మేలుచుండు ముని♦పుంగవ ధర్మముఁ దప్పకుండఁగన్. ౮౫

ఆ॥ పరగ రామచంద్ర ♦ పావనవార్తలఁ, బూతదేహులైన ♦ పుర జనులకు
సత్యమందకాని ♦ నిత్యము వ్యసనంబు, జూదమందు నెప్డు ♦ లేదు లేదు. ౮౬

క॥ ఏమనివర్ణించెద నే, నామహనీయుని గుణంబు ♦ లడకువ నొకమా
ట్రేమిడి స్మరించునంతన, భూమిఁ బటాపంచ లగుచుఁ ♦ బోవు నఘంబుల్. ౮౭

వ॥ ఆ వసుమతీధవుని సేవకు లా పురంబునఁ దిరుగుచుఁ జందనచర్చితంబును లలాటబద్ధలిఖిత స్పష్టాక్షరాష్టాపదపత్రశోభితంబును నగు సవనవాహంబుఁ బొడగాంచి విస్మయంబు నొంది యందలి వర్ణంబులఁ జదివి శ్రీరామచంద్రముక్తంబుగా నెరింగి సంతసింపుచుం జని తమ యేలికం గాంచి యిట్లనిరి. ౮౮

సీ॥ అవనీశ విను మయో♦ధ్యాధీశుఁడగు రామ, మేదినీపతి హయ♦మేధయాగ
మాచరింపుచు దీక్ష ♦ హయమును విడువఁగ, నందందుఁ దిరుగుచు♦నరుగుదెంచి
భటులతో మనపుర ♦ ప్రాంతంబునను మనో, హరమూర్తితో దిరు♦గాడుచుండె
వాజిశాలను దాని ♦ బంధింపుఁడన విని, హర్ష పరిప్లుతుఁ♦డగుచు నృపతి
తే॥ ఘనగభీరోక్తి వారితో ననియె నిట్లు, మనము ధన్యుల మా రాముఁ♦గనగవచ్చు
బట్టుదము రండు భటకోటి♦పరివృతాశ్వ, వరము విడచెద రాముఁడు ♦ వచ్చినపుడు

క॥ చిరకాలమునుండియు రఘు, వరుపదముల హృదయమందు ♦ భరియించెడి నా
కిరవు లభించెను నిష్ఠ,ధ్వరహారిమూలమున నాదు ♦ దైవముఁ గనఁగాన్. ౯౦

తే॥ అహహనాపూర్వపుణ్యమే ♦మనఁగవచ్చు,హరచతుర్ముఖ వాసవా♦ద్యమరవరులుఁ
జూడలేనట్టి రాముని ♦ జూడఁగంటిఁ, బెద్దలాభంబుఁ గొనఁగంటిఁ♦ బేరుఁగంటి. ౯౧

ఆ॥ రామదర్శనంబు ♦ ప్రాప్తించు నెవనిచే, స్వజనుఁడైనవాఁడు ♦ బంధుడైన
వాహనంబయినఁ ♦ బశువైన సుతుఁడైన, వాఁడె ధన్యతముఁడు ♦ వసుధలోన.

ఉ॥ కావునఁ గామయానమును ♦ గాంచన పత్రి లసత్ప్రభాయుతం
బై విలసిల్లి హృద్య మగు ♦ నశ్వముఁ బట్టుఁడు గట్టుఁడంచు నా
భూవిభుఁ డాజ్ఞ సేయ వెసఁ♦బోయి భటుల్ శుభలక్షణాఢ్యమౌ
మావును బట్టి కట్టి రల♦మందుర నాతఁడు సంతసింపఁగాన్. ౯౩

వ॥ ఇట్లు ధర్మకృత్య విచక్షణుం డగు నరపాలుండు దనుజమర్దనుం డగు రఘువీరుని యశ్వంబు బంధించి రామాగమనంబుఁ గోరుచుండి భటులను గాంచి యిట్లనియె.

సీ. మన విషయంబు నం♦దునఁ బర దార ని, రతులుఁ బరద్రవ్య♦రతులుఁగారు
లంపటు లతిథిని♦లింపపూజాదూరు, లుండ రెచ్చట నొకఁ♦డున్న నతని
దండింపఁ డీరు స♦దా రామకీర్తన, మొనరింపు చుండుడీ ♦ యొరులచేతఁ
జేయింపుఁ డట్లు వా♦శ్రేయని నా డేను, శిక్షింతు నని మీరు♦ సెప్పఁడరసి
తే॥ పరవిసిందకు లాగమ ♦ పథవిదూరు, లాతతాయులు నీ రాష్ట్ర♦మందునుండఁ
దగరు కావునఁ బురినుండి♦తరలఁ జేతు,నుండు భయభక్తుల మెలంగు♦చుండు డెపుడు.

వ॥ ఇట్లా రాజు శాసింపుచుండు, విను మతని దేశంబున ననవరతరామస్మరణంబున నిరస్త సమస్తాఘులైన పవిత్రమూర్తుల కాని కలనైనఁ బాపకృత్యంబులు సేయువారలు లే రద్దేశంబున మృతినొందిన జను లంతకకింకరభయంబుఁ దక్కి పుణ్యలోకంబుల సౌఖ్యంబు లనుభవించు చుండఁ గాంచి శమనుం డత్యాశ్చర్యంబు నొంది యతని మనోనిశ్చయం బెరుంగఁ దలంచి జటావల్కలధారియై ముని వేషంబుఁ దాల్చి కుండల నగరంబుఁ బ్రవేశించి యందలి రాజసభా మందిరంబుఁ జేరం జని సభామధ్యంబునఁ బేరోలగంబున నుండి మస్తంబునఁ దులసియు రసన హరినామంబునుం గలిగి సేవకులచే ధర్మరతుల వార్తలు వినుచుండు పరమపావ నుం డగు సురథుం గాంచి సమీపించు నెడ నృపాలుండు. ౯౬

క॥ పరమతపోమూర్తివలెన్ , మెరయుచుఁ జనుదెంచు సంయ♦మిపదంబులఁ దా
నెరగుచు నర్ఘ్యాదుల నా, దరమునఁ బూజించి యిట్లు ♦ ధరణిపుఁ డనియెన్.

క॥ ధన్యంబయ్యెను జన్మము, ధన్యంబయ్యెను గృహంబు ♦ దయచే జటిమూ
ర్ధన్యుల రగు మీర్వచ్చుట, ధన్యుఁడ నన్నింటనైతి ♦ ధరణీశులలోన్. ౯౭
తే॥ వినినమాత్రమునను బాప ♦ వితతి విడచి,ప్రతిపదంబునఁ బావన♦త్వము ఘటించు
చారుతర మైన రాముని♦చరిత మింకఁ, దెలుపుమయ్య మునీశ్వర♦ తేటపడఁగ. ౯౮
తే॥ అట్లు వల్కెడి నృపు నుడు ♦ లాలకించి, పండ్లు ముప్పదిరెండుఁగ♦నృడగఁ బెల్లు
తాలువులయందుఁ బాణిని♦దవులఁజేసి,పక్కునను నవ్వెఁ గృతక తా♦పసుఁడు మీరి.
క॥ కేరెడి మునిఁగని యిందుకుఁ, గారణముం దెల్పు మదినిఁ♦గల సందియ ముం
దీరఁగ నను నృపు నుడులకుఁ, బాఱుఁడు స్మితకారణంబు ♦ వచియించె నిటుల్.

క॥ నరవర యేదెది నా ముం, దర శ్రీహరి కీర్తి మఱలఁ ♦ దగ నింకొకమా
రెరిగింపుము హరియెవ్వఁడు, హరికీర్తియనంగ నెంత ♦ యతిగఁ బొగడెదే? ౧౦౧
ఉ॥ అందఱుఁ జూడఁ గర్మవశు ♦ లందఱుఁగర్మముచేత స్వర్గమున్
గందురు పొందుదు ర్నరక ♦ కష్టముఁ గర్మముచేత నందఱున్
గందురు పుత్రపౌత్రులను ♦ గర్మముచేతను సర్వసౌఖ్యముల్
చెందెద రెప్డుఁ గర్మమునఁ ♦ జేయున దేదియు లేదు భూవరా. ౧౦౨

మ॥ శతమన్యుండు శతాధ్వరంబులను ని♦ష్ఠంజేసి యయ్యెం దివ
స్పతి, లోకేశుఁడు మించెఁ గర్మమునఁ బ్రాం♦చత్సత్యలోకేశుఁడై
కుతలంబందు మరున్మఖాధిపు లనే♦కు ల్చేసి సత్కర్మ మూ
ర్జితులై పొందరి కాదె మున్ను విబుధ♦స్త్రీ భోగ సౌఖ్యంబులన్. ౧౦౩

క॥ కావున యజ్ఞము లొనరిచి, దేవతల యజింప నీవు ♦ తివురుము నిక్కం
బీ వసుమతి నంతట నో, భూవర నీ కీర్తి వెలయుఁ ♦ బొల్పుగ ననినన్. ౧౦౪

ఆ॥ కువలయాధినేత ♦ క్రోధక్షుభితచిత్తుఁ, డగుచుఁ జెడుఫలంబు ♦ నందఁజేయు
కర్మ వార్తఁ దెల్పఁ♦గా రాకు, పురినుండి,యరుగు ముండఁ దగ ద♦టంచుఁ బల్కె.

వ॥ మఱియు నిట్లనియె.

క॥ శతమన్యుఁడు క్షయమొందును, శతధృతి క్షయమొందు నెప్డు ♦ క్షయమొందరుసూ
సతతము రామస్మరణముఁ, గుతుకంబునఁ జేయువారు ♦ కుతలమునందున్.

క॥ చూడుము బలిఁ బ్రహ్లాదుని, జూడు విభీషణుని ధ్రువుని ♦ జూడుము దాల్భ్యుం
జూడుము రుక్మాంగదనృపు, బాడబ వీరెట్టి పదవిఁ ♦ బడసిరొ కంటే.

తే॥ రామదూషకు యమభటుల్ ♦ దాళ్ళఁగట్టి, కొట్టుదురు తలపై నిన్ప♦గుదెలచేత
బ్రాహ్మణుఁడ వౌట చేత నో♦పరమ నీచ, గాత్ర దండన మొనరింపఁ♦గడగనైతి.

ఉ॥ ఇచ్చట నుండఁగా దగ విఁ♦కేగుము బాపడ యుంటివేని మే
న్పెచ్చులు నూడఁగొట్టెదను ♦ నిక్కమటంచును బల్కుచుండఁగాఁ
జెచ్చెర రాజ సేవకులు ♦ చేతుల గెంటఁగఁ బోవునంతలో
నచ్చటివార లద్భుతము ♦ నందఁగ విప్రుడు పొల్చెఁ గాలుడై. ౧౧౦

వ॥ ఇట్లు లోకైకవందితుం డగు తపననందనుండు నిజాకారంబుఁ దాల్చి యిట్లనియె.

సీ॥ సురథక్షితీశ శ్రీ♦హరిమీది నీ దృఢ,భక్తిని దెలియంగ ♦ వచ్చినాఁడ
నెటులైన నిన్ జలి♦యింపఁ జేయఁగ నెంచి, పరుషంబుగా నిట్లు ♦ పల్కినాఁడ
నిశ్చల మైన నీ ♦ నిజభక్తికిన్ జాల, మెచ్చినాఁడ వరంబు ♦ లిచ్చువాఁడ
నిట్టింటి నని మది ♦ నేవగింపక వరం,బులఁ గోరుకొనుమయ్య ♦ పుడమిరేడ

తే॥ అనుచు సంతోషిత స్వాంతుఁ♦డగుచుఁ బల్కె,దండితోన నె దయ తమ♦కుండెనేని
యనఘ శ్రీరామదర్శనం♦ బబ్బువరకుఁ జావకుండఁగ వరమిమ్ము ♦ శమన నేడు.

వ॥ ఇట్లు నుడువు సురథుం గని సమవర్తి యిట్లనియె. ౧౧౩

క॥ కోరినయట్ల యగున్ రఘు, వీరుఁడు దర్శనమొసంగి ♦ వివిధేప్సితముల్
గూరిమి నొసఁగు నటం చా, వారిజబాంధవసుతుండు ♦ స్వపురికి నరిగెన్. ౧౧౪

మ॥ హరిభక్తుండును ధర్మమూర్తియగు నా ♦ జ్యాసాయకుం డిట్లనెన్
హరిసేవారతులైన సేవకులతో ♦ నా రామచంద్రియమా
హరి బంధించితిఁ గానఁ బోరితమవ♦శ్యం బయ్యెడున్ మీరలున్
హరి మాతంగ రథాదిసేన నిపు డా♦యత్తంబుఁ గావింపుడీ. ౧౧౫

తే॥ యుద్ధకర్మవిశారదుల్ ♦ యోధవర్యు, లిట్లు భూపాలుచే నియ♦మింపఁబడుచు
సకల సేనల నపుడ స♦జ్జంబుఁజేసి, యెదురుఁ జూచుచు నుండిరి ♦ కదనమునకు.

వ॥ మహావీరు లగు రాజపుత్రులు, చంపకుండును, మోహకుండును, రిపుంజయుండును, దుర్వారుండును, ప్రతాపియు, బలమోదకుండును, హర్యక్షుండును, సహదేవుండును, భూరిదేవుండును, సుతాపనుండును నను వారలు పదుగురు మహోత్సాహవంతులై తమ తమ వాహనంబులతో యుద్ధసన్నద్ధులై యుండిరి. సురథుండును, హేమమయంబును, రత్నచిత్రితంబును మహాబలవేగ హయబద్ధం బగు శతాంగం బధిష్ఠించి సకలసైన్య పరివృతుండై రణోత్సాహంబునఁ బొదలుచుండె నంత శత్రుఘ్నుం డరుదెంచి సేవకులన్ గాంచి మన యజ్ఞాశ్వం బెచ్చట కరిగె ననిన వార లతనిం జూచి యిట్లనిరి. ౧౧౭

చ॥ నరవర యజ్ఞవాహము న♦నల్పబలుల్ భటు లెవ్వరో మముం
దరికిఁ జొరంగనీయక న♦దల్పుచు నిప్పుడ కొంచుఁ బోయి రీ
పురమున కింకముందుఁ బనిఁ ♦ బూనఁగ మీర కలా రటంచు నం
దఱుఁ బలుకంగ లక్ష్మణుని ♦ తమ్ముఁడు గోపపరీతచిత్తుఁడై. ౧౧౮

తే॥ పండ్లు పటపటఁ గొరుకుచుఁ♦బల్కె నిట్లు, నాదువాహము హరియించి♦నావె రాజ
యెచ్చటికిఁ బోయెదవుచూడు ♦ మీనిశాత,బాణముల నీదుపురిసేతు♦భస్మముగను

వ. అని పల్కి మంత్రింగాంచి యిట్లనియె. ౧౨౦

క॥ ఎవనిది యీ పుటభేదన, మెవఁ డీ పురమునకు నేత ♦ యీ మనతురగం
బెవఁడు హరించెను బెదరక, వివరింపుమనంగ సుమతి ♦ వినిచె దృఢముగాన్. ౧౨౧

క॥ కుండలనగరం బిది యిం, దుండినవాఁ డతి ప్రతాపుఁ♦డూర్జితబలుఁ డు
ద్దండుఁడు భండనమునఁ గో, దండధరుని సేవకుండు ♦ ధర్మరతుండున్. ౧౨౨

క. విరథుఁడు రిపుహరణంబునఁ, గురథుండు ప్రతాపముననను ♦ గురువిద్యల హం
సరథుం డతిరథవర్యుఁడు, సురథుం డభిధేయముననను ♦ శూరవరేణ్యా. ౧౨౩

తే॥ వాఙ్మనఃకర్మములను భా♦వని విధమునఁ,జేయుచుండును శ్రీరామ♦సేవ యెపుడు
ధర్మ కారణముననను సీ♦తని చరిత్ర,లెన్ని యో కలవవియు నా♦కెన్న వశమె. ౧౨౪

ఆ॥ అతనితో సమాను♦లతిబలాఢ్యులు భటుల్, గల రనేకు లతఁడుఁ ♦ గత్తలానిఁ
బట్టినాడ యేని ♦ భండన మగు నందు, నమిత వీరతతికి ♦ హానికల్గు. ౧౨౫

వ॥ ఇట్లు పలుకుచున్న సచివుం గాంచి శత్రుఘ్నుం డిట్లనియె. ౧౨౬

తే॥ రామచంద్రుని మఖవాజి ♦ రాజుపట్టె, నేనిమన మేమి సేయంగ ♦ నానొ చెప్పుము
కడిఁది జోదులు గల కట ♦ కము జయింప, వచ్చు నతఁడన విని మంత్రి ♦ పలికె నిట్లు.

—♦ అంగదుని రాయబారము ♦—

చ॥ నరవర దూత నొక్కని మ ♦ నఃప్రియు వక్తను బంపుమయ్య యా
ధరణిపుఁజేర నాతఁడు ర ♦ థద్విరదావళితోడఁ బోరఁగాఁ
దరలెడుఁగాక, లేక మన ♦ దార్ఢ్య మెరుంగని మాని యెవ్వఁడేఁ
హరి హరియించుటల్ దెలిసి ♦ యశ్వము రాజ్యముతోడ నిచ్చెడున్. ౧౨౮

వ॥ ఇట్లు నుడువు సుమతి నుడులు విని బుద్ధిమదగ్రగణ్యుండును బలవంతుఁడగు శత్రుఘ్నుండు వినయవినమితోత్తమాంగుం డగు నంగదుంగాంచి యిట్లనియె. ౧౨౯

క॥ లెమ్మా నీవిట కంగద, రమ్మా సురథావనీట్పు ♦ రవరంబునకున్
బొమ్మా నేఁ జెప్పిన నుడు, లమ్మానవనాథు తోడ ♦ ననువుగఁ జెపుమా. ౧౩౦

సీ॥ రావణు లోకవి ♦ ద్రావణుశిరముల, రాల్చినవాఁడు మా ♦ రాముఁ డనుము
చేలమై యాతని ♦ వీతిఁ బట్టితి నీకు, రూఢిగ నికఁ జేటు ♦ మూడె ననుము
తెలిసియో నీమతి ♦ తెలియకయో చేసి, తివిపుడైనను నీవు ♦ దెలియు మనుము
సకలరాజ్యంబుతో ♦ సప్తిని వేగఁ దె, ప్పించి భక్తిని సమ ♦ ర్పింపు మనుము

తే॥ కొన్ని ప్రొద్దులు మనఁ గోరు ♦ కొనుము యనుము
భక్తుఁడ వటంచు నిటు చెప్ప ♦ వలసె ననుము
తెలివిచే మంచి చెడ్డలఁ ♦ దెలియు మనుము
వీర వాలితనూజ వే ♦ వేగఁ జనుము. ౧౩౧

క॥ ఆనాఁడు రాఘవేశ్వర, భూనాయకు దాత్యమునను ♦ బొందితివి యశం
బీనాఁడు చేసి దాత్యం, బో నాకేత్పాత్రి కీర్తి ♦ నొందుము మఱలన్. ౧౩౨

వ॥ అనుటయు నంగదుండు వల్లెయని తదాజ్ఞను బడసి వీరసేవితం బగు సభామధ్యంబునఁ దులసీదళాభిరాముండును ననవరత రసనాగ్రనర్తిత రామ నాముండును నగు సురథుఁ జేరం జనునంత నాతండును మనోహరాకారుం డగు వానరుం గాంచి శత్రుఘ్నుని దూతగా నెఱింగి యిట్లనియె. ౧౩౩

ఉ॥ వానరపుంగవా యిటకు ♦ వచ్చిన కారణ మిప్పు డంతయున్
మానుగఁ దెల్పు నాకు ననుమా ♦ నము లేదది చక్కఁ జేతు నం
చా నరనాయకుం డనఁగ ♦ నంగదుఁ డద్భుతమొంది రామసే
వానిరతున్ బవిత్రుని గృ ♦ పామతి భూపుని జూచి యిట్లనెన్. ౧౩౪

స్రగ్విణి॥ వానరాధీశుఁడన్ ♦ వాలిపుత్రుండ నేన్
మానవాధీశ స♦మ్మాననీయుండ రా
మానుజన్ముండ న♦న్నంపఁగా నీ సమీ
పానకు న్వచ్చితో ♦ పార్థివాగ్రేసరా. ౧౩౫

ఉ॥ ఓ వసుధేశ నీదు భటుఁ ♦ డొక్కఁడు గొందఱఁ గూడి జన్నపు
మ్మావు హరించె బేలయయి ♦ మమ్ము నెరుంగమిఁ బుత్రరాజ్య స
చ్ఛ్రీవిభవంబుతో హయము ♦ శీఘ్రమ దెచ్చి సుమిత్రి పట్టికిన్
గావుమటంచు మ్రొక్కి కుతు♦కంబున నర్పణ మీవు సేయుమా. ౧౩౬

తే॥ అట్లుకాదేని శత్రుఘ్ను♦ నంపగములు, చెక్కలుగఁ జేయ నీ మేను ♦ శిరములేక
తన్మతలంబున నొక యలం♦కారమగుచు,నీవు శయనించెదవుసుమ్ము♦నిక్కమిదియ.

ఆ॥ ఎప్పుడైన భూప ♦ యెఱిగితివే రామ, చంద్ర బాహుబలము ♦ క్షణములోన
రావణాది క్రూర♦రాక్షసులను జంపె,నతని హయముఁగొంచు ♦ బ్రతుకఁగలవె.

క॥ అన విని యనె సురథుఁడు నీ, వనినది నిక్కంబకాని ♦ యనృతముఁగా దో
వనచరశేఖర మైనను, వినుమా! నా నుడువొకండు ♦ విశదముఁగాఁగన్. ౧౩౭

సీ॥ ముందుగా మీరామ♦మూర్తి హయంబు నే, బంధించినాఁడ ని♦ర్భయుఁడ నగుచుఁ
బిదపను శత్రుఘ్ను ♦ భీతిచే దాని స, మర్పింప నెట్లోర్తు ♦ నయ్య చెపుమ
రాముఁడు వచ్చి ద♦ర్శన మిచ్చెనేని నా, కప్పుడు యజ్ఞవా♦హంబకాదు
ధనధాన్య వస్తు వా♦హన పుత్ర మిత్ర బ, లాదులతో రాజ్య ♦ మర్పణంబు

తే॥ సేతు క్షత్రియులకు నని♦ సేయ ధర్మ, మగును దన స్వామితోడను ♦ బగ వహించి
కాన శ్రీరామదర్శనా♦కాంక్షఁ జేతు, యుద్ధ మే నోపు కొలదిని ♦ సిద్ధ మిదియ.

తే॥ రాముఁడే దర్శనం బీయ ♦ రాకయున్న, శత్రుసూదనుఁ డాదిగా ♦ సకల యోధ
వీరవరుల జయించి నా ♦ వీర్యమెసఁగ, మద్గృహంబున బంధింతు ♦ మఱ్ఱకేంద్ర.

వ॥ ఇట్లు పలుకుచున్న సురథుం గని పక్కున నవ్వి యంగదుండు మహాధైర్యంబున
నిట్లనియె. ౧౪౦

సీ॥ వృద్ధుఁడ వగుటచే ♦ బుద్ధిహీనుండవై, శత్రుఘ్ను నీ లీలఁ ♦ జాలఁదూల
నాడితి వక్కటా ♦ యాతని బల మిసు,మంతయైన నెరుంగ♦వైతి వహహ
మాంధాతృభూమిపు♦మడియఁ జేసిన లవ,ణాసురు నవలీల♦నడఁచె మఱియుఁ
దునిమె విద్యున్మాలి♦యనుఁ గామచరదైత్యుఁ, జంపె సంఖ్యమున న♦సంఖ్యరిపుల

తే॥ రుద్రగణముల నా వీర♦భద్రు నొక్క, కడకుఁ దెచ్చిన మేటి పు♦ష్కలుఁడెవండొ
యెరసినాఁడవె యాతని ♦ యన్నకొడుకు, నఖిల శస్త్రాస్త్రవిదుఁ డతఁ♦డతిబలుండు.

క॥ ఖ్యాతిని బలమున సిరిచే, నాతని కీడైన వాని ♦ నరసి యొకని నీ
భూతలమునఁ జూపించెదె, వాతికి వచ్చినటులెల్లఁ ♦ బలుకఁగ వచ్చున్. ౧౮౪

అంబురుహము॥ రావణ నందను నక్షుని ద్రుంచెను ♦ రక్కసుల్ భయమొంద నా
రావణు లంకను బూదిగఁ జేసె సు ♦ రల్ప్రమోదము నొందగాన్
భూవర యింక ననేకముఁ జేసెను ♦ బుద్ధి నీవ యెరుంగు దా
పావని మా లవణాంతకు చెంతను ♦ బంట టంచు నెరుంగుదే. ౧౮౫

ఆ॥ సురలతోడ ద్రోణ♦గిరిఁ దోఁకతోఁ జుట్టి, తెచ్చి మృతుల భటులఁ ♦ దేర్చినట్టి
యాంజనేయ చరిత ♦ మఖిలంబు శ్రీరాముఁ, డే యెరుంగు మూఢుఁ♦డే మెరుంగు.

క॥ ఖ్యాతిని వినియును మును నీ, వాతని మరచితివి భాను♦జాదులు గడకన్
భూతలమును మ్రింగెడి వా, రేతన్మాత్రులుగ వారి ♦ నెంచితె భూపా. ౧౮౬

వ॥ మఱియు వినుము కుశధ్వజుండును సమదాఖిలారితాపుండగు రిపుతాపుండును బ్రతాపవదగ్రగణ్యుం డగు ప్రతాపాగ్ర్యుండును బాహుబలాధఃకృత బాహుతే యుండగు సుబాహుండును పరిహృతశాత్రవమదుండగు సుమదుండును నతిబలుం డగు విమలుండును శ్రీరామసేవనారతుం డగు సత్యవంతుండును నిఖిలవీరముకుట మణిరుగ్నిరాజితపదకమలుం డగు వీరమణి నృపాలుండును మొదలగు ననేకయోధులు శత్రుఘ్నుని సేవింపుచున్నవారలు, నృపవీరపయః పారావారంబున మశకతుల్యుండ వగు నీవా శత్రుమథను బంధించుట నోటఁ బల్క వచ్చుఁగాని పల్కినట్లు సేయుట దుర్ఘటం బిదంతయు బుద్ధిం బరికించి పుత్రమిత్ర బలసంపన్నం బగు రాజ్యంబుతో నశ్వంబు సమర్పించి శత్రుఘ్నుమైత్రివడసి యార్తత్రాణపరాయణుం డగు శ్రీరాముని దర్శించి కృతార్థుండ వగుమని యనేక విధంబులఁ బలుకుచున్న యంగదుంగాంచి సురథుం డిట్లనియె. ౧౮౭

తే॥ నీవు దెల్పినయట్టి యీ ♦ నిఖిలయోధు, లెవ్వరును నా మనస్సున ♦ కెక్క రంజ
నీకుమారుండు బలముచే ♦ నాకు జోడు, గాఁడు, దెల్పెద నందుకుఁ♦గారణంబు.

క॥ హనుమంతుఁడు శ్రీరాముని, వెనుకనిడుక యాగసప్తి ♦ వెంటను వచ్చెన్
మనమున వాక్కునఁ గర్మం, బున ననవరతంబు రాముఁ♦బూజింతుఁగడున్. ౧౯౦

ఆ॥ అందువలన రాముఁ ♦ డనయంబు శుభదర్శ, నం బొసంగుచుండు ♦ నాకు మీఁరు
భక్తులైన నన్ను♦బంధించి విజయంబు, గొందుగాక హరిని ♦ గొందుగాక.

క॥ చనుమా యంగద నేఁ జెప్పినదంతయు నృపునితోడ ♦ వినిపింపుచు నా
తని దోడితెమ్ము కార్యం, బనువెరిఁగి యొనర్చు నీ ర♦ణాంగణ మందున్. ౧౯౨

క॥ అనుమాటలు విని నవ్వుచుఁ, జని వీరుం డంగదుండు ♦ శత్రుఘ్నునకున్
వినిపించె సురథభూపతి, తనతో ననినట్టి నుడులు ♦ తప్పక వరుసన్. ౧౯౩

—♦ పుష్కలాదులు చంపకాదులతో ద్వంద్వయుద్ధం బొనర్చుట. ♦—

క॥ సురథో క్తములగు నుడువులు, భరతాత్మభవాదివీర♦భటు లంగదుచే
నరుదుగ విని రథ,వారణ హరుల నధిష్ఠించి సిద్ధు♦లై రని కనఘా. ౧౫౪

తే॥ భేరికానాదములు పట♦హారవములు, వీరగర్జనములు గరి♦బృంహితములు
స్యందనధ్వానములు బ్రపం♦చంబు నిండి, తివిరి పట్టక భేదించి ♦ దివము సొచ్చె.

క॥ ఆయోధన కోవిదు లగు, నా యోధుల సింహనాద ♦ మలముచు భీతిన్
జేయన్ గాతరులకు నృపు, డా యోధనమునకు నడచె ♦ నాత్మజతతితోన్. ౧౫౬

వ॥ ఇట్లు సురథుండు రథ గజ హయ పదాతిసైన్యంబుతోఁ బుడమి పిక్కటిల నడుచుచు సాగరంబు తరంగంబులచే ద్వీపంబు ముంచువిధంబున స్వసైన్యంబు దఱియం జూచి శత్రుఘ్నుండు మంత్రిం గాంచి యిట్లనియె. ౧౫౭

మ॥ కనుఁగొంటే సుమతీ జయధ్వనులు శం♦ఖారావము ల్మ్రోఁగఁగాఁ
జనుదెంచెన్ సురథక్షితీశుఁడు మహా♦సైన్యంబుతోఁ బోరఁగా
మనమి ప్డేమి యొనర్పఁగా వలయు ధీ♦మంతుండ వీ వన్నిటన్
వినిపింపందగు నంచుఁ బల్కు నృపతి ♦ వీక్షించి తా నిట్లనెన్. ౧౫౮

సీ॥ వివిధ శస్త్రాస్త్రకో♦విదులు యుద్ధవిశార,దులు నైన పుష్కలా♦దులను బోరఁ
బంపుము సురథుతో ♦ నవరం బొనర్చు న,త్యంతశౌర్యుఁడు హను♦మంతుఁ డెలమి
నంచు మంత్రి వచించు♦నంతలో నృపతనూ, జాతులు పదుగురు ♦ చంపకాదు
లమితబలుల్ ధను♦ర్జ్యావల్లి మ్రోయించు, చాయోధనస్థలి ♦ కరుగుదెంచు

తే॥ వారిఁగన్గొని తీక్ష్ణకృ♦పాణ బాణ,పాణులై రిపుతాపను♦బాహుపుష్క
లాదియోధులు రథములం ♦ దధివసించి, యేగి రోహరిసాహరి ♦ నెదురుగాగ.

వ॥ అందుఁ బరమాస్త్రవిదుండగు పుష్కలుండు ద్వైరథుండును మహావీరుండగు చంపకునితోడను జనకరాజపుత్రుం డగు కుశధ్వజుండు మోహకునితోడను రిపుంజయుండు విమలుతోడను సుబాహుండు దుర్వారునితోడను బ్రతాపితోఁ బ్రతాపాగ్ర్యుండును బలమోదనుతో నంగదుండును హర్యక్షునితోడ నీలమణియు సహదేవునితో సత్యవంతుండును భూరిదేవునితో వీరమణి క్షితీశుండును బోరుచుండిరి.

క॥ అందఱు కదనవిశారదు, లందఱు శస్త్రాస్త్రకుశలు ♦ లందఱు బాహా
స్పందబలాఢ్యులు వీర్యా, రందఱు తీక్ష్ణముగఁ బోరి ♦ రన్నిఁట సములై. ౧౬౧

వ॥ అందుఁ బుష్కలుండు చంపకునితో నిట్లనియె. ౧౬౨

చ॥ నరవర పుత్రి నీదు శుభ♦నామ మెఱుంగఁగఁ దెల్పుమయ్య సం
గరమును జేయ వచ్చితివి♦గా కడు ధన్యుఁడవైతి విప్ర డెం
దరిగెద వింక నీ ధరణి♦యందున నెట్టు మనంగలాడ వే
భరతసుతుండ రమ్ము బహు♦బాహుబలాఢ్యుఁడ వంచు వింటినేన్. ౧౬౩

వ॥ ఇట్లు పల్కుచున్న పుష్కలుం గాంచి బలశాలి యగు నృపాలాత్మజుం డిట్లనియె.

తే॥ కదనమును జేయఁగావలెఁ ♦ గాని నాదు, కులముతోడను బేరుతో♦గలుగు లాభ
మేమి కలదైనఁ జెప్పెద ♦ నెఱుక పడఁగ, నడిగితివి కాన నేఁ జెప్ప ♦ ననుట తగవె.

తే॥ తల్లి రాముఁడు, రాముఁడే♦ తండ్రి నాకు, రాముఁడే మేటి చుట్టంబు♦రాఘవుండు
స్వజన మా రామచంద్రి సే♦వకుఁడ నెపుడు, రామదాసుడె నా పేరు ♦ రాజతనయ.

క॥ రాముఁడు భక్తకృపాళుఁడు, రాముడె జయమిచ్చు నాకు ♦ రణమందున నీ
పామర జనములు నుడివెడి, నామము వినిపింతు వినుము ♦ నరనాథసుతా. ౧౬౭

సీ॥ సురథభూపాలుని ♦ సుతుఁడను నారీమ, తల్లి వీరవతియే ♦ తల్లి నాకు
శోభావహావసంత ♦ శుభకాలమున మీకుఁ, బేర్చి శోభనములఁ♦గూర్చు నెద్ది
మధువిమోహితులైన ♦ మధుపాయు లెప్పుడుఁ, గడు భీతిచే దేని ♦ గంటఁగనరు
మేల్కడానిని జిగి ♦ మేలమాడుచు లింగ, ధారణం బొనరించి ♦ తనరు నెద్ది,

తే॥ అదియ నానామమఖిలమో♦హనము సూవె, కలహమొనరింపు మోపిన♦కొలది బవర
మందు నన్ను జయించువాఁ♦డవనిఁ గలఁడె, కాంచు మస్మత్తమగు పరా♦క్రమము నేడు.

క॥ అన విని పుష్కలుఁ డెంతయు, మనమున సంతసమునంది ♦ మాయు రెయీా రా
ట్తనయుఁడు దుర్జయుఁ డనుచును, నవల సదృశతీక్ష్ణశరము♦ లతిముఱిఁ గప్పెన్.

వ॥ అంత. ౧౭౦

క॥ సౌరథపార్వృణ్మేఘము, భారతి ఘన పర్వతంబు ♦ పై నెడ తెగకన్
ఘోరున వర్షించె శరా, సారము తరుచుగను దరులు ♦ జడత వహింపన్. ౧౭౧

వ॥ ఇట్లు స్వనామ చిహ్నితంబులును స్వర్ణమయ పుంఖ విరాజితంబులును నగు నిశిత
శరంబులన్ జిక్కువఱుపఁ బుష్కలుం డత్యంత క్రోధంబునం దచ్ఛరంబులం
దునిమి తెరపిసేయుటం గని సహింపక చంపకుండు. ౧౭౨

చ॥ మది భయమొంది పారెదు సు♦మా భరతాత్మజ యంచుఁ బూన్కిచేఁ
బదిబలు వాడి తూపులను ♦ వక్షముఁ గాడఁగ నేయ వేగ నా
పరిదరము లేగి రొమ్మున జో♦రంబడి తద్రుధిరంబుఁ దాగివె భా
స్వదతిఖరోస్రితప్తులగు ♦ వారలు నీరము దాగివు చాడ్పునన్. ౧౭౩

క॥ ఆ శిత శిలీముఖంబుల, గాసిని బడి పుష్కలుండు ♦ గనలుచు నెద నా
వాసవు వజ్రము కెన యగు, భాసుర శరపంచకమును ♦ బరపె నతనిపై. ౧౭౪

క॥ చంపకుఁ డది గని మెరుగా, రంపగముల వానిఁ దునిమి ♦ యాతఁడు మఱి నూ
రంపఱ లంపిన వానిని, బొంపిరి సురథాత్మజుండుఁ ♦ బొడిపొడిఁ జేసెన్. ౧౭౫

వ॥ అంత సౌరథక్షిప్త శర పరంపరలఁ బుష్కలుం డట్లసేయ నుభయ వీర శిలీముఖ శకలంబులచే నాకాశంబు నిరవకాశంబై యుండె నప్పుడు. ౧౭౬

మ॥ సురథక్ష్మాపతి పుత్రుఁ డాతని మహా♦క్షుద్ర ప్రభావంబు గాం
చి రహింజెంది సహస్రబాణముల వే ♦ భేదింపఁ దద్వక్షముం
బరపెన్ బుష్కలుఁ డా పృషత్కములఁ దా ♦ వమ్మై చనన్ జేయఁగా
ఖరబాణాయుత మా నృపాత్మజుఁడు వీఁ♦క న్వింట సంధింపఁగాన్. ౧౭౭

సీ॥ ఆ శరంబులఁ బర♦మాస్త్ర విదుండగు, భారతి తునకలై ♦ పడఁగఁ జేసి
మిక్కిలి కుపితుఁడై ♦ యొక్క మొగిం బాణ, వృష్టిని గురిపింప ♦ నృపసుతుండు
పొగడి మేల్మేలని ♦ పుష్కలు బలువాడి, కోలలచేఁ బిట్టు ♦ డీలువఱుప
నితఁడు మహావీర్య♦యుతుఁడని యెంచి బ్రహ్మాస్త్రంబు నారియం♦దమరఁగూర్చెన్

తే॥ పరప భూమ్యంతరిక్ష వి♦వరము దిక్కు, లెల్ల మంటలచేఁ గప్పి ♦ యెలమి విశ్వ
మును లయంబొనరింపఁగ♦ఁబొలయుఁదాని,నడఁపనయ్యస్త్రమేసె నృ♦పాత్మజుండు.

క॥ ఆరెంటి తేజముల్ గని, నీ రా లోకంబులనుచు ♦ నెఱిఁదలఁప జనుల్
పోరెన్ క్షణమాత్రము చ, ల్లారెన్ రెండొక్కరూప ♦ మందె మునీంద్రా. ౧౭౯

తే॥ అట్టి చిత్రంబుఁ గని భర♦తాత్మజుండు, భూపసుత నిల్వుమంచు న♦మోఘశాత
బాణములుచంపకుని మీఁదఁ♦బఱప నాతఁ,డా శరంబుల గణియింప♦కాగ్రహమున.

క॥ దారుణమగు రామాస్త్రము, భారతిపైఁ బరప నతఁడు ♦ బరికించి వెసన్
ఘోరశరంబునఁ దత్పరి, హారముఁ గను నంత దచ్ఛ♦రాహతుఁ డయ్యెన్. ౧౮౧

ఆ॥ మూర్ఛమునిగియున్న ♦ పుష్కలు బంధించి, స్యందనంబునందు ♦ సరగఁ జేర్చి
చంపకుండు తనదు ♦ స్థానీయమున కేగ, స్వాంతమందుఁ దలఁచు ♦ నంతలోన.

క॥ హాహాకారము లెసఁగెను, మోహంబునఁ బరువు లిడఁగ ♦ మొదలిడిరి భటుల్
వ్యూహంబు చెడుటఁ గని యనె, బాహాబలశాలి నృపుఁడు♦పావనితోడన్. ౧౮౩

ఉ॥ చాలినవాఁ డెవండు మన ♦ చండబలాధిక శూరసైన్యముల్
గూలఁగఁ జేయ నేడు రణ♦కోవిద తెల్పుమటన్నఁ బల్కె వా
తూలసుతుండు భూపతిసు♦తుండు బలాఢ్యుఁడు చంపకుండునే
డాలమునందుఁ గట్టి లవ♦ణాంతక పుష్కలుఁగొంచుఁ బోయెడిన్. ౧౮౪

క॥ అని వొరిగించిన యాపా, వనిమాటల కాగ్రహమున ♦ వరలుచును మరు
త్తనయునితో ననెరిపుసూ, దనుఁ డరి కడనుంచి తెమ్ము♦తనయు నటంచున్.

సీ॥ అనుమాటలకుఁ బవ♦నాత్మజు డంగీక, రించి పుష్కలుఁ గొన♦నెంచి మదిని
వచ్చుచుండెడివానిఁ ♦ బరికించి చంపకుఁ,డతిశిత బాణ స♦హస్రములను
బఱప నా శరముల ♦ నురుము సేయుటఁ గాంచి, చంపకుఁ డెదలోనఁ♦జాలఁగినిసి
మఱియు నన్నియు దీక్ష్ణ ♦ శరముల వర్షింపఁ, బావనికరములఁ♦ బట్టి వానిఁ

తే॥ బొడి పొడిగఁ జేసి సాలంబుఁ♦గడిమి మెరయఁ, బెల్లగించి నృపాత్మజు♦విసరివైవ
నాతఁ డదిగని నవ్వుగింజ ♦ లంతలేసి, ముక్కలుగఁ జేయఁ బావని♦యుక్కుమిగిలి.

క॥ కరినొక్కటి యా చంపకు, శిరమునఁ బడనేయ నొక్క ♦ చిలుకున దానిన్
ధరణిం బడనేసిన నది, గిరగిరఁ దిరుగుచును ద్రెళ్ళె ♦ గీపెట్టుచొగిన్. ౧౮౭

మ॥ శిలలన్ బెల్లుగ వాయుజుం డతనిపైఁ ♦ జిమ్మంగ రాట్సూనుఁ డా
శిలలన్ జేసెను బాణయంత్రిక మహా♦చిత్రంబుగాఁ జూర్ణ మా
శిల లల్లాటను గాంచి పావని క్రుధా ♦ చిత్తాబ్జుఁడై చంపకున్
బలుఁడీతం డని మీఁది కేగి బలిమిన్ ♦ బట్టె న్భటుల్ బెళ్కురన్. ౧౮౮

వ॥ ఇట్లు కరంబులం బట్టి గగనంబున కేగునంత నా పుడమిరేని పట్టి యిట్టటు పెనఁగి యప్పట్టుఁ దప్పించుకొని బిట్టెగసి చదలు పట్టున న్గాడ్పు పట్టిం బట్టి యూచియూచి యక్కున న్బిడికిటం బిట్టు వొడిచిన హనుమంతుండు గినిసి. ౧౮౯

తే॥ రెండుచేతుల నాతని♦ రెండుఁగాళ్ళు, నిండు బలిమిని బట్టి తా♦నింగి కెగసి
దివిజులెల్లరు మాన్పడఁ ♦ ద్రిప్పి త్రిప్పి, బెండువడి నేలఁబడునట్టు ♦ విసరివైచె.

క॥ నేలం బడ కాతం డవ,లీలన్ గగనమున కెగసి ♦ లీల నతని లాం
గూలంబు పట్టి త్రిప్పఁగ, గాలి కొడుకు విస్మయంబుఁ ♦ గడుఁ జెందె మదిన్. ౧౯౧

తే. మఱలఁ గడకాళ్ళఁబట్టి ప♦ల్మారు త్రిప్పి,త్రిప్పి యేనుంగుమీఁదను ♦ దివిరివైవఁ
బుడమిరేని సుతుండుఁ బె♦న్మూర్ఛ మునిఁగి, లావుసెడి జన్యభూమి న♦లంకరించె.

వ॥ అప్పుడు. ౧౯౩

తే. దాశరథిసేన సింహనా♦దములు మీఱె, వారి సైన్యంబు హాహార♦వములఁ బాఱె
నమరులమనంబులనువిస్మ♦యంబుఁగూరెఁ, గపియుఁబుష్కలుఁగొంచురా♦ఘవునిఁజేరె.

—♦ హనుమంతుడు సురథునితోఁ బోరి రామాస్త్రబద్ధుండగుట. ♦—

సీ॥ మూర్ఛనొందిన తన ♦ పుత్రుని జంపకు, సురథక్షితీశుండు ♦ జూచి వెలుచ
దుఃఖభారమునఁ గుం♦దుచు రథారూఢుఁడై, కరముల శరకార్ము♦కములు బొదల

క్రోధ సంరక్తాంబ♦కుం డౌచు నార్పులఁ, బుచ్చుచుఁ బిలిచెడి ♦ పుడమిఱేనిఁ
గని మహావీరులఁ ♦ గణియింప కెదురుగఁ, బావనిరా నిట్టు♦పలికె నృపుఁడు

తే॥ రక్కసుని వీట మున్ను శ్రీ♦రాఘవునకు, గొప్ప యుపకృతిఁజేసి పే♦ర్గొన్న వాఁడ
వతిబలుండవు రామపా♦దాబ్జసేన, నారతుండవు నీవు స♦మీరతనయ. ౧౯౫

క॥ ధన్యుండవు వానర ముఖ్యా, ధన్యుండవు జనకరాజ♦తనయావరస
మ్మాన్యుండవు చేసితి సా, మాన్యుండవె మత్సుతుండు ♦ మయి మఱపుఁగొనన్.

తే॥ నా ప్రతాపంబుఁ గనుము వా♦నరవరేణ్య, యిప్పుడెల్లరుఁ గనుచుండ♦ నెలమిఁబట్టి
కట్టి నిను గొంచుఁబోదు న♦గరమునకిఁక, జాగ్రతగ నుండు మిదియని♦జమ్ముసుమ్ము.

వ. అని పల్కు సురథక్షితీశ్వరుని మాటలు విని ధీరుండగు హనుమంతుండు మేఘ
గంభీర భాషణంబుల నిట్లనియె. ౧౯౮

ఉ॥ ఎప్పుడు రామనామము స్మ♦రించెడి భక్తుఁడ వౌదు నీవు మే
మెప్పుడు రాఘవేశ్వరు భ♦జించెడి వారల మౌదు మీవు నన్
జెప్పినరీతి బద్ధునిగఁ♦ జేయుము చేసితి వేని మత్ప్రభుం
డప్పుడ వచ్చి చూడుము ద♦యన్ గని బంధవిముక్తుఁ జేయఁడే. ౧౯౯

తే॥ స్వాంతమునఁ దలచినయది ♦ సత్యముగను, జేయు మో వీర రాముని♦జిత్తమందు
భక్తితోడను స్మరియించు♦వారు నిఖిల, దుఃఖములఁ బాయఁగలరనె♦దొల్లిశ్రుతులు.

ఆ॥ పవనతనయుఁ డిట్లు ♦ పలుకుట కెంతయు, భూమినాథుఁ డతనిఁ ♦ బొగడి పదును
వెట్టినట్టి నిశిత♦విశిఖము ల్పెక్కిటిఁ, బఱపి చాల బాధ♦వడఁగఁ జేసె. ౨౦౧

సీ॥ నెత్తురు మేనున ♦ నెగడంగఁజేయు నా, శరములఁ బావని ♦ సరకుఁ గొనక
సజ్జమై శితబాణ♦సంయుతమై యొప్పు, నుర్వీశు విల్లుఁజే నొడిసిపట్టి
ఫెల్లున విరచి యా♦వీరుల నఖములఁ, జీల్చుచుఁ జీత్కృతిఁ ♦ జెదరఁజేయ
నదిచూచి సురథుఁడి♦ష్వాసంబు నొక్కటిఁ, బూని గుణంబునఁ ♦ బూన్చునంత

తే॥ నదియు ఖండించె హనుమంతుఁ♦ డాగ్రహమున
సురథుఁ డింకొక ధనువున ♦ శరముఁగూర్ప
దాని విరచెను బావని ♦ తక్షణమున
నిట్లు కపి తుంచె విండ్లుఁ దా ♦ నెనుబదింటి. ౨౦౨

వ॥ ఇట్లు కరువలిపట్టి పెచ్చురేగి విచ్చలవిడి విండ్లు దునుకలు సేయుచు భటుల గుండె
లదరఁ బెడబొబ్బ లిడుచుఁ దను లెక్కసేయకఁ దిరుగుటకుఁ గుతలనేత యతికుపి
తుండై. ౨౦౩

క॥ ఓగి వనేచర యిదె నీ, బీరమడఁతు నంచు శక్తి♦విడువ నతఁడు దో
స్సార మెడలి యా హతిచే, ధారుణిఁబడి యపుడలేచి ♦ తద్దయుఁ గడఁకన్. ౨౦౪

క. బిర బిర రథమున్ గొని యం,బరమునకును వాతసూతి ♦ పరవగఁ గని యా
సురథక్షితిపతి కుృధచేఁ, బరిఘుంబుల నెంత రొమ్ముఁ ♦ బగల నడిచినన్. ౨౦౫

ఆ॥ వాని సరకుఁగొనక ♦ పవమాన తనయుండు, తేరు పెక్కుసార్లు ♦ త్రిప్పి త్రిప్పి
పారవైవ విసరి ♦ పడి నుగ్గు నుగ్గయ్యెఁ, దప్ప నురికె మున్న ♦ ధరణివిభుఁడు.

ఉ॥ వేరొక తేరు నెక్కి నృప♦వీరుఁడుఁ దాఁ గపివీరుఁజేర సా
మీరియు వాహసారథి స♦మేతముగాఁగ రథంబుఁ దోకచే
నేరుపుమీరఁ జుట్టి వడి ♦ నేలపయిం బడఁగొట్టి రూపరన్
గేరుచుఁ జేయ రేఁడు బరి♦కించి మఱొక్క రథంబుఁ గూర్చుచున్. ౨౦౭

ఆ. వచ్చునంతఁ జూచి ♦పావని యా తేరుఁ, గరయుగంబుచేతఁ ♦ గడగిపట్టి
నురిమివేయఁజూచి ♦ సురథుఁడు వేరొక్క, యరదమెక్కి రాగ ♦ నడఁచె దాని.

వ॥ ఇట్లంజనీసుతుండు తురంగ ధ్వజ పతాక సారథులతో నేకోత్తర శతశతాంగంబుల రూపఱంజేయఁజూచి సురథుండు విస్మయ క్రోధంబులు మనంబునం బొదలఁ బ్రిభంజన నందను నీక్షించి యిట్లనియె. ౨౦౯

చ. హరికులవర్య యీ విధి మ♦హత్తర కృత్యము సేయు నేటి యొ
క్కరుఁ డిల లేఁడు ధన్యుఁడవుఁ ♦ గాని మదీయ శరాసనంబునన్
శరమునుఁ గూర్చునంతకును ♦ సైపు మొక క్షణమాత్రి మాత్రత
త్పరవరరామచంద్రిపద♦పంకజ షట్పదుఁ గాఁగఁజేతు నిన్. ౨౧౦

తే॥ ఇట్లనుచు వింటనారి బి♦గించి కట్టి, బిట్టు పాశుపతాస్త్రంబు ♦ విడువ భూత
ప్రేత భేతాళ యోగినుల్♦వెడలి పెలుచ, భీతిఁగొల్పుచు బంధించె ♦ వాతసూతి.

తే॥ బద్ధుఁడైనట్టి పవనసం♦భవుని జూచి, జనము హాహారవంబులు ♦ సలుపుచుండు
నంతలో రామునిస్మరించి♦స్వాంతమందుఁ, ద్రెంచెఁగపిబంధములఁబటా♦పంచలుగను.

సీ॥ బంధవిముక్తుఁడై ♦ బవరంబు సేయఁగ, నరుదెంచు వీరుని ♦ నక్షహంతృ
వీక్షించి పరమాస్త్ర♦విదుఁడగు సురథుండు, వేనిచే వధ్యుఁడు వీఁడుగాఁడ
టంచు బ్రహ్మాస్త్రంబు ♦ ననుప నవ్వుచు నాతఁ,డా యస్త్రమును జేత♦నడఁచిపట్టి
విరుచుటఁ గని రేఁడు ♦ విస్మయంబును జెంది, దశరథరాముని ♦ దలచి మదిని

తే॥ వింట రామాస్త్రమును జేర్చి ♦ పేర్చి నీవు, గట్టిగా దీనిచేతను ♦ గట్టువడుదు
వడచి పడకు మటంచది♦విడుచునంతఁ, గూలె శ్రీరామ యంచు నా♦గాలికొడుకు.

వ॥ ఇట్లు వివశుండై పుడమిం బడి సురథుం గాంచి యిట్లనియె. ౨౧౪

మ॥ వసుధానాయక యేమి సేయుదును నా♦స్వామ్యస్త్రపాతంబునన్
వసుధన్ గూల్చితి వన్యశస్త్రములు న♦న్బాధించునే నీదుకై
వసమైతిన్ ననుఁగొంచుఁ బొమ్ము రఘుభూ♦పాలుండు వే వచ్చియా
రసి యీ బంధములన్ గృపారసము మీ♦రన్ బుచ్చి కాపాడడే. ౨౦౫

—♦ పుష్కలశత్రుఘ్నులు మూర్ఛనొందుట. ♦—

క॥ ఈ రీతి బద్ధుఁడగు స్వామీరింగని పుష్కలుండు ♦ మీరిన క్రుధచే
ధారుణిపతి కెదురై చన, ఘోరశరము లెనిమిదింటఁ ♦ గూర్చి ధనువునన్. ౨౦౬.

క॥ సురథుఁడు భరతాత్మజు పే, రురము నగులఁ బరప వాని ♦ నోరిచి యాతం
డురు శరసాహస్రింబులుఁ, బరపి మనుజపతిని బడలు♦వడఁగాఁజేసెన్. ౨౦౭

క॥ సురథుని శరముల భారతి, భరతాత్మజు బాణములను ♦ వసుధాపతియున్
నుఱుమాడుచు నొక మూర్తముఁ, బురుడుగ వారేపు మిగిలి ♦ పోరి రిరువురున్.

తే॥ ఇరువురి పృషత్కముల జగం ♦ బించుకంత
సందులేకుండ నిండె నో ♦ సంయమీంద్ర
యిరువురి రణోద్యమముఁగాంచి ♦ యిందునందుఁ
గలుగు యోధాళి మోహాసఁ ♦ గదలకుండె. ౨౦౯

వ॥ ఇట్లు వీరరోమహర్షణం బగు తుములాయోధనంబున సురథుండు మహోగ్రుండై.

ఆ॥ వాడి కల్గు ముల్కి ♦ వడి నొక్క టేయఁగ, వాడి కల్గు ముల్కిఁ ♦ బరపి దాని
నడఁపఁదలఁచునంత ♦ నదిరొమ్మునననుగాడఁ, బుష్కలుండుగూలె♦మూర్ఛనొంది.

క॥ భారతిపడుటకు మది రు, ద్భారము వహియించి లవణ♦వైరి బిఱాన్
తేరుపయినెక్కి చని యా, జ్యారమణుని జేరి యిట్టు♦లనియె మునీంద్రా. ౨౧౧

శా॥ వీరాగ్రేసరుఁడౌ ప్రభంజనసుతున్ ♦ విశ్వంభరాధీశ నీ
వీ రీతిన్ గడుబద్ధుఁ జేసితివి మే♦లీ శూరుఁడౌ పుష్కలున్
బోర న్మూర్ఛ మునుంగఁ జేసితి బలే ♦ పోకార్చి తీ బంట్ల మ
జ్జారే గొప్పపనుల్ బొనర్చితివి మ♦త్సామర్థ్యముం జూడుమా. ౨౧౩

చ॥ కదనమునందు మద్భటులఁ ♦ గారియవెట్టితి వెందుఁ బోయెదో
కదలక యుండు మస్మదురు♦కాండములన్ సహియింపు మంచు బల్
పదరుచుఁ బల్కునట్టి రిపు♦భంజనుఁ గన్గొని రామచంద్ర స
త్పదవనజంబుల న్మదినిఁ ♦ దాల్చి యనెన్ సురథుండు గిన్కతోన్. ౨౧౪

క॥ రామానుజ చూచితివే, యీ మారుతి ముఖ్యవీరు ♦ లేమయిరో కటా
సామాన్యుఁడ ననుకొంటివో, యీ మాదిరి నిన్ను నిప్పు ♦ డనిఁబడఁజేతున్.

తే॥ శత్రుతాపన రాముని ♦ సంస్మరింపు
మాత్రఁ దరుదెంచి రక్షించు ♦ నట్లు సేయ
కున్న నా మ్రోల బ్రతుకుట ♦ సున్న యనుచు
బాణ సాహస్రి మతనిపైఁ♦బరపె నృపుఁడు. ౨౨౮

సీ॥ శత్రుఘ్నుఁ డా శర♦సంఘాతపంజరం, బునఁ జిక్కువడియు నా ♦ భూమినాథు
బాణ జాలంబుల ♦ భస్మంబు సేయఁగ, వీతిహోత్రాస్త్రంబు ♦ విడువ సురథుఁ
డదిగాంచి వడి వారు♦ణాస్త్రంబుచే వహ్ని, శరమునఁ జల్లార్చి ♦ శరవితతులుఁ
గోటుల కొలదిగ♦గుప్ప సౌమిత్రియు, నివ్వెరపడి యోగి♦నీప్రదత్త

ఆ॥ మై సమస్తజనుల ♦ కతినిద్రఁ గలిగించు, మోహనాస్త్రమేయఁ♦బూనుటయును
గాంచి మానసమున ♦ ఖరదైత్య సంహారు, సంస్మరింపు చనియె ♦ జనవిభుండు.

తే. అఖిల శస్త్రాస్త్రవేత్త వీ ♦ వగుదువైన, రామసంస్మరణమున ని♦రంతరంబు
మోహితునినన్ను నన్యంబు♦మోహితునిగఁ, జెలగిభయతాపవంతుని♦ జేయఁగలదె?

క॥ ఈరీతిఁ బల్కుచుండఁగ, ఘోరాస్త్రము రాగ దానిఁ♦గ్రూరశరమునన్
దారిన్ ఖండించిన రఘు, వీరుం డరుదందఁ జెడుచు ♦ విపుల న్వడియెన్. ౨౨౯

వ॥ శత్రుఘ్నుండు తన సమ్మోహనాస్త్రంబు విఫలం బగుటఁ గాంచి. ౨౩౦

మ॥ లవణాదిత్యవిరోధి నే శరము నే♦లన్ గూల్చె మున్నేది దా
నవవిధ్వంసనకీర్తి నెల్లపుడు బూ♦నన్ జాలెఁ దేజంబుచేఁ
బవనాప్తున్ బురుడించు నేది బలిధూ♦పప్రక్రియ ల్గాంచు నె
ప్డు వసించున్ బొదిలోన నా శరము వే ♦ పూన్చెన్ శరాసంబునన్. ౨౩౧

వ॥ అది చూచి సురథుం డిట్లనియె. ౨౩౨

క॥ ఈ రోష మసత్పురుషులఁ, గారియఁ దాఁ బెట్టుఁగాని ♦ ఖరహరుభక్తున్
జేరి వెతల్ గలిగించునె, వీరవరా యైన శరము♦విడుమనుచుండన్. ౨౩౩

సీ॥ లవణారి వహ్నికీ♦లాతుల్యశరమును, విడువఁగ రిపు రొమ్ము ♦ బిట్టుగాడి
నందుచే దుఃఖార్తుఁ♦డై మహాబాధను, బొందుచు రథమందు ♦ మూర్ఛనొంది
పడి తత్క్షణమ లేచి ♦ బాధ లెక్కింపక, యెదురేగి నృపునితో ♦ నిట్టులనియె
నెటకేగఁ గలవు నా♦యెదుటను బడి యిదె, యొకప్రహారంబు నీ♦వోర్చుకొనుము

తే॥ టంచుగాంగేయపుంఖస♦మన్వితంబు, హేతిమాలాపరీతమై ♦ యెసకమెసఁగు
బాణమిష్వధి సంధించి ♦ పరప మధ్యఁ, దునిమె నొకకోల సౌమిత్రి♦తున్కలుగను.

ఆ॥ అందుఁ జివరముల్కి ♦ యక్కునఁ గాడఁగ, రాఘువుండు గూలె♦రథమునందు
నఖిలసైన్యమప్డు ♦ హాహారవంబులఁ, జేయు చొక్కమొగిని ♦ జెదరిపారె. ౨౩౪

క॥ దురమున రాముని భక్తుఁడు, సురథుఁడు జయమందె నతని ♦ సుతదశకముచే
నరితాపప్రముఖులు బడు, గురు యోధులు వాహనములఁ ♦గూలిరి మూర్ఛన్.

—♦ సుగ్రీవుండు మూర్ఛనొందుట. ♦—

క॥ తన స్వామి మొదలుగాఁ గల, ఘనులందరు మూర్ఛవడుట ♦ గటకము చెడుటన్
గని సుగ్రీవుఁడుఁ గ్రోధం, బున నని యోన్ సురథుఁజేరఁ♦బోయి మునీంద్రా. ౨౩౭

ఉ॥ రమ్మని నరేంద్ర యందఱి ని♦రంకుశవృత్తిని మూర్ఛఁబుచ్చి యే
యిమ్ముల కేగఁగాఁ గల వ♦హీనపరాక్రమశాలి వైన నా
కిమ్మని రణం బటంచును మ♦హీరుహ మొక్కటిఁ దెచ్చి పూన్కి బీ
రమ్మని తలిర్ప భూభుజు శి♦రమ్మునపయిన్ బడ వైచెఁ గేరుచున్. ౨౩౮

చ॥ అతిబలశాలి యైన వసు♦ధాధిపుఁ డట్లు మహీరుహప్రతా
డితుఁడయి లక్ష్యపెట్టక వ♦డిన్ విలునందునఁ దీక్ష్ణసాయక
ప్రతతులఁగూర్చి పెక్కుపరు♦షన్ గపినాథుఁడుఁ దప్ప దాటి ప
ర్వత నగదంతి వాజుల న♦పారముగాఁ బడఁగప్పె రాజుపై. ౨౩౯

తే॥ వీఁడు హనుమంతునకుఁ దీసి♦పోఁడటంచు, రేఁడు రామాస్త్రమపుడుమం♦త్రించి విడువ
నందువునఁ గట్టఁబడిన మ♦హాగజంబు, మాడ్కిఁబడియుండె బద్ధుఁడై ♦మర్కటుండు.

వ॥ ఇట్లు బద్ధుండై యితఁడు రామసేవకుం డని డెందంబునఁ దలంచి చేయునది లేక చేష్ట లుడిగియుండె నిట్లు సురథుండు జయలక్ష్మిం బరిగ్రహించి శత్రుఘ్నాది వీరుల నందఱిఁ దన రథంబుపై నుంచి పురంబుఁజేరి సభాస్థానంబున డించి బద్ధుం డగు హనుమంతుం గాంచి యిట్లనియె. ౨౪౧

తే॥ భక్తపరిపాలకుండుఁ గృ♦పాసముద్రుఁ,డైన రాముని స్మరియింపు♦మతఁడు వచ్చి
బంధములనూడ్చుఁ గాకున్నఁ ♦ బవనజ పది,వేల వత్సరములకైన♦ విడువ నిన్ను.

ఆ॥ ఇట్లు పల్కుచున్న ♦ నృపు పల్కు లాలించి, విభుశరాభిఘాత♦పీడితులయి
కదలకుండ నున్న ♦ కాకుత్స్థులను గాంచి, భటులఁగాంచి ముక్తిఁ♦బడయ నెంచి.

శా॥ శ్రీరామున్ రఘువంశజాతు ననఘున్ ♦ సీతామనోనాయకున్
నీరేజాసన ముఖ్యదేవ వినుతున్ ♦ నీరేజపత్రేక్షణున్
స్ఫారానూనదయాసమేతుని ఘన♦శ్యామున్ విభున్ సజ్జనా
ధారున్ బంధవిముక్తికై మనమునన్ ♦ ధ్యానించె మారీశ్వరా. ౨౪౪

శా॥ హా సీతాపతి హా కృపాజలనిధీ ♦ హా మర్త్యమర్త్యోత్తమా
హా సద్భక్తజనార్తిదాహక ఘన♦శ్యామా చలత్కుండలా

వాస ప్రోల్లసదాననాంబుజహారీ ♦ బద్ధుండవై భూమిరా
డ్వ్యాసంబందునఁ జిక్కియుంటి నిపు డీ ♦ బంధంబులన్ బాపవే. ౨౪౫

ఆ॥ నీవు యాగకర్మ♦నిరతుండవై మహా, మునులవలన ధర్మ♦ములను నరయు
చుంటి వచట నిచట ♦ సర్వేశపాశ వి,గాఢబంధములను ♦ గదలకుంటి. ౨౪౬

సీ॥ మకరంబుచే నల♦మట నొంది మొరవెట్టి, నట్టి గజేంద్రుని ♦ నరయలేదె
యపరాధ మొనరించి ♦ యతిభీతి శరణన్నఁ, గాకాసురుని మున్ను♦గావలేదె
యసురులచేత ము♦న్నలజడి వడినట్టి, మునిపుంగవుల దయఁ ♦ బ్రోవలేదె
యగచాట్లఁ బడునట్టి ♦ యంబరీషాదుల, నెందరినో పూర్వ♦మేలలేదె

తే॥ అట్టి నెనరుంచి యరుదెంచి ♦ యరయు మయ్య
నన్నుఁ గనకున్న లోకులు ♦ నవ్వరయ్య
లేచిరావయ్య దయ నీకు ♦ లేదటయ్య
యేలుకొనవయ్య యింక జా♦గేల నయ్య. ౨౪౭

క॥ రమ్మ రఘూద్వహ యాల, స్యమ్మింక వలదో నరామ♦రార్చితపాదా
రమ్మ భవత్సోదరసుతు, లుమ్మర మగు మూర్ఛ మునిఁగి ♦ యున్నారు సుమా.

క॥ ఈ రీతిని మొరవెట్టు స,మీరాత్మజుఁ బ్రోవనెంచి ♦ మిహిరకులభవుం
డా రామచంద్రుఁ డనుజులు, పారాశర్యాదులైన ♦ పరమర్షులతోఁ. ౨౪౯

వ॥ విమానారూఢుండై యాశుగతిం జనుదెంచినఁ దన స్వామి యగు రామచంద్రుం
జూచి కపీంద్రుండు నరేంద్రునితో నిట్లనియె. ౨౫౦

చ॥ వసుమతినాథ చూడు నను♦భక్తుని ముక్తునిఁ జేయ నెంచి తా
మసలక వచ్చినాఁ డడుగో ♦ మా రఘురాముఁడు దీక్షనుండియుఁ
బసఁ దగ మున్న నేకులను ♦ బంధవిముక్తులఁ జేసినాఁడు నూ
పస చెడియున్న నన్నుఁ బరి♦పాలన సేయఁగ రాక తక్కునే. ౨౫౧

క॥ అనుటయు సురథుఁడు శ్రీరా,ముని, గాంచి ప్రమోదవార్ధి♦మునిఁగి నమస్సుల్
వినయావనతతనుండై, యొనరింపుచు మేనఁ బుల్క♦లొదవఁగఁ నుండెఁ. ౨౫౨

ఆ॥ బాహుయుగము సాచి ♦ వత్స యటంచును, దరికిఁ జేరఁదీసి ♦ దయ దలిర్పఁ
బరమపురుషుఁ డతని, ♦ బరిరంభణ మొనర్చి, మోదబాష్పసమితి ♦ ముంచెశిరము.

వ॥ మఱియు నిట్లనియె. ౨౫౪

క॥ ధన్యతనుండవు కపిమూ,ర్ధన్యుని హనుమంతు నమిత ♦ దర్పసమేతుఁ
జన్యమునఁ గట్టితివి సా,మాన్యుఁడవే చూడ నీవు ♦ మానవ నాథా. ౨౫౫

తే॥ అనుచు నినవంశపావనుం ♦ డాంజనేయు, బంధమోచితునిగఁజేసి ♦ భటులఁ జూపు
చేతనే జీవితులగను ♦ జేసె నంత, లేచి వారెల్లరును రాముఁ ♦ జూచిరపుడు.

వ॥ శత్రుఘ్న ప్రముఖు లందఱుఁ బరమాశ్చర్య మగ్నులై భరతలక్ష్మణసహి
తుండును గరుణా సముద్రుండును నగు రామభద్రునకు సాష్టాంగదండప్రణా
మంబు లాచరించి నిలుచుండ శ్రీరాముం డిట్లనియె. ౨౫౭

చ॥ పవనజ నీకు క్షేమమె ది♦వాకర పుత్రి శుభంబె పుష్కలా
నవసితి వెంతయో యిపు డ♦నామయమే కుశలంబె తమ్ముఁడా
యవనిపులార భావుకమె ♦ యందరకుం దగ నంచు జానకీ
ధవుఁ డన నీదయఁ గుశల♦తఁ గొనినా మని పల్కి రందఱుఁ. ౨౫౮

వ॥ అంత రామచంద్రుం గాంచి సురథుం డిట్లనియె. ౨౫౯

పంచచా॥ తురంగమంబుతో ధనంబు♦తో మదీయరాజ్య మా
దరంబుమీరఁ గొంచు నన్ను ♦ ధన్యుఁ జేయుమయ్య నా
శరీర మీ సుతాళి నీ వ♦శంబ నేను నీదు కిం
కరుండ నీదు సేవఁ జేయు ♦ కాంక్ష నింతఁ జేసితిఁ. ౨౬౦

క॥ అపరాధ మొనర్చితి నఁ, గృపఁ జూడుము రామచంద్ర ♦ కినియకు మెద నీ
నెపమున రప్పించితి నీ, లపనాబ్జముఁ గంటి నేఁ డి♦ల నగడు మంటిఁ. ౨౬౧

చ॥ అనుటయు రాఘవుం డనె ధ♦రాధిపుతోడ బలే నృపా హయం
బును గని పట్టినాఁడ వది ♦ పోలఁగ క్షత్రియ ధర్మమేకదా
విను తమ స్వామితో నయిన ♦ వీరులుఁ బోరుట వింతగాదు నీ
యనుపమ శూరకృత్యమున ♦ కందఱు మెచ్చిరి నేను మెచ్చితిఁ. ౨౬౨

ఆ॥ ఇట్లు పలుకుచున్న ♦ యినవంశతిలకుని, సురథభూవిభుండు ♦ సుతులతోడ
బహువిధార్ఘ్యణములఁ ♦ బరమహర్షునిఁజేయ, రాముఁడుండె మూఁడు♦రాత్రులచట.

వ॥ ఇట్లు భక్తాగ్రేసరుం డగు సురథునిచే నర్చనల వడసి యాతని నామంత్రణంబుఁజేసి
కామగమనం బగు విమానంబున మునివరులతో నాసీనుండై సాకేతంబునకుం
జనియె నిక్కడ. ౨౬౪

సీ॥ అందఱు విస్మయం ♦ బందుచు రామచం, ద్రుని కథలను జెప్పు ♦ కొనుచునుండు
నంతట సురథక్ష♦మాధీశుఁ డెద లవ ♦, ణారితో నేగెద♦నంచు నెంచి
చంపకుఁ బురమున ♦ స్థాపించి రథగజ, హయ పదాతులతోడ ♦ నతని జేర
శత్రుఘ్నుఁడును సంతో♦సం బంది భేరీ నినాదముల్ శంఖని♦నాదములును

తే॥ మొరయుచుండఁగయజ్ఞీయ♦హరినివిడచె, నదియు దేశంబులన్నియు ♦ నధిగమించి
యేగుచుండెను గాని యెం ♦ దేవ్వఁడైనఁ బట్టువాఁ డిల లేడయ్యె ♦ బాడబవర,

క॥ తురగంబెట కేగునో యా, తురగము వెనువెంటనంటి ♦ తూర్యరవంబుల్
మొరయఁగ సైన్యముతో దా,శరథియు నృపవర్యుతోడఁ ♦ జనియె మునీంద్రా.
వ॥ అనుటయు. ౨౬౭

నిరోష్ఠ్యకందము॥ జలధర నీకాశగళా, ఖలరాత్రిచరాసుహరణ ♦ కారుణ్యనిధీ
సలలిత శుద్ధచరిత్రా, జలచరరాట్కేతు దహన ♦ జక్షేశసఖా.

అంబురుహము॥ రాజితశైల నివేశ మహేశ కు♦రంగ హస్త జటాధరా
రాజవిరాజిత జూటకపాలధ♦రా సురార్చిత పాదస
ద్రాజఘనాంబుజ కాశపటీర మ♦రాళ సన్నిభ దేహ గో
రాజతురంగ రతీశవిభంగ ధ♦రాధరేంద్ర శరాసనా. ౨౬౯

మాలిని॥ శమన మదవిభంగా ♦ శర్వ గంగోత్తమాంగా
శమితవృజినజాలా ♦ శైలజాప్రాణలోలా
యమర రిపువిఫాలా ♦ యార్తసంత్రాణశీలా
కమలనయనమిత్రా ♦ కంజజస్తోత్రపాత్రా. ౨౭౦

## గద్యము

ఇది శ్రీమద్గౌర్త్యన్వయ పవిత్ర లక్ష్మీనారాయణార్యౌరసపుత్ర శ్రీ చింతలపాటి
వంశ క్షీరపారావారరాకాసుధాకరాయమాణ సూర్యనారాయణార్య దత్త
పుత్త్ర శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షాసమాసాదితానవద్యోభయ
కవిత్వ విద్యావధాన రామమూర్తిశాస్త్రి కవ్యభిధానప్రణీతంబైన
రామాశ్వమేధంబునందు
షష్ఠాశ్వాసము.



శ్రీ

గణాధిపతయే నమః

శ్రీరామభద్రాయ కరుణాసముద్రాయ నమః

# రామాశ్వమేధము

## సప్తమాశ్వాసము



కర కరుణాకర ద
ర్వీకరకంకణ యరాతి♦భీషణ శివ నా
కాకరపూజితచరణా
పాకరిపుస్తుత్య నంది♦వాడపురీశా. ౧

వ॥ అవధరింపు మనంతరకథాశ్రవణాభిలాషి యగు వాత్స్యాయనతాపసాఖండలుండు గుండలీంద్రుం గాంచి యిట్లనియె. ౨

—♦ లవుండు హయంబును బంధించుట ♦—

ఆ॥ ఇట్లు పోవుచుండ ♦ నిల నెవ్వఁడై నను, వాజిఁబట్టినట్టి♦వాఁడు గలఁడె
యేమి జరిగెఁ బన్న♦గేశ్వర సర్వంబుఁ, దేటపడగ నాకుఁ ♦ దెల్పుమయ్య. ౩

వ॥ అనిన శేషుం డిట్లనియె. ౪

ఉ॥ వీఁకఁ దురంగమంబు పృథి♦వీతల మెల్లఁ జరించిపోయి మం
దాకినిఁ జేరి తత్సవిధ♦ధారుణిఁ గ్రుమ్మరుచున్ యథేచ్ఛ వా
ల్మీకి తపోవనంబునకు ♦ లీలమెయిన్ జన మౌనిబాలకా
నీకము వద్దు వద్దనుచు ♦ నిల్పినఁ బట్టెద నంచు నుగ్రుఁడై. ౫

వ॥ ఇట్లు కుశేంధనాహరణార్థం బరుదెంచిన జానకీతనయుం డగు లవుండు కుంకుమాగరుకస్తూరిదివ్యగంధవాసితంబును, సువర్ణపత్రశోభితంబును నగు యజ్ఞాశ్వంబు దైవయోగంబున మన యాశ్రమంబునకుం జనుదెంచె రండు రండు భయంబు వీడి కనుం డనుచు స్కంధంబున ధనుర్బాణంబులు గ్రాల జయంతుండు పోలె దుర్జయుండై మునిబాలురతోఁ జని తన వామహస్తంబున మెడవట్టి ఫాలపట్టలిఖితవర్ణంబుల నిట్లు చదివె. ౬

సీ॥ ఒకఁడైన నన్యబా◆ధకుఁ డన్యవిత్తలం, పటుఁడు లేఁడో యట్టి ◆ పావనంబు
భువనవిశ్రుతమునై◆పొల్పొందు రవివంశ, మునఁ బుట్టి తద్వంశ◆మునకుఁ గేతు
వగుచు నమత్స క◆లామరాసుర శిరో,రత్నప్రభా విస్ఫు◆రత్పదుండు
ధన్వి బలిష్ఠుఁడౌ ◆ దశరథేశ్వరునకుఁ, దనయుండు రిపువీర◆దర్పహరుఁడు
తే॥ కోసలేశ్వర పుత్రికా◆కుక్షిరత్న, మఖిల వీరశిరోమణి ◆ యైన రాముఁ
డార్య శిక్షితుఁడై బ్రహ్మ◆హత్య నడఁప, నశ్వమేధంబు సేయుచు◆నంపె హయము.
ఆ॥ వీతి వెంటవచ్చు ◆ వీరుఁడు శత్రుఘ్నుఁ, డనెడివాఁడు నాకు ◆ ననుఁగుఁదమ్ముఁ
డతిబలుం డితండ◆మితబలు లవణుని, గాలుఁ జేర్చినట్టి ◆ కడిఁదిజోదు. ౮

ఉ॥ ~~ఈతఁ~~ డమేయసైనికస◆హీశపరీతుఁ డసాధ్యుఁ డేరికిన్
క్ష్మాతలమందు మేము బల◆మానయశః పరిపూర్ణ పౌరుషా
న్వీతులమంచుఁ జెప్పికొను ◆ వీరులు పట్టుఁడు రత్నమాలికో
పేతము గామగం బనిల◆వేగయుతంబగు వీతి నుద్ధతిన్. ౯

ఆ॥ పట్టినట్టివారి ◆ బలువాడితూపుల, బవరమందుఁ జిక్కు◆వరపు నాదు
పిన్నతమ్ముఁ డపుడ ◆ విడిపించుకొను నవ, లీల జనులు భీతిఁ ◆ దూలుచుండ.

వ॥ మఱియును. ౧౧

క॥ క్షత్రియ కన్యకుఁ బుట్టిన, క్షత్రియు లకలంకవంశ◆సంభవులే యీ
సత్రిహయంబును బట్టఁగఁ, బాత్రులు వసుధాధిపతులు ◆ బరికింపుఁ డెదన్. ౧౨
క॥ విపరీతదేహు లగు భూ, మిపు లెల్లరు రఘుకులాబ్ధి◆మృగలాంఛను స
త్కృపఁ గోరి రాజ్య మొసఁగుచు, లపనము లానఁగ నమస్సు◆లను జేయుఁడొగిన్.

వ॥ ఇట్లు చదివి.

క॥ మిత్రకుల శ్రేష్ఠుండు న, మిత్రధనుర్ధరుఁడు లవుఁ డ◆మేయక్రోధా
పాత్రుండై యనియె మునీ, ట్పాత్రులతో రుట్చలద్వ◆చఃకలితుండై. ౧౪
సీ॥ వింటిరే క్షత్రియ◆వృత్తంబు, వారల, ధృష్టత్వమును వ్రాత◆తీరు మీరు
తనప్రతాపము వ్రాసి◆కొనెన ప్తిముఖపత్ర,మందు రాముఁడనంగ◆నహహ యెవఁడు
శత్రుఘ్నుఁడన నెంత ◆ స్వల్పబలు ల్వీరిఁ,బురుగు లటంచు నా ◆ బుద్ధిఁదలఁతు
సద్వంశమందున ◆ జన్మించినారంట, జన్మింపమో మేము ◆ సత్కులమున
తే॥ వీరి తల్లియ కాఁబోలు ◆ వీరమాత, అరణి వహ్నిఁనిబోలెఁ గు◆శాఖ్యమణిని
గనిన సీతామహాదేవి ◆ కాదొ చూడ, నిపుడ నా క్షత్రియత్వంబు ◆ నెరుగఁజేతు.
క॥ లవణారి క్షత్రియాన్వయ, భవుఁడే కాఁగలఁడు నేను ◆ బంధించిన యీ
సవనార్హంబగు హయమును, బవరాన గ్రహించెనేని ◆ పల్కు లిఁకేలా. ౧౬

తే॥ పట్ట లేకున్న క్షత్రియ♦త్వంబు విడచి, కుశపదార్చకుఁ డగుఁగాక ♦ క్రూర మచ్ఛ
రాహతుల నేఁడుఁగడు సుప్తుఁ♦డగునుగాక, అన్యజన ముఖ్యకి విభూష♦యగునుగాక.

క॥ ఈ రీతిగఁ బల్కుచు లవుఁ, డా రాజులఁ బరిగణింప ♦ కాగ్రహయుతుఁడై
ఘోరాస్త్రంబులఁ దాలిచి, ధీరుండై పట్టె హయము ♦ ధీరవరేణ్యా. ౧౯

వ॥ అప్పుడు లవుం జూచి మునిసుతు లిట్లనిరి. ౨౦

మ॥ మదిలో నెవ్వనిగాఁ దలంచితివొ రా♦మక్ష్మాపతిన్ భూమిలో
నెదిరింపం గల మానవుండు: గలఁడే ♦ యెందైన బాహాబలా
స్పదుఁ డా వీరుని వీతిఁబట్టఁగను జం♦భ ద్వేషికిన్ శక్యమే
మదిలోఁ జేరిచి మా హితోక్తులను నీ ♦ మావున్ విసర్జింపుమా. ౨౧

వ॥ ఇట్లు పలుకు మునిబాలకుల పలుకులు పెడచెవి నిడి లవుం డిట్లనియె. ౨౨

ఉ॥ బాడబులార క్షత్రియుల ♦ బాహుబలం బెరుగంగ లేరు మా
రేఁడులు వీర్యశౌండులు ధ♦రిత్రిని నెల్లెడఁ జూడ వింటిరే
పోడిగ బ్రాహ్మణోత్తములు ♦ భోజన శౌండులు గాన నందఱిన్
గూడుక పోయి తల్లు లొడఁ♦గూర్చిన యన్నము మెక్కుచుండుఁడీ. ౨౩

క॥ అను లవు మాటలు విని యా, మునిపుత్రులు వేగ దూర♦మునకుం జని యా
తని బలవీర్యంబులు గ, న్గొనుచుండిరి యొక్కచోటఁ ♦ గూడి మునీంద్రా. ౨౪

వ॥ అంతట లవణాంతకుని కింకరు లరుదెంచి బద్ధం బగు హయంబుఁగాంచి లవునితో
నిట్లనిరి. ౨౫

తే॥ ఎవఁడు బంధించె మా హయ ♦ మెవ్వఁ డంత
కుని మహాగ్రహమునకుఁ దా ♦ గురియు నయ్యొ
శరవిపీడితతనుఁ డౌచు ♦ శ్రీమలఁ బడఁగఁ
దలఁచె నెవ్వఁడుఁ జెప్పుమా ♦ తడయ కిపుడు. ౨౬

వ॥ అనుటయు లవుం డిట్లనియె. ౨౭

ఉ॥ సైనికులార మీ సవన♦సప్తిని గట్టితి నే న్మదగ్రజుం
డైన కుశుండు వీతిని న♦హంకృతితోఁగొనఁ జూచు వానిఁ దా
మానఁడు శిక్షసేయ కను♦మానము లేదు కృతాంతుచేత నే
మాను కుశాంబువృష్టి కెద ♦ హర్షము నొందుచు మ్రొక్కిపోవఁడే. ౨౮

వ॥ ఇటులఁ బలుకుచున్న లవుని పలుకులు లెక్కసేయక.

క॥ బాలుం డితం డితని, యాలాపంబులఁ బనేమి ♦ యని తురగంబున్
పేలన్ గ్రహింపరాఁగా, **వాలమ్ముల** లవుఁడు వారి ♦ బాహులఁ దునిమెన్.

క॥ అంతట నా సైనికు ల,త్యంతవ్యథ గుందు చరిగి ♦ దశరథసుతుతో
నంతయుఁ జెప్పిరి యో లవ,శాంతక లవుచేత నిట్టు ♦ లైతి మటంచున్. ౩౧

—♦ సీత వనంబున నున్న మునికన్యకలఁ జూడఁ గోరుట ♦—

తే॥ కడు మనోహరమైన యీ ♦ కథను మాని, విని మనంబున సంశయా♦విష్టుఁడగుచు
దశశతాననుఁ డైన వృ♦దాకు నాథుఁ, బలికె జలముగ్గభీరసం♦భాషణముల. ౩౨

చ॥ ఉరగకులేంద్ర మున్ను రజ♦కోక్తుల రాఘవుఁ డొక్క సీతనే
కరుణ యొకింత లేక మదిఁ ♦ గాననభూమికిఁ బంపెఁ గాదె యా
ధరణిజ కెందుఁ గల్గెను సు♦తద్వయ మెట్టు ధనుర్ధరత్వవి
స్ఫురణ వహించె విద్య లెటుఁ ♦ బొందె నెవండు హరించె నీ హరిన్. ౩౩

వ॥ ఇట్లు వచియించు వాత్స్యాయన మునివచనంబులుఁ గొనియాడి బుద్ధిమదగ్ర గణ్యుం డగు భుజంగనాయకుం డద్భుతం బగు రామచరిత్రం బిట్లని చెప్పం దొడంగె. ౩౪

సీ॥ సానుజుం డయి యయో♦ధ్య వసించి రాముఁడు, సీతతో రాజ్యంబు♦సేయుచుండెఁ
గొన్ని రోజుల కిన♦కులజుని వీర్యంబు, జనకజ తన గర్భ♦మున ధరించె.
నెల లైదు సీతకు ♦ నిండె మహాపూరు, షుని ధరించిన శ్రీతి ♦ సొబగుఁ గాంచె
రాముఁడొకప్పుడు ♦ రామతోడ రహస్య,మునఁ గోర్కె నెరిగింపు ♦ మని వచించె

తే॥ సిగ్గుచేతను జానకి ♦ శిరము వంచి, హార్దమున విభుఁ డీటు వల్కె ♦ నని తలంచి
స్వాంతమునబొందితెలమొ త్తి♦స్వామిఁగాంచి,యిటులవాగమృతముఁబ్రవ♦హింపఁజేసె.

శా॥ స్వామీ నీదయచే భుజించితిని నే ♦ సర్వంబు నవ్వారిగా
క్షేమంబొప్ప భుజింపు చుంటి నిఁక నా ♦చి త్తంబునన్ గోరఁగాఁ
గామం బెద్దియు లేదు దేవనుతప♦త్కంజద్వయా! సద్గుణో
ద్దామా! నీ సతి నైన నాకిలఁ గోరం♦త ల్గలునే యొయ్యొడన్. ౩౬

క॥ చేతోహర కృపచే నా, చేతస్థితదోహదంబుఁ ♦ జెప్పు మటంచున్
జేతఃకంజం బలరఁగ, నీ తీరునఁ బల్కితిరి వ♦చింతు నిజంబున్. ౩౭

సీ॥ బహుకాలము గళించె ♦ వనిని లోపాముద్ర, మొదలైన స్త్రీజన♦ములను గాంచి
మఱల నింకొకసారి♦పరమ సాధ్వులఁ జూడఁ,జి త్త ముత్సుకతనుఁ♦జెందెఁబోయి
యఖిల సామ్రాజ్య సౌ♦ఖ్యంబుల మీతోడ, ననుభవింపఁగఁ గల్గినం♦దులకుఁ గృ
తఘ్నత కాకుండ ♦ ధనవస్త్ర మాల్య స,ద్రత్న భూషల సమ♦ర్పణముఁ జేసి

తే॥ వారి పదపద్మములకు స♦ద్భక్తి మ్రొక్కి, మనసు రంజింపఁజేసి దీ♦వెనలఁ బడసి
సెలవుఁ గొనివత్తు మీపద♦సేవఁ జేయ, నిదియ నా యీప్సితము సెల♦విమ్ము నాకు.

వ॥ ఇటుల నుడువు మనోహారిణి మనోహరవాక్యంబుల కలరి శ్రీరాముం డిట్లనియె.

తే॥ ప్రియసీ ధన్యవైతివి ♦ ఋషిసతులను, బ్రొద్దుపోడుపునఁ జూడఁగాఁ ♦ బొమ్ము మేల్కొ
డాని పుట్టంబులును బవ ♦ డాలు మణులు, నిమ్ము నాకడ కతివేగి ♦ రమ్ము రమ్ము.

క॥ అను రాముని వచనంబులు, విని సంతసమునను బొంగి ♦ పృథ్వీసుత ప్రొ
ద్దునఁబోయి మౌనిపత్నులఁ, గనెద ననుచు మదినిఁ గౌతు ♦ కంబున నుండెన్. ౪౧

క॥ అంతట నా నిశి సీతా, కాంతుని యనుమతిని భక్తిఁ ♦ గైకొని చారుల్
మంతనముల జనులను శ్రీ, కాంతుని యశము న్వినంగఁ ♦ గడునుత్సుకులై. ౪౨

తే॥ అరిగి యొక్కధనాఢ్య గృ ♦ హంబుఁజేరి,
యొరులు గనకుండ నొకమూల ♦ నొదిగి యొదిగి
వెలుఁగుచుండెడి దీపాలఁ ♦ గలయఁజూచి
నుడులు వినఁ గోరుచుండిరి ♦ పుడమి వేల్ప. ౪౩

వ॥ అందొక సాధ్వీలలామంబు పాలుఁ ద్రావు తన పసిబాలునిం దొడ నిడుకొని
యిట్లనియె. ౪౪

మ॥ తనయా యిప్పుడ త్రావుమా మధురమా ♦ స్తన్యంబులన్ స్వేచ్ఛగాఁ
జనుబాలిక్క విఁక ద్రావ వెన్నిటికి వ ♦ త్సా నిక్క మీ ప్రోలు శ్రీ
వనజాక్షుం డసితోత్పలాభతనువి ♦ భ్రాజుండు రాముండుఁ బా
లనముం జేయుచునుండె, లేదు జని ప్రో ♦ లన్ గల్గు మర్త్యాళికిన్. ౪౫

క॥ రాముని స్మరించువారలు, రాముకథల్ సెప్పువారు ♦ రాముని ధ్యానం
బేమరక చేయువారును, నీ మహి చనుఁబాలుఁ ద్రావ ♦ రెన్నటికి సుతా. ౪౬

తే॥ అనుచు వచియించు రామయ ♦ శోమృతంబుఁ,
జెవులతోఁ ద్రావి సంతోష ♦ చిత్తు లగుచుఁ
జెలఁగి రాముని సుగుణముల్ ♦ చెప్పికొనుచుఁ
జనిరి చారులు వేర్వేరు ♦ సౌధములకు. ౪౭

క॥ అందొక్కం డొక ధనికుని, సుందరగృహమునకుఁ బరులు ♦ చూడకయుండన్
బొందుగఁ జని యందు దశ,స్యందన సుతు కీర్తి వినుట ♦ కై కూర్చుండెన్.

వ॥ ఇట్లుండ నంత. ౪౮

మ॥ ప్రణయం బొప్ప హృదీశదత్త మగు క ♦ ర్పూరంపు విడెం బంది చ
ర్వణమున్ జేయుచు సంచలన్నయనయై ♦ పర్యంక మందుండు సా
రిణరాశ్కొతన సుందరాంగు విభుస ♦ ప్రేమంబునన్ హస్తకం
కణముల్ మ్రోయఁగ మ్రొక్కి నమ్ర ♦ యగుచున్ గంజాస్య తా నిట్లనెన్. ౫౦

సీ॥ అత్యంత సుందర ♦ మతిమృదువౌ నీదు, గాత్రము నీ నేత్ర♦కమలములను
నతివిస్తృతంబు మో♦హన మైన నీదువ, క్షంబును నాజాను♦లంబు లగుచు
నంగదంబులతోడ ♦ నలరారు నీ బాహు,వులఁగన, నానేత్ర♦ములకు నిష్ఠ
ప్రాణేశ నాపుణ్య♦వశమున సాక్షాత్క,రించిన రాఘవు ♦ రీతినుంటి
తే॥ వహహ ధన్యాత్మురాల నే♦నైతి ననుచుఁ,బలుకు కాంతామనోహర♦వచనములకు
నలరి మన్మథసుందరుఁ♦డైన ప్రియుఁడు, వలికెనృత్యంబుఁగనుగొనల్ ♦సలుపుచుండ.

తే॥ తరుణి నీకిట్లు పలుకుట ♦ తగును సాధ్వి,వగుటచే సాధ్వులకుఁ దమ ♦ మగఁడ రూపుఁ
డైన శ్రీరామమూర్తిగాఁ ♦ గానిపించుఁ,గాని నేనేడ రామభూ♦కాంతుఁడేడ. ౫౨

సీ॥ మందభాగ్యుండేడ ♦ మహనీయుఁడును మహా,భాగ్యాన్వితుఁడు భగ♦వంతుఁ డేడ
కృమివిధంబున తుచ్ఛ♦తముఁడనౌ నేనేడ, యజముఖసురపూజ్యుఁ ♦ డాతఁ డేడ
శలభప్రతీకాశ♦చపలుఁడ నేనేడ, ఖమణియా పద్మినీ♦రమణుఁ డేడఁ
శశమేడ గజకుంభ♦సంస్ఫోటనక్రియా, దక్షమైనట్టి హ♦ర్యక్షమేడ
తే॥ కలుషమైనట్టి రథ్యోద♦కం బదేడ, పావనంబైన గంగాస్ర♦వంతి యేడ
అణువు గురిగింజ యేడ హే♦మాద్రియేడ, పడఁతి నే నేడ యా రామ♦భద్రుఁడేడ.

క॥ తన పదరజమున మున్నాని, బెనురాతిని క్షణములోన ♦ విధికే మోహం
బును గల్గఁ జేయు సుందరి,గను జేసిన హరికి సాటి ♦ గలరే భువిలోన్. ౫౪

ఆ॥ భక్తినిటులఁబల్క ♦ పతిఁగని నర్తిత, భార్యయుగంబుతోడఁ ♦ బూవుఁబోడి
జాతకామ యగుచు ♦ సంతతప్రేమచేఁ, గౌఁగిలించుకొనియె ♦ గాఢముగను. ౫౫

వ॥ అంత. ౫౬

క॥ ఈ నుడుల న్విని చారుఁడు, మానసమునఁ బొంగి వేరు ♦ మాడువు సేరెన్
బూని యొక చరుఁడు సీతా,జాని యశము వినఁగ నొక్క ♦ సౌధముఁజేరెన్. ౫౭

ఉ॥ అం దొక సుందరాంగి కుసు♦మాంచిత శయ్యఁ బటీరయుక్తమౌ
చందన ముంచి యుంచఁదగు ♦ సర్వముఁ జేర్చుచు నాథుఁ గాంచి యా
నందముతోడఁ బల్కె విను ♦ నాయక పూవులపాన్పిదే యిదే
చందన మీ విడెంబు ఘన♦సారము నీ కయి సేకరించితిన్. ౫౮

క॥ ఇవి రామకృపాలబ్ధము, లివి యుష్మత్తుల్య జనుల♦ కే యర్హంబుల్
భువి రామపరాఙ్ముఖులకు, నివి దొరకవు నాథ యనుభ♦వింపుము స్వేచ్ఛన్. ౫౯

ఆ॥ మత్సమాన మైన ♦ మత్తేభగామిని, చల్లనై తనర్చు ♦ చందనంబు
బుష్పరచితశయ్య♦భామలన్నియు రఘూ,ద్వహుని సత్కృపాభ♦వములు సుమ్ము.

క॥ శ్రీరాముని భజియింపని, క్రూరులు కూటికిని గుడ్డ♦కుం గఱవగుచున్
బోరాపాట్లల నింపఁగ, లారా? వే పోయికాన♦లన్ దిరుగఁగనీ. ౬౦

ఆ॥ ఇంతి యిటులు పల్క♦ నెంతయు ముదమంది, యాతఁడనియె నో ప్రి♦యా! త్వదుక్త
మంతయును నిజంబ♦ యఖిలసిరుల్ రఘూ,ద్వహుని సత్కృపాభ♦వములు నిజము.

వ॥ ఇట్లు పల్కుచుండు రామచంద్రయశఃప్రచారవచనంబులు విని చారుఁ డన్య గృహంబునకుఁ జనియె నప్పుడ యింకొకఁ డన్యగృహద్వారంబున వేచియుండు నంత. ౬౩

క॥ పతితో నొక బింబాధరి, కుతుకంబున శయ్యయందుఁ ♦ గూర్చొని సీతా
పతి చరితంబు విపంచీ, శ్రుతిచేఁ బాడుచు వచించె ♦ సొంపుగఁ బతితోన్. ౬౪

తే॥ ప్రాణనాయక వింటివే♦ ప్రజలఁ దనదు, ప్రాణములువోలెఁ బ్రేమఁగా♦పాడుచున్న
వాఁడు రాఘవుఁ డాతని ♦ భవ్యదర్శ,నంబునను మనజనియు ధ♦న్యత్వమొందె. ౬౫

వ॥ మన యయోధ్యాధీశ్వరుండగు శ్రీరాముని చరిత్రంబుఁ గొంత చెప్పెద వినుము.

సీ॥ అన్యులకు నసాధ్య♦మైన సముద్రంబుఁ, గట్టినాఁడు స్వయంబు ♦ మెట్టినాఁడు
జంకక కపులతో ♦ లంకలోపలఁ గాలుఁ,బెట్టినాఁడసురులఁ ♦ గొట్టినాఁడు
కంటక రహిత లం♦కను విభీషణుని దాఁ,బెట్టినాఁ డవని జఁ♦బట్టినాఁడు
నిఖిల కష్టంబుల ♦ నెట్టినాఁ డభిషేక, పట్టంబు నుదుటను ♦ గట్టినాఁడు
తే॥ పాపములఁ ద్రుంపగాఁ జల♦పట్టినాఁడు, భక్తులను బ్రోవఁగా దీక్ష♦వట్టినాఁడు
దుష్టులవలనభయముఁబోఁ♦గొట్టినాఁడు,పురజనులపుణ్యమితఁడుగాఁ♦బుట్టినాఁడు.

క॥ ఈ రీతిగఁ బలికెడి తన, నారీ వాక్యముల కలరి♦ నాథుం డనియెన్
ఘోరాసురదమనుం డగు, శ్రీరాముని మనుజుఁడంచుఁ ♦ జింతించెదవే. ౬౭

తే॥ రావణాదులచేతను ♦ రాపుఁజెంది, వేవిధంబులఁ దను మొఱ♦వెట్టినట్టి
యాదితేయుల కష్టము ♦ లడఁప శార్ఙ్గ,పాణి వింటివె కోదండ♦పాణియయ్యె.

ఆ॥ కంధిబంధనంబుఁ ♦ గడు దుష్టరావణ, హరణ మనఁగ నెంత ♦ యతని చర్య
లమితములు నమాయి♦కము లచింత్యంబు ల,మానుషములు నమ్ము♦మచ్చెకంటి.

తే॥ సకల మృగఖగపశుపంచ♦జనులతోడఁ, దరులతాగుల్మతృణకుల♦గిరులతోడ
నొక్కఁడేయీప్రపంచంబు♦నొక్కత్రుటిని, ద్రుంపగాఁజాలుమఱలఁబు♦ట్టింపజాలు.

క॥ లీలామానుష విగ్రహుఁ, డీ లోకంబులను మూఁడు♦ నేలఁగలాఁడో
లోలాక్షి దుష్ట శిక్షణ, కై లీల జనించినట్టి ♦ హరిగఁ దెలియుమా. ౭౧

తే॥ ధాతృముఖ్యామరులకుదు♦ర్దర్శనమైన, రామచంద్రునిముఖతామ♦రసముఁ గంటి
మతని చరితంబుఁ జెవుల కా♦నందముగను,వింటిమహాయిఁకధన్యతన్♦గంటిమబల.

క॥ అను వాక్యంబులు చారుఁడు, విని సంతసమంది యన్య♦ వేశ్మంబునకున్
జనియె మఱొక్కఁడు వేఱొగృహ, మునకుంజని ద్వారభాగ♦మునఁగూర్చుండెన్.

క॥ అందున నొక మేచకకచ, క్రిందొనరింపంగ హస్తకంకణములు నే
ర్పొందనమున జూదం బా,నందంబున నాడు చనియె నాథునితోడన్. ౭౫

శా॥ స్వామీ నేగెలుపొంది తంతయును నా ♦ స్వాధీనమే నీకు లే
దే మాత్రం బిఁక నేమిచేసెదవు నీ ♦ హృద్వీథి యోచింపుమం
చా మీనాంబక కౌఁగిలించుకొనఁగా ♦ నాతండు డెందంబునన్
రాముం జేరిచి యోడువాఁడ గెలు పె ♦ ట్రాదో యటం చిట్లనెన్. ౭౬

ఆ॥ చారుగాత్రి నేను ♦ జయమొందితంచు నన్, బరిహసింపుచుంటివా రఘూద్వ
హుని స్మరింప మున్ను ♦ కనను పరాభవం,బిపుడుఁ దలఁచినన్ జ♦యింతుఁజుమ్ము.

తే॥ సవనభుక్కులు మును రాము ♦ సంస్మరించి, మించి యసురుల నెట్లు జ♦యించినారొ
యట్లనేఁజేసెదనటంచు♦నాడి మఱల, గెలుపుఁ దా బొంది ముదమునఁ♦బలికె నిట్లు.

క॥ పలికినదే నిజమాయెను, కలికీ నిను గెలిచినాఁడఁ ♦ గద చిత్తములో
పల రాముని స్మరియించినఁ, గలుగునె రిపువలనిభయము ♦ కలలోనైనన్. ౭౮

తే॥ ఎలమివారిర్వురును బ్రేమ♦నిట్లు చెప్పు, కొంచునుత్సాహమునఁగౌఁగి♦లించుకొనుచు
నుండుటల్ గని చరుఁడు వే♦రుదవసితముఁ,జేరె రాముని సుగుణముల్ ♦ చెప్పుకొనుచు.

వ॥ ఇట్లయిదుగురు చారులు పరస్పరంబు రామభద్రుని సుగుణంబులఁ బ్రశంసింపుచు
వారి స్వగృహంబులకుఁ జనుచుండి రాఱవచారుండును. ౮౧

—♦ రజకుఁడు సీతను దురుక్తులు పలుకుట ♦—

క॥ చాకలి గృహములఁ గన్గొని, శ్రీకరుఁడగు రాము నెట్లు ♦ చెప్పుదురో యనుచున్
వేకువఁజని తా నందొక, చాకలివా నింటిగోడ ♦ చాటున నుండెన్. ౮౨

వ॥ అంత నా యింటి చాకి పరు నింట వసించి వచ్చిన భార్యం గని మహాక్రోధంబునఁ
గనులెఱ్ఱఁజేయుచు నిట్లనియె. ౮౩

ఉ॥ ఎక్కడ కేగినావె నిను ♦ నెవ్వఁడు రమ్మనె వాని యింటనే
టక్కుచు నుండ లేక కుల♦టా యిపు డిక్కడ కేల వచ్చితే
పక్కనఁ బొమ్మటంచు సికఁ♦బట్టుక యీడ్చుచుఁ జెప్పఁగాలితో
మక్కెలు నూడఁ దన్నెఁ బలు♦మాఱు మొఱో యని యేడ్చుచుండగన్. ౮౪

వ॥ అంతట నిల్వక మోకాలునన్ బొడుచుచు వాకిటి కీడ్చుకొని వచ్చి యిట్లనియె.

క॥ ఎచ్చట నుంటివో యీదిన, మచ్చటికే నడుపు మింత ♦ యాగడమటవే
వచ్చిన నీ యబ్బ యిసీ, రచ్చనిలుము గడపదాటి ♦ రానిచ్చెద నే. ౮౬

వ॥ ఇట్లు పలుకుచున్న కొడుకుం గాంచి తల్లి యిట్లనియె. ౮౭

ఆ॥ కొడుక దీనిమీఁదఁ ♦ గోపమేలర యింత, పుట్టినింటి కేగఁ ♦ బోలు కూడె
కూడె కాపురంబుఁ ♦ గూలఁద్రోసుకొనాక, యెగిరిపడక దీని ♦ నేలుకొనుము.

వ॥ అంతఁ గొడు కిట్లనియె. ౯౦

క॥ తీరుపు దిద్దఁగ నిటకున్, జేరితివో ముండమోపి ♦ సీరాముఁడనే
క్రూరుని గృహమందుండిన, నారిని దగునని నికేత♦నముఁ జేర్చుకొనన్. ౯౧

వ॥ అనినఁ దల్లి యిట్లనియె. ౯౨

ఆ॥ ముండకొడుక నోరు ♦ మూయుము నోటికి, వచ్చినటుల నిటుల ♦ వాగఁబోకు
మైనఁ గానికార్య ♦ మది యేమిచేసెరా, నిరపరాధఁ దగునె ♦ నిగ్రహింప. ౯౩

వ॥ అనుచుఁ బల్కు తల్లి నుడుల కత్యంత రుషావేశంబునఁ గొడుకిట్లనియె. ౯౪

ఉ॥ ఈ సరణి న్వచించితివ ♦ యింకను దాడలు వాయఁగొట్టెదే
నోసి దశాననుండు చెఱ♦నుంచిన సీతను రాఘవుండుఁ దాఁ
దీసుక వచ్చి యేలె నని ♦ తీరుఁదొలంగుచు నిప్పుడే నటుల్
చేసెడివాఁడఁగాను మఱి♦చెప్పకుమా యిటువంటి మాటలన్. ౯౫

ఆ॥ ఇట్లు వల్కుచున్న ♦ హీను నుడుల్ విని, చారుఁ డాగ్రహమునఁ♦ జంపఁబోయి
మఱల రాము నాజ్ఞ♦ మదిలోఁ దలంచుచు, మఱలెఁ గ్రోధ ముడిగి♦మానివర్య.

వ॥ అప్పుడు ములుకులుం బోని చాకలి నుడుల కులికి క్రోధరోషంబులు మనంబునఁ బెనంగొన నిట్టూర్పులు వుచ్చుచుం జని తక్కిన చారులం గలసినంత వారు వినిన లోకపూజితం బగు రామచరితంబుఁ జెప్పఁ దానును రజకోక్తుల వినిపించె నంత వారార్గురు రేపటి యుదయంబున రామదర్శనంబునకుఁ బోయెదముగాని యీ దురుక్తుల మాత్రముఁ జెప్పవలదని నిశ్చయించుకొని వారి వారి గృహంబులకుం బోయి నిద్రించి రంత. ౯౭

చారుఁడు రామునితో రజకోక్తులఁ జెప్పుట.

క॥ రాముఁడు ప్రాతః కృత్యము, నేమమునను జేసి విధిగ ♦ నిగమవిధులు గో
త్రామరులకు ధేనువులును, హేమముల నొసంగి సభకు ♦ హితమతి నరిగెన్.

తే॥ ప్రజలఁ బుత్రులవలెఁ బరి♦పాలనంబు, సలుపు శ్రీరామునకు నమ♦స్కారములను
జేయు తలఁపున ఫలములఁ ♦ జేతఁ గొనుచు, సభకు వచ్చిరి భక్తిచే♦సకల జనులు.

సీ॥ ఒకవంక లక్ష్మణుం♦ డకలంక భక్తిచే, శ్వేతాతపత్రంబుఁ♦జేతఁ బట్ట
నొక చక్కి భరతుఁ డిం♦కొక చక్కి శత్రుఘ్నుఁడమలములౌ చామ♦రములవీవ
నొక వైపునను దాప♦సోత్తము లగు వశి,ష్టాది మును ల్గొని♦యాడుచుండ
నొక క్రేవ భూపాల♦నోద్యోగ సరణుల, సకల మంత్రులు చేరి♦సంప్రదింప

తే॥ నొక్కకడఁ గీర్తిమాగధు♦లొగినుతింపఁ,నొక్కయెడరాజులెడగని♦ మ్రొక్కుచుండ
నిండు కొలువున్న జానకీ♦నేత కడకు, నరుగుదెంచి రలంకృతు♦లగుచుఁ జరులు.

క॥ వచ్చిన చారులఁ గన్గొని, చెచ్చెర నేకాంతగృహముఁ ♦ జేరి నృపతి మీ
రచ్చుగ నిశి వినినది పౌర, పొచ్చెము లేకుండఁ దెలియఁ♦బుచ్చుఁడు నాతోన్. ౧౦౧

తే॥ నాదుభార్యను దమ్ముల ♦ నాదు మంత్రి, వర్గమును నన్నుఁజాటున ♦ బంధువులను
జనులు గృహముల నేమను♦కొనుచు నున్న, వారలో నిజమును జెప్ప♦వలయుఁజుండు.

వ॥ అనిన విని చారులు రామచంద్రుంగాంచి మేఘగంభీరవచనంబుల నిట్లనిరి. ౧౦౩

సుగంధి॥ దేవ నీ యశంబు నీ క్షి♦తిన్ జనావళిన్ గడుం
బావనంబు సేయుచుండెఁ ♦ బౌరు లింట నింట నిన్
భావమందుఁజేర్చి కీర్తిఁ ♦ బాడుచున్నవారు లో
కావనప్రవీణ వింటి ♦ మంతటన్ యశంబునే. ౧౦౪

మ॥ ఇనవంశంబు నలంకరించుటకునై ♦ యీ భూమి జన్మించితో
మును రాజుల్నగరాదు లార్తబలు లీ ♦ భూమి న్గలా రెందరో
ఘనవాహార్చిత వారు నీదు యశముల్ ♦ గాంచంగ లేరైరి యీ
జనలోకంబు కృతార్థత న్గనె నహో ♦ క్ష్మానేత నీ వోటచేన్. ౧౦౫

క॥ ఏనా డకాలమరణం, బే నా డామయభయంబు ♦ నెరుఁగక జను లే
భూనాయకు లేలిరి యిల, నీ నా డవి లేకయుండె ♦ నీ విశ్వమునన్. ౧౦౬

క॥ నారద పారద శారద, నీరద గంగాబ్జహార ♦ నీకాశయశం
బో రజనీ చరమద సం, హార ప్రకాశింపఁజేసె ♦ నవనీతలమున్. ౧౦౭

తే॥ స్వామి యంతట నీ కీర్తి ♦ సర్వజనులఁ, బావనులఁ జేయఁగాఁ గని ♦ పద్మభవుఁడు
సిగ్గుపడుచుండు మాకు నీ♦ శ్రీముఖంబు, నెంత ధన్యులమో చూడ♦ నెప్డుగలిగె.

వ॥ ఇట్లయిదుగురు చారుల నుడువుల విని విలక్షణముఖుం డగు నారవచరునిం గని
శ్రీరాముం డిట్లనియె. ౧౦౯

ఆ॥ నీచజనులవలన ♦ నీవు విన్నది నాకుఁ, జెప్పు మిపుడ నిజముఁ ♦ జెప్పవేని
దుష్కృతౌఘములను ♦ దొరితొరిఁ జేసిన, వాఁడ వగుదు విన్ని ♦ పల్కులేల.

వ॥ ఇట్లు పరిపరి విధంబులఁ బొరింబొరిఁ జెప్పుమనినఁ జారుం డా తుచ్ఛోక్తులఁ జెప్ప
నొల్లక వెలవెలం బోవుచుండుటం గాంచి రాఘవుం డిట్లనియె, నో చారుండ మారు
వల్కక నీ రీతి ఖిన్నుండవై యుంటి వేల సత్యంబుతోడు నిజంబుఁ దెల్పు మన నతం
డిట్లనియె. ౧౧౧

ఆ॥ కారుజనులు వల్కు ♦ కారు కూతలు నీకుఁ, జెప్పదగనివైనఁ ♦ జెప్ప వలసి
వచ్చె రామచంద్ర ♦ పలికెద నే నంచు, చారుఁడనియె మది ఖి♦చార మొదవ,

క॥ రావణహానసము మొదలగు, తావకయశ మన్యయాతు♦ధానాలయమే
తావలముగ నున్న నహో, నీ వనితా యశము వొగడ ♦ నేర్చునె యజుఁడున్.

తే॥ చాకి యొక్కఁడు వీఁటనా♦సాయ మన్య, గృహమునందుండివచ్చిన♦గృహిణిఁగాంచి
యేమనుచువచ్చినావెనా♦యింటికిపుడు, చెడుగ-ఛీయంచుఁబడదన్నెఁ♦బుడమిఁబడఁగ.

ఉ॥ అంతట వాని తల్లిగని ♦ యాగడ మేలర యాడుదాని నీ
వెంతయుఁ గాలఁదన్ను చిటు ♦ లీడ్చెద వేల నదేమి చేసెరా
రంతుల పాలుఁగాక విన♦రా యిఁక నా నుడిఁ బాడెకట్ట నీ
యింతిని నేలుకొమ్మని య♦నేకవిధంబులఁ జెప్పఁ జెప్పినన్. ౧౧౭

వ॥ రజకుం డిట్లనియె. ౧౧౮

తే॥ మండిపడి యోసి నీ వొక ♦ మానిసివలె, నీతిఁ జెప్పఁగ వచ్చితే♦ నిఖిల మెరుఁగ
రావణుని యింటనుండిన♦రాణిఁదెచ్చి, ముఱియుచుండుట కేను రా♦ముఁడను గాను.

తే॥ ఇంతకును రాజు తా నెంత♦లేసి కాని, పను లొనర్చిన నవి నీతి♦వంతములగు
నన్యులెంతటి పుణ్యకా♦ర్యములొనర్ప, ననయ మనయంబులై తోచు♦నవని నవియు.

క॥ ఈరీతిఁ దల్లితోఁ బలు, మా రాతఁడు వల్క నే న♦మర్షంబున నా
కూరిరాత్మని తల నరుకం, బారియు నీ యాజ్ఞ నేను ♦ మానితి దేవా! ౧౧౯

తే॥ రాముఁ డేడను నీచుఁ డీ ♦ రజకుఁడేడఁ, బరమసాధ్విని వీఁడిట్లు ♦ పలుకుటేడ
నోటి కబ్బిన యట్టుల ♦ నుడువు నుడులఁ, బాటిగాఁజేయ నెంతయుఁ ♦ బాడిగాద
టంచు యోచించి వచ్చితి ♦ నవనినాథ. ౧౨౦

వ॥ మీ రానతిచ్చిరేని యిప్పుడ పోయి వాని శిరంబు ఖండించి భూమికిం బలి
యిచ్చెద, నీ వార్త చెప్పందగని దైన మీ యాగ్రహంబునకు వెఱచి చెప్పితి,
నిఁక మీరే ప్రమాణంబు, ముందుపని నాలోచింపుఁ డను నంత. ౧౨౧

క॥ కులిశ నిభాక్షరములు గల, పలుకులు విని రాఘవుండుఁ ♦ బలుమరు నిట్టూ
ర్పులఁ బుచ్చుచు వివశుండై, యిలఁబడెఁ బెనుమూర్ఛదన్ను♦నెలయ మునీంద్రా.

తే॥మూర్ఛితుండయిపడియున్న♦భూమినాథు, గాంచిదుఃఖించిచరులువ♦స్త్రాంచలముల
వీచుచుండఁగఁ గను విప్పి♦చూచి కొంత, వడికిఁ దెలివొంది వచియించె ♦ వారితోడ.

చ॥ భరతుని తోడి తెండిటకు ♦ వైళమ పొండని యాతుధాన సం
హరుఁ డన నేగి చారులు ద♦దాజ్ఞను మ్రొక్కుచు విన్నవింప నా
భరతుఁడు వే సభాస్థలికి ♦ వచ్చి రహస్యగృహంబునన్ ధరా
వరుఁడు వసించుటల్ దెలిసి ద్వారపుఁ ♦ గన్గొని భీతి నిట్లనెన్. ౧౨౪

తే॥ భ్రాత కారుణ్యనిధి రామ♦భద్రుఁ డెచట, నున్న వాఁడనవాఁడాతఁ♦డున్న గృహముఁ
జూపనందునఖిన్నుఁడై ♦చొప్పుదప్పి,యున్న రాముని గని భీతి♦నొంది మదిని.౧౨౫

సీ॥ మాయన్న కుపితుఁడై ♦ పాయనిచింతచే, నిట్లుండుటకుఁ గత ♦ మేమొ యనుచు
వెరఁగొంది పలుమరు ♦ వేఁడినిట్టూర్పులఁ, బుచ్చుచుండెడి రాముఁ ♦ బోలఁజూచి
సుఖసమారాధ్యమై ♦ సొంపొందు నీ నగు,మోము కన్నీటిచే ♦ మఱుఁగుపడక
దేవ రాహుగ్రస్త♦ దేహుఁడౌ యామినీ,పతి విధంబునఁ గను♦పట్టుచుండె
తే॥ నేమికారణమో నిజ♦మెరుఁగఁ జెప్పు,మయ్య నేఁజేయు కృత్య మే♦ మయ్య యింత
దుఃఖభాజనమఘ మేమి♦దొరలెనయ్య,త్వరగఁ జెపుమయ్య దుఃఖింపఁ♦దగునటయ్య.
వ॥ ఇట్లు నుడువుచున్న భరతుంగాంచి గద్గదస్వరంబున రాముం డిట్లనియె. ౧౨౮
ఉ॥ తమ్ముఁడ దుఃఖకారణముఁ ♦ దద్ద వచింతు నెరింగి దాని నైః
శమ్మ్యగఁ బాపుమా మనకు♦లంబునఁ బుట్టిన రాచవారిలో
నిమ్మహి దుర్యశంబుగడి♦యించినవాఁ డొకఁడైన లేఁడు నే
నుమ్మరమైన దుర్యశము ♦ నొందితి నేటి కిఁకేమి చెప్పుదున్. ౧౨౯
తే॥ యమునతో గంగ కలసిన♦యట్ల నాదు, యశము మిక్కిలి యావిల♦మయ్యెఁ గీర్తిఁ
బడయఁ గల్గినవారిదే ♦ బ్రదుకు దుర్య,శమున బ్రతుకుట కన్నను♦జావు మేలు.
చ॥ వసుధను సద్యశంబు కల♦వానికిఁ గల్గును బుణ్యలోకముల్
కసటస మన్ భుజంగమము ♦ గంటిడ వారికినౌ సధోగతుల్
పసదరిగెన్ దలంగఁబడు ♦ స్వర్ధునికిన్ వలెఁ గీర్తి కిప్డు సా
హసమున నిన్న రేయి రజ♦కాధముఁడాడిన మాట వింటివే. ౧౩౦
ఉ॥ ఈ నగరంబునన్ రజకుఁ ♦ డిప్పుడు తమ్ముఁడ బల్దురుక్తులన్
జానకిఁ గూర్చి పల్కె నని ♦ చారులుఁ జెప్పి రిఁకేమి సేయుదున్
జానకినిన్ ద్యజించుటయొ ♦ చయ్యన దేహము నేఁ ద్యజించుటో
మానుగ రెంటిలోన నెది ♦ మంచిదియో వచియింపఁగాఁ దగున్. ౧౩౧
ఆ॥ ఇట్లు పలికి దుఃఖ♦మెంతయుఁ దనుముంపఁ, గన్నుఁగవల బాష్ప♦కణము లురుల
క్షుభిత గాత్రుఁడగుచు ♦ క్షోణిని బడె ధార్మి,కాగ్రగణ్యుఁడైన♦యవనివిభుఁడు.
క॥ ధరఁ బడిన యన్నఁగన్గొని, భరతుఁడు దుఃఖించి తనదు ♦ పరిచర్యల భూ
వరుఁ దేర్చి దుఃఖ నాశం,కరమగు మధురోక్తిఁ బలికెఁ ♦ గడు నమ్రుండై. ౧౩౩
తే॥ ఎవఁడయా చాకివాఁడు నే♦డిటు లవాచ్య,మైన నుడి వల్కె నెట్లు నో♦రాడెనయ్య
పరమ సతి సీతనే యిట్లు♦పల్కినాఁడె, కుమతి నాలుక నిప్పుడేఁ♦గోతుఁ జూడు. ౧౩౪
వ॥ అని మహారోషంబునం బల్కు భరతుఁగాంచి క్రోధం బుడిపి చారునిచే వినిన వృత్తంబంతయు వినిపింప విని భరతుం డిట్లనియె. ౧౩౫
తే॥ అన్న జానకి వహ్నిశు♦ద్ధాత్మగాదె, బ్రహ్మ పరిశుద్ధ యని మున్ను ♦ పల్కలేదె
చేరి దశరథుఁ డట్లనే ♦ చెప్పెఁగాదె, యేల నీ చింత జనపూజ్య♦రాలుగాదె. ౧౩౬

క॥ అజముఖ సురవినుతంబగు, నిజవిమల యశంబు నేడు ♦ నీచతమంబౌ
రజకోక్తిం గలుష మెట్లగు, నిజముగ నది తెలుపుమయ్య ♦ నిఖిలం బెరుగన్.౧౩౭
క॥ నీచుం డెవఁడో పల్కిన, నీచోక్తుల కవనిసుతను ♦ నీ వెఱఁగియు నో
వాచంయమినుత గుణ మది, యోచింపక సాధ్వి విడువ ♦ యోచించితివే? ౧౩౮
శా॥ అన్నా సీతగురించి సంశయము నా♦వంతేం గొనంబోకుమా
యెన్నండైనఁ జెదల్ ప్రపంచమున వ♦హ్నిం బట్టునే చెప్పుమా
యెన్నన్ లోకులు గుర్వీణీ మహిళతో ♦ నీ భూతలం బేలుమా
పున్నెంబు ల్లెడుఁ బాప మాత్మహననం♦బు జ్జేయఁగా నోఁ జుమా. ౧౩౯
తే॥ నీకు నీతులు జెప్పఁగా ♦ నేర నేను, నీవు లేకున్న భువిలోన ♦ నేను లేను
జానకియుఁ దక్షిణంబునఁ♦జావఁబూనుఁ, దక్కవార్జత్తు రెట్టి నీ♦తలఁపుమాను.౧౪౦
వ॥ అనిన రాముం డిట్లనియె. ౧౪౧
ఉ॥ జానుగ నీవు చెప్పినది ♦ సర్వము ధర్మయుతంబ సుమ్ము నీ
కేను వచించినట్టి నుడు ♦ వేదియొ దాని మదాజ్ఞఁజేయుమా
జానకి వహ్నిశుద్ధ కదు ♦ సాధ్వి యటంచును నే నెఱుంగుదున్
బూనితి లోకనిందకయి ♦ భూతనయన్ విడనాడఁగా మదిన్. ౧౪౨
తే॥ కాన యీ దారుణంబైన ♦ కత్తిచేత, నాదుశిరమును దరుగుము ♦ లేద సీతఁ
గానకై నను బంపుము ♦ కరుణమాని, చేయు మెద్దాని నైనను ♦ శీఘ్రముగను.
క॥ అను రాముని మాటలు విని, కనులను బాష్పములుఁ గారఁ ♦గంపయుతుండై
పెనుమూర్ఛగదుర భరతుఁడ,వనిఁ బడె సుడిగాలి నగము ♦ వడిన విధమునన్.

—♦ చిలుక సీతతో శ్రీరాముని చరిత్రంబు జెప్పుట. ♦—

వ॥ అనుటయు విని వాత్స్యాయన మునీంద్రుండు ఫణీంద్రుం గాంచి యిట్లనియె.
చ॥ భువనపవిత్రకీర్తి యగు ♦ భూమిజ నెవ్వఁడో దుర్వచస్సులన్
దవిలి వచించినాఁడనుచుఁ ♦ దద్దయు నమ్మి బహిష్కరింప రా
ఘవుఁ డెటు లెంచెఁ దావకము♦ఖ ప్రసరామృత మేను ద్రావి దు
ర్భవభవభీతిఁ దోలి సుఖ♦భాజ నిఁ కౌదును దానిఁ జెప్పుమా. ౧౪౬
వ॥ అనిన శేషుం డిట్లనియె. ౧౪౭
సీ॥ జనకుఁడన్ భూపతి ♦ జనుల నందరి ధర్మ, పథమున నేలుచు ♦ మిథిలనుండి
యజ్ఞము సేయఁ దా♦నవని దున్నుచు నుండ, సీరాగ్రమునఁ దోచె♦ సీతయనెడు
కన్యక జనకుండుఁ ♦ గడు సంతసం బందె, నా సీత ప్రియ సఖు♦రాండ్రతోడ
నొకనాఁడు విహరింప ♦ నుద్యానవని కేగ, నందు మనఃకాంత ♦ మగుచు మిగుల

తే॥ కామలోలుపమై బహు♦ప్రేమ భరిత, వాక్కులఁ బరస్పరంబును ♦ బల్కు చాక
సమున కెగురుచుదిగుచు బల్ ♦సంతసమున, నెగడుచుండెడిశుకశుకీ♦యుగముఁగాంచె.

వ॥ ఇట్లు పర్వత ప్రాంతంబున నుండు పక్షిద్వయంబుఁ గని సీత సంతసింపుచుండ నందు
శుకిం గాంచి శుకం బిట్లనియె. ౧౪౯

ఉ॥ భూమినిఁ బుట్టు రాముఁ డను ♦ భూమివిభుండు మనోహరుండు నా
రాముని కొప్పు సీత యను ♦ రామ మహోళికయై ధరిత్రి నా
భీమ బలుండుఁ బ్రోచుఁ బది♦వేలకుఁ బై నొక వేయి వత్సరాల్
భూమి మెలంగెదర్ నృపుల ♦ బొంక మడంచుచు నందుఁగానుకల్. ౧౫౦

తే॥ ధన్యురాలా వసుంధరా♦ తనయ సీత, ధన్యుఁడా రామభద్రుఁడి♦ద్దఱును బ్రేమఁ
గలసి మెలసియు నుండఁగాఁ ♦గలరు వారి, దర్శనము సేయు వారలే♦ధన్యులవని.

క॥ ఈవిధ సంభాషణమును, గావించు శుకీ శుకంబు ♦ గని దేవతలే
కావచ్చుఁ గాక యుండిన, నీవిధ భాషణముఁ గలదె ♦ యెందైన మహిన్.

క॥ ఈకథఁ జూడఁగ నిక్కము, నా కథగాఁ దోచె నేర్పు♦నన్ సకియలచే
నాకఁగొనఁ జేసి మఱలన్, వీకనడిగి తెలిసికొనెద ♦ విశదముఁ గాగన్. ౧౫౩

వ॥ ఇట్లు నిశ్చయించి చెలికత్తియలఁగాంచి సీత యిట్లనియె. ౧౫౪

తే॥ మెల్లఁగాఁ బోయి యా పక్షి♦మిథునమిపుడ, పట్టికొనిరం డటంచును ♦ బలుక వార
లేగి యా చిల్కలను రెంటి ♦ నెగిచిపట్టి, తీసికొనివచ్చి యిడిరి వై♦దేహి ముందు.

వ॥ అంతఁ జిల్కలన్ గాంచి సీత యిట్లనియె. ౧౫౬

ఉ॥ ఎక్కడ మీ నివాస మిపు ♦ డెచ్చటనుండిటు వచ్చితీరు నే
నెక్కడఁ దేనెలొల్కు వచి♦యించు శుకంబుల నెప్పు డిట్టి బల్
చక్కదనాల కుప్పల ని♦జంబుగఁ జూచి యెరుంగ మీకు మే
ల్చక్కెరఁబాలుఁ బప్పుల నొ♦సంగెద నా నుడి యాలకింపుడీ. ౧౫౭

ఆ॥ రాముఁ డనఁగ నెవఁడు ♦ రాముని తనుకాంతి, యే విధంబు సీత ♦ యెవరు వేగ
మీకుఁ దెలిసినంత ♦ మీవచశ్చాతురి, తేటపడఁగనాకుఁ ♦ దెల్పుడనిన. ౧౫౮

వ॥ శుకంబు లిట్లు చెప్పం దొడంగె నెట్లనిన. ౧౫౯

సీ॥ అఖిలైకధర్మవి♦దగ్రేసరుండైన, వాల్మీకి యనెడి త♦పస్వి యొకఁడు
గలఁడెప్పుడును బుష్ప ♦ ఫలమనోహరమైన, తత్పావనాశ్రమ ♦ స్థలమునందు
నివసింపుచుండు మా ♦ నిఖిల భూతహితుండు, రామపదధ్యాన♦రతుఁడు మాని
ప్రత్యహంబును భావి♦రామాయణముఁ దన, శిష్యవర్గమునకుఁ ♦ జెప్పుచుండు

తే॥ వినువుఁగొనకను బరిపాటి♦వింటి మెపుడు, రాముఁడెవ్వరో సీత య♦న్నామ యెవరో
వార లిర్వురకైన సం♦బంధమెట్లొ, విన్నవిధమున నీకుఁ జె♦ప్పెదము వినుము. ౧౬౦

తే॥ ఋశ్యశృంగమునీంద్రు కృ♦తేష్టియందు, నాల్గువిధములుగాఁ బద్మ♦నాభుఁడొదవు
నందురాముఁడు సానుజుం♦డగుచుఁ గుశిక, పుత్రికునితోడ మిథిలకుఁ♦బోగలండు.

క॥ దండిమగ లెత్త నేరని, దండధర మదాపహరుని ♦ ధను వవలీలన్
ఖండించి సీత యను వే,దండగమనఁ బెండ్లియాడు ♦ దనుమెచ్చ జనుల్. ౧౬౨

తే॥ సీతతోడను రాజ్యంబు♦సేయురాముఁ, డంచు నందుండియే వింటి ♦ మమ్మ విన్న
దాని నెరిగించినాముక♦దమ్మ నీకుఁ, బోవవలెనమ్మ మాయమ్మ ♦ పుచ్చుమమ్మ.

వ॥ ఇట్లు పలుకు చిలుకల మధురంపుఁ బలుకుల కలరి పంటవెలందిపట్టి యిట్లనియె.

ఉ॥ ఎచ్చటనుండు రాముఁ డతఁ, ♦ డెవ్వని పుత్త్రుఁడు సీత నెట్లు తా
వచ్చి గ్రహించు రూప మెటు♦వంటిది శీల మదెట్టి దిప్డు నా
కచ్చుగఁ జెప్పఁడావలఁ బ్రి♦హార్షము నొందఁగఁజేసి మిమ్ము వే
పుచ్చెద నించుకంత పొర♦పొచ్చెము లేక వచింపుచుంటి నేన్. ౧౬౫

వ॥ అనుటయుఁ గామపీడిత యగు సీతాహృదయంబెరింగి శుకియిట్లనియె. ౧౬౬

సీ॥ అమరులే బలశాలి ♦ నాశ్రయించి సమస్త, శాత్రవులజయింపఁ ♦ జాలినారొ
యట్టి ధీయుతుఁడు హా♦ర్యశ్వవంశధ్వజుఁ, డార్యుఁడు దశరథ♦జ్యావిభునకుఁ
గౌసల్యయు సుమిత్ర♦కైకయన్ భార్యలు, మువురౌదు రిందు స♦మ్మోహకరులు
వారియందున రామ♦ భరతలక్ష్మణులన,శత్రుఘ్నుఁడన ♦ సుతుల్ జననమగుదు

తే॥ రందు రాముఁడు రఘునాథుఁ♦డనెడిఖ్యాతిఁ,గాంచునామము లమితము♦ల్గల వతనికి
పుండరీకనిభాక్షుఁడు♦పుల్లపంక,జాభలపనంబుగల్గు వాఁ♦డతఁడు మఱియు. ౧౬౭

క॥ పొడవైన మనోహరాకృతి, వడసిన నాసికగలాఁడు ♦ వరశష్కులులన్
గడవెట్టు చెవులవాఁడు, న్బెడఁగగు కనుబొమలు గల్గి ♦ నెగడెడువాఁడున్. ౧౬౮

వ॥ మఱియు. ౧౬౯

అంబురుహాము॥ జానువిలంబిత చారుకరుండును ♦ శంఖతుల్య గళుండు దీ
ర్ఘైన విశాలపు రొమ్ముగలా డ్నును♦పైన సక్థులు గల్గువాఁ
డ్జానుగ మిక్కిలి నానికలై తగు ♦ జానువు ల్గలవాఁడు భూ
జానులు మొక్కెడు పాదములుం గల ♦ జాణ యంచును వింటినేన్. ౧౭౦

క॥ ఈ రూపశాలి యగు నా,శ్రీరాముని వర్ణనంబు ♦ సేయంగలనే
నూరాననములు గల్గిన,వారే చాల రని వింటి ♦ వనరుహనేత్రీ. ౧౭౧

ఉ॥ చక్కని వారిలోనఁ గడుఁ ♦ జక్కనిదే కద లక్ష్మి విష్ణు పే
రక్కున నుండె మోహమున ♦ నాతనిఁ దా విడువంగలేక నే
లెక్కఁ గొనంగనేలఁ బెర♦లేమల నాతఁడె రాముఁడంచుఁ బే
రెక్కినవాఁడు వేయినుడు♦లేలఁ గనన్ దగువాఁడుఁ గన్నులన్. ౧౭౨

క॥ అతిబలుఁ డతివీర్యయుతుం, డతి మోహన రూపవంతుఁ♦ డఖిలైశ్వర్యా
న్వితుఁ డతఁ డాతని మాదృశ, పతగు లహా చాలువారె ♦ వర్ణింపంగన్. ౧౮౩

ఆ॥ దయకుఁ బుట్టినిల్లు ♦ దాక్షిణ్యమున కిక్క, నయమునకును తావు♦న్యాయమునకు
నెలవు సత్యమునకు ♦ నిల్క డన్నిట వాని, కెన ధరిత్రి నెన్న ♦ నెందుసున్న.

తే॥ మోహనాకృతిఁ గైకొన్న ♦ భూమితనయ, ధన్యురా ల్పదివేలవ♦త్సరము లెలమిఁ
గలసి క్రీడింపఁ గలదు రా♦ఘవునితోడ, వారి దాంపత్యమును జూచి♦తీరవలయు.

క॥ అమ్మా యెవరవు? పేరే, మమ్మా వైదగ్ధ్యముగను ♦ నా రాము కథల్
మమ్ములఁ బలుమారులు విన, యమ్మున నడిగెదవు జాన♦కమ్మవె చెపుమా. ౧౮౬

వ॥ ఇట్లు పలుకు చిలుకల పలుకులు విని సీత మనోహరంబగు తన జన్మవృత్తంబిట్లు
సెప్పె. ౧౮౭

ఉ॥ జానకి యంచు మీరిపుడు ♦ జానుగఁ జెప్పుచు నున్నవార లా
జానకి నేనె రాఘవుఁడు ♦ చారుపవిత్ర చరిత్రుఁ డెవ్వ నన్
గానఁగ వచ్చునో యప్పుఁడ ♦ గట్టిగ నే విడిపింతు మిమ్ములన్
మీనుడులన్ విన న్మదికి ♦ మెచ్చు జనించెను వీడ నిప్పుడే. ౧౮౮

క॥ లాలించెద స్నేహంబునఁ, బాలించెదఁ బంచదార ♦ బండు లొసఁగి నే
నాలించెద మీ పలుకులుఁ, దేలించెద మోదవార్ధిఁ ♦ దిరముగ మిమ్మున్. ౧౮౯

తే॥ అనెడు మాటల కధికభ♦యంబు నొంది, దుఃఖభారంబున నొకింతఁ♦దూలుచుండి
వడఁక మేనులుతహతహ♦పడుచుమదిని, జనకసుతఁగూర్చిపలికెనా♦శకునయుగము.

తే॥ అమ్మరో మేము పక్షుల ♦ మమ్మ మాకుఁ దర్వులే యాటపట్టులం♦తటనుదిరుగు
చుందుమే కాని యిండ్లలోనుండసౌఖ్య, మించుకంతయు లేదమ్మ♦యెరుఁగుమమ్మ.

క॥ ఈ నా సతి గర్భిణి స్వ, స్థానంబున కేగి యచటఁ ♦ దనయులఁగని నీ
వానందింపఁగ నాతో, నూనంబుగ వచు నాదు♦నుడ్చి నిజముసుమా. ౧౯౨

వ॥ ఇట్లు వేడికొనినను దమ్ము విడువకుండు సీతంగాంచి నిరుత్సాహంబున దీనవదన
యై శుకం బిట్లనియె; ౧౯౩

శా॥ ఈ లీలన్ వచియింపఁ బోకు మబలా♦యీ నా మనోహారిణిం
జూలాలిన్ భరియింప నీకు వశమా ♦ చూలున్ జెడున్ నిల్వఁగాఁ
గాలంబే యిది కాదు నీ వెరుఁగవో ♦ కాంతామణీ కానలన్
లీలన్ సంచరణంబు సేయుదుము హా♦ళిం బంపుమా యీ తరిన్. ౧౯౪

వ॥ అనిన సీత యిట్లనియె. ౧౯౫

క॥ శుకమా వినుమా యాలిం, పక విడుతునె దీని నుడులు ♦ మది ననుమానిం
పకుమా చనుమా యిఁక నే, ల్త్రికముల పండ్లిచ్చి దీని ♦ లాలింతుసుమా.

వ॥ ఇట్లు సీత పలుక దుఃఖితయై శుకం బిట్లనియె.

తే॥ తరుచుగామాటలాడుట♦తగదుతగద, టన్న యోగుల నుడి మిథ్య♦యగునెయెప్పుడు
మౌనమే మంచిదది మది♦మఱచెనేని, వాక్యదోషంబుచే వాఁడు ♦ బద్ధుఁడగును.

ఆ॥ ఏముచెట్టుమీఁద ♦ నేమియు నిప్పుడు, పల్కకున్నఁగలదె ♦ బంధనంబుఁ
గాన మౌనముదగ్రి ♦ కడుమేలుమేలని, ధరణితనయతోడ ♦ మఱల ననియె. ౧౮౯

క॥ అమ్మా వినుమా యో సీతమ్మా నా ప్రియను బాసి ♦ యరనిముషము నే
నిమ్మహి బ్రతుకను బ్రేయసి, నిమ్మా నా వందనంబు♦లివియే కొమ్మా. ౧౯౦

వ॥ ఇట్లనేక విధంబుల బోధింప నందుఁ బురుషశుకంబు విడచె నదియుఁ దన పత్ని
విడచి పోవంజాలక సమీపంబున ఖిన్న వదనయై యుండె నది చూచి తత్పత్నియగు
శుకి కుపితయై యిట్లనియె.

క॥ నా పతితోడను నన్నిపు, డే పగిదిని జాలిలేక ♦ నెడవాపితివో
యా పగిదినె రామునితో, నేపరి యెడఁబాటు నొందు♦మీ గుర్విణివై. ౧౯౨

తే॥ ఇట్లు శపియించి పతిఁగూర్చి♦యేడ్చియేడ్చి, భూరి పరితాపవశమునఁ♦బొగిలిపొగిలి
రామరామాయటంచప్డె ♦ ప్రాణములను, బాసి పుష్పకమునఁజేరె ♦ స్వర్గపురము.

క॥ సతి మృతి నొందుట కా శుక, మతిదుఃఖిత యగుచుఁ గ్రోధ ♦ మాపఁగలేకన్
మతిచెడి గంగానదిలోఁ, గుతిలముతోఁ గూలు చిట్లు ♦ గుందుచుఁ బలికెన్. ౧౯౪

తే॥ రామచంద్రు నయోధ్యాపు♦రంబునందుఁ, బుట్టి రాముని కతిక్రోధ ♦ పుట్టునట్టు
కాని దుర్వాక్యములఁ గొన్ని ♦ కడఁకఁ బలికి, సీత నాతనితోఁ బాయఁ ♦ జేతుఁగాక.

వ॥ ఇట్లు పలుకుచు మహావర్త భీకరం బగు గంగానదీ ప్రవాహంబునఁబడి మరణంబు
నొందె. ౧౯౬

ఆ॥ సంయమీంద్ర శుకము ♦ చచ్చునప్పుడు మహా, దుఃఖతామసములు♦దొరలుకతన
నవనితనయ కట్టి ♦ యవమానమును జేయు, కతన నీచభవముఁ♦గాంచెవింటె. ౧౯౭

తే॥ ఉగ్రకోపవశంబున ♦ నోడలెఱుఁగక, మంచివారలఁ దిట్టుచు ♦ మరణ మొందు
జన్ని గట్టును నిజ మంత్య♦జత్వ మొందు, ఖగము క్రోధను డగు చాకి♦యగుచుఁబుట్టె.

వ॥ అట్లు రజకునిచే నిందితయగు సీతను శ్రీరాముఁ డరణ్యంబున కంప నిశ్చయించెనని
చెప్పి మునీంద్రా నీ వడిగిన ప్రశ్నంబునకు సమాధానంబుఁ జెప్పితిఁగాదె యిఁక
నా వృత్తాంతంబుఁ జెప్పెద విను మని శేషుం డిట్లనియె. ౧౯౯

—♦ లక్ష్మణ శత్రుఘ్నులు మూర్ఛ నొందుట ♦—

తే॥ మూర్ఛనొందిన భరతురా♦ముండుఁజూచి, వేగ శత్రుఘ్న నీ వేగి ♦ పిలువుమనిన
యంతఁ బ్రతిహారుఁ డచ్చటి♦కరిగి రాము, నాజ్ఞ దెలుపఁగ శత్రుఘ్నుఁడరుగు దెంచి.

క॥ పడియున్న భరతుఁ గన్గొని, కడుదుఃఖితుఁ డైన రాముఁ ♦ గని దుఃఖితుఁడై
పడి యాతని యడుగులపై, నడలుచు నీ దారుణం బ♦యా యే మనినన్. ౨౦౧

వ॥ అంత రాముఁ డధోముఖుండై మేనువడఁక గద్గదస్వరంబునఁ బదసేవకుండగు శత్రుఘ్నుని గాంచి యిట్లనియె. ౨౦౨

మ॥ అనుజా యిప్పుడు నాదు కీర్తి మలినం ♦ బందెన్ ధరాయాతస్వ
ర్ధునివోలెన్ బరిశుద్ధ మొందునటులన్ ♦ దూగింపుమా నేడు దు
ర్జనుఁడౌ చాకి యొకండు జానకి నవా♦చ్యంబుల్ వచించెన్ గటా
విను ప్రాణంబులనో విదేహసుతనో ♦ వీడంగ నూహించితిన్. ౨౦౩

క॥ అను రాముని వచనంబులు, విని శత్రుఘ్నుండు చాల ♦ వెతనొందుచు మూ
ర్ఛను బొంది తెలిసి యప్పుడ, తన యన్నంగాంచి యనియెఁ ♦ దత్తఱపడుచున్.

శా॥ అన్నా సీతను దారుణంబుగను ని♦ట్లాడంగ ధర్మంబె దం
దన్న ల్దుష్టులు ధర్మబాహ్యు లొక కొం♦దర్ దూషణల్ చేసిరం
చెన్నండైన శ్రుతిన్ ద్విజోత్తములు గ♦ర్హింపంగ లో నెంతురే
కన్నా మే చెడుగుల్ స్పృశించి రనుచున్ గంగ ♦ న్విసర్జించుటల్. ౨౦౫

తే॥ లోకబాంధవు తేజంబు ♦ లోకమునకుఁ దేజమును సంతసంబును ♦ నోజసేయు
ఘూకముల కిష్టమదిగాదు♦కువలయేశ, యధముఁడనునంతమన కేమి♦హాని చెపుమ.

ఆ॥ సీత శుద్ధ యనుచు ♦ వీతిహోత్రుఁడెరుంగు, ధాత యెరుఁగు గుహుని♦ తాత యెరుగు
నీదు తాత యెరుఁగు ♦ నీ వెరుంగుదు విఁక, వేయుమాటలేల ♦ విశ్వ మెరుఁగు. ౨౦౭

తే॥ కారుకులజుండుఁ గూసిన♦కారుకూత, నూత గను జేసి సీతను ♦ బూతచరిత
నీతరి వెడలఁబుచ్చుట ♦ నీతిగాదు, సంశయింపక నెసరుంచి♦సాకుమన్న. ౨౦౮

వ॥ ఇట్లనేకవిధంబులం జెప్పినను వినక సిర్దయుండై రాముండు భరతునకుఁ జెప్పిన చందంబునఁ బలుమారులుఁ జెప్ప శత్రుఘ్నుండు దుఃఖప్రవాహంబున మునింగి మూలంబు తెగిన నగంబు వడువున మూర్ఛనొంది పుడమిం బడియె నంత. ౨౦౯

క॥ తనువెరుఁగని తమ్మునిఁగని, మనుకులతిలకుండు దుఃఖ♦మగ్నుండై తా
ననేఁ బ్రతిహారునితో సర, గునఁ జని లక్ష్మణునిఁ దోడి♦కొనిరమ్మనుచున్. ౨౧౦

క॥ అంతట నాతం డాతని, యంతికమున కరిగి రాము♦నాజ్ఞఁ దెలుపఁగా
నింతటిలో నను రమ్మను, నంతటి పనులేమి కల్గె♦నని వ్యగ్రుండై. ౨౧౧

తే॥ వచ్చి సౌమిత్రి వగఁదల♦వాంచియున్న, యన్నఁగని మూర్ఛఁబడియున్న♦యనుజులఁగని
యధిక దుఃఖంబుఁదనుముంప♦నవయవములు, వడవడవడంకన నెరఘూ♦ద్వహునితోడ.

శా॥ అన్నా యీ విపరీత మే మిరువురున్ ♦ హామూర్ఛయందున్న వా
రెన్నండైనను దుఃఖభారమున నీ♦ వీ రీతిగా నుంటివే

యన్ననా్న యిటులున్న నిన్నుఁ గనఁగా ♦ నాయె న్గటా యెవ్వరే
మన్నారో యఘమేమి దొ్రసై్ర నోకో నా ♦ కాద్యంతముం దెల్పుమా. ౨౧౩

వ॥ ఇట్లు పల్కుచున్న లక్ష్మణునిం గాంచి రాముండు రజకోక్తులు మొదలుగాఁగల వృత్తంబు సర్వంబునుం దెలుప సౌమిత్రి నిట్టూర్పులు పుచ్చుచు దుఃఖభారంబున నేమియుం జెప్పఁజాలక స్తబ్ధగాత్రుండై యుండెనప్పుడు రాముండు శోకార్దితుండై తనలో నిట్లని తలపోసె. ౨౧౪

సీ॥ ఏ నేమి సేయుదు ♦ నినవంశ నృపులలో, నపకీర్తి పాలైతి♦నక్కటకట
యూడిక నొందుచు ♦ నవని జీవింపఁగ, నేర దేహంబుతోఁ ♦ దీరువాఁడ
నెప్పుడు లక్ష్మణుం♦డేఁ జెప్పుమాటలు, వినుచుండు వాఁడిష్టు ♦ విధివశమునఁ
బ్రతికూల వచనముల్ ♦ పలుకుచున్నవాఁ, డెచట కేగుదు నాశ్రి♦యింతు నెవని?

తే॥ వసుధ కుస్థుని గని రూప♦వంతులు వలె, నపయశోవంతుఁగని నృపు♦లపహసింతు
రనఘు లీ మనువంశజు♦లంద రిపుడు, పుడమి విపరీతమయ్యె నే♦బుట్టుకతన. ౨౧౫

వ॥ ఇట్లు పల్కుచున్న రాముంగాంచి లక్ష్మణుం డశ్రులు గన్నుల నాపి వికలసర్వాంగుడై యిట్లనియె. ౨౧౬

క॥ స్వామీ దుఃఖింపకుమా, యేమాయెను నీదు బుద్ధి ♦ యీ సాధ్విని నీ
వా మాడ్కి ననెదె భువిలో, నే మానవుఁడైనఁగాని ♦ యిటులఁ బలుకునే. ౨౧౭

తే॥ చాకిఁ బిలిపించి యో యవి♦వేకి పరమ,సాధ్వి యన్నుల మిన్నయా♦జనకతనయ
నెందుకయినింద'జేసెదో♦యెరుఁగఁజెప్పు,మనుచునుడివిన వాఁడేమి♦యనఁగలండొ?

ఆ॥ అల్పుఁడైన వాని ♦ నబలల బాధించు, నతఁడు నీదు దేశ ♦ మందు లేఁడు
గనుక వాని హృదయ♦మునఁ బ్రీతియు నెట్లొ,యట్ల సేయుమయ్య♦యవనినాథ.

తే॥ భీరువుఁ బతివ్రతయు నగు,ధారుణి సుత, నెందుకయి వీడఁబూనితో♦యెరుఁగ జనక
తనయవాఙ్మనముల నన్యుఁ♦దలఁచునదియె, వీఁడెదను సీత ననుమాట♦వీఁడుమన్న.

—♦ రాముఁడు సీత నరణ్యంబున డించి రమ్మని సౌమిత్రితోఁ జెప్పుట. ♦—

క॥ నాపయిఁ గృపనించుక నిడి, నా పల్కులు వినుమటంచు ♦ నమ్రతఁబలుకన్
భూపతితమ్మునితోఁ బరి,తాపమునను బల్కె నిట్లు ♦ తాపసవర్యా. ౨౨౧

చ॥ కరమిటు వల్కనేల నన♦ఘా యఘదూరయటంచు సీత నే
నెరుగు దనిందితాత్మయని ♦ యెప్పుడెరుంగుదు నైన లోక దు
ర్భరతరదుర్వచస్సులను ♦ బాచఁగలేక మదీయ కీర్తియున్
దరుగు నటంచు జానకిని ♦ దమ్ముఁడ వీడఁగఁ బూనితింజుమా. ౨౨౨

ఆ॥ లోకవాదభీతి ♦ లోఁగుచు నిన్నైన, వీఁడు వాఁడ సిరుల వీఁడువాఁడ
వేయుమాటలేల ♦ వీఁడుదన్నిఁటి సీత, వీఁడుటనఁగ నెంత ♦ వింతనాకు. ౨౨౩

తే॥ భువనవిశ్రుతమైఁగడుఁ ♦ బొల్చుయశము, కన్న నాకెక్కు వెవరును♦గారునిజము
కాలవశమున సర్వంబుఁ ♦ గల్గుచుండు, చాకలేల వివాదంబు♦సల్పుటేల. ౨౧౪

ఆ॥ చెడు చికిత్సనెంతఁ ♦ జేసిన నామాము,యంబు పోద కాల ♦ మగుటకతనఁ
గడపటదియచూడఁ ♦ గాల పరీపాక,మునను భేషజమునఁ ♦ బోవు సుమ్ము.

ఉ॥ కాలము చేత నన్నియును ♦ గాగల దెప్డు విలంబమేల నీ
శీలవతిన్ బతివ్రతను ♦ జేర్పు మరణ్యము నందు లేక యీ
వాలున నన్నుఁజంపు పెర♦పల్కులతోఁబని లేదటంచు నీ
లీల వచింప డెందము చ♦లింపగ లక్ష్మణుఁ డారటంబునన్. ౨౧౬

వ॥ మనంబున నిట్లు విచారించె. ౨౧౭

ఆ॥ తండ్రియాజ్ఞ చేతఁ ♦ దల్లినే చంపెను, పరశురాముఁ డంత ♦ వాఁడుమున్న
గురువునాజ్ఞఁదోఁయఁ ♦ గూడ దెన్నండైన, యుక్తమైన నది య♦యుక్తమైన.

వ॥ కావున రామాజ్ఞచే జానకి నరణ్యంబునకుఁగొనిపోయెదనని మనంబున నిశ్చయించి యన్ననుం గాంచి యిట్లనియె. ౨౧౯

తే॥ గురువునానతి లంఘింపఁ ♦ గూడదనుచుఁ, జేయఁగూడని పనియైనఁ♦జేయవలయుఁ
గావునను నీవు చెప్పిన ♦ కరణిఁజేతు, ననెడి సౌమిత్రిఁగని రాముఁ ♦ డనియె నిట్లు.

సీ॥ బాగు మేల్మేల్మహా♦ప్రాజ్ఞ నీచే నాదు, డెంద మత్యంత మా♦నంద మొందె
నీరాత్రియే తాప♦సీక్షణముం జేయఁ,గాఁగోరె జానకి ♦ గాన నట్టి
మిషచే శతాంగంబు ♦ మీద నెక్కించుక, విపినంబునకుఁబోయి ♦ విడువుమనిన
వెలవెలఁ బోవుచు ♦ భీతిచే సౌమిత్రి, కన్నీరుగార దుః♦ఖమునఁ గుంది

తే॥ సద్మమున కేగి తన యాజ్ఞ ♦ స్యందనంబుఁ, గూర్చి సారథి తెచ్చినఁ♦గూరుచుండి
పోయె శోకవశంబునఁ ♦ బోగిలి లోనఁ, బల్లటిల్లుచు జానకీ♦భవనమునకు. ౨౨౦

వ॥ ఇట్లు లక్ష్మణుండు సీతాంతఃపురంబున కరిగి దుఃఖంబు పైకిఁ దోపనీయక నిట్టూర్పులు వుచ్చుచు సీతం గాంచి యిట్లనియె. ౨౨౧

క॥ తల్లీ వని జడదారుల ♦ యిల్లాండ్రంజూడ నిప్పు♦డేగుమటంచున్
దెల్లంబుగ వనె రాముం♦డుల్లంబున నుండుఁ గోర్కె♦లాడఁగూడె నిఁకన్. ౨౨౨

తే॥ రమ్ము వైళమ్మ యిదిగో సా♦రథి రథమ్ము, సజ్జముగఁ జేసి తెచ్చెను♦జాగిఁ కేల
నమ్మ యన సంతసంబున♦స్వాంతమందుఁ, బొంగుచనెలక్ష్మణునితోడ♦భూమితనయ.

ఆ॥ రామచంద్ర పాద ♦ రాజీవములను జింతనము సేయు నేను ♦ ధన్యురాల
నైతి మరదిఁ బ్రేమ♦నంపె నా దోహద, పూర్తికొరకు విభుఁడు ♦ పుణ్యమే మొ.

సీ॥ పతులు దేవతలుగ ♦ భావించుఁ దాపస, సతుల కిప్పుడు నతుల్ ♦ సల్పుదాన
నంబరంబుల మహా♦ర్ఘాభరణంబుల, నిచ్చి పాదముల భ♦జింపుదాన

మణులు చందనమును♦మౌక్తికంబులు మొదల్, పసమించువస్తువు♦లొసఁగు దాన
స్నేహంబు నెరపి నే ♦ సెలవును బొంది నా, పతిసేవకు బిరాన ♦ వచ్చుదాన
తే॥ ననుచు దాసీకరంబుల ♦ నఖిల వస్తువులను, గ్రహియించి పతిపాద♦ములఁ దలంచి
వచ్చుచుండఁగ దేహాళిఁ♦బదము తొట్రుఁ, బడిన నది లెక్కఁగొనక దే♦వరునితోడ.
క॥ ఎక్కడ సారథి కలఁడే, నెక్కడి రథ మేది యనఁగ ♦ నెంతయు నెదలోఁ
బొక్కుచు జానకితో రథ, మెక్కెను సౌమిత్రియూర్పు♦లిచ్చుచుఁ గడకన్. ౨౩౭
వ॥ అంత లక్ష్మణుం డశ్రుపూర్ణముఖుండై సుమంత్రుంగాంచి తురంగంబుల నతి త్వరితగతిన్ దోలుమనిన నాతండట్లసేయ నవిస్ఖలద్గమనంబులై నడవక పడుచుండ సుమంత్రుండు సౌమిత్రింజూచి యిట్లనియె. ౨౩౮
క॥ వారువములెంతగొట్టినఁ, బారవు నే నేమిసేతుఁ ♦ బడుచున్న విలన్
గారణమేమియొ తెలియఁగ, నేరను వాహముల నడప♦నేరను గంటే. ౨౩౯
వ॥ అనిన లక్ష్మణుం డతనింగాంచి సుమంత్రా కశలన్గొట్టుచుఁ బ్రియత్నంబున సందోలుమనిన నతం డట్లసేయుచు బలాత్కారంబునఁ దోలుచుండె నంత. ౨౪౦
తే॥ అదరెఁ గడుదుఃఖసూచకం♦బగుచు భూమి, తనయ కుడికన్నుమదిలోనఁ♦దక్షణంబ
యొదవెశోకంబుశోకింపు♦చుండఁజూప, గరుడముఖఖగములుచుట్టుఁ♦దిరుగుచుండె.
క॥ ఆ విపరీతంబును గని, దేవరునింగాంచి యనె వి♦దేహాత్మజ భూ
దేవకులాంగనలన్ గన, నీ వెరపున నాకుఁగోర్కె ♦ లెందుకుఁ బుట్టెన్. ౨౪౧
తే॥ క్షేమమగుఁగాఁత నాపతి ♦ రామునకు శుభంబు గల్గునుగాత మా♦భరతునకును
మంగళంబగు నా పిన్న ♦ మరది కిపుడు, వారిసంతతి కగుఁగాత ♦ భావుకములు.
ఆ॥ ఎల్లజనులు సిప్పు ♦ డేవిపర్యయములు, లేక మెలఁగుచుండ్రు ♦ గాకనుచుఁ
బొగులుచున్నసీతఁ ♦ బొడఁగాంచి సౌమిత్రి, పలుకకుండె దుఃఖ♦భారమునను.
వ॥ అంత సీత యిట్లనియె. ౨౪౫
మ॥ మరదీ నేఁ బిలువన్ బరాఙ్ముఖుఁడవై ♦ మాటాడవేమయ్య బల్
దిరుగన్ జొచ్చెను వామభాగమున నా♦ర్తిం గుంద నే నీ మెకా
ల్వారు పాదంబుల వీడినట్టి కుమతిన్ ♦ భావ్యంబ యి ట్లాట నా
కరయన్ స్త్రీలకు ధర్మమౌ స్వపతిపా♦దాబ్జార్చనల్ సేయుటల్. ౨౪౬
క॥ ఈవిధమునఁ బల్కుచుఁ దన, భావమునను గుతిలపడుచుఁ ♦ బరిపరిగతులన్
బోవుచుఁ గాంచెను ముందటఁ, బావనమునిసేవ్యమాన ♦ భాగీరథినిన్. ౨౪౭
వ॥ అది దగ్ధనిభంబులగు జలకల్లోలంబులుఁ గలదియుఁ దదంభఃకణ స్పర్శంబుచేఁ దొలంగి యుండి యెచ్చటన్ జోటుఁ గనకఁ దిరుగుడు వడు దురితౌఘంబులు గలదియు

స్వర్లోక సోపానంబులు వోలె నొప్పుచున్న తరంగ పరంపరలు గలదియునై కను
పట్టునట్టి గంగంజేరి లక్ష్మణుండు సీతంజూచి యిట్లనియె. ౨౪౯

క॥ అమ్మా రథమును దిగి రా, వమ్మా పోవలెను నేటి ♦ కావలి కని బా
ష్పమ్ములుఁ గార్చుచు నన సీ,తమ్మయు దిగి నిల్చెఁ బుడమి♦తహాతహ పడుచున్.

ఉ॥ అంతట లక్ష్మణుండు జన♦కాత్మజతో నదిదాఁటి కాననా
భ్యంతర సీమ కేగుతరిఁ ♦ బాదములందున రాలు ముళ్లు న
త్యంతము గాడఁ గుంది చడు ♦ గద్దుకుఁ దూలుచునుండు జానకిన్
జింతిలుచు న్మనంబునను ♦ జేకొని తా నడిపించె మెల్లఁగాన్. ౨౫౦

వ॥ ఇట్లు రాఘవాజ్ఞావిధాయకుం డగు లక్ష్మణుండుఁ జనిచని ఖర్జూర ఖదిర శ్లేష్మా
తక చించడీకాశ్వత్థ వటకుటజాది భీకరానోకహాకరంబును దావానలభయంక
రంబును సకలజన మనోవికల కరకూరోలూకాది విష్కిరవిసర పరివృతంబును
తరుకోటరగతకుపితోరగఫూత్కారత్రస్తాఖిలలోకంబును సకలజంతు మనస్తాప
కరణచణ మహాగ్రహవ్యగ్ర వ్యాఘ్రహర్యక్ష తరక్షువరాహ మహిషారావ రావి
తంబును నగు మహారణ్యంబుఁ జొచ్చునంత సీత భీత్యుపగతజ్వరయై లక్ష్మణునిం
గాంచి యిట్లనియె. ౨౫౧

సీ॥ సౌమిత్రి యిచట శు♦ష్కనగంబులేకాని, జటిలాశ్రమంబు లె♦చ్చటను లేవు
లక్షింప దావాన♦లజ్వాలలేకాని, మునిహోమ వహ్ను లెం♦దునను లేవు
కాననఁగ నెందున ♦ మానవాదులెకాని, పరమర్షి పత్ను లే♦వలను లేరు
కాకఘూకాదిభీ♦కర రావములెకాని, శ్రుతినినాదంబు లె♦చ్చోటలేవు

తే॥ అశ్రుపూర్ణాకులాక్షుండ ♦ వగుచు లోనఁ, గుందెదవు చాల సింతకు♦ముందుఁజూడ
దుష్టశకునసహస్రంబుఁ♦దోచె నకట, యేమిపాపంబు దొరలెనో♦ యెరుఁగఁజెపుమ.

ఆ॥ పాపినైన నన్నుఁ ♦ బంపె నేమని రాముఁ, డనుచుఁ బల్కు సీతఁ ♦ గనుచు నాతఁ
డశ్రు రుద్ధనేత్రుఁ♦డగుచు దుఃఖంబున, నొక్కమాటఁ జెప్ప♦కుండెనపుడు. ౨౫౩

క॥ పలువిధముల దుఃఖింపుచుఁ, బలుమారులుఁ జెప్పుమనుచుఁ ♦ బరిపరిగతులన్
బలికెడు సీతను గని యే, పలుకును దలవాంచి యతఁడుఁ ♦ బలుకకయుండెన్.

క॥ అప్పుడు జానకి మనమునఁ, దెప్పరముగ నలిగి కనులుఁ ♦ దెరచి మరందీ
చెప్పవదేమయ సీవిఁకఁ జెప్పకతప్పదు నిజంబుఁ ♦ జెప్పుము నాతోన్. ౨౫౫

వ॥ అని నిర్బంధించిన సీతంగాంచి లక్ష్మణుం డిట్లనియె. ౨౫౬

క॥ అమ్మా యేమని చెప్పుట, కమ్మా నోరాడదమ్మ ♦ యధముని మాటల్
నమ్మి మదుక్తుల వినక వ, నమ్మునఁ బతి వీడుమంచు ♦ నన్నంపె ననన్. ౨౫౭

తే॥ వజ్రిపాత నిభంబగు ♦ వచనమునకు, మొదలు దెగిపడు లతవోలె ♦ భూమిఁబడిన
తనసుతను ధాత్రిగ్రహియింపఁ♦దలఁచదయ్యె,విడుచునె విగతకల్మష♦విభుఁడటంచు.

వ॥ ఇట్లు మూర్ఛిలి నేలంబడియున్న సీతంగాంచి దుఃఖంచి లక్ష్మణుండు పల్లవాగ్రం
బులచే వీవఁ దెలివొంది యిట్లనియె. ౨౫౯

మ॥ పరిహాసం బొనరింపఁ బోకుమయ నా ♦ ప్రాణేశ్వరుం డిట్టు ని
ష్కరుణన్ నన్నపరాధహీన విడువం♦గా నెంచునే కాదు కా
దరయన్ నీ ముఖ మొప్పకున్నదియ దుః♦ఖార్తుండవై యుంటివో
మరదీ నిక్కమె యెంతేఁ జేసితివి రా♦మా యంచుఁ గూలెన్ భువిన్. ౨౬౦

తే॥ ఒక ముహూర్తంబునను దెలి♦వొంది దుఃఖ, మగ్నయై విభుపాద తా♦మరసములను
స్మరణసేయుచు నను రఘు♦వరుఁడు బుద్ధి, శాలి విడుచునె దయవీడి♦స్వాంతమందు.

క॥ నా కొరకు సాగరంబును, వీఁకను బంధించెఁ బ్లవగ ♦ వీరులతోడన్
జాకలి మాటల కైన, న్నే కరణి నపాపిఁజేయు ♦ నిలువెడలంగన్. ౨౬౨

క॥ దైవ ప్రతికూలముచే, నే విపరీతంబులైన ♦ నెడపక పుట్టున్
గావున నేమనఁ దగునని, భావమునను బొగిలి మఱలఁ ♦ బడె మూర్ఛ భువిన్.

వ॥ ఇట్లు నేలంబడియున్న జానకింజూచి లక్ష్మణుండు వికృత స్వరంబున నేడ్చె నంత
కొంతవడికిఁ దేరి లక్ష్మణుం గని దుఃఖాతిశయంబున గద్గదస్వర యగుచు సీత
యిట్లనియె. ౨౬౪

తే॥ త్వరగఁ బొమ్ము యశోనిధి ♦ ధర్మమూర్తి,యైన రామునికడకు రా♦మానుజన్మ
దురితరహితయటంచు నీ♦వెరిగినన్ను, గానకంపితి విదియేమి ఘనత యనుము. ౨౬౫

తే॥ వంశమునకును దగినట్టి♦పనియ యిదియొ, యెల్ల శాస్త్రాలుఁ జదువుట♦కిదియఫలమొ
యెపుడు నీపదరక్తనై ♦ యెంగిలిఁదినను, చన్నె మెరుఁగని నన్వని♦కంపినావు. ౨౬౬

క. అంతకు దైవము కారణ, మంతరమునఁ గుందనేమి ♦ యగు నా తను వు
న్నంతకు నీచరణంబులు, స్వాంతమున స్మరింపుచుందు ♦ ననుము మరందీ. ౨౬౭

ఆ. రఘుకులావతంస ♦ రాధ్యం బొనర్చుచు, నుండు మేనుఁగాన ♦ నుసురులుండు
వరకు నెప్డు నిన్ను ♦ మరవను ద్రికరణ, శుద్ధిననుచుఁ జెప్పు ♦ మిద్ధచరిత. ౨౬౮

సీ॥ ఈవయుత్త ముఁడ వం♦చెంచుచు నన్యుల, నీచులుగా నెప్డు ♦ జూచితనుము
జన్మజన్మమునకు ♦ స్వాంతమందున నీవ,యుడుగక పతివంచు ♦ నుంటి ననుము
నిరఘ న నాథ్రిముఁడు ♦ బరచె నడవికంచు, ముగురత్తలకుఁ జెప్పి ♦ మొక్కితనుము
వ్యాఘ్రాది మృగయుత ♦ వనమందునుండి యు,మ్మత్పాదములను నే♦ మరువననుము

తే॥ గుర్వీణిని దోర్చియ నీకేమి ♦ కొఱలెననుము, గర్భగతవీర్యమే నను ♦ గాచుననుము
మదినెపుంగుము నా మన ♦ స్సిదియె యనుము,చేసినా వన్న గార్పనిఁ♦ జేరఁజనుము.

మ॥ పరతంత్రుండవు నిన్ను నే మనుటకున్ ♦ భావ్యంబుగా దెప్డు భూ
వరుపాదంబులఁ గొల్చు నీకిది యొ♦నర్పన్ బాడియే రాఘవే
శ్వరుఁ జేరంజనుమయ్య మార్గమున సౌ♦భద్రంబు నామీఁద నీ
కరుణం బుంచి స్మరింపుచుండుము కడం♦కన్ నన్ను నష్టప్పుడున్. ౨౨౦

తే॥ రామనామముచే గిరి♦రాజపుత్రి, పీత దుష్కృతయయ్యె నా ♦ విధమున నిట
రామరామ యటంచు ని♦రంతరంబుఁ, బ్రాణమున్నంతవరకు నేఁ♦బల్కుచుందు.

వ॥ ఇట్లు బలుకుచు దుఃఖాతిశయంబున మూర్ఛనొందె నంత సౌమిత్రి చేలాంచ
లంబున వీచుచుండ నెట్టకేలకుఁ దెలివొందిన సీతంగాంచి నమస్కరించి మధురో
క్తుల నోదార్చుచు నిట్లనియె. ౨౨౧

సీ॥ అమ్మా రఘూద్వహు♦నంతికంబునకు నేఁ, బోయెదనిఁక సెల♦వీయవమ్మ
వల్మీకసంభవు ♦ పావనాశ్రమ మిట, కనతిదూరంబున ♦ నలరునమ్మ
రాముని యాజ్ఞ మీ♦రఁగలేకఁ దల్లిని, నిట్లు చేసితి క్షమి♦యింపుమమ్మ
సకల వృత్తంబు నీ♦స్వామితోఁ జెప్పెద, నోయమ్మ యిదె మ్రొక్కు♦చుంటినమ్మ

తే॥ అనుచుఁ గన్నీరుఁగార్చుచు♦నవనిజాతఁ, దిరిగి చూచుచు దుఃఖంబు♦బెనుగఁగాల్గుఁ
దడబడుచునుండ రాముని ♦ కడకు నరిగె, నంతకంతకు సీతకు ♦ నడలుపెరిగె.

వ॥ అప్పుడు సీత తన మనంబున. ౨౨౪

ఉ॥ రాముఁ డపాప గర్భిణిని ♦ బ్రాణము కన్నను నెక్కువైనన
న్నేమని కాన కంపు మనె ♦ నేలిక చెప్పినమాత్ర గానలో
నీ మతిశాలి నాదు మర ♦ దేమని డించెను దైవచిత్రమే
నేమని చెప్పవచ్చు నని ♦ నెంతయు విస్మయమొందె నప్పుడున్. ౨౨౫

వ॥ ఇట్లు విస్మయంబున ముక్కున వ్రేలిడి మాయురే యెంతపని జరిగిన దని తల
యూచుచు. ౨౨౬

క॥ అనిమేషయగుచు రాఘవు, ననుజన్మని నయనములకు ♦ నగపడువఱకున్
గని జాహ్నవి దాటం గలఁడని భువిఁబడె గాఢమూర్ఛ♦నందిమునీంద్రా. ౨౨౭

సీ॥ కలహంస లప్పుడు ♦ జలములుఁబైఁజల్లె, గంధవహుడుఁజల్ల♦గాలివీచెఁ
ధూళిధూసరమైన ♦ తోయజముఖిఁ గరుల్, బుష్కరోదకముల ♦ బోరుకాడె
మృగగణంబులుఁ దత్స♦మీప స్థలంబున, విస్మితేక్షణములై ♦ విడిసియుండెఁ
గుజములు లతలును ♦ గుసుమవంతంబులై, కన్పట్టె నప్పుడు ♦ కాలమైన

తే॥ అట్టి సమయంబు నను సంజ్ఞ♦ నంది సీత, మెలమెలగ లేచి దిక్కులుఁ♦గలయఁజూచి
హారఘూత్తమ హా నాధ♦హా దయాబ్ధి, యనుచుఁ గన్నీరు కాల్వలై ♦జనఁగ నేడ్చె.

ఆ॥ ఇట్లు ఘోరముగను ♦ నేడ్చి యేడ్చి హృదీశ, యేమి తప్పుజేసి ♦ తిట్లుసేయ
ననుచు నుస్సురనుచు ♦ నటునిటుఁ దిరుగుచు, నుర్విఁ బడుచు లేచు♦చుండెనపుడు.

—♦ సీత వాల్మీక్యాశ్రమముంజేరి పుత్రులఁ గనుట ♦—

క॥ అంతేవాసులతో భగవంతుఁడు వాల్మీకిమౌని ♦ ఫలపత్రపవిత్ర
త్యంతంబులకై వచ్చి నిరంతరమై పరగు రోద♦నారవము వినెన్. ౨౮౦

క॥ విని యనె శిష్యులతో మీ, ర్చని భీకర కాననాంత♦రమున నెవరిదో
వినిపించుచుండె నార్తధ్వని దాని నెరింగి రండు ♦ త్వరలో ననినన్. ౨౮౧

ఆ॥ వార లేగి చూచి ♦ వచ్చి మునీశ్వర, యలత రామ రామ ♦ యనుచు మిగులఁ
బొగులుదాని బాష్ప♦పూరపరిప్లుత, కాంత నొక్కదానిఁ ♦ గంటి మనిన. ౨౮౨

వ॥ అంత వల్మీకభవుం డవ్వాక్యంబుల విని త్వరితగతిం జనియె నప్పుడు సీత మునిం
గాంచి లేచి యిట్లనియె. ౨౮౩

ఆ॥ మౌనివర్య యివె న♦మస్కారములు వేదమూర్తి నీకుఁ గేలు♦మోడ్పు లివె మ
హావ్రతాంబునిధి జో♦హారు లివే యంచు, మ్రొక్కు సీతఁగాంచి♦మునివరుండు. ౨౮౪

క॥ వినుమా నుడి నీ పతితోఁ, గొనుమా దీర్ఘాయు వింక♦ గొనముల గనుమన్
దనయుల శుభగుల నిద్దరిఁ, గనుమా నా మాట కల్ల ♦ గాదది గనుమా. ౨౮౫

తే॥ అమ్మ యెవరమ్మ నీవు మా♦యమ్మ నీదు, నామధేయంబదేది నీ♦నాథుఁడెవరు
ఘోరకాంతారమున కేలఁ♦జేరితమ్మ, శీఘ్రముగ శోకహేతువుఁ ♦ జెప్పుమమ్మ.

వ॥ అనిన జానకి నిట్టూర్పులఁ బుచ్చుచుఁ జెప్పఁబోయి కంపంబున నోరాడక నెట్టకేల
కెలుంగుఁ దెచ్చుకొని తపోధనుం గాంచి వినుమని యిట్లనియె.

చ॥ క్షితిపతి రామచంద్రునకు ♦ సేవకురాలను దప్పులేకనే
యతిభయదాటవిన్ విడువ ♦ నంపెను లక్ష్మణు నా విభుండు న
న్నతఁ డిట డించి పోయె నిను♦మంతయు నక్కటికంబు లేక నో
వ్రతికులభూషణా తెలియ♦రాదు వచింపఁగ హేతు వేమియున్.

తే॥ అశ్రుపూర్ణావిలముఖాబ్జ ♦ యగుచు నిట్లు, చెప్పు జానకి నోదార్చి ♦
నేను వాల్మీకి యనువాఁడ ♦ నీదు తండ్రి, గారికి గురుండ నమ్ము మో♦

వ. అనుచు మఱల నిట్లనియె.

ఆ॥ అమ్మ వగవకమ్మ ♦ యాశ్రమ మిదె సమీ, పమ్మునందుఁ
లెమ్మ రమ్మ నా గృ♦హమ్ము నీ తండ్రి గృహమ్ముగా

క॥ ఈకరణి విభుఁడు విడుటకు, నా కతిరోషంబు పొడమె ♦ నవలామిన్నా
శోకింపకు మన జానకి, వ్యాకులత నడంచి కొంత ♦ స్వస్థతఁ గాంచెన్. ౨౯౨

వ॥ ఇట్లు నాకుభవుండు దుఃఖపూర్ణాకులేక్షణ యగు సీతను సాంత్వవచనంబుల నోదార్చి మునిబృందనిషేవితం బగు దన యాశ్రమంబుఁ జేర్చెనంత. ౨౯౩

సీ॥ వైదేహి తాపస ♦ వనితల కతిభక్తి, వందనంబులు చేసె ♦ వారు ప్రేమ
నవనిజఁ బరిరంభ ♦ ణాదుల సంతుష్టిఁ, బరపి గోష్ఠియుఁ గొంత ♦ జరిపి రంత
ఘనదారువులచేత ♦ మునివరు శిష్యులు, నిర్మించి రటఁ బర్ణ ♦ నిలయ మొకటి
యందు సీత తదాజ్ఞ ♦ నధివసించి మనంబు, నందు శ్రీరఘురాము ♦ ననుదినంబు

ఆ॥ స్మరణ సేయు చెపుడు ♦ సంయమీంద్రుని పాద, సరసిజార్చనంబు ♦ సలుపుచుండి
పండ్లు దుంప లెలమి ♦ భక్షణ సేయుచు, ఘనప్రియములను గొన్ని ♦ గడపె నంత. ౨౯౪

తోదకము॥ కాలమునందునఁ ♦ గాంచె సుజనులన్, మేలిగొనంబుల ♦ మీరెడి ఘనులన్
వేలుపు వైద్యుల ♦ పేరిమి యడఁపన్, జాలిన నిర్వురఁ ♦ జక్కని సుతులన్. ౨౯౫

వ॥ అంత సీత శ్రీరామప్రతినిధు లగు పుత్త్రులఁ గాంచుట విని వామలూరుభవుండుఁ బ్రహృష్టాంతరంగుండై వచ్చి. ౨౯౬

తే॥ జాతకర్మాది పరమ సం ♦ స్కారములను, గుశలవమ్ములఁ దా సమ ♦ కూర్చిచేసె
నందుచేతను కుశలవు ♦ లనెడుఁ బేర, వారుఁ బ్రఖ్యాతిఁ గనిరి తా ♦ పసకులేంద్ర.

ఆ॥ అపుడు జనకతనయ ♦ యత్యంత హృష్టచి, త్తాబ్జ యగుచుఁ బొల్చె ♦ నా త్రియామ
లక్ష్మణానుజుండు ♦ లవణాసురుని జంపి, వచ్చె నటకు వీర ♦ వరులతోడ. ౨౯౭

తే॥ అంత ముని శత్రుమథనుని ♦ నర్హవిధులఁ బూజలొనరించి మీ రామ ♦ మూర్తితోడ
సీత పుత్త్రులఁ గని యిటఁ ♦ జెలఁగుననుచుఁ, జెప్పఁబోకుము ముందునేఁ ♦ జెపుదునయ్య.

వ॥ అనుచు నుడివిన వల్లె యని శత్రుఘ్నుండు జనియెనంత. 300

క॥ వ్రతివర సీతాసుతు లతి, కుతుకత ఫలమూలము ♦ లను గొని తిని మునికిన్
నతిఁ జేయుచు సితపక్ష, ప్రతిపచ్ఛశి మాడ్కి వృద్ధి ♦ వడసిరి పేర్మిన్. 301

ఉ॥ వేదవిదుండు మౌని సర ♦ విన్ వడుగుల్ దరిఁ జేసి తాఁ జతు
ర్వేదము లంగముల్ గఱపి ♦ వీసరవోవక శ్రద్ధగా ధను
ర్వేదముఁ గావ్యరూపరఘువీ ♦ రుకథన్ జదివించి వైరిరా
డ్భేదచణంబులై తనరు ♦ విండ్లను రెంటి నొసంగి క్రమ్మరన్. 302

క॥ కరవాలంబుల రెంటిని, దరుగని సితమార్గణములఁ ♦ దనరారెడి మే
ల్వరధుల రెంటిని శరములఁ, జిరుగని కవచముల రెంటిఁ ♦ జెలుతల కిచ్చెన్. 303

వ॥ అంత నా సైతేయులు ధనుర్ధరులు ధనుర్వేదపారగులై జంటఁబాయక దస్రులవలెఁ దిరుగుచుండుట వీక్షించి విదేహరాజనందన పరమానందకందళిత హృదయారవింద యగుచు దుస్త్యజం బగు రామచంద్రవిరహంబు మఱచియుండె ననుటయు. ౩౦౪

శా॥ గాంగేయావనిభృచ్ఛరాసన నమద్గాంగేయగర్భా లస
ద్గాంగేయాచ్ఛధునీపవిత్రితకపర్దా శాక్వరేడ్వాహ సా
రంగాంచత్కర వారణామరరిపుప్రాణాపహారీ కృపా
పాంగా భక్తజనప్రియా గిరిసుతాస్వాంతాంబుజాహస్కరా! ౩౦౫

క॥ అమరార్చిత పదకమలా, కమలారి శిరోవిభూష కలుష సుశమనా
శమనప్రస్మయదమనా, దమునస్సూర్యనేత్ర దానవహరణా. ౩౦౬

కుసుమవిచిత్రవృత్తము॥ కుసుమశరారీ కుజనవిదారీ,శశధరధారీ సనయవిహారీ
వ్యసనవినాశా హరిపదకేశా, భసితవిభూషా వరమునిపోషా. ౩౦౭

గద్యము

ఇది శ్రీమద్గౌర్త్యన్వయ పవిత్ర లక్ష్మీనారాయణార్యారసపుత్ర శ్రీ చింతలపాటి వంశ
క్షీరపారావారరాకాసుధాకరాయమాణ శ్రీ సూర్యనారాయణార్య దత్త
పుత్త్ర శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షాసమాసాదితానవద్యోభయ
కవిత్వ విద్యావధాన రామమూర్తిశాస్త్రి కవ్యభిధానప్రణీతంబైన
రామాశ్వమేధంబునందు
సప్తమాశ్వాసము.



శ్రీ

గణాధిపతయే నమః

శ్రీరామభద్రాయ కరుణాసముద్రాయ నమః

# రామాశ్వమేధము

## అష్టమాశ్వాసము



కంఠ శివావల్లభ
వైకుంఠసఖా మహేశ ♦ భవభయనాశా
నాకాకరనుతపాద పి
నాకీ శ్రీ నందివాడ♦నగరేశ శివా. ౧

వ॥ అవధరింపు మనంతర కథాశ్రవణకుతూహలి యగు వాత్స్యాయనమునివరుం గాంచి వాతాశనవరుం డిట్లనియె. ౨

క॥ మునివర వింటివికద యా, జనకతనయసుతులఁ గనిన ♦ చందం బిఁక వే
వినుమా వీరభుజనికృం,తనచరితము నీవు సావ♦ధానుఁడ వగుచున్. ౩

—♦ సేనలతో శత్రుఘ్నుఁడు లవునితోఁ బోరఁ జనుట ♦—

ఆ॥ భటుల విఱిసిపడిన ♦ బాహువులం గని, శత్రుహంత క్రోధ♦సహితుఁడగుచు
రోషదంశితాధ♦రుం డయి మిమ్మిట్లు, చేసినట్టి వీరుఁ ♦ జెప్పు డిపుడు. ౪

తే॥ చనుచు వాని కరంబులు ♦ దునుమువాఁడ, నమృతభుక్కులు నాతని ♦ కడ్డువడిన
వీఁడ రాముని బలమును♦జూఁడనట్టి, వట్టి మూర్ఖుఁ డతండు నా ♦బలముఁ గనుఁడు. ౫

క॥ ఎక్కడఁ గలఁ డా వీరుం, డెక్కడ నున్నది తురంగ ♦ మెవ్వండైనన్
జిక్కఁగఁ బట్టునె నిద్రం, జొక్కెడు సర్పమును దాని ♦ చురుకు దెలిసినన్. ౬

వ॥ ఇట్లు నుడువు శత్రుఘ్నుని నుడులు విని మిక్కిలి దుఃఖితులైన వీరభటు లయ్యా రామప్రతినిధి యగు నొక బాలుండు మన హయంబుఁ గట్టి మమ్మిట్లు చేసె నని చెప్పిన నాతండుఁ గ్రోధతామ్రాక్షుం డగుచు సేనానిం గాంచి యిట్లనియె. ౭

తే॥ కడక సేనాని మన కిటఁ♦గల్లుసైన్య,మంతయును బన్ను మొక్క వ్యూ♦హంబుఁగాఁగ
బాహుబలశాలి యాతండు ♦ బవరమునకు, జాగరూకతతో నిప్పు♦డేగవలయు. ౮

తే॥ ఇట్టి గాంభీర్యధైర్యము ♦ లిట్టిశౌర్య, మెవ్వనికినైనఁ గలదె యీ ♦ యిలను గాన
నస్మదీయతురంగమ♦హరుఁడు హరుఁడు, బాలుఁడా లేక దనుజవి♦ఘాలుఁ డేమొ. ౯

క॥ కావునఁ గదనముఁగాఁదగు, వేపురతో నేగవలయు ♦ విను నిర్భయుఁడై
వావిరి నున్నాఁ డాతం, డే వెరవిడి నైన పీతి ♦ విడిపింపవలెన్. ౧౦

వ॥ అనుచు నాజ్ఞాపింపఁ గాలజిత్తుం డట్లసేసె, నంత శత్రుఘ్నుం డాతని ముందిడి
కొని చతురంగబలంబులతోఁ బుడమి గ్రిక్కిదల నడచుచుండె, నప్పుడు గాల
జిత్తు ముం దరిగి రామప్రతిబింబంబుచందంబునఁ బొల్చు లవుం గాంచి హితవచ
నంబుల నిట్లనియె. ౧౧

క॥ బాలక రాముం డతిబల,శాలి మహావీరుఁ డతని ♦ సవనహయంబున్
బేలవయి గట్టితివి జయ,శీలుఁడ సేనానిఁ గాల♦జిత్తను వాఁడన్. ౧౨

క॥ రామసమానుని నిన్గనఁ, బ్రేముడి జనియించె లోన ♦ బింకము విడి మా
రాముని తురగము విడు మీ, వాముస విడకున్నఁ బ్రాణ♦హానియ వచ్చున్. ౧౩

వ॥ ఇట్లు పలుకుచున్న కాలజిత్తునివచనంబులు విని లవుండు నవ్వుచు నీషదమర్షం
బున నిట్లనియె. ౧౪

క॥ పోవోయి కాలజిత్తా, నీవా నా ప్రాణహాని♦నిం జేసెదవో
మీ వాజిఁగట్టి తెంచును, వేవేగ నతనికిఁజెప్పుము ♦ విడచితి నిన్నున్. ౧౫

తే॥ నీవు శూరుఁడ వగుదువు ♦ నీతివాక్య,ములను బల్కితి వైన నీ ♦ వలన నాకు
భయ మొకింతుక లేదు నీ♦వంటివారు, లెక్కయే కోటులైనఁ జ♦లింపఁ గలన. ౧౬

ఆ॥ ఎట్టిశూరు లన్న♦దిషు సముద్భవ మరు,ద్వ్రాతములను దూది ♦ వడువు దోప
నెగిరిపోదు రెటకొ ♦ యింతకు వినుము మ,దంబకృపయ కార♦ణంబు సుమ్ము. ౧౭

ఉ॥ నిండుదయన్ ద్వదంబ యిడె ♦ నీ కభిధేయముఁ గాలజిత్త బల్
పండిన దొండపండునకుఁ ♦ బైపసయే కద లోన గట్టి యే
ముండును నట్టిదే యిదియు ♦ నోడక కాలుని నజ్జయించి నీ
కుండిన పేరు సార్థకము♦నొందఁగఁ జేయఁగఁ జూపు సారమున్. ౧౮

వ॥ అనిన; ౧౯

ఆ॥ వజ్రనిభములైన ♦ వాక్కుల కా కాల,జిత్తు ప్రబలరోష♦చిత్తుఁ డగుచు
చిరుత నీదు నామ♦మెరుఁగఁ గులంబును, శీలమును వయస్సుఁ ♦ జెప్పు మఱియు. ౨౦

క॥ పదచర రథచరులకు నిట్టు, కదనము ధర్మంబె యెట్లు ♦ గడఁగుదు ననినన్
మది క్రోధముఁ బొదలగ లవుఁ, డెదురై సేనాని తోడ ♦ నిట్లని పలికెన్. ౨౧

ఆ॥ ఏమి కులముతోడ ♦ నేమి శీలంబుతో, బాహుబలముఁ జూప♦వలయుఁగాని
చెప్పు నామ మనినఁ ♦ జెప్పనే ననుట మే,లా పరాళికంఠ♦లవుఁడ లవుఁడ. ౨౨

ఉ॥ జాగిఁక నేలఁ జేతుఁ బద♦చారిగ నిన్నని విల్లు నారితో
బాగుగఁగట్టి దానిఁ బరి♦పంథులచిత్తము భీతినొందఁగా
మ్రోగఁగఁజేసి నాకుభవు♦మ్రొక్కి యనంతర మంబకు న్మదిన్
జాగిలిఁజేసి ప్రాణహర♦శాతశరంబుల నేసె వానిపై. ౨౩

వ॥ అంతఁ గాలజిత్తు ప్రళయకాలకాలుండు వోలె దుర్నిరీక్ష్యుండై శరాసనంబు సజ్యంబుఁ గావించి నిశితశరంబుల లవుహృదయంబుఁ గాడఁ బఱపునంత నతండు.

సీ॥ తచ్ఛరంబుల శత♦ధాఖండములఁ జేసి, సేనాని నెన్మిది ♦ శితశరముల
విరథునిఁ జేయ నా ♦ వీరుఁడు మదగజ, మెక్కెరా నంతలో ♦ నిషుదశకముఁ
గూర్చి విల్లున నవ్వ♦గొనుచు గుఱిగనేయఁ, గూలి రనేకులు ♦ గుదులుగాగ
నప్పుడు గాలజి♦త్తాతనిఁ గని డెంద, మందున నతివిస్మ♦యంబు నొంది

తే॥ వీరభీతిదమై పది♦వేలపుట్లు, యినుముతోఁ జేసినట్టి గ♦ద నిరుకేలఁ
బట్టి త్రిప్పుచు వైవ నం♦బరమునంద, లవములుగఁ జేసెములుకుల♦లవుఁడు దాని.

—♦ లవునిచేఁ గాలజిత్తు మడియుట ♦—

క॥ అది గని పరిఘముఁగొని లవు,నెద గురిగని విడువ దాని ♦ నిరుతునకలుగాఁ
జదిపి మహోగ్రుండై లవుఁ, డెదురై కనులెఱ్ఱజేసి ♦ యిట్లనియెఁ గ్రోధన్. ౨౬

క॥ ఏనుగుపై నెక్కితి నని, యోగడమా యింత కొంచె ♦ మాగుము నీ యీ
యేనుగు పీనుగ యనుచు బి,ఱానఁ గరఖరాసిఁ గరిక♦రంబును నరికెన్. ౨౭

తే॥ దంతపాదంబులను బట్టి ♦ దంతిమస్త,కమున కెగఁబ్రాకి సేనాని♦ కవచమకుట
ములను జీలిచి వేల్వేల ♦ ముక్కలుగను, జుట్టువట్టుక పడద్రొబ్బె♦క్షోణియందు.

క॥ పతితుండై లేచి యతం, డతికుపితుం డగుచు ముష్టి ♦ నక్కునఁ బొడువన్
వెతనొందియుఁ జలియింపక, శితశరముల లవుఁడు బిట్టు♦జించె నురంబున్. ౨౯

తే॥ దూపటిల్లుచు సేనాని ♦ దుహృదభేద్య, దృఢతనుత్ర శిరస్త్రముల్ ♦ దివిరితాల్చి
కుండలీకృతధన్వుఁడై♦కొరలు లవునిఁ, జురచురంజూచి క్రుధఁబండ్లు♦గొరికికొనుచు.

క॥ కరవాలంబును గొని పై, కరుదేరగఁ జూచి లవుఁడు ♦ హస్తము నరుకన్,
గరవాలము హస్తముతో, విరిసిపడియె నతఁడు కోప♦వివశుండగుచున్. ౩౦

తే॥ వామహస్తంబునను గద ♦ వట్టి కొట్ట,వచ్చు సేనానికేల్ శిత♦ప్రదరములను
ఖండనముసేయ నంగద ♦ గదలతోడఁ, బడియె నంతటఁ గలగుండు♦వడియె సేన.

ఉ॥ అప్పటికిన్ గ్రుధంబు మది ♦ నాపక యా దళవాయి కాండ్లచేఁ
గుప్పని గూరఁదన్నఁ బలు♦గొమ్ము మెకంబును బూలదండతోఁ
గుప్పిన యట్ల నుండ నగి ♦ క్రూరశరంబుల రెంట రెండు గాం
డ్లొప్పరికింపకన్ దునిమె ♦ నుద్ధతుఁడై లవుఁ డప్పు డాతఁడున్. 33

క॥ తలచేతఁ గ్రిమ్మఁదొడఁగిన, బలె యేమనవచ్చు నితని ♦ పౌరుష మనుచున్
దలతల మని తరవారిన్, దలఁదరిగె సమకుటముగను ♦ ధరఁబడె నదియున్. 3౪

క॥ దళవాయి పోలియ వారల, దళమున హాహారవంబుఁ ♦ దలకొనె వీరుల్
దలకడచి లవునితోడన్, దలపడిరి మహోగ్రులగుచుఁ ♦ దరతరములుగాన్. 3౫

వ॥ అంత లవుండు ప్రళయకాలంబున మహార్ణవంబును వరాహంబువోలె ఘూర్ణిల్లుచు సేనాపారావారంబు సొచ్చి యందరి కన్నిరూపులై శరపరంపరల శతాంగంబుల నురువుచు మాతంగంబుల నరుకుచు హయంబుల లయంబు నొందించుచుఁ గాల్బలంబుల మడియింపుచు ధ్వజంబుల గెడపుచుఁ బతాకంబులఁ బడనేయుచు ఛత్రంబులఁ బొడిసేయుచు స్వశరభిన్నమదకుంభికుంభపతన్మౌక్తికంబుల సర్వంసహారమణికి నూతనాలంకారంబు గల్పించుచు నిట్లు చతురంగబలంబుల మట్టిమల్లార్చుచుండ నప్పుడుఁ బొడియగు నడిదంబులును నుసుమగు శరంబులును విదళితంబు లగు పదములును జెక్కు లగు నక్కులును, ముక్కలగు చెక్కులును గోతవడిన చేతులును వమ్ములగు నెమ్ములును దుత్తుమురగు గత్తళంబులును దునుకలగు పునుకలును నీరికలగు నూరువులును గల్గి మస్తకోపలంబుల మేదఃపంకంబుల నస్థిచూర్ణసైకతంబుల శిరోజశైవాలంబుల హయశిరోగ్రాహంబులఁ గరికరకుంభీరంబుల రథాంగకమఠంబుల శంఖమీనంబుల భయంకరం బగు శోణితమహానది ప్రవహింపందొడంగె నందుఁ గూలు మణిచిత్రిత కల్యాణమయ పల్యాణరుచిరంబులగుఁ గంఖాణంబులును బృందారకులు మందాకినింబోలె రథంబులనుండి క్రిందికిఁబడు ధనుర్ధరు లగు రథికులును లవుని పరాక్రమంబు సహింపనోపక రోషావేశంబున నౌడులు గరచుచు నోడలెరుంగక కయ్యంబునకు వెలువడి కుత్తుకబంటియైన నడాడక ప్రవాహవేగంబునఁ గొట్టికొనిపోవు కదనవిశారదు లగు కాలిబంటులును గల్గి కేశకీకస భూయిష్ఠంబై శ్మశానంబువోలె భయంబు గొల్పుచున్న రణరంగంబుఁగని యిందొక్కండైనఁ బ్రతికియున్న వాఁడుఁ గలండే యని పరిశీలించి కానక యత్యాశ్చర్యమగ్నులై తనుఁ గొనియాడు నిలింపుల ప్రశంసావాక్యంబులు వినుచు లవుం డన్యాగమన కుతూహలాయత్తచిత్తుండై యుండె నంత నదృష్టవశంబున నే మూలనో యొదిగియున్న యొకరిద్దరు భటులు శత్రుఘ్నుం జేరఁబోయి యిట్లనిరి. 3౬

తే॥ అయ్య జోహారు విను మద్భుతావహవాతి,నిపుణుఁ డగు నొక్క శిశువుచే♦నీల్గెఁ గాల
జిత్తనంగను విని శత్రు♦జిత్తు క్రుధను, బండ్లుగొరుకుచు వారితోఁ ♦ బలికె నిట్లు.

సీ॥ భటులార మీకిది ♦ పరిహాసమా లేక, కపటమా వెఱ్ఱియా ♦ కనఁగ మదము
కాలజిత్త న రిపు♦గణదారణుఁడు యుధి, శమనునకును దురా♦సదుఁడతండు
బాలకుచేతను ♦ గూలునే యన నృపు, నాలాపములకు ని♦ట్లనిరి భటులు
మదమత్తతాదులు ♦ మా కేమియును లేవు, నిజమయ్య లవునిచే ♦ నీల్గుటతఁడు

తే॥ బాలుఁడనరాదు మా పాలి♦కాలుఁడయ్య, సైనికులనెల్ల క్షణములోఁ♦జంపెనయ్య
చేయఁదగుకార్యమేదియో♦చేయుమయ్య,బొట్టెయనిసాహసముఁజేయఁ♦బూనకయ్య.

క॥ అను మాటలు విని లక్ష్మణు, ననుజన్ముఁడు సుమతిఁగాంచి ♦ యనె నో మంత్రీ
మన మిప్పుడు సేయందగు, పని యెదియో తెల్పు మతఁడు ♦ బాలుం డగునే. ౩౯

వ॥ అనుటయు మంత్రి యిట్లనియె. ౮౦

—♦ లవునిచేఁ బుష్కలుండు మూర్ఛనొందుట ♦—

మ॥ సుమతీ వీతి హరించినట్టి పృథుకుం ♦ శూరుం గనుంగొంటివే
సమరంబందు సముద్రతుల్య బలముం ♦ సర్వంబుఁ జక్కాడె నా
యమివర్యుం డగు నాకుజన్మున కిదే ♦ యావాసమా క్షత్రియుల్
సమదారిందమ సంభవింపదు నివా♦సం బిందు నన్పేయఁగాం. ౮౧

తే॥ ఈతఁడు నగారి కావచ్చు ♦ నీర్ష్య దీని, నాహరింపఁగ నెవ్వాని ♦ కవసరంబు
లేక సవనారి కావచ్చుఁ ♦ గాకయున్న, నీ హయంబు హరింపఁగ ♦ నెవరితరము.

వ॥ అని చెప్పి సుమతి మఱియు నిట్లనియె. ౮౩

ఆ॥ బైరవారిలోక♦భయదుఁడౌ నీ మన, కాలజిత్తువంటి ♦కడిఁది జోదుఁ
జంపెనతనితోడ♦జగడంబునకు నేగఁ, గలఁడె పుష్కలుండు♦గాఁక యొరుఁడు.౮౪

తే॥ వీరభటబృందములతోడ ♦ వివిధయుద్ధ, నిపుణులైనట్టి నృపులతో ♦ నీవుఁబోయి
తెమ్ము త్రుంపక యతనిబం♦ధించిరామ,మూర్తికిని జూపెదనుమది♦ముదముఁబొదల.

వ॥ ఇట్లు వలుకుచున్న సుమంత్రుని వచనంబులు విని శత్రుఘ్నుండు సకల సైనికుల రావించి మీరు ముందరుగుఁ డేను మీపిరుందన వచ్చుచున్న వాఁడ ననిన వారు ధనుష్టంకారములు సేయుచు సకలాయుధంబుల ధరించి లవునిఁ జేరం బోవునంత వీరభట పూరితం బగు నా సైన్యంబుంగని. ౮౬

చ॥ అతిబలశాలి యాతఁ డిసు ♦ మంతయు జంకక నా భటావళిం
గొతుకక నష్టు లేళ్ళపెను♦గుంపుగ నెంచి మదిం మెకాలరే

డ్వితమున నొక్కగంతుఁగొని ♦ విల్మ్రోఁరయింపుచు వాడిముల్కులన్
బ్రతిఘ భటాళిపైఁ బరపె ♦ వందలు వేల్పదివేలు లక్షలున్. ౪౮

క॥ ఆరోపగ్రథితులగుచు మ, హారోషమునన్ గలంగి ♦ యరె యితఁడు మహా
వీరుం డని మదినెంచుచు, వారందరుఁ బరవసమున ♦ వచ్చిరెదురుగాన్.

తే॥ చుట్టు భ్రమి యేడుగా వచ్చి ♦ చుట్టుకొనిన, వీరుల ననేకులను జూచి ♦ వేగవిల్లు
నందు నారిని బంధించి ♦ యంబకములఁ, బరపఁదొడఁగెను రోషదు ♦ ర్భరుఁడు లవుఁడు

వ॥ వాత్స్యాయన మునీంద్రా భ్రమముల విధంబు వివరించెద వినుమొక వేయి యోధులు గలది మొదటి భ్రమియును బదివేల యోధులు గలది రెండవదియును నిఱువదివేల యోధులు గలది మూడవదియును నేఁబదివేలు గలది నాల్గవదియును లక్ష యోధులు గల దైదవదియును లక్షపైఁ బదివేలుగలది యారవదియు రెండులక్షల యోధులు గల యేడవదియునుగా నెరుంగుము.

తే॥ అట్టిభ్రమములేడుగ్రమమున ♦ జుట్టుఁదిరిగె, నడుమదావాగ్ని చందాన ♦ బుడుతఁడుఁదగె
ఖరశరార్చుల భ్రమములను ♦ గాల్పఁదొడఁగె, నష్టవీరుల మదిని ధై ♦ ర్యంబు లుడిగె.

క॥ ఒక భ్రమి ఖడ్గంబులచే, నొక భ్రమి శరములను గదల ♦ నొక భ్రమణము వే
రొక భ్రమి ప్రాసంబుల, నిం, కొకటిని గుంతముల నిట్టు ♦ లొగిఁబొడిఁజేసెన్. ౫౨

ఆ॥ ఏడు భ్రమములనిట్టు ♦ లేచిన శరత్తున, నభ్రపటల ముక్తుఁ ♦ డైన కుముద
బాంధవుండు వోలె ♦ వసుధాసుతాసూతి, మెరయుచుండె బాణ ♦ కిరణుఁడగుచు.

క॥ అరిమురిఁ గరవాలంబునఁ, గరికరములు నరుకుచు నడు ♦ గడుగులఁ బరు వే
దరుగుచు శరముల నురుముచు, నరుల భటుల శిరము లడఁచె ♦ నరదములగదన్.

ఆ॥ పేరువాడు చిట్లు ♦ గారింపఁ బీన్గుల, బారు క్రిందఁ బోయి ♦ దూరువారు
చేరువారు పడిన ♦ తేరులచాటుకుఁ, బారువార లైరి ♦ భటులు భీతి. ౫౫

వ॥ ఇట్లు లవశిలీముఖ నిపీడితులై పరచిన సైనికులంగని పుష్కలుండు రోష పూరిత లోచనుండై సుదృఢహయశోభితం బగు రథంబెక్కి రేరే డింభక నిలునిలు మని యదల్చుచు సమీపించి యిట్లనియె. ౫౬

తే॥ కాలి నడనున్న నీతోడఁ ♦ గదన మెట్లు, సేతు మద్దత్త జవహయా ♦ న్వితమహా శ
తాంగమందునఁ గూర్చుండు ♦ మంత దురము, సేతు నీతోడ నన నవ్వె ♦ సీతకొడుకు.

ఆ॥ పరగ నీ వొసంగు ♦ నరదము పై నుండి, దుర మొనర్ప నాకు ♦ దురితమబ్బు
జయముసందియంబ ♦ యయిన మేమే దాన, ములఁగొనంగ బ్రాహ్మ ♦ ణులముగాము.

ఉ॥ ఎప్పుడు దానముల్ ద్విజుల ♦ కిచ్చెడి క్షత్రియజాతివార మే
మిప్పుడు సేతు ముక్కలుగ ♦ నీవు గనుంగొన నీ శతాంగ మీ

వప్పుడుఁ బాదచారి వగు ♦ దప్పుడ నేను దురం బొనర్చెదన్
దప్పదటన్నఁ బుష్కలుఁడుఁ ♦ దద్దయు విస్మితుఁడై మనంబునన్. ౫౯

క. ఈతని ధైర్య స్థైర్యము, లీతనిశౌర్యంబు బలము ♦ నెందునఁ గనసం
చాతఁడు ధనువెక్కిడి కడు, శాతశరము వింటఁ గూర్చె ♦ సమయములోనన్.

ఉ॥ కోపసమేతుఁడై లవుఁడు ♦ కోయని యార్చి కరస్థవిస్ఫుర
చ్చాపముదుగ్రింప నింకొకటి ♦ సజ్యము సేయుచు నుండు నంతలోఁ
దాపసవర్య పుష్కలు ర♦థం బెల నవ్వుచు నుగ్గుసేసె నా
చాపరథంబు లిట్లు నిము♦సంబునఁ బోవఁగ విస్మితాత్ముఁడై. ౬౧

తే॥ ఈతఁ డతివీరుఁ డని మతి♦నెంచి తాఁబ, దాతి యగుచును భారతి♦ జాతరుట్స
మేతుఁడై కుశుతమ్ముని ♦ కెదుటనిల్చెఁ, జూతమని సురతతి దివి ♦ సొరిదిఁబొల్చె.

క. ఇద్దరు బాణాసనధరు, లిద్దరు రక్తప్లపృష్టు ♦ లిద్దరు శస్త్రా
త్యుద్ధతు లన్యోన్యశరా,విద్ధతనులు దుల్యు లన్ని♦విధముల నిర్వుర్. ౬౩

తే॥ ఇరువు రన్యోన్య స్వస్వజ♦యైషిణులును, నిరువు రన్యోన్యహననస♦మీాప్సితులయి
శరవణోద్భవపాకశా♦సనసుతు లన, నలరి రిరువురు మురభిత్పు♦రారు లనగ. ౬౪

క॥ ఘోరరణాంగణమున నిటు, వారిద్దరు బోరి రందు ♦ భారతి యనె నో
శూరశిరోమణి నీ సమ, వీరుని నే నెందుఁగాన ♦ విశ్వములోనన్. ౬౫

క॥ శితశరముల నీ శిరమును, క్షితిఁ బడఁగాఁ జేతు నెచటి♦కిన్ బాలక సం
యతుఁడ వయి ప్రాణవాయువు,లతులితగతిఁ గాచికొను మ♦హా యనశూరుల్! ౬౬

వ॥ ఇట్లు పలుకుచు ములుకులగములఁ బుడమి నాకసంబునుం గప్పి శరపంజరంబునఁ
జిక్కఁజేయ నాతండుఁ బుష్కలునితో నిట్లనియె. ౬౭

ఆ॥ తెప్పరముగ నాకు ♦ గొప్ప బాణంబుల, నొప్పి కలుగ నిట్లు ♦ గుప్పి తీవు
గొప్పతనముఁ జెప్పు♦కొనవచ్చులే యని, త్వరగ నా శరాళి ♦ నరకి యనియె. ౬౮

తే॥ భారతీ మత్కరాఘాత♦భయముచేత, శోణిత పరిప్లుతుండవై ♦ క్షోణియందుఁ
గూలెదవు సుమ్ము నీదుప్రా♦ణాలఁ గాచి, కొమ్మన లవుండు, భారతి♦ కోపియగుచు.

సీ॥ బవరంబునను నతి♦బలుఁడు శూరుం డీ ల,వుండని మదినెంచు ♦ చుండునంత
నాతండు కుపితుఁడై ♦ యరివిదారణ మతి, నిశిత మాశీవిష♦నిభశరంబు
విల్లున సంధించి ♦ విడువఁగా జాజ్వల్య, మానమై యది చాల ♦ మండిపడుచుఁ
బోరఁ గాడఁగరాఁగఁ ♦ బుష్కలుం డద్దాని, ఖండించె మధ్యలో♦ ఖరశరమున

తే॥ నందు కతికోపుఁడై లవుఁ♦డతి నిశాత, బాణమొక్కండు విలుఁజేర్చి♦పట్టితిగిచి
బిట్టువిడువఁగ నదిరొమ్ముఁ♦బ్రిదులఁజేయ,మూర్ఛమునుఁగుచుఁబడెనేలఁ♦బుష్కలుండు.

## —♦ హనుమంతుఁడు కపటమూర్ఛ నొందుట ♦—

క॥ పడినట్టి పుష్కలుం గని, వడముడికొమరుండు వడిగ ♦ వచ్చి భుజముపై
నిడికొని చని శత్రుఘ్నుని, కడ నుంచినఁ జూచి యతఁడు ♦ గడు దుఃఖితుఁడై. ౨౧

తే॥ అక్షరాక్షసహర నీ స♦మక్షమంద, యింతపని యేల జరిగె నీ♦వేగి వేగ
బాలకుని ద్రుంచి రమ్మన♦ వాయుసూనుఁ, డీతఁ డతిబలుఁ డని మది♦నెంచి మించి.

ఉ॥ బూరుగమ్రానుఁ దెచ్చి కడుఁ ♦ బూనికతో లవు మస్తకంబునన్
బోరునవైవ నాతఁ డొక ♦ భూరిశరంబున నుగ్గుసేయ నా
మారుతి క్రోధియై మఱల ♦ మ్రాఁకులు వేరులతోడఁ దెచ్చి ప
ల్మారు లురశ్శిరంబు లురు♦లన్ బడనేయుచు నుండెఁ బెక్కటిన్. ౨౩

క॥ ఏ యే వృక్షంబుల నా, వాయుతనూజుండు మీఁద ♦ వైవఁ దొడఁగెనో
యాయావృక్షంబుల లవుఁ, డాయతగతి నుగ్గుగాఁగ ♦ నడఁచెఁ గ్రమమునన్. ౨౪

తే॥ అంత హనుమంతుఁ డాగ్రహా♦వ్యగ్రుఁ డగుచు, గండశైలాభశిలలను♦ గడకఁ దెచ్చి
యొక్కమొగి నెత్తిమీఁదఁ బె♦ల్లూఁచివైవ, యంత్రికాభిన్నరజ మన♦ నంబకములఁ
దూర్ణముగఁ జేసె లవుఁడు దు♦త్తుమురుగాఁగ. ౨౫

వ॥ అంత, ౨౬

తోటకము॥ హనుపాప్పఁగ మారుతి ♦ పుచ్ఛమునన్
దనుఁ జుట్టుచు నుండగఁ ♦ దల్లిని లోఁ
దెనుబత్తిఁ దలంచుచు ♦ వీరునిఁ దో
కను ముష్టిఁ గడున్ నలి♦గాఁ బొడిచెన్. ౨౭

క॥ ఆ పోటుల బాధలచే, నా పావనిఁ బట్టలేక ♦ హనుమంతుఁడుఁ దా
నేపరి విడువగ నాతఁడుఁ, గోపంబున బాణవృష్టిఁ ♦ గురిపించెఁ బయిన్. ౨౮

సీ॥ పావని దుర్వార♦బాణఘాతంబునఁ, గడు నొచ్చి యిది వాన ♦ జడియ నిక్క
మీ రీతి శరముల ♦ నెవ్వఁడుఁ బరగించుఁ, గడు దెప్పరంబయ్యెఁ ♦ గలన నుండఁ
బారిపోదు నటన్నఁ ♦ బరిహాసింతురు జనుల్, స్వామికి లజ్జయు ♦ సంభవించుఁ
బరమేష్ఠివరమున♦మరణంబు లేదు మూ,ర్ఛయగాని యకట యీ♦ సమయమందుఁ

ఆ॥ జేయఁదగిన దేది ♦ పాయని కష్టంబు, సంభవించె రిపుని ♦ శత్రుహంత
యే జయించునంత♦కే నా జయముఁగోరు,చుండి లేని మూర్ఛ ♦ నుందువాఁడ.

తే॥ ఇట్లు హృదయంబునను నిశ్చ♦యించి సకల,శూరు లద్భుతమందుచుఁ♦ జూచుచుండఁ
బడిమెఁ బెనుమూర్ఛ నొందిన♦వానిరీతి, నంతఁ జెలరేగి నృపతుల♦ నడఁచె లవుఁడు.

—◆ లవ శత్రుఘ్నుల యుద్ధము ◆—

మ॥ హనుమంతుండు రణోర్వి మూర్ఛిలుట తా◆నాలించి శత్రుఘ్నుఁ డీ
హనుమంతుం డిటులయ్యెఁ జేయఁదగు గా◆ర్యం బేది యా బాలుఁడో
ఘనబాహాబలశాలి నేన చతురం◆గవ్యూహముల్ గొల్వఁగాఁ
గనకస్యందన మెక్కిపోయి లవునిన్ ◆ గారించెదన్ ముల్కులన్. ౮౧

వ॥ ఇట్లు నిశ్చయించి సకల వీరబృంద పరివృతుండై చని ముందుఁ బ్రతివీర నిరీక్షణైకతత్పరుండును, ధనుర్ధరుండును శ్రీరాముండు బాలుండై రణరంగంబున నిల్చెనో యనునట్లు మారులేని పరాక్రమంబున వెలుంగు లవుం గాంచి శత్రుఘ్నుండు దన మనంబున నిట్లు వితర్కించె. ౮౨

క॥ నీలోత్పల దళనిభతనుఁ, డాలోలసరోజనేత్రుఁ◆డై రామక్ష్మా
పాలాకారంబునఁ దగె, బాలుం డెవ్వండొ యితని ◆ బల మే మందున్. ౮౩

తే॥ ఇతఁడు సీతాసుతుండొట◆యే నిజంబు,దురమునను బుష్కలాదియో◆ధుల జయించి
వెలుఁగుచున్నాఁడుసింహంబు◆విధముఁదోపఁ,మఱియొకనికింతవీర్యంబు◆మహినిఁగలదె.

ఆ॥ శక్తిలేని మాకు ◆ సంశయంబు జయంబు, నాలమందు వీరు◆లనదలైరిఁ
కేమిసేయ నేర్తు◆మీ తరి ననుచును, బాలుతోడ నిట్లు◆పలికె నృపుఁడు. ౮౫

ఉ॥ భూమిఁ బడంగఁ జేసితి చ◆మూపతులన్ నృపులన్ క్షణంబులోఁ
దామస మేల నీదు తలి◆దండ్రుల పేరెది చెప్పు మెప్పు మా
రాముని సత్త్వ మాతని తె◆రంగు నెరుంగవు చేసెఁ బ్రేతరా
డ్ధామనివాసు రావణు సు◆తప్రకరంబులతోడ వింటివే. ౮౬

ఆ॥ బాలకా యదృష్ట◆వంతుఁడ వగుదువు, విజయ మొంది తేది ◆ పేరుఁ జెపుము
కత్తలాని నేలఁ ◆ గట్టితి విపుడైన, విడు క్షమించి తీవు ◆ పిన్నవగుట. ౮౭

క॥ రమ్మా రామునిఁ జూడఁగఁ, గొమ్మా సొమ్ములను ధనముఁ ◆ గొల్లలుకాగన్,
దెమ్మా వీతిని వైశమ; ముమ్మాటికిఁ బోరువలదు ◆ బుద్ధిని గనుమా. ౮౮

వ॥ అనిన లవుం డిట్లనియె. ౮౯

ఆ॥ పేరుతోడ నేమి ◆ పితరులతో నేమి, కులముతోడ నేమి ◆ కువలయేశ
వయసుతోడ నేమి ◆ బవరంబు సేయఁగ, సారముండెనేని ◆ సలుపుపోరు. ౯౦

క॥ లేదేని మత్సహోదరు, పాదాలకు మ్రొక్కి చనుము ◆ బలమే యున్నన్
గాదా యా రాఘవునకు, సోదరుఁడవు వీతిఁగొనఁగఁ◆జూడుము బలిమిన్. ౯౧

వ॥ ఇట్లు వల్కుచు లవుండు మహోగ్రుండై శరపరంపరలచే నురశ్శిరోభుజంబుల నాట నేసె నంత శత్రుఘ్నుండు కుపితుండై బాలుండు బెదరునట్లు మేఘగంభీరం

బుగ విల్లు మొరయించి మొక్కలంబుగ నొక్కమొగి లెక్కలేని ములుకులఁ బఱపం
దొడంగె నంత లవుండు నా శరంబుల లవంబులుగ ఖండించుచుండె నప్పుడు.

తే॥ కుశునితమ్ముని ములుకులు♦కుతల మాక, సంబు నెఱిఁగప్పె నిసుమంత♦సందు లేక
నిల వ్యతీపాతకృతదాన♦ఫలములు వలె, నలరె బహువిధముల నక్షు♦యంబులగుచు.

తే॥ తాపసోత్తమ విను జగ♦త్త్రాణుఁడైన, వీక శరపంజరముఁజొర♦లేకపోయె
స్వల్పకాలము జీవించు ♦ పంచజనుల, చొప్పు లిప్పుడు వేరుగాఁ ♦ జెప్పనేల. ౯౪

సీ॥ తచ్ఛరవ్యాప్తికిఁ ♦ దనలోన లవణారి ♦ విస్మయంబును జెంది ♦ వేలకొలది
శరములఁ బఱపె నా ♦ శరముల ఖండించి, కుశుని తమ్ముఁడుఁ గోప♦వశత నతని
విల్లును ఖండింప ♦ వేరొక ధను వాతఁ, డంది సజ్యముసేయు ♦ నంతలోన
ధనువుతోఁగూడ ర♦థంబును జూర్ణంబుఁ ♦ జేసె క్షణంబున ♦ శితశరముల

తే॥ అది గనుంగొని లవుఁగొని♦యాడి రంద, రప్డు శత్రుఘ్నుఁడశరాసు♦డరథుఁ డతుర
గుం డసారథి యగుచు వే♦రొండు తేరు, నందుఁ గూర్చుండి యభిముఖుఁ♦డయ్యె ననికి.

వ॥ ఇట్లు శత్రుఘ్నుఁడు విజృంభించి క్రోధావేశంబున నొడ లెరుంగక చిత్తజల్లు
మాడ్కి నిశితాశుగంబులఁ బఱపఁ దద్బాణవినిర్భిన్నశరీరుండై రక్తంబు గారు
చుండఁ బూచిన మోదుగ వడువున రణమధ్యంబున వెలుంగుచు శరసంధాన
చాతురీధురీణుండగు లవుండు గుండలీకృతచాపుండై తీక్ష్ణనారాచంబులఁ గవ
చంబుఁ జించి మకుటంబు వికలం బొనర్చి స్రివదృక్తపరిప్లుష్టగాత్రుం జేయ నంత
శత్రుఘ్నుం డత్యంతామర్షంబున.

తే॥ ప్రాణములఁగొనఁగజాలిన ♦ పదిశితాగ్ర,సాయకంబులఁ బరప నా♦త్మసుతాసు
తుండు వానిని దిలలంతఁ ♦ దుమురు చేసి, యష్టబాణంబులను డెంద♦మగల నేసె.

క॥ ఆ శరపీడితుఁడై లవ,ణాశరహరుఁ డతని లో మ♦హాబలుని జయా
వేశుని శూరాగ్రిగు జిత,కాశినిగా నెంచి ముంచె ♦ ఘనశరవృష్టిన్. ౯౮

తే॥ అప్పు డతికోపియై లవుం♦డర్ధచంద్ర, తుల్య శితశర మొక్కటి♦ దొడిగి వింట
బెట్టువిడువఁగఁ దచ్ఛర♦విద్ధహృదయుఁ,డగుచు శత్రుఘ్నుఁ డరదంబు♦నందుఁగూలె.

సీ॥శత్రుఘ్నుఁడటులమూ♦ర్ఛనుబొందఁగాఁగాంచి,సురథుఁడు విమలుఁడు♦సుమదుఁడు రిపు
తాపుఁడో నా రిపు♦తాపుఁడు వీరర,త్నాది మహావీరు ♦ లతనిఁ జుట్టి
ముట్టడింపుచు నెందుఁ ♦ బోయెదవో బాల,కా నిలు నిలుమంచుఁ♦గడకఁ గొంద
రడిదంబులను గొంద♦రరులఁ గొందరు శిత,బాణాలఁ గొందరు ♦ పట్టెసములఁ

తే॥ గొంద రీటెలఁ గొందరు♦ కుంతములను, గొందరు క్షురప్రములఁ బెల్లు♦గుందఁజేయ
వీరధర్మప్రచారులు ♦ వీరధర్మ, మగునొక్కో యంచును మహోగ్ర♦హామున లవుఁడు,

తే॥ పదిపదేసి శరంబుల ♦ బడలువడఁగఁ, జేసి నృపతుల మఱల ని♦శితశరౌఘ
వృష్టిచే ముంప నెడలేక ♦ వివశు లగుచుఁ, బారువా ర్మూర్ఛఁబడినట్టి ♦ వారలైరి.

ఆ॥ అంతలోన శత్రు♦హంతయుఁ దెలివొంది, బలముతోడ మఱల♦బవరమునకు
నరుగుదెంచి యెదుట ♦ నరుదెంచు లవుఁగని, పలికె విస్మయ ప్ర♦భరితుఁడగుచు.

మ॥ లవుఁడా ధన్యుఁడ వైతి విప్రు డవలీ♦లన్ మూర్ఛ నొందించి మా
ణవకుం డంచుఁ దలంపరాదు నిను న ♦ న్వారింపఁగా వచ్చితే
దివిషన్మార్తివా కాక నెవ్వనికి నా♦ర్తిం గుందఁ జేయం దగున్
భువిలో నెవ్వనిచేతనైన మును నే ♦ మూర్ఛన్ బడంగంటినే. ౧౦౩

మత్తకోకిల॥ ఓరిబాలక నా పరాక్రమ ♦ మోర్చియిప్పుడు చూడుమా
పారిపోకుము భండనస్థలి♦బండునట్లుగఁ జేతు నిన్
ఘోరబాణ మిదే కనుంగొను ♦ కూర్చు చుంటిని విల్లునన్
ధీర యీ శర మొక్కదాని ని♦దే సహింపుము వచ్చెదున్. ౧౦౪

తే॥ లవణుఁ డే బాణమునఁగూలె♦బవరమందు,
యముని వక్త్రింబుతో సమ♦మై మహోగ్ర
మగుచు వెలిగెడి యా శర♦మపుడు విడచె
నది గనుంగొని లవుఁడిట్లు ♦ మదినిఁ దలచె. ౧౦౫

ఆ॥ కీలివోలె ఘోర♦కీలల వీరస, హస్తిముల దహించు ♦ నట్టి దిది స
మస్తదిశలు వెలుగ♦మండుచు నేతెంచె, దీని నే నడంపఁ ♦ దివురు టెట్లొ. ౧౦౬

క॥ ఈతరి బలవంతుఁడు నా, భ్రాత కుశుం డుండెనేని ♦ రజముగఁ జేయన్
బ్రాతియె యీతని కిది ని, ర్భీతుఁడనై యతనియండ ♦ రిపుని నడఁపనే. ౧౦౭

తే॥ ఇటులఁ దర్కింపుచుండఁగ ♦ నెద లవుండు, ప్రలయకాలానలోపమ♦ప్రదర మేగు
దెంచి తన హృదయంబు భే♦దింప మూర్ఛ, నొంది వీరశిరోలస♦దుర్వి నొరిగె. ౧౦౮

— ♦ లవుని మూర్ఛ విని సీత దుఃఖించుట ♦ —

ఉ॥ వైరివిదారణున్ లవుని ♦ భండనమందున మూర్ఛఁబుచ్చి సు
స్ఫారబలుండు శత్రుకుల♦భంజనుఁ డొంది జయంబు మోహనా
కారు శిరస్త్రధారు లవుఁ ♦ గాంచన స్యందన మందుఁ జేర్చిపోఁ
గోరుచునుండె నంత లవుఁ ♦ గూడి చరించెడి విప్రబాలకుల్. ౧౦౯

తే. క్షిప్రగతి నంద రప్పుడు ♦ సీతఁజేరి, పల్కిరి ట్లమ్మ నీ చిన్న♦పట్టి లవుఁడు
మాని బలవంతుడగు నొక ♦ మహీపు సవన, వీతి బంధించె నదురును ♦ బెదరులేక,

సీ॥ అంత సేనలకు నీ♦యాత్మసంభవునకు, నతిభయంకర కల♦హంబుఁ దనరె
నా జన్యమునఁ గాల♦యముఁడో యనంగ నీ, పట్టి సైన్యంబంత ♦ బారిసమరెఁ
బిదప శత్రుఘ్ను మూ♦ర్ఛ దొరలఁగాఁ జేసి, గెలుపొంది యా రణ♦క్షితిని మీరెఁ
దేరిన సౌమిత్రి ♦ క్రూరబాణంబుల, మురిసెడి నీ పట్టి ♦ మూర్ఛఁగూరె
తే॥ మావుఁగట్టకు మన మున్న♦మమ్మదూరె, త్మ్మసురలు వీరనాకను ♦మాటమీరె
నతఁడు లవు రథమునఁజేర్చి♦యరుగఁగోరె, నపుడు కుశుఁడున్న నింత సే♦యంగలారె.
చ॥ అనుటయు సీత దుఃఖమున ♦ హా యని మూర్ఛను జెంది లేచి యో
తనయ కృపావిహీనత న♦ధర్మమునన్ బసికూనతోడ నే
మని కలహం బొనర్చి వసు♦ధాధిపుఁ డిప్డు వడంగఁ జేసెరా
మనమున జాలిలేని నృపు♦మావును గట్టితి వేమి వచ్చెరా. ౧౧౩
తే॥ వారు దుర్ధరు లఖిలాస్త్ర♦పటువు లాఢ్యు, లరదములయందు నున్న వా♦రరయనీవు
విరథుఁడవు బాలకుండవు ♦ వెరవెరుఁగవు, జన్యమెట్లు సమంబుగా ♦ జరిగెఁ బుత్రి.
క॥ రామత్యాగాసుఖమును, నే మిమ్ములఁగండ్లఁ గాంచి ♦ నెట్టఁగలిగి తిం
కేమని బ్రతుకుదుఁ గానన, సీమను దిక్కెవరు నాకుఁ ♦ జెప్పుము తండ్రీ. ౧౧౪
క॥ రమ్మా నా కడకుఁ దురం, గ మ్మా నరపతికి నిచ్చి ♦ కడువేగముగాఁ
బొమ్మా యనఁ బోవఁడె యతఁ, డిమ్మాడ్కిని దుఃఖ మొందు ♦ టెరుఁగవు నీకై.
తే॥ భీమ బలుఁడును వీర శి♦రోమణియగు, నన్న కుశుఁ డున్న రణమున ♦నా నృపాల
వశ్యు విడిపింపఁడే ని న్న♦వశ్యమునను, నతఁడు లేకుంట దురదృష్ట♦మయ్యె నేడు.
ఆ॥ ఏమి సేయుదాన ♦ నెల్ల దుఃఖములకుఁ, గారణంబు విధియ ♦ కాదె యనుచుఁ
గాలి బొటనవ్రేల ♦ నేల రాయుచుఁ గంట, నీరుఁ గార్చె చేడ్చె ♦ నీరజాక్షి.
వ॥ ఇట్లు దుఃఖింపుచు ద్విజబాలురం గాంచి సీత యిట్లనియె. ౧౧౫
ఆ॥ బాలులార నాదు♦బాలునిఁ బృథివీశుఁ, డెట్లు వడఁగఁజేసె ♦ నెచటి కరుగ
నెంచెఁ జెప్పుమని వ♦చించెడి నంతలో, వచ్చె విమతవిపిన♦వసుఁడుఁ గుశుఁడు. ౧౧౬

—♦ లవుని మూర్ఛవిని కుశుఁడు యుద్ధమున కరుగుట ♦—

సీ॥ వచ్చి కన్నీరు కా♦ల్వలుఁగాఁగఁ గార్చుచు, వ్యాకులమై పెల్లు, ♦ వగచుఁ దల్లిఁ
గనుఁగొని పల్కె నో ♦ జనని నేనుండఁగ, నింత వందురుచుంటి ♦ వేల నమ్మ
యీ మహాశివరాత్రి ♦ శ్రీమహాకాళేశ్వ, రునిఁజూడఁగా నుజ్జ♦యినికిఁ బోయి
హరుని కర్చనముల ♦ నభిషేకము లొనర్చి, భూరివరంబులఁ ♦ బొందితమ్మ
తే॥ అందుచే నింత యాలస్య♦మైనదమ్మ, యనుచు నుడువుచు నుండ యు♦ద్ధాభిశంసి
యగుచుఁ దన బాహువదరఁగ♦స్వాంతమందు, సంగరంబబ్బునంచును♦ సంతసించి.

క॥ ఉమ్మరముఁగాఁగఁ గన్నీర్, గ్రమ్మఁగ దురపిల్లుఁదల్లిఁ ♦ గనుఁగొని యనెనో
యమ్మా యసువులతో నే, నిమ్మహి నుండంగఁబడుట♦యే బాష్పంబుల్. ౧౨౧

తే॥ వైరిమర్దనుఁడైన నా♦ భ్రాత లవుఁడు, వచ్చుచుండు నెదురుగ నే♦వచ్చు వెఱఁగి
హర్షమునఁ బొంగుచును నిప్పు♦డాతఁడేడి, కానరాఁ డేట కేగెనో ♦ కదనమునకు.

ఆ॥ బాలుఁ డొట నొక్క ♦ బాలునితో నన్నుఁ, జూడఁగోరి పోయి♦నాఁడొ యిప్పు
డింత వంత నొంద♦నేలనే మాయమ్మ, యంతయును వచింపు♦మడలు టుడిగి. ౧౨౩

వ॥ అనినఁ గుశుంగాంచి సీత యిట్లనియె. ౧౨౪

సీ॥ యాగక్రియోచిత♦మగు తురంగము రాగ, బంధించె లవుఁ డంతఁ ♦ బాలక భటు
లమిత సంఖ్యలుగాగ ♦ నరుదేర వారల, నందరి నొకడ జ♦న్యమునఁ దునిమెఁ
బిదప నొక్క మహీశు♦నెదిరింప నాతఁడు, మూర్ఛఁబుచ్చి శతాంగ♦మునను జేర్చి
కొనిపోవఁ జూచుచుం♦డె నటంచు లవు సహ,చరులు తెల్పఁగ నల♦మరుగుచుంటి

తే॥ వత్స తత్క్షణ మా నృపు♦వలన లవుని, బలిమి విడిపింపు మను తల్లి ♦పలుకులు విని
క్రోధమునఁబండ్లుఁ బెదవినిఁ♦గొరికికొనుచుఁ, బలికెఁ గుశుఁ డబ్దగంభీర♦భాషణముల.

శా॥ అమ్మా తమ్ముని బంధముక్తుని నవ♦శ్యంబిప్పుడే సేతు ని
క్కమ్మా మానవనాథు సైన్యములతో ♦ ఖండించెద న్మల్కులన్
దెమ్మా నా కవచంబు దివ్యధనువుం ♦ దీక్ష్ణాసి నుష్ణీష మి
ప్డిమ్మా దుఃఖము నొందకమ్మ యశమే ♦ యిట్లాట శూరాళికిన్. ౧౨౬

చ॥ అలజడి నొందకమ్మ నరుఁ♦డైనను నిర్జరుఁడైన నాతఁడా
యళికతలాక్షుఁడైన రణ ♦ మందున నాతనిఁ బట్టికట్టెదన్
మెలపునఁ దెచ్చెదన్ లవుని ♦ మేలన వీరులు చూడు మట్లనే
సలుపనొ నీదు పాదవన♦జంబులఁ దప్పినవాఁడ నయ్యెదన్. ౧౨౭

వ॥ ఇట్లు పలుకు కుశుని మాటల కలరి సీత యాశీఃపూర్వకంబుగా సమస్తాయుధంబు
లొసంగి వత్సా సత్వరంబునఁ బొమ్ము లవుం దెమ్మన నతం డుప్పొంగుచు నమస్క
రించి తదాజ్ఞ వడసి కవచకుండల మకుటాదుల ధరించి ధనురాదిసకలాయుధో
పేతుండై పోయి ముందు. ౧౨౮

శా॥ కాంచె న్వైరివిపాటనక్షమము శతాం♦గస్థుం గుశుం డా లవుం
గాంచె న్వీరసమూహ మంతకనిభున్ ♦ ఖడ్గాదిహస్తుం గుశున్
గాంచె న్మూర్ఛఁ దొరంగి లేచి కదనో♦త్కంఠున్ లవుం డా కుశుం
గాంచె న్వీరల నిద్దరం గని యనీ♦కం బప్పు డాశాంతమున్. ౧౨౯

—♦ లవునితోఁ గుశుడు రణంబున శత్రుఘ్ను మూర్ఛ నొందించుట ♦—

తే॥ బంధములఁ ద్రెంచుకొని బాహు♦బలుఁడు లవుఁడు
స్యందనమునుండి యురుకుచు ♦ నన్నఁ జేరి
యనిలసాహాయ్యమునఁ జేసి ♦ యనలుఁడు వలె
వెలిఁగె రణభూమి సైన్యంబు ♦ భీతిఁ గలఁగె. ౧౩౦

సీ॥ పృథ్వీశిని గుశుండుఁ ♦ బ్రత్యాశ లవుండు, నిలచి సేనలఁ బెల్లుఁ ♦ గలచుచుండ
వీరిద్దరి నిశాత ♦ విశిఖంబులను వీర,వరు లెల్లరును సుడి♦వడుచు భీతి
నిటునటు వేఁ బరు♦గిడుచు నుండిరి కాని, యొకఁడైన రణభూమి♦నుండఁడయ్యె
నట్టియెడఁ శత్రు♦హంత మహోగ్రుఁడై, బవరంబునకు వచ్చి ♦ లవసమాను
తే॥నసమబలశాలి రామని♦భాంగుఁ గుశునిఁ, గని సువర్ణరథస్థుఁడై ♦యనియె నిట్లు
లవుని కన్నవుఁగా నుంటి♦ వెవఁడవీవు, కనిన తలిదండ్రు లెవ్వరో♦వినెదఁ జెప్పుము.

క॥ వనముల నిట్టుల బ్రాహ్మణ, జనములతో నుండనేల ♦ సర్వముఁ దెలుపన్
ఘనబల నీతో నపుడే, ననిఁ జేసెద ననిన నాతఁ ♦ డనె ధీరుండై. ౧౩౨

చ॥ వినుము నృపాల మమ్ములను ♦ వీరపతివ్రత సీత గాంచె నీ
వనమునఁ బావనంబు లగు ♦ వల్మికసంభవు సీద్యదివ్యప
ద్వనజములన్ భజింపుచు ని♦వాసముగా నిఁట నుంటిమయ్య మా
జననిని భక్తిఁ బూజలను ♦ సల్పుచుఁ దన్పుచు నో నృపాలకా. ౧౩౩

క॥ కుశలవు లను నామంబుల, యశముం గైకొన్న వార ♦ మయగారి కృపా
వశమున విద్యల నన్నిఁటి, వశములుఁగాఁ గొంటిమయ్య ♦ వసుధాధీశా. ౧౩౪

తే॥ వీరుఁడవు యుద్ధసంశ్లాఘి♦వే యగుదువు, గాని నీ వెవ్వఁడవు చెప్పు ♦ కత్తలాని
వీడుకోలేల యా వీతి ♦ వెంట బలము,తోడవచ్చితె? బలమున్నఁ♦దొడరు మనికి.

క॥ ఇప్పుడ యీ రణభూమిం, దప్పక పడఁ జేతు నిన్నుఁ ♦ దడయక ననఁగా
నప్పలుకులు విని యాతం, డిప్పాపలు రామభూత♦లేశుని సుతులా? ౧౩౬

తే॥ అనుచు విస్మయంబు♦నందుచు మదిలోనఁ, బ్రతిఘ గదుర విల్లుఁ♦బట్టునంతఁ
గుశుఁడుఁజూచి తనదు ♦కోదండమును బూని, మొక్కలముగ నారి♦ మొరయఁ జేసె.

క॥ అది గని సౌమిత్రి శిత, ప్రదరంబులుఁ గుశునిమీఁదఁ ♦ బరపెఁ గుశుం డా
ప్రదరంబుల నన్నింటినిఁ, బదడుగ నొనరించె స్వీయ♦బాణాగ్నులచేన్. ౧౩౮

సీ॥ సైతేయశత్రుఘ్న♦ సాయకంబులు లోక, మంతయుఁ గప్పఁగ ♦ వింతఁ దోచె
నంతట నా కుశుఁ♦డాగ్నేయశరముచే, నెల్లమూకలను ద♦హింపుచుండె
నది గని శత్రుఘ్నుఁ♦డంబుదాస్త్రంబున, సొంపర దాని శ♦మింపఁ జేసె
సైతేయుఁడతిక్రుధా♦సంరంభుఁడై దానిఁ, బవనాస్త్రమున దిశల్ ♦ బారఁ జేసె

తే॥ శత్రుహంతయుఁ బర్వతాస్త్రంబుఁ బరపి,గాలి సొరకుండగను దానిఁగడఁకనాపెఁ
కుశుఁడు వజ్రాస్త్రమున రాలుగూలనేసి, విడిచె నారాయణాస్త్రంబు విభునిమీఁద.
వ॥ అది మహాబలపరాక్రముఁడగు శత్రుఘ్నుం గలంపంజాలక వ్యర్థంబగుటకుఁ గుశుండు
మనంబున నత్యంత కుపితుండై యతనింగాంచి యిట్లనియె. ౧౪౦
ఆ॥ నరవరేణ్య నాదు నారాయణాస్త్రంబు, నిన్ను వెతలఁబెట్ట నేర దయ్యెఁ
గాన జన్యవిజయకారివి వీరుఁడ, వీ వటంచు నిప్పు డెఱిఁగినాఁడ. ౧౪౧
ఉ॥ ఇప్పుడ మూఁడు బాణముల నిప్పుడమిం బడఁ జేతు నిన్ను నేఁ
దప్పిన నా ప్రతిజ్ఞ విను తద్దయుఁ బుణ్యశతంబులన్ విధిన్
దప్పకచేసినన్ గడఁక దక్కఁ గనఁ జాలని మేను నొంది నే
రొప్పుఁగ నాదరింపని మదోద్ధతుఁ డొందెడు పాప మొందెదన్. ౧౪౨
తే. సావధానంబునను నీవు సంగరమున, నుండుమా నీ కళేబరం బుర్వియందు
నిప్పుడే కూల్తు నే నిజ మిదియటంచు, ఘోరదహనాభశర మొండు నారిఁగూర్చి
సీ॥ విపులమై కఠినమై పెంపారు వక్షంబు, గురిఁజూచి కొట్టఁగాఁ గొరలు నంత
నదిచూచి శత్రుఘ్నుఁ డత్యాగ్రహంబున, శాతముల్ త్వగ్భేదచణము లైన
శరములఁ బరప నా ధరణిజానందనుఁ, డవి లెక్కసేయక యా శరంబు
విడువఁగాఁ గ్రూరదర్వీకరంబు విధాన, మొరయుచురా రామమూర్తి మదినిఁ
తే॥ దలఁచి యొక క్రూరశితపృషత్కమున దాని
ఖండన మొనర్పఁగాఁ బెల్లుఁ గనలి కుశుఁడు
కాలవహ్ని సదృక్షమై కడువెలుంగు
వేరొక శరంబు లక్షించి బిట్టువిడిచె. ౧౪౪
ఆ॥ విడుచునంతలోన వేగ శత్రుఘ్నుఁడుఁ, దునిమె దాని మధ్యఁ దునకలుగను
నటుల నగుటఁ జూచి యుగ్రహోదగ్రుఁడై, తల్లిపాదములను దలఁచి కుశుఁడు.
క॥ మూఁడవ శిలీముఖంబును, దోడుత బాణాసనమునఁ దొడిగి విడువ నా
రేడంబులుఁ గడుఁ బరపిన, గాఁడె నతని రొమ్ము వాని ఖండింపు చొరగిన్. ౧౪౬
తే॥ గాడ సౌమిత్రి పెనుమూర్ఛ గదురనొరిగె,నొరుగహాహారవంబులు దఱచుపరగెఁ
బరగభటతతిరణభూమి వెరచితొలఁగెఁ,దొలఁగజయలక్ష్మిఁగుశుఁడొంది కలనఁజెలఁగె.

—♦ సురథాదులు కుశునితోఁ బోరి మూర్ఛనందుట ♦—

క॥ నరపాల ప్రవరుండగు, సురథుం డది చూచి రత్నజుష్టఘనలస
త్సురథారోహకుఁడై కుశుఁ, దటియంజనెఁ గ్రోధపూరితస్వాంతుండై. ౧౪౮
ఆ॥ భరతసుతుఁడు మూర్ఛఁ దొరఁగి లవుంజేర, నరిగె నపుడు సురథుఁ డతిఖరాంబు
వృష్టిఁ బరపి కుశునిఁ బీడితునిం జేయ, నతఁడు గనలి ధశశితాంబకముల.

క|| సురథుని విరథునిఁగా దృఢ, తర గుణపూరితకరస్థ♦ధనువు విఱుగఁగాఁ
బరువడిఁ జేయఁగ ♦ సురథుఁడు, గరుదంబకములను గుశునిఁ ♦ గప్పె మునీంద్రా.
వ|| అంత. ౧౫౧

ఆ|| కదన భూమిఁ గుశుఁడు♦ గాల్సేతు లాడక,యంబుపంజరమున ♦ నడఁగియుండి,
కొంతవరకుఁ దెరపి ♦ గొని మహాగ్రహమున, మించి బాణవృష్టి ♦ ముంచె నతని.

వ|| ఇట్లు సమంబుగ నిద్దరు నస్త్రప్రత్యస్త్రంబుల క్షేపణప్రతిక్షేపణంబుల వీర భయంకరంబుగఁ బోరుచుండి రందుఁ గుశుండు సురథుని బలంబునకు విస్మయంబు నొంది తన మనంబున నిట్లు వితర్కించె. ౧౫౩

చ|| కడు బలశాలి యీ నృపుని ♦ గండడగించుట యెట్లు నాకు బల్
బెడగుగఁ దోచె నంచు రిపు♦భీకరమైన నిశాత బాణ మొ
క్కఁడు విలుఁ జేర్చి నారి కడు♦గట్టిగ లాగి హృదంతరాళ మే
ర్పడ గురిజూచి పో విడువ ♦ రాజది దుర్గింపఁగఁ జూచునంతలోన్. ౧౫౪

ఆ|| పోయిఁ బొమ్మ్మగాడ ♦ మూర్ఛమునుంగుచు, రథముమీఁదఁగూలె ♦ రాజసింహుఁ
డంత యంత తేరు ♦ నాహవావనిఁ దప్పఁ, దోలుకొనుచుఁబోయె ♦ దూరమునకు.

క|| తేరునఁబడిన నృపుం గని, వీరులఁ బోఁదోలు కుశుని ♦ వీక్షించి వెసన్
మారుతసూతి మహాగ్రహ, పూరితుఁడై యరుగుదెంచెఁ ♦ బుడమి వడంకన్.

వ|| ఇట్లరుగుదెంచు ప్రబలుం డగు ప్రభంజనాత్మజుం జూచి కుశుండు దంతకాంతులు మెరయ నవ్వుచు నిట్లనియె. ౧౫౭

క|| రమ్మా హనుమంతుఁడ నా, సమ్ముఖమున కీవు తీక్ష్ణ♦శరశతములనే
నిమ్మహిఁ గూల్చుచు శమనపు,రమ్మునకుం బరపుదున్ బ♦రాక్రమ మొప్పన్.

ఆ|| ఇట్లు పలుక వినుచు ♦ నితఁడు మహాబల, శాలి రాఘవాత్మ♦సంభవుం డ
టంచు నెరిఁగి యిప్పు♦డధిపుఁ గార్యము సేయఁ, దగునటంచు నాత్మఁ♦దలచు చరిగి.

తే|| శతసుశాఖలుఁ గల్గి వి♦శాలమైన, సాలమొక్కటిఁదెచ్చి తా ♦ సరగునఁజని
వైవ గమకించు తరి మూఁడు♦వాడితూపు,లేసి వక్షముఁ బగులఁగఁ♦జేసెఁ గుశుఁడు.

చ|| అటమటమొంది వాయుసుతుఁ ♦ డాగ్రహ మొప్పగఁ జూచి యా కుశున్
బటపట పండ్లుగీటుచును ♦ బాదప మక్కునవైవ బిర్రులై
పొటపొట రక్తబిందువులు ♦ భోరునఁ గ్రమ్మఁగఁ బిచ్చలింపఁడ
క్కటకటయంచు విస్మయముఁ ♦ గాంచిరి వీరులు బాలుఁడోటచేన్. ౧౬౦

సీ|| అంతట వృక్షప్ర♦హారంబునకు నల్గి, పరమాస్త్రవిదుఁ డతి♦బలుడుఁ గుశుఁడు
హరియింతుఁ గపిని సం♦హారాస్త్రమున నంచు, ధనువునఁ గూర్చ నా♦తరుచరవరుఁ
డది దుర్జయంబని ♦ యంతరంగంబున, శ్రీరాముపదములఁ ♦ జేర్చి భక్తి
ధ్యానింపుచుండఁ ద♦దస్త్రంబుఁ బావని, వక్షంబు గురిఁజూచి ♦ వదలెఁ గుశుఁడు

తే॥ పోయియదియెదగాడఁగఁ♦బొక్కుచతఁడు, మూర్ఛనొందుచువ్యధరణ♦భూమివడుట
గాంచిసైతేయుఁడతితీక్ష్ణ♦కాండములను, సైన్యమంతయుక్షణములో♦సమయఁజేసె.
ఆ॥ కుశశరాయుతములఁ ♦ గూలిన భటులను, బరచుచున్నసైన్య♦పతులఁ జూచి
యపుడు ప్లవగనాథుఁ, ♦ డైన సుగ్రీవుఁ డ,త్యధికరోషశోణి♦తాక్షుఁడగుచు.
మ॥ తరువుల్ పెక్కులుఁ దెచ్చి యా కుశుని మీ♦ద న్వైవ నాతండు లో
చిరునవ్వొప్పఁగ లీల నన్నిటిని వే ♦ ఛేదింపఁగాఁ జూచి వా
నరనాథుండు ననేక వృక్షములఁ ద ♦ న్గారింప నా భూజముల్
నురుమాడెన్ గిరివైవఁ దానిఁ బెలుచన్ ♦ నుగ్గై చనంజేసెఁ దాన్. ౧౬౪
తే॥ మఱలసుగ్రీవుఁడొకకొండఁ♦ బెఱికితెచ్చి,కుశునిమ స్తంబుఁబగులఁగాఁ ♦ గోరివైవ
నతఁడు శరములఁ గాలరు♦దాగ్నియోగ్య,మగునటుల్ చేసెదానినో♦యమివరేణ్య.
కం॥ తన గిరి భస్మంబగుటను, గని సుగ్రీవుండు విజయ♦కాంక్ష వదలి బా
లుని నొంప శక్యముం గా, దని రణభూతలమునందుఁ♦దలకుచు నుండెన్. ౧౬౬
కం॥ సైతేయుం డంతట ఖ, ద్యోతాత్మజుఁ దోఁకఁదూట్లు♦తూట్లుగఁ గొట్టన్
భీతుండై యధికక్రుద్ధో, పేతుండై యతఁడుఁ గుశుని ♦ *బింబెదనంచున్. ౧౬౭
ఆ॥ పెద్దచెట్టుఁ దెచ్చి ♦ తద్దయు నీ తల, బ్రద్దలగు నటంచు ♦ వైవ దానిఁ
గృద్ధుఁడగుచుఁ గుశుఁడు ♦ గెడపుచు సుగ్రీవు, నుద్దవిడి శరాళి♦నొంచుటయును.
చ॥ మఱియొక మద్దిచెట్టుఁగొని ♦ మచ్చరమొప్పఁగ ♦ వచ్చువాని దు
ర్భర మగు వారుణాస్త్ర ఘన♦పాశములన్ గశుఁ గట్ట నా వనే
చరవరుఁ డపు మూర్ఛఁగొని ♦ చచ్చినయట్లు రణాంగణంబు నం
దొరుగఁగ వానిఁ జూచి వెర♦పొందుచుఁ బాఱిరి వీరులెల్లరున్. ౧౬౯

—♦ లవుఁడు బుష్కలాదుల జయించి కుశుం జేరుట ♦—

కం॥ వీరశిరోమణియగు కుశ, వీరుఁడు జయమొంది జన్య ♦ పృథ్వి సుమహో
దారుండై యుండెను లవుఁ, డా రీతిని బుష్కలాదు ♦ లందరి తోడన్. ౧౭౦
సీ॥ పోరుచు వీరులఁ ♦ బోఁదోలి యంగదుఁ, ద్రుంగఁజేసి సుబాహు♦తుళ్ళడంచి
వీరుఁ బ్రతాపాగ్ర్యు ♦ బీరం బడంచి యా, వీరమణినిఁ జాల♦ వెతలఁబెట్టి
బలుని లక్ష్మీనిధి ♦ బడఁజేసి సుమదుని, సురుగఁజేసి భటాళి ♦ సుగ్గిఁజేసి
పుష్కలుని జయించి ♦ పోరున గెలుపొంది, చెలఁగుచుఁ దా నన్నఁ♦జేరి మ్రొక్క
ఆ॥ అంత నొక్కరొకరి ♦ నాలింగన మొనర్చి, కొనిరి జయముఁజెప్పు♦కొనిరి సంత
సంబుఁ గొనిరి మాన♦సంబున వారిలో, వారు మెచ్చికొని ర♦వారిగాఁగ. ౧౭౧
వ॥ అప్పుడు లవుండుఁ గుశుం గాంచి యిట్లనియె. ౧౭౨
తే॥ అన్న వినుమయ్య త్వదనుగ్ర♦హంబు వలనఁ, గదన వారిధి దాటఁగా♦గంటినిపుడు
జన్యతలమునఁ బడియున్న ♦ సకల వీర, వరులఁ జూడఁగ రమ్మనఁ ♦ దరలె నతఁడు.

---

* బింబెదను = చంపెదను.

వ॥ ఇట్లిద్దరు రణస్థలిం జేరి రందుఁ గుశుండు శత్రుఘ్నుని సువర్ణస్థాపితం బగు శిరో
రత్నంబుఁ గైకొనె, నతనిమకుటంబును బుష్కలుని మకుటాంగదంబులను వీరుల
శస్త్రాస్త్రంబులను లవుండు హరించె నిట్లిరువురు నక్కడక్కడఁ దిరిగి యయ్యా
వస్తువుల సంగ్రహించి యొక్కచో మూర్ఛ లుడిగి పడియున్న హనుమత్సుగ్రీ
వులఁ బట్టి బంధించి రందు లవుండు హనుమంతుని తోఁకఁ బట్టుకొని యన్నం
గాంచి యిట్లనియె. ౧౭౪

తే॥ అన్నయనయంబు మనయమ్మ♦హర్ష మొందఁ,గూడి మునిబాలులెల్లరు♦గ్రీడసలుప
నాకుఁ గౌతుకముగ వీని ♦ తోఁకఁబట్టి వేగఁగొని పోయెదను మన♦వేశ్మమునకు.

వ॥ అనుటయుఁ గుశుం డిట్లనియె. ౧౭౬

తే॥ బలియు ముదుసలియైన యీ♦పండుకోతి, నేనుఁగొని తెత్తు వే మన♦నిలయమున క
టంచుఁ బలుకుచుఁ బగ్గాల♦నంటఁగట్టి, వాలములఁ బట్టుకొని వేగ♦వచ్చునపుడు.

వ॥ సుగ్రీవాంజనేయులు దమ్ముఁ గొనిపోవు కుశలవులం గాంచి కంపితహృదయులై
యొకరి మొగ మొకరు గాంచుచు నుండి రందు సుగ్రీవుం గాంచి హనుమంతుం
డి ట్లనియె. ౧౭౮

క. శ్రీరాముని తనయులు వీ, రీ రీతిని మనలఁగొంచు ♦ నేగి జననికిఁ
గారింపుచుఁ జెప్పెద రా, నారీమణిఁ గాంచి యెట్లు ♦ నతిసేయుదునో. ౧౭౯

ఉ॥ ఎట్టి మహోన్నతుండ నయి ♦ యేగితినో మును రావణాసురే
ట్పట్టణమందు నా పుడమి♦పట్టినిఁ జూడఁగ వానరేశ యి
ట్టెట్టి విహీనవృత్తిఁ గన ♦ నేగుచు నుంటినొ చూచితే కటా
యిట్టి యవస్థ నున్న నను ♦ నెంతయుఁ గాంచి హసింపకుండునే. ౧౮౦

తే॥ అందుకై నాకుఁ జూడ సి♦గ్గగుచునుండె, నపుడు నేఁ జేయఁదగిన కృ♦త్యంబు మరణ
మంతకన్న మరొక్కటె ♦ యరయఁగలదె, యిట్టులైతిని ప్రభు వేమి♦ సేయఁగలఁడు.

వ. ఇట్లు దీనవదనుండై పలుకుచున్న హనుమంతుం జూచి సుగ్రీవుం డిట్లనియె. ౧౮౨

తే॥ అంజనీసుత వినుము నా♦కట్లయుండె, నిప్డు వీ ర్సీతకడకుఁ గొం♦చేగిరేని
యెట్లు తలనెత్తుకొందు నే♦నింక మృతినిఁ, బడయఁగలవాఁడ నంచును♦బలుకుచుండ.

వ॥ హనుమంతుం డిట్లనియె. ౧౮౪

ఆ॥ కాలగతినిఁ ద్రోయఁ♦గడగు వారెవ్వరు, కాఁగలట్టి వెల్లఁ ♦ గాక పోవ
టంచుఁ బల్కుచుండ ♦ నా యమళులుఁ బోయి, చేరి మ్రొక్క సీత♦చేరఁదీసి.

తే॥ మోదమునఁజిక్కి వారల♦ముద్దుఁగొనుచుఁ, దడయ కరుదెంచినారె నా♦తండ్రులార
యనుచు నాలింగన మొనర్చు♦నంబఁగాంచి, యనిరి కుశలవు లప్పుడు♦హర్షమొదవ.

´॥ ముదుసలి కోతుల రెంటిని, ముదమునఁ దెచ్చితిమి నీకు ♦ మురి కల్గుటకై
యిదివర కెన్నండైనను, మది రంజిలఁ గంటె యిట్టి ♦ మర్కటవరులః ౧౮౭

— ♦ బద్ధులగు సుగ్రీవాంజనేయులను సీత విడిపించుట ♦ —

వ॥ ఇట్లు నుడువుచున్న కుశలవుల వాక్యంబు లాలింపుచుః గృహీతపుచ్ఛులై బంధం
బులఁ గట్టువడి దీనవదనులై నేలఁ జూచుచున్న సుగ్రీవాంజనేయులఁ గని సీత
యిట్లనియె. ౧౮౯

తే॥ బలవదగ్రేసరులు మీరు ♦ వసుధలోన, బాలకులచేత నెటు పట్టు♦బడితిరయ్య
యహహా యీ విపరీత మే♦మనఁగవచ్చు, బలిమి డేగలఁ బిచ్చుకల్ ♦బట్టుటాయె.

వ॥ అనుచుఁ బరితాపంబునఁ బుత్త్రులం గాంచి యిట్లనియె. ౧౯౦

ఉ॥ బాలకులార యీతఁడు బ్రి♦భంజన నందనుఁ డాంజనేయుఁ డా
భీలపరాక్రముండు మును ♦ వీరుఁడు రావణు లంకఁగాల్చెఁ జూ
వాలికి తమ్ముఁ డాతఁడుఁ బ్ల♦వంగకులేశ్వరుఁ డిట్టి మానులన్
బేలతనానఁ గట్టితిరి ♦ వీరులు చావగనుండి రక్కటా. ౧౯౧

ఉ॥ ఎచ్చటనుండి నీ బలుల ♦ నెందుకుఁ గట్టితి రయ్య హీనతన్
బుచ్ఛఁగనేలఁ బట్టితిరి ♦ పుచ్ఛము లిట్టుల నింత వీరిపై
మచ్చర మేల విస్మయము ♦ మానసమందునఁ దోఁచె నిత్తరిన్
బుచ్ఛుఁడు గట్టు లూడ్చి దయఁ ♦ బోలునె మానుల నిట్లు సేయగన్. ౧౯౨

ఆ॥ అనిన పలుకు లిరువు ♦ రాలించి వారలఁ, గాంచి తల్లిముఖము ♦ గాంచి బలవ
దగ్రగణ్యులైన ♦ యీ బాలకులు విన, యంబుఁ దోఁపఁబల్కి ♦ రంబతోడ. ౧౯౩

సీ॥ అమ్మ దశరథజుఁ♦డఁట మహావీర శి, రోమణియఁట పేరు ♦ రామచంద్రుఁ
డట తురంగమమేధ♦యజ్ఞంబు సేయుచు, వీతిని భటులతో ♦ విడచె దాని
నుదుట వ్రాసినవ్రాతఁ, ♦ జదువుదు మిప్పుడు, వివరంబుగా దాని♦వినుము తల్లి
తనతల్లి వీరమాత యఁట నృపుల్ భువిఁ, గలరేని కట్టఁగా ♦ వలయునంట

తే॥ కట్టవలెనంట లేకున్న ♦ కప్పములను, వానియడుగుల పైఁబడ♦వలయునంట
వింటె క్షత్త్రియజాతుఁడు ♦ వీరుఁడైన, వాఁడెవండైన నోర్వఁ♦గలాఁడె దీని. ౧౯౪

వ॥ లవుం డిట్లనియె. ౧౯౫

సుగంధివృత్తము॥ అమ్మ నీవు క్షత్త్రియాన్వ♦యంబునందుఁ బుట్టవే
మమ్ముఁగన్నతల్లి వీర♦మాత వీవుకాదె దా
ష్ట్యమ్ముఁ జూచి పట్టినాఁడ ♦ సప్తతంతుసప్తి నే
నిమ్మహిన్ బడంగఁ జేసె ♦ నెల్లసైన్య మన్నయే. ౧౯౬

క॥ జననీ మణిచిత్రితమై, దనరారు కిరీట మల్ల ♦ ధరణీశునిదాఁ
గనుఁగొంటివె యీ మకుటము, ఘనబలుఁడగు పుష్కలునిది♦గా నెరుఁగుమెదన్.

తే॥ కామగమనంబుచే నొప్పి ♦ కడు మనోహ, రాకృతినిఁ జెన్నుమీరు వా♦హంబునెక్కి
యధికసంతోషమునను నా♦ యన్న కుశుఁడు, హాయిగ వనవిహారంబు♦ సేయుఁగాత.

క॥ మచ్చరమునఁ బోరిరి బల, మచ్చుపడన్ వీర లీ వ♦నాటుల బలులన్
మెచ్చుకొనంగను నీమదిఁ, దెచ్చితి నే నాడుకొనఁగఁ♦ దెక్కర మొప్పన్. ౧౯౯

వ॥ ఇట్లు బల్కుచున్న లవుని వాక్యంబులు విని సీత యిట్లనియె. ౨౦౦

ఉ॥ బాలకులార రాఘవుని ♦ వాహముఁ బట్టి యనీతికృత్యముం
దాలిమిలేకఁ జేసితిరి ♦ తద్దయుఁ వీరులఁ గొట్టినారు స
చ్ఛీలురు వానరోత్తములు ♦ సిబ్బితి నొందఁగఁ బట్టి కట్టి నా
రాలము నింతఁ జేసితిరి ♦ యా రఘురాముఁడు తండ్రియే సుఁడీ. ౨౦౧

తే॥ అశ్వమేధీయ మగునట్టి♦హయముఁ బట్టి, తండ్రియజ్ఞంబు వృథ సేయఁ♦ దలఁచినారు
మెచ్చ రెవ్వరు పై పెచ్చు ♦ వచ్చుదూరు, వీతి నీ కీశవర్యుల ♦ విడువుఁడీరు. ౨౦౨

ఆ॥ చండకోపియైన ♦ శత్రుఘ్ను మీ ర్త్రమి,యింపుఁ డఖిలలోక ♦ మెంచు మిమ్ముఁ
గాంచెదరు యశంబుఁ ♦ గావున నే నిప్డు, చెప్పినట్లు మీరు ♦ సేయుఁ డనిన. ౨౦౩

వ॥ కుశలవు లిట్లనిరి. ౨౦౪

క॥ వినుమమ్మ క్షాత్రధర్మం,బునఁ బోరితి మేము వారిఁ ♦ బో విడచెద మే
మును దగ వాల్మీకి మహా,ముని మా కెఱిఁగించెఁ దెల్ల♦ముగ నొక వార్తన్.

సీ॥ మున్ను దుష్యంతుఁడన్ ♦భూనాయకుం డధ్వరంబొనర్చుచు దురఁగంబు విడువ
నది కణ్వమౌనిమ♦హాశ్రమంబును జేరఁ,బట్టి తత్పుత్రుఁ డ♦వార్యబలుఁడు
భరతుఁడు దండ్రితో ♦ బవరం బొనర్చెను పాపమించుకయును ♦ బడయఁ డాతఁ
డన్నతోఁ దమ్ముఁడు♦ననఘుఁడౌ గురువుతో, శిష్యుఁడు కదనంబు♦ సేయఁదగును,

తే॥ గాక మా కేమి పాపంబు♦గల్గు చెప్పు, మమ్మ నీ యాజ్ఞ మే మిప్పు♦డాదరించి
వీతి నీ కపివర్యుల ♦ విడుతుమమ్మ, తల్లి నీమాట కడుగైన ♦ దాటమమ్మ. ౨౦౬

వ॥ ఇట్లు పలికి తల్లి యానతింగని కుశలవులు రణస్థలింజేరి హనుమత్సుగ్రీవుల బంధ విముక్తులన్ జేసి సవనయోగ్యం బగు వాహంబు విడిచిరంత సీత తన పుత్రులవలన సకల సైన్యంబుతో శత్రుఘ్నుండు పడుట విని కర్మసాక్షిం గాంచి యిట్లనియె.

తే॥ కడుమనఃకాయవాక్కర్మ ♦ కలన నెప్పు, డేమరక రామచంద్రు భ♦జింతునేని
యితరమును మానసంబున ♦ నెఱుఁగనేని, భటులతో వేగ సౌమిత్రి♦ బ్రతుకుఁగాత.

వ॥ ఇట్లు మహాపతివ్రతయగు జానకి పలుకునంతఁ బుష్కలాది యోధులును శత్రుఘ్నుండును మూర్ఛ దొఱంగి లేచిరి, యజ్ఞాశ్వంబును ముందరఁ గన్పట్టె నంత.

క॥ స్మృతిఁ దెలిసియున్న తనుఁగని, వెతలుడిగి సుఖాన నున్న ♦ వీరులఁగని య
ద్భుతపడుచుండెను మదిలో, నతఁ డెఱుఁగఁడు మకుటహరణ ♦ మరగడె వరకున్.

వ॥ అప్పుడు మూర్ఛారహితుం డగు మంత్రింగని శత్రుఘ్నుం డిట్లనియె. ౨౧౧

ఆ॥ వీరమణి నృపాల ♦ వీరులు లేచిరి, బాలుఁ డెచటనున్న ♦ వాఁడొ యిప్పుడు
మత్కిరీట మెవఁడో ♦ మాయురే హరియించి, వీతిఁ గరుణ నెదుటఁ ♦ బెట్టిపోయె.

—♦ శత్రుఘ్నుఁడు సవనహయంబుతో నయోధ్య కరుగుట. ♦—

క॥ ఇంతట సాకేతమున క,నంతం బగు సేనతోడ ♦ నరుగఁగవలె భూ
కాంతుఁడు సావనహరికై, స్వాంతంబున నెదురుఁజూచు ♦ ననుచు బిజాన్.

తే॥ స్యందనారూఢుఁడై తను♦నఖిల భటులుఁ, గొల్చుచుండఁగ వీతిఁ♦గొంతదూర
మరుగువరకును దరపట♦హాదివాద్య, నినదములు లేకయుండఁగఁ♦జనియె నృపుఁడు.

క॥ స్యందనములు తంబేరమ, బృందములుఁ దురంగమములు ♦ వీరభటాళుల్
గ్రిందుగఁ జనుచుండఁగ నే, మందును నా తలలుఁ గుంగె♦నపుడు మునీంద్రా.

వ॥ ఇట్లు శత్రుఘ్నుండు ధనుర్ధరుండై శిరంబున శ్వేతాతపత్రంబు గ్రాలఁ బుష్కలాదియోధులతో సురథాదిధరాధినాయకులు రా, ముం దధ్వరతురంగంబుఁ బోవుచుండ, మహావేగంబునఁ జని చని, తరంగమాలాశోభితంబగు గంగానది నుత్తరించి స్వజనశోభితం బగు స్వీయ విషయంబుఁ బ్రవేశించి ధనుర్ధరు లగు వీరులు సింహనాదంబులు సేయుచుండఁ గ్రమక్రమంబున ననేకపతాకాలంకృతంబై తరణివంశసంభవు లగు ధరణీశుల కాలవాలం బగు నయోధ్యం బ్రవేశించె నపుడు. ౨౧౬

క॥ తురగముతో శత్రుఘ్నుఁడు, భరతప్రియనందనుండు ♦ వచ్చిరటంచున్
బరిచరులుఁ జెప్ప రాముఁడుఁ, బరివారముతోఁ బ్రమోద♦భరితుం డయ్యెన్.

ఉ॥ తమ్ముఁడ లక్ష్మణా యిపుడు ♦ దమ్ముఁడు వచ్చె నృపాళితోడ నై
శమ్మునఁ బోయి వారి కుశ♦లమ్ముల నారసి తోడి తెమ్మనన్
సమ్మద మొంది లక్ష్మణుఁడు ♦ సైన్యముతోఁ జని సాయకక్షతాం
గమ్ములఁ బొల్చు సోదరునిఁ, ♦ గౌఁగిటఁ జేర్చి వచించె నిట్టులన్. ౨౧౮

తే॥ వత్స పుష్కల క్షేమాన ♦ వచ్చినావె, బావ లక్ష్మీశనిధి నీకు ♦ భావుకంబె
యోప్రతాపాగ్ర్యరిపుతాప♦యోసుబాహు, సురథులార సుఖంబెయం♦దరికిననుచు.

ఆ॥ వీరమణి నృపాల ♦ వింటి నీ యశ మని, కౌఁగలించు కొనుచు ♦ గాఢముగను
రండు భూపులార ♦ రామునిఁ గన నని, స్యందనంబు నందు ♦ నధివసించె. ౨౨౦

వ॥ ఇట్లు లక్ష్మణుండుఁ జతురంగబలంబులతోఁ జని సరయూనదీతీరంబున సుందరంబుగ రచించిన రత్నస్థగిత మంటపంబుల నయ్యె రాజన్యుల నిలిపి తగు సపర్యలఁ జేయం దగు వారల నియమించి శ్రీరామ సమీపంబునకుఁ జనియె నప్పుడు. ౨౨౧

ఆ॥ వేదవేత్తలైన ♦ విప్రుల వేదని, నాదముల్ ధరాధి♦నాథలోక
జ్యానినాదములును ♦ శంఖభేరీపట, హధ్వనుల్ కకుప్పు ♦లలముకొనియె. ౨౨౨

వ॥ సరయూనదీతీరంబున నుండు భోజనశాలలఁ గైరవంబుల మాదిరి స్వచ్ఛంబులై మిలమిలలాడుచున్న శాల్యన్నంబు భక్షించుచు బ్రాహ్మణు లొకరొకరితో సంభాషింపఁ దొడంగి రెట్లనిన. ౨౨౩

♦— బ్రాహ్మణులు భక్ష్యాదులఁ బ్రశంసించుట ♦—

సీ॥ శర్కరేలామధు♦సమ్మిశ్రమై పెల్లు,మీఁచుఁ బాయసరుచి ♦ నెంచఁదగునె
యబ్జబింబచ్ఛవి ♦ నడఁచు నీ భక్ష్యాల, మాధుర్య మెప్పుడైన ♦ మఱవఁ గలమె
పసమీరి గుమగుమ♦వాసించు నీ లడ్డుకముల నెన్నండైనఁ ♦ గాంచఁగలమె
ఘృతముద్గఘనసార♦యుత శర్కరోదనమును ముందు నెప్పుడైనఁ ♦దినఁగలామె
తే॥ రంధ్రములునూరుఁగలవియు♦రంధ్ర మొకటి,కలవియునుజూడరంధ్ర మొ♦క్కండులేని
భక్ష్యములుఁ జక్కిలంబులు♦వటుకములును,ఫేనికలు నెందుఁగంటిమే ♦ విశ్వమందు.
వ॥ ఇట్లందరుఁ బలుకుచుండ నొక బ్రాహ్మణుం డిట్లనియె. ౨౨౯
ఆ॥ తరుచు చెప్పనేల ♦ దధ్యోదనపు రుచి,మఱిగినట్టివారు ♦ మరల నింటి
కరుగ రనిన నొక్కఁ♦డనెఁ బులిహోరతో,సాటిరాదటంచుఁ♦జాటుదనుచు.
తే॥ వంటవారిఁట కెందుండి♦వచ్చినారొ, యీపదార్థాల రుచి నెందు♦నెరుఁగ మహహ
యొక్కటొకటినిమించుచు♦నొప్పుచుండె,నలుఁడువచ్చెనొయీమహా♦నసమునకును
వ॥ మఱియు నొక్కబాడబుండుఁ బాత్రిస్థక్షీరాన్నంబుఁ గాంచి యిట్లనియె. ౨౩౦
ఉ॥ ఈ నునుపైన పాత్రిల స్రవించెడుదాని గ్రహించినారె స్వ
ర్భానుభయంబుచే నమృత♦ భానుఁడు గ్రిందఁబడంగ బ్రద్దలౌ
మేనున నుండి చిందెడు న♦మేయ సుధారస మౌను ద్రావినన్
గానరు మృత్యువె ష్టన నొ♦కండుఁ గ్రుధారుణితాక్షుఁడై యనెన్. ౨౩౧
తే॥ అమృత విప్లుత మైనట్టి ♦ యబ్జబింబ, మొక్కటియ కాదె కనఁగను♦లెక్కవెట్ట
నలవి కానట్టి ద్విజపాత్రి♦లందుఁ దత్సు,ధారసం బెట్లు పడునయ్య♦మీర చెప్పుఁడు.
తే॥ కైరవములైన మంచి క♦ర్పూరమైనఁ, గాఁగలదు చంద్రబింబంబు♦ కాదటంచుఁ
దెలియుఁడనఁగమఱొక్కఁడుఁ దేరిచూచి,యాగ్రహంబునఁదలయూచు♦చనియెనిట్లు.
తే॥ మీరు మూఢులు రుచెరుంగ ♦ లేరు నిజము, బల్మనోహర మా శత♦పత్రిపుష్ప
జాలమును క్షౌద్రికందర♦సంబుచేతఁ, గాచినారు సుమా యిది ♦ కడకఁగనుఁడు.
వ॥ ఇట్లరణ్యంబునఁ గాయలు దుంపలు నమలుచు గ్రామ్యంబు లగు భక్ష్యాదులఁ దిను వారుఁ గాకుండుటం జేసి పదార్థంబులను వాని రుచులను బరిపరివిధంబులఁ జెప్పు కొనుచుండునంత నొక్క భూసురుం డిట్లనియె. ౨౩౩
సీ॥ ఇట్టి భక్ష్యాలతో ♦ నెపుడు శాల్యన్నంబు, భక్షించు నృపులదే ♦ భవము చూడ
నది పూర్వ కృత సుకృ♦తాతిశయంబున, నలవడు నన నొక్కఁ♦డనియె నిట్టు
లౌదార్య ఫల మిది ♦ యుగ్రజన్మున కన్న, మిడువాఁడె గాంచు స♦మీప్సితంబు
భక్ష్య భోజ్యాదులఁ♦ బద్మాక్షు నర్చింప, నట్టి దుర్మతు లెల్ల ♦ నిట్టి భోజ్య
తే॥ వస్తువుల నెన్నఁడును గను♦వారుఁ గారు, వివిధ రసముల నెవ్వారు ♦ విపరీతతులఁ
దుష్టి నొందించిరో వారు ♦ దురిత మతుల, కందరాని పదార్థము♦లనుభవింత్రు

వ॥ ఇట్లు నుడువుచు రసపానీయాది సకల ద్రవపదార్థసహితం బగు భోజ్యంబుల భుజించుచుం, బూర్వ పక్ష సిద్ధాంతంబు లొనర్చుచు భోజనశాల మారు మ్రోయున ట్లొనర్చు చుండఁ గొందరానందంబున నృత్యంబులు సలుపు వారును గొందఱు బరిహసింపు వారును గొందఱు రామనామ సంకీర్తనంబు సేయువారును మధ్య మధ్య గోవింద నామంబులు సేయువారును నైరట్టి మహోత్సవంబున కాటపట్టగు నచ్చటకు శత్రుఘ్నుం డరుదెంచె నప్పుడు. ౨౩౫

—♦ నమస్కరించిన శత్రుఘ్నాదుల శ్రీరాముఁ డూరడించుట ♦—

తే॥ భరతపుత్రునితో హస్త♦పంకజముల, మోడ్చుచును వచ్చు శత్రుఘ్నుఁ♦బోలఁజూచు
నప్పు డొదవెడు సంతోష♦మాపఁజాల, నందుచే రాముఁడది పొందె ♦నచటిజనుల.
క॥ తమ్ముని కెదురుగఁ బోవఁగ, నెమ్మనమునఁ దలఁచి లేవ ♦ నిగిడెడు నంతన్
సమ్మదమున రాముని పాదమ్ములపై వ్రాలె శత్రు♦దమనుఁడు భక్తిన్. ౨౩౬
వ॥ అంత రామచంద్రుండు. ౨౩౭
క॥ క్షతసంశోభితతనుఁ బద, పతితుని మతిమంతు వినయ♦వంతుని భ్రాతన్
వెతలుడుగఁగఁ బరిరంభణ, మతిప్రేమ నొనర్చి సమ్మ♦దాంబుల ముంచెన్. ౨౩౮
సీ॥ ఆంజనేయార్కాత్మ♦జాంగద లక్ష్మని, ధి రిపుతాపాదులు ♦ ధరణిపతులు
సుమద సుబాహు వీ♦రమణి నీలమణి ప్రవీర సురథముఖ్య ♦ వీరనృపులు
మఱియు నన్యులు లోక♦మాన్యుఁడౌ రాముని, పదములఁ గ్రమమునఁ♦బడుచునుండ
బరిరంభణముల నం♦దరి మోదితులఁజేసి, యానందమున నుండు ♦ నంత సచివుఁ
డధిక ప్రేమ నప్పు ♦ డాలింగన మొనర్చి, సమ్ముఖంబునందు ♦ నెమ్మినుండఁ
జూచి హర్షమునను♦ జొక్కుచు వక్తయౌ, రామచంద్రుఁ డనియె ♦ రాగ మొప్ప.
చ॥ సచివవరా! ప్రపంచమున ♦ సర్వ మెరింగినవాఁడ వీవు మే
ల్వచనములన్ నినున్ మిగులు ♦ వారును లేరిలఁ జెప్పవయ్య వీ
రెచట వసించు రాజవరు ♦ లెచ్చట నెచ్చటఁ గూడి రీ హయం
బెచటెచటన్ జరించె హరి♦యించిన వారు గలారె యెవ్వరేన్. ౨౩౯
ఆ॥ జక్కఁబట్టినట్టి ♦ శాత్రవుల జయించి, యెట్లు సోదరుఁడు గ్ర♦హింపఁజాలె
నంతయును వచింపు ♦ మన మంత్రివర్యుఁడుఁ, బలికె ఘనగభీర♦భాషణముల.

—♦ మంత్రి రాజుల చరిత్రము రామునితోఁ జెప్పుట. ♦—

సీ॥ సర్వజ్ఞుఁడవు నీదు ♦ సన్నిధి నేనెట్లు ♦ చెప్ప నేర్చెద నైనఁ ♦ జెప్పుమనుచు
లోకమర్యాదచే ♦ లోకులు వినుటకై ♦ కోరుచుంటివి రఘు♦వీర వినుము
నీ యాజ్ఞ శిరమున ♦ నిడికొని వచియింతు, నీ యనుగ్రహమున ♦ నిటలపత్ర
సంశోభితం బగు ♦ సప్తి యీ సర్వంసహాచక్రమునఁ దిరు♦గాడునంత

తే॥ రాజ్యము సిరులతోడ న♦ర్పణ మొనర్చి, (మొక్కి)రే కాని భువిలోన♦నొక్కఁడైన
నశ్వమునుబట్టువాఁడులేఁడయ్యె రావ, ణాసువులఁ గొన్న నిను♦విని♦యడలుఁగనరె.
ఆ॥ మరణభీతి నుండు ♦ మనుజుల నట నుంచు, ముదిమి చావులేని ♦ త్రిదశవరులుఁ
బట్టగలరె నీదు ♦ భక్తు లే హేతువు, చేతనైన సాహ♦సింతుగాక. ౨౪౪
సీ॥ సవనవాహం బహి♦చ్ఛత్రిపురంబున ♦ కరుగఁ దత్పతి సుమ♦దాఖ్యనృపుఁడు
విని పుత్రసహితుఁడై ♦ వినిహతకంటక, మైన రాజ్యము సస్వ♦స్యముగ నర్ప
ణముఁజేసి యీ తురం♦గముపెంట నరుదెంచి, నాఁడు మున్నితఁ డీ♦రేడులోక
ముల కంబయై యిష్ట♦ముల దయనిచ్చు కా,మాక్షి సేవించి యా♦యమ్మకృపను
తే॥ ఆయువు నిహతకంటక♦మగుచు నొప్పు,రాజ్యమునుగొన్న వాఁడు శ్రీ♦రామ నేఁడుఁ
జూఁడు నీపాదముల వ్రాలి♦నాఁడు చేరఁ, దీయు మీతని నీ కృపా♦దృష్టిఁ బరపి.
వ॥ తదనంతరంబ. ౨౪౬
తే॥ తురగమును బాహుభూపాల♦పురముఁజేర,నతనిపుత్రుఁడు దమనకుం♦డమితబలుఁడు
గనుచుముందరబంధింపఁ♦గదన మపుడు, దమనపుష్కలులకుభయ♦దముగఁజరిగె.
క॥ అందునఁ బెనుమూర్ఛను నృప, నందనుఁ బొందఁగఁజేసి ♦ నరవరనుతుఁడై
పొందెను విజయముఁ బుష్కలుఁ, డందులకు సుబాహు భూపుఁ♦డతికుపితుండై.
చ॥ అతిబలశాలి తావకప♦దాంబుజసేవకుఁడైన యా మరు
త్సుతు నెదిరించి తత్పదహ♦తుం డయి తాపసశాపజాతమూ
ర్ఖతను దొరంగి జ్ఞానమును ♦ గాంచి సమర్పణ మొప్పఁజేసి మీ
కతులిత భక్తి సర్వము హ♦యానుచరుం డయి వచ్చెఁ జూచితే. ౨౪౮
వ॥ నమ్రవదనుండై మ్రొక్కుచున్న యీ సుబాహు నృపాలుని కరుణాదృష్టిం గను
మని మఱియు నిట్లనియె. ౨౫౦
క॥ అంతట ముక్తంబై రే,వాంతర్జల మందు మునుఁగ ♦ హయ మనుజుం డా
వంతయుఁ దలకక చని హను,మంతునితో మోహనాస్త్ర♦మంత్రముఁ గొనియెన్.
వ॥ అటుపై వాసుకిభూషణున కావాసం బగు దేవపురంబుఁ జేరె నచ్చటికి నీ వరు
దెంచుటచేఁ దద్వృత్తంబంతయు నీకు విశదంబేకదా, తర్వాత వినుము. ౨౫౨
క॥ విద్యున్మాలియు మాయా,విద్య హరి హరించి భటుల♦ వెతలఁ బరపఁగా
నుద్యద్గతి నీ తమ్ముఁడుఁ, బ్రద్యోతనసుతుని కడకుఁ ♦ బంపె నరేంద్రా. ౨౫౩
తే॥ సత్యవంతుండు వచ్చె నీ ♦సన్నిధి తోడ, సురథభూనాయకునితోడ ♦ జరిగె బవర
మదిమెరుంగుదు వటనుండి♦యరిగెఁదురగ,మొక్కఁడైనను బట్టఁగా♦నోపఁడయ్యె.
ఆ॥ వాహములూరుభవుని ♦ పావనాశ్రమమును, జేరె నందు జరిగె ♦ చిత్రమొకటి
దాని నీకుఁదెల్పెఁ♦దను సావధానత, నాలకింపు మో నృ♦పాలతిలక. ౨౫౫
సీ॥ అచ్చటఁ బదియారు♦హాయనంబులవాఁడు, బాలుఁడొకండు నీ♦వంటివాఁడు
పత్రచిహ్నిత మగు ♦ వాహంబుఁగని దాని, బట్టినా డ్వీలు కేలఁ♦బట్టినాఁడు

కత్తులానినిఁ గొన ♦ గమకించు వీరులఁ, గనినాఁడు బాహులఁ ♦ దునిమినాఁడు
కాలజిత్తది విని ♦ కదనంబునకుఁ బోవ, నతని గాలునిపురి ♦ కంపినాఁడు
తే॥ పుష్కలాదులఁ బెనుమూర్ఛఁ♦బుచ్చినాఁడు, భటులనెందరినో బడ♦ల్వారపినాఁడు
తివిరిశత్రుఘ్నుమూర్ఛఁబొం♦దించినాఁడు,తుదకు నాతనిచే మూర్ఛఁ♦దొరఁగినాఁడు.
ఆ॥ అంతలోన నొక్కఁ♦డాతనితోఁ దుల్యుఁ, డేగుదెంచి భటుల ♦ నెల్ల దుంచి
నీదు పిన్నతమ్ము ♦ నెటిమూర్ఛలో ముంచి, శస్త్రమకుటములను ♦ సంగ్రహించె.
క॥ వినుమంతకు మును తెలివొం,దిన పిన్నాతఁడును దాను ♦ దినకరసుతునిఁ
హనుమంతుని బంధింపుచుఁ,గొనిపోయిరి నిలయమునకుఁ ♦ గోదండధరా. ౨౫౮
ఆ॥ కల్గఁబోలు రామ ♦ కారుణ్య మెదలోన, నెపుడొ వీతిఁదెచ్చి ♦ యెదుటఁ బెట్టి
పోయిరంత నిదురఁ ♦ బోయినవార్లేచి, నట్ల లేచిరయ్య ♦ యఖిలభటులు. ౨౫౯
క॥ అందర మొకతరిఁ బ్రాణము, లొందితి మని యద్భుతంబు ♦ నొందుచు వీతిఁ
ముందరనిడికొని మనవా,రిందుల కరుదెంచినార ♦ లినకులతిలకా. ౨౬౦

—♦ రాముఁడు వాల్మీకిచేఁ గుశలవుల వృత్తాంతంబు వినుట ♦—

వ॥ ఇట్లు సుమంతుగ్రిం డెరిగించిన బాలురు తన పుత్రులుగా నెఱింగియు శ్రీరాముండు
వల్మీకభవుం గాంచి యిట్లనియె. ౨౬౧
చ॥ మునివర మత్స్వరూపమును ♦ బొంది బలాధికులై ధనుఃకళా
ఘనులగు వార లెవ్వరొకొ ♦ కానల నుండుట కేమి హేతువో
వినవిన మంత్రిమాటలకు ♦ విస్మయ మయ్యె దినేంద్రపుత్రిపా
వనిలవణారులే విశిఖ♦బాధల సుగ్రక్కిరటంచు వింటి నేఁ. ౨౬౨
క॥ వినఁగోరిక పొదలెను మది, వినిపింపుము వారి తెఱఁగు ♦ విశదముగా నో
మునినాథోత్తమ యన విని, యనియెఁ వల్మీకజన్ముఁ ♦ డా రామునితోఁ. ౨౬౩
క॥ సకలాంతర్యామివి నీ,వకళంకుఁడ వెఱుకలేక ♦ నడిగితె యైనన్
సకలముఁ జెప్పెద విను కౌ,తుకమొదవఁగ ననుచు మౌని♦ధూర్జటి పలికెన్. ౨౬౪
సీ॥ విను రామ మును లక్ష్మ♦ణునితోడ సీతను, నడవిలో డించిర♦మ్మనఁగలేదె
నీ యాజ్ఞఁదలనిడి ♦ నిర్దోషమైన సా,ధ్వినిఁ దమ్ముఁడడవిలో ♦ విడువలేదె
యప్పుడు వైదేహి♦యైదు నెలల గర్భ,మొందు టెరింగి నీ♦వుండలేదె
యొక్కతె యడవిలో ♦ దిక్కులేకను భీతి,నెంతయు వెక్కెక్కి ♦ యేడ్వఁగాదె
తే॥ అప్పు డింధనములకు నే ♦ నరుగుదెంచి, యామె యార్తనినాదంబు ♦ లాలకించి
యరిగి యంతయు నారసి ♦ యనునయించి, సాకితిని గాదె నా పర్ణ♦శాల నుంచి.
వ॥ మునికన్యలచేఁ బరమోపచారంబులఁ జేయింపుచుండ సకాలంబున నొక దివ్య
లగ్నమందు, ౨౬౫

క॥ భాసురతనులు దశాశా, భాసకు లగు సుతుల సీత ♦ పడసె నిరువురన్
జేసి తభిఖ్యాకరణము, వాసిగఁ గుశలవు లటంచు ♦ వసుధాధీశా. ౨౬౬

ఆ॥ శుక్లపక్షమందు ♦ శుభ్రాంశుడుంబోలె, వృద్ధినొందునట్టి ♦ పృథుకవరుల
కుక్తకాలమందు ♦ నుపనయనాదు లొనర్చినాఁడ విధిని ♦ నరవరేణ్యా. ౨౬౭

సీ॥ ఆరంగములతోడ ♦ నామ్నాయములు నాల్గుఁ, జదివించితిని రహ♦స్యములతోడ
వివరంబుగా ధను♦ర్వేద మాయుర్వేద,మును దెల్పినాఁడ నే ♦ నను వు మీర
శస్త్రాస్త్రవిద్యల ♦ జాలంధరీ విద్యఁ, జెప్పి ప్రవీణులఁ ♦ జేసినాఁడ
సంగీత విద్య నీ♦జగముల వీరితో, సాటిలేనట్టుల ♦ సలిపినాఁడ

తే॥ జాహ్నవీతీరగతనికుం♦జములయందు, వనులయందున సైకతా♦వనులయందుఁ
బాడునట్టుగఁ జేసి తా♦పాటవలన,బ్రోడులుఁ జిగిర్చెఁ జూడ న♦ద్భుతముఁగాఁగ.

ఆ॥ పాదరసమువంటి ♦ వారి మనీషకు, స్వాంతమందుఁ బెల్లు ♦ సంతసించి
శిరమునందు నాదు♦చెయిఁ జేర్చి చెప్పితి, నస్త్రములను దద్ర♦హస్యములను.

తే॥ షడ్జమధ్యమ గాంధార♦సరణులెల్ల, నెరిఁగి పాడుచు నుండఁగ ♦ నెల్ల జనులు
విస్మయంబును బొందిరీ♦ విధముఁదెలిసి,మత్కృతంబయి పరగు రా♦మాయణంబు.

క॥ పాడించితి మఱికొందరుఁ, బాడించిరి వీరు గాన ♦ పండిత బృందం
బోడించిరి తమకీర్తుల, నాడించిరి లోకమందు ♦ నంతట రామా. ౨౭౧

తే॥ వీరి వీణామృదంగాది ♦ వివిధవాద్య,ములకు వనపక్షులకునైన ♦ మోహనంబుఁ
గల్గుచుండు మనోహర♦ గానములకు, నక్కజం బందు చప్పతి ♦ యొక్కరేయి.

ఆ॥ వీరిఁ బ్రేమఁదనదు♦ వీటికిఁ గొంపోయి, గానరసముఁ జెవుల ♦ నానజేయుఁ
డంచు వేడఁ బాడి♦రయ్యె యే మందును, బాళి యపుడు మేనుఁ♦బాసియుండె.

వ॥ అప్పుడు వరుణుని బంధువులందరు బవిత్రింబును మధురంబును భవచ్చరిత్రా
కరంబగు గానరసాకూపారంబునన్ మునింగి దరిఁగానక యుండిరంత. ౨౭౪

క॥ సుధకన్న మధువుకన్నను, మధురంబై యున్న గాన♦మహితరసంబున్
వ్యధ లుడుగు నంచుఁ ద్రావిరి, బుధవినుతా తోయనాథ♦పుత్రులుఁ బత్నుల్.

క॥ వరుణుఁడుఁ బలుమారులు గా,నరసంబును గ్రోలి తన మ♦నంబునఁ గించి
త్పరితృప్తిఁ గొనక వారల, నిరువుర నిల్పుకొనెఁ బంప ♦ నిష్టములేకన్. ౨౭౬

తే॥ భోగలోలుపు లగుచు నీ పుత్రు లంబ, పాదపద్మము లయగారి ♦ నాదుపాద
ములను దలఁపక నందుండఁ ♦ బోయినాఁడ, వరుణపురవరమునకు నృ♦పాలచంద్ర.

చ॥ వరుణుఁడు నాకు భక్తిని స♦పర్య లొనర్చి మునీంద్ర వీర లె
వ్వరితనయుల్ వచింపు మని ♦ పల్కఁగ వారి విధంబుఁ దెల్పఁగా
నరుసముఁజెంది భూమితన♦యాసుతు లంచు నెరింగి కాంచనాం
బరములు హారముల్ నగలు ♦ బాలుర కిచ్చె నమేయవస్తువుల్. ౨౭౮

తే॥ వానిని గ్రహింప శంకించు ♦ వారలఁగని, దేవదత్తంబు లగుటచే ♦ నేవిధైనఁ
బుచ్చుకొనవచ్చునంటి నీ ♦ పుత్రులపుడు, బుచ్చికొనిరి మదుక్తుల ♦ బుద్ధినిల్పి.
సీ॥ అంతటఁ గృతిదైన ♦ యప్పతి నా తోడ, సీత నుద్దేశించి ♦ సిలుగు వడుచు
వల్మీకభవ నాదు ♦ పల్కులుగా రాఘవునితోడఁ దెల్పుమా ♦యనుచుఁ బలికెఁ
వినిపింతునే నవి ♦ వినుమవధానంబు, గను సీత పరమపా♦వన చరిత్రి
సాధ్వి రూపవయోభి♦జాత్యశీలోపేత, వీరపుత్రి గుణాఢ్య ♦ విమలపుణ్య
తే॥ కాన విడుచుట కర్హమె ♦ దాన నీకు, భానువంశావతంస బల్♦హానికాదె
పామరోక్తులు వినఁ బౌర♦పాటు నీదె, ధూర్తుఁడ వటండ్రు జను లప♦కీర్తిగాదె.
క॥ అనపాయిని నీ కెప్పుడు, విను సిద్ధులలోన సిద్ధి♦విమలు లగుదు రా
జనకాత్మజను స్మరించెడి, జను లది సాక్ష్యంబుఁగాదె ♦ చర్చింపంగన్. ౨౮౩
తే॥ పరమనీచులు గారులు ♦ నరచినంత, లోకపావని కద నీకు ♦ లోపమేమి
జానకీపదచింతన ♦ సలుపుజనులుఁ, దక్షణమ పొందుదురు సిద్ధిఁ ♦ దలఁపవలదె.
సీ॥ ఎల్లలోకంబుల ♦ కేదేవి సంకల్ప,మున జనిస్థితిలయం♦బులుఁ దనర్చు
నీశ్వరులకు నెప్పఁ ♦ డేదేవి కరుణచే ♦ నెల్లవ్యాపారంబు ♦ లెలమిఁగల్గు
నా దేవియే సీత ♦ యఖిలంబును దపింపఁ, జేయునదియును వ♦ర్షింపఁజేయు
నది మృత్యు వమృతంబు ♦ నస్మన్ముఖాశాధి,పతుల నన్యుల భవ♦పద్మభవుల
ఆ॥ సృష్టిసేయునదియు ♦ సీతయ సుమ నీకు, దానయోగమోక్ష ♦ తపములెల్ల
జానకియ యటంచు ♦ స్వాంతంబు నందున, నెరుఁగవే వచింప ♦ నెంతవాఁడ.
చ॥ నరవర యా సమస్త భువ♦నంబులకుం జనకుండ వాదు వా
ధరణిజఁ దల్లి కావునను ♦ దథ్యము క్షేమకరంబుగా దనా
దరమున నీవు వేరొక వి♦ధంబునఁ జూచుట సీత శుద్ధయం
చెరుఁగవె సర్వముం దెలియు ♦ నేలిక వీవు జగత్త్రియంబునన్. ౨౮౫
క॥ ప్రాణప్రియ యగు సతి న, జ్ఞానులు దూషించి రనుచు ♦ సర్వమెరిఁగియున్
గానల కంపుదురే యను,మాన ముడిగి యేలుకొనుట ♦ మర్యాదసుమా. ౨౮౬
వ॥ ఇట్లు వరుణుండుఁ దన పలుకులుగా వచింపు మనె, మఱియుఁ దక్కిన దిక్పతులు నట్ల నీతోఁ దెల్పుమని రింక వినుము. ౨౮౭
క॥ మును లమరులు గంధర్వులు, దనుజులు నెల్లరును నీడి♦తం బగు రామా
యణగానం బరుదుగ నీ, తనయులచే విని మహాము♦దముఁ గొనిరి హరీ. ౨౮౮
పంచచామరము॥ ప్రసన్నులై సురాసురల్ ♦ భవత్తనూజులం గరం
బు సంస్తుతించి రీ త్రిలోక♦ముల్ వయస్సురూపగా
న సద్గుణంబులన్ బ్రమోహ♦నంబుఁ జెందె మే ల్వారా
ళ్లాసంగి రార్యు లిచ్చి రప్పు♦డోజ దిక్పతుల్ సిరుల్, ౨౮౯

తే॥ ఒక్క రాముఁడుఁగలదియే♦ యుర్వి మున్ను, ముగురు రాములుఁగలదయ్యె♦ బుడమి నేడు
గామమూర్తియు మున్నొండుఁ♦గానుపించెఁ, జూచినామిప్పు నాల్గు నీ♦సుతుల కతన.
ఉ॥ అంతట రామచంద్ర భవ♦దాత్మజ శస్తయశః ప్రకాండమే
వింతగఁ బేర్కొనం బడుచు ♦ వెల్గుచునుండె విచారశీల నీ
యంతటి పండితుండు నన♦యస్థితి నిట్లు నెలంగ మేలె గో
రంతయు దుర్యశంబుఁ గన♦రాదిది యొక్కటి దప్ప నీయెడన్.
తే॥ జననిరాకుండఁగులశీల♦సంపఁదలను, మించు నాత్మజు లిటకు రా♦ ర్మేదినీశ ౨౯౧
సీతతో వారిఁ బిలిపించి ♦ చెలఁగియేలు, మఖిలజగములు గార్హస్థ్య♦మనుసరించి.
క॥ మృతిఁజెందిన సైనికులను, బ్రతికించెను సీత మఱల ♦ పావని యనుచున్
మతిఁ దోఁచె నమ్మకము వసు,మతిఁగల జనులకు సమీక♦మహిపతితులకున్. ౨౯౩
క॥ మాకందరకును సురలకు, లోకంబుల కెల్లఁ దెలియు ♦ లోపల నా సీ
తాకాంత శుద్ధ యనుచును, మీకందరి కెరుక భటులు♦మృతినొందుటచేన్. ౨౯౪
వ॥ ఇట్లు పల్కినంత. ౨౯౫

—♦ రామాజ్ఞచే లక్ష్మణుఁడు సీత కడ కరుగుట ♦—

తే॥ ఎంత సర్వజ్ఞుఁడయ్యుఁ దా♦నినకులుండుఁ, బుట్టుపుట్టువుచేతఁ బ్ర♦బోధితాత్ముఁ
డై నుతింపుచు మునికి జో♦హారుఁజేసి, పల్కె లక్ష్మణుఁగూర్చి తా♦పసవరేణ్య.
ఉ॥ తమ్ముఁడవేగఁ గాంచనర♦థమ్మునుగొంచు సుమంత్రిమంత్రియు
క్తమ్ముగ నేగి నా నుడులఁ ♦ దాపసవాక్యములన్ గరంబు చి
త్తమ్మలరంగ నేర్పునను ♦ దద్దయు రమ్మని బోధఁజేసి తో
డ్తెమ్మిటకుం దనూజుల వి♦దేహతనూభవ ధర్మచారిణిన్. ౨౯౬
వ॥ అనిన లక్ష్మణుం డిట్లనియె. ౨౯౭
సీ॥ అఖిల జగత్ప్రభు♦వగు నీదు సందేశ,మును శిరమున నిడి ♦ పోదు నిపుడ
పూర్వదోషంబుఁ దా♦బుద్ధిలో నిడుచు నా, యం దీర్ష్యనొందక ♦ హర్షమునను
దేవి తా వచ్చిన ♦ దేవ నా యీయాత్ర, సఫలంబు నొందును ♦ సంతసమగు
రాక తక్కిన నాదు♦రాక క్షమింపఁగ, వలె నంచు మ్రొక్కి త♦త్పాదములకు
తే॥ వెడలి మునిశిష్యుఁడును మంత్రి ♦ వెంటరాగ, నన్నయానతి మును చేసి♦నట్టిపాప
కృత్య మెదనుంచు వైదేహి♦ నెట్లనుగ్ర,హంబుఁగల దానిఁగాఁజేయ♦నగునొయంచు.
క॥ మతిమంతుఁ డిటుల మది నా, యతగతిఁ దలపోసి హర్ష♦మనుమానములో
జతఁగొన శ్రమనాశన మగు, క్షితిజాశ్రమపుణ్యభూమిఁ ♦ జేరి వినతుఁడై. ౩౦౦
తే॥ రామరామా యటంచు ని♦రంతరంబు, భక్తిచే వినువుఁగొనక ♦ పలుకుచున్న
భూమిజాకంఠరవమును♦బోల వినుచు, దుఃఖమెదలోనఁ గొరింప ♦ దూరమందు.

ఆ॥ తేరునుంచి వడిగ ♦ దిగి బాష్పసంరుద్ధ, నేత్రయుగళుఁ డగుచు ♦ నిటలమందుఁ
గేలుదోయి భక్తిఁగీ♦లించి పడియెఁ ద, త్పాదయుగళి మేను ♦ వడకుచుండ. ౩౦౨
వ॥ అంత సీతయు. ౩౦౩
తే॥ ప్రేమవిహ్వాల చిత్తయై ♦ వేగ లేవ, నెత్తి సౌమ్యుఁడ యీ వని♦ కేల వచ్చి
నాఁడ వాకలములుఁ దిను♦నరులు మాను, లుందు రిందున మీ రక్ష ణ♦ముండఁదగునె.
సీ॥ కుశలియే నాపతి♦కోసలనందనా గర్భశుక్తికి మౌక్తి♦కం బతండు
ముఖ్యంబుగా యశ♦మును గోరుచుండుఁ గ, ల్యాణగుణాంబుధి♦యారఘూత్త
ముఁడు నాయెడ రోష♦మును బొంద కఖిలభు, వనములచే నుతి♦వడయునుగద
యపకీర్తి భీతి న♦న్నడవికంపుటచేత, నమలయశం బందె ♦ నవనిలోన
తే॥ జచ్చియునుఁ గీర్తి విభునకు సంఘటింపఁ, జేయు నాకును గీర్తి సు♦స్థిరము విభుని
సన్నిధానంబు శీఘ్రంబ ♦ సంభవించు, మరది నిజ మిది యింకొక♦మాట వినుము.
ఆ॥ విడచెఁగాని నన్ను♦విభుఁడు నేసించుక, యైన విడువనెప్పు ♦ డతని మదిని
ననఘ ఫలము సాధ♦నాయత్తమా ఫల, వశము హేతు వనుట ♦ వలనుపడదు.
తే॥ మూఁడులోకాలఁ బాలించు ♦ పుత్రు శుభగుఁ
గన్నదియు నన్నధిక ప్రేమ ♦ గాంచు నదియు
నైన మా యత్త కౌసల్య ♦ నడుగ నేల
శల్యమాత్రావశిష్టయై ♦ జడత నుండు. ౩౦౭
క॥ మనభరతాదులుఁ గుశలులె, తనప్రాణము కన్న నన్ను ♦ దయనెక్కువగాఁ
గను పిన్నత్త సుమిత్రయు, మనఁగ్గలెనె సౌఖ్యముననను ♦ మరదీ చెపుమా. ౩౦౮
తే॥ అఖిల లోకంబులను గీర్తి ♦ నందఁ గోరి, వనికి నన్వాలెఁ బతి నిన్నుఁ♦బంపి నాఁడె
యొడయులకుదుస్త్యజంబైన♦దొకటికలదె, యాత్మయేవారలకొకప్పు♦డప్రియమగు.
వ॥ ఇట్లనేక విధంబులఁ బల్కుచున్న సీతంగాంచి లక్ష్మణుం డిట్లనియె. ౩౧౦

♦— లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞ నెఱిఁగించుట ♦—

క॥ తల్లీ క్షేమము సుమ నీ, వల్లభునకు మరదులకును ♦ భావుకమే మా
తల్లులకును గుశలము వా, రెల్లరు నాశీస్సు లిచ్చి ♦ రెంచుచు నెలమిన్. ౩౧౧
క॥ భరతుఁడు శత్రుఘ్నుండును, బరగించిరి నీకు భక్తి ♦ వందనశతముల్
గురువులు గురుపత్నులుఁ జే, సిరి యాశీఃపూర్వకముగ ♦ క్షేమప్రశ్నల్. ౩౧౨
క॥ అమ్మా నీ నాథుఁడు నిను, రమ్మని సెలవిచ్చెఁ గపట♦రహిత హృదయుఁడై
రమ్మా యెం దభిరతి లే, దమ్మా నీయందుఁ దప్ప ♦ నా రామునకున్. ౩౧౩
తే॥ ఆశ లతనికి శూన్యంబు♦లగుచుఁ దోచె, నాశ లతనికి శూన్యంబు♦లగుచుఁదోచె
నాశలనుగాంచి దుఃఖాన♦ నడలి మమ్ముఁ, గ్లేశమొనరించు దుఃఖాబ్ధిఁ♦గెడపుచుండు.

మ॥ మును నీవెప్డు వసించినట్టి నిలయంబుం గాంచి లేకున్కి నీ
వనయం బాతఁడుఁ గుందుచుండుఁ గడు ధన్యం బయ్యె వల్మీకజ
న్ముని పుణ్యాశ్రమ మస్మదీయ కథలన్ మోదంబునం జెప్పికొం
చును గాలంబును నీతఁ బుచ్చుట నటంచున్ బల్కుచుం జెప్పుడున్. ౩౧

తే॥ అమ్మ నీ పతి మాతోడ నడలు చనిన, పల్కులను విను మందుచేస్వామిచి
మందుఁగల భావమెట్టిదో యవనితనయ, సర్వమును నీక తెలియుని స్సంశయముగ

సీ॥ సర్వలోకంబులు సర్వేశ్వరేశ్వరుఁగా నన్నుఁ జెప్పు నీ త్మాతలమున
నే నదృష్టము హేతు వెవ్వారల కటంచు, గట్టిగ వచియింపఁ గలను సుంతు
సర్వవిధంబుల సకలకార్యములం ద, దృష్ట మెప్పు డనుసరించి నడుచు
సుఖదుఃఖములయందుఁ జూడ నదృష్టంబు, ననుసరింపనివార లవని లేరు

ఆ॥ హరధనుర్విభంగ మందుఁ, గైకమనోభ్రమణమునందు, జనక మరణమందు,
గహనగమనతావకహరణోదధిబంధ, నముల, రావణనిధ నమున మఱియు.

వ॥ వృక్షచరార్క్ష రక్షస్సహాయంబు లందుననుఁ, దావకలాభంబునందునను, బ్రతిజ్ఞా
సత్యత్వమందును, బంధుసందర్శనంబునందును, రాజ్యప్రాప్తియందును, మఱలఁ
బ్రియ వగు నీ వియోగమందునను, నని వారణం బగు కారణం బదృష్టంబ సుమ్మా,
యదృష్టం బిప్పుడు మన సంయోగంబున కనుకూలం బగుచున్నయది యెద్దానిచే
లోకోత్పత్తి లయంబులు, శ్రుతులు నన్యధా చేయఁబడినవో, యట్టి సమర్థం బగు
నదృష్టంబువలన లోకంబుల ననుసరించి నే ప్రథమకారణ మైతి, సమ్యక్ప్రతి
బోధకు లగు జను లదృష్టము ననుసరించి సుఖదుఃఖముల యెడ నిశ్చింత మెలంగు
చుందు రనుభవించినఁగాని యదృష్టంబు హరింప దది నీచే నరణ్యంబున నను
భవింపంబడె. నీయెడ వృద్ధినొందుచున్న యకారణం బగు స్నేహంబు లోకాదృష్టం
బులం ద్రోసి యాదరంబున నిన్నుఁ బిలిపింపుచున్నది. శంకితదోషుఁ డగుచు
స్నేహనైర్మల్యంబు కొఱకు ప్రయత్నించిన వాఁడు శుద్ధుఁడై పండితులచే నెప్పు
డాదరింపఁ బడుచుండు. మహనీయుల చరిత్రంబులఁ దెలియనేరక యీ లోకంబు
సర్వావస్థలయందు శుద్ధి విషయమై మనల నిందించి నశింపఁగల దిప్పుడు మన
కీర్తి యుజ్వలం బగుచున్నది. యనురాగము ప్రకాశింపుచున్నది. మన వంశంబు
లొప్పుచున్నవి, మన క్రియ లలరుచున్నవి. మనకీర్తిని గానము సేయువారు
మాననీయు లగుచున్నవారు. మన యందు భయభక్తులు గలవారు భవాంబుధిని
సంతరింపుచుందు రని జానకీ! నీ సద్గుణంబులచేఁ బ్రేమింపఁబడు శ్రీరామచంద్రుండు
నిను గూర్చి పల్కిన పల్కులు వింటివా? జాగుసేయక మనోహరుని పదపద్మం
బులఁ గనుటకుఁ ద్వరపడు మని మఱల నిట్లనియె. ౩౨

సీ॥ స్వర్ణాంబరంబులు స్వర్ణభూషణములుఁ, గడుమనోజ్ఞం బగు గంధ మంగ
రాగము నీకయి రామచంద్రుఁడు నమ్మ, కూర్చె నీ సంతుష్టి కొఱకు రథము

దాసీజనంబుతో ♦ దయ నంపె ఛత్రచామరములు గజములు ♦ హయములు నవియ
చూడుము ద్విజులచే ♦ సూతమాగధులచే, సంస్తూయమానవై ♦ సకలపౌర

తే॥ సుందరులు మ్రొక్కుచుండఁగ ♦ సురవధూటు, లుల్లమలరంగఁ బువ్వుముల్ ♦ జల్లుచుండ
నెల్లయోధులు నిన్భజి ♦ యింపుచుండ, దగిన వైభవములతోడఁ ♦ దరలిరమ్మ. ౩౧౯

మ॥ ధన మిమ్మా తగినట్లు బ్రాహ్మణులకున్ ♦ స్తంబేరమారూఢులై
తనయుల్ ముందుఁ జనంగఁ జిత్తమున మో ♦ దం బందుచున్ వెన్కరాఁ
గను నే నేగు మయోధ్య వంద జనముల్ ♦ గైవారముల్ సేయ నీ
వనుమానింపకు నాథుఁ గూడికొని బల్ ♦ హర్షంబుతో నుంటివేన్. ౩౨౦

ఉ॥ వచ్చిన రాజపత్నులుఁ ద ♦ పస్వుల భార్యలు గౌసలాదులున్
మెచ్చుచు డెందమందున న ♦ మేయముదంబునఁ జొక్కి వాద్యముల్
హెచ్చుగ మ్రోయఁగాఁ జెవుల ♦ కింపుగఁ బాడుచు నుత్సవంబు మీ
కచ్చపుఁ బచ్చకప్పురపు ♦ హారతు లిచ్చుచుఁ జేతు రందరున్. ౩౨౧

వ॥ ఇట్లు, ౩౨౨

తే॥ విభుని విజ్ఞప్తి నూర్మిళా ♦ విభునివలన, సీత విని యనె లక్ష్మణా! ♦ శ్రీరఘూద్వ
హునకు నపకీర్తిఁ జేయుదా ♦ నను యశంబుఁ, గలుగఁజేయ సమర్థను ♦ గాను నేను.

తే॥ స్వామికెన్నఁడు ధర్మార్థ ♦ కామములకు, నుపకరింపని నాచేత ♦ నొక ప్రయోజ
నంబు లేదది యట్లుండ ♦ నా విభుండుఁ, గద నిరంకుశుఁ డెటు నమ్మఁ ♦ గలరు మీరు.

మ॥ అనఘా మత్పతి చిత్తదోషములు ప్ర ♦ త్యక్షాపరోక్షంబులై
నను గల్యాణకులప్రసూత నగు నే ♦ నాల్కన్ మరందీ! వచిం
ప నొకప్డైన వివాహకాలమున రూ ♦ పంబేది నా చిత్త జీ
వనజం బందున నిల్చె దానిఁ జలియిం ♦ పన్ జేయ నే నెప్పుడున్. ౩౨౩

సీ॥ మరది వీరలు నా కు ♦ మారులు రామ తేజస్సంభవులు మహా ♦ సమరశూరు
లన్వయాంకురములు ♦ నస్త్రవిద్యావిశారదులు వీరల నను ♦ రాగ మొప్ప
జనకునియొద్దకుఁ ♦ గొనిపోయి లాలన, మునుఁ జేసి పాలింపుఁ ♦ డనువుమీర
నిచ్చటఁ దపము నే ♦ నెలమిఁజేయుచు రాము, నోజ ధ్యానింపుచు ♦ నుండుదాన

తే॥ పూజ్యపాదంబులకు నేను ♦ మ్రొక్కితనుము, మనుచు నత్తలఁ బ్రేమ నే ♦ మరువననుము
తోడికోడండ్ర స్నేహంబుఁ ♦ దొరగననుము, చీరరానందులకు నుపే ♦ క్షించి చనుము.

వ॥ ఇట్లు భూపుత్రి సౌమిత్రిం గాంచి పలికి పుత్రులతో నిట్లనియె. ౩౨౪

క॥ జనకుని సమీపమునకును, జనుఁ డర్భకులార మీరు ♦ సద్భక్తిమెయిన్
జనకుని శుశ్రూషలచేఁ, దనియింపఁగఁ జేయు డెపుడు ♦ దయమిముఁ గాచున్. ౩౨౫

ఆ॥ అనుచుఁ బల్కునట్టి ♦ యంబపల్కుల కిసు, మంతయిష్టపడని ♦ మాణవకులు
దాపసేంద్రునాజ్ఞ ♦ దాటలేక సుమిత్రి, పట్టితోడ నతని ♦ వజ్జఁ జనిరి. ౩౨౬

—♦ లక్ష్మణుఁడు సీతమాటలు రామునితోఁ జెప్పుట ♦—

వ॥ అంతట లక్ష్మణుం డీ మువ్వురతో నయోధ్యం బ్రవేశించి రామభద్రుఁడు సభ నలంకరించుట నెరింగి చని డెందంబున హర్ష శోకంబులుఁ బొదలఁ దత్పదంబుల కెరగి సీతావచనంబుల నెరింగించుటయు. ౩౩౦

ఉ॥ హా యని మూర్ఛ నొంది విభుఁ ♦ డంతటఁ దాఁ దెలివొంది సీత న
న్నాయని క్రోధ మూని యిటు ♦ వల్కెనె రానని లక్ష్మణుండ యా
రా యని వెచ్చనూర్చుచు బి♦తాన మఱేఁజని సీతఁగొంచు ర
మ్మా యని చెప్పుమాట విను♦మా యని తమ్మునితోడ నిట్లనెన్. ౩౩౧

సీ॥ గహనంబునఁ దపస్సుఁ♦గడుఁ జేసినను వేరు,గతి నీకు లేదని ♦ కడఁకఁ జెపుము
సతులకుఁ బతికన్నఁ♦గ్రతుభుక్కులైనను, సాటిగా రని శ్రుతుల్ ♦ సాటు ననుము
నీకోర్కెఁ దీర్పఁగ ♦ నే మునిప్రియ మగు, నడవికి నిన్నంపు ♦ డంపితనుము
మునిపత్నులను గాంచి ♦ పూజించితివికాన, నీదు కోరిక తీరెఁ♦గాదె యనుము

తే॥ నీవుకోరిన యట్టుల ♦ నెగడితనుము,దోషమును మోప నామీద♦దోష మనుము
సతికిజడుఁడైనను గతి♦పతియయనుము,హితుఁడు పతియైన వేర్చెప్ప♦నేలయనుము

క॥ కులసుందరు లెపుడే వ్రత,ముల నే తపములను దాన♦ముల నే సురపూ
జలను మ తేవియుఁ జేసిన, నిల నవి పతి సమ్మదమున♦కే కద యనుమా. ౩౩౩

క॥ అతివా యాగతపోజప, వ్రతదానాదికము నేనుఁ ♦ బరితుష్టిఁగొనన్
సతతము ఫలించు నే దే,వతయైన మదీయతుష్టిఁ ♦ బరితుష్టిఁ గొనున్. ౩౩౪

క॥ ఇది నిజ మని యనుమా మది, ముద మొందితి నీదు సుగుణ♦ములకే మున్నే
ముదితా యిప్పుడు వేరుగ, నిదమిత్థం బనుచుఁ జెప్ప♦నేలా యనుమా. ౩౩౫

క॥ లేదా నాయెడ స్నేహము, కాదా యపకీర్తి యింత ♦ కఠినతఁ జూపన్
వాదా నాతోడను విన,లేదా సతి నడత లెప్డు ♦ లేమా యనుమా. ౩౩౬

క॥ మేలా యిటువల్కుట న, న్నేలా ముందెరుఁగ వింత ♦ బేలతనము నీ
కేలా చాల్చాలిఁక ర,మ్మాలాపంబుల కిది సమ♦యంబె యనుమా. ౩౩౭

వ॥ ఇట్లు పల్కు జగత్ప్రభు వగు రామచంద్రుని సందేశంబు శిరంబున నిడి నమ్రుం డగుచు సీతానయనముం గూర్చి ప్రసన్నుండై పలికిన వాక్యంబుల సవినయంబుగ దేవితో మనవిఁజేసెద నని రాముని పదంబుల కెరగి రథారూఢుండై శీఘ్ర గమనంబున సీతాశ్రమంబున కరిగె నిట వామలూరుభవుండు స్మితాననుండై కుశలవులం గాంచి యిట్లనియె. ౩౩౮

క॥ మతిమంతులార వీణెను, శ్రుతిసేయుచు మధురగాన ♦ శోభితమై య
ద్భుతమైన రామ చరితము, శ్రుతులకు హితవుగను బాడి ♦ చూపుఁడు ప్రజ్ఞన్.

సీ॥ అనుటయు బాలకు ♦ లతిపవిత్రముఁ బుణ్య,దము మృదుపద చిత్రి♦తంబు నైన
రామాయణము బహు♦రాగయుక్తంబుగఁ, దాళమానంబులు ♦ దప్పకుండఁ

బాడి రందుకు ధర్మ♦పద్ధతులకు గురు, భక్తి భ్రాతృస్నేహ ♦ పతివ్రతాత్వ
ముల కిన భృత్య నీ♦తులకు రాఘవ కృతా, ధర్మప్రవర్తక♦ధ్వంసములకుఁ
గీ॥ గుతలమందునఁ గడు మెచ్చు♦కొనని నరులు, నభ్రతలమునఁ దలయూచ♦నట్టిసురలు
పరవశత నొందనట్టి కి♦న్నరులు సాల, భంజికలవలె నుండని♦ వారు లేరు. ౩౮౦
ఉ॥ భూపతు లా కకుత్థ్సకుల♦భూపతనూజుల గానపంచమా
లాపవిమోహితాత్ములు మి♦ళత్పులకాంగులు హర్ష బాష్ప ధా
రా పరిమోచకుల్ మునివ♦రా విను చిత్రితతుల్యులైరి యా
పాపల కిచ్చె రాముఁడు సు♦వర్ణము లొక్కొక లక్ష వేసఁగాన్. ౩౮౧
వ॥ అప్పుడు కుశలవులు వాల్మీకిం జూచి కించిత్కుటిలీకృతభ్రుకులై నవ్వు చిట్లనిరి.
తే॥ తాతగారీ మహీపతి ♦ దానమీయఁ, బూని యెంతటి యవినీతి♦ బుద్ధిఁదలఁచి
నాఁడొ చూచితిరే యిట్టి♦నాణెములకు, మోదమగునని యెంచెఁ గా♦బోలుమదిని.
ఆ॥ దానమును గొనంగఁ ♦ దగు బ్రాహ్మణుల కది, తగదు నిశ్చయం బి♦తరుల కెపుడు
దానమును గ్రహించు ♦ ధారుణీశుఁడు నిర,యంబునందుఁ గూలు♦నండ్రుగాదె.
క॥ అంబాజ్ఞ మే మిడిన రా, జ్యం బీతం డనుభవించు ♦ చహహా యీనా
ణెంబుల్ మా కిచ్చెడి డెం, దంబందున నీతఁ డేమి ♦ తలఁచినవాఁడో. ౩౮౫
వ॥ ఇట్లు పలుకుచున్న రాజపుత్రులం గాంచి సదయుండై మునీంద్రుండు నయకోవిదులార యీతండు మీ తండ్రిగా నెఱుంగుఁడన మాతృభక్తిచే వినిర్మలు లగు నా బాలురు సవినయంబునఁ దనపదంబులం బడిన వారి రాముండు దృఢంబుగఁ గౌఁగిలించుకొనియె, నా సభికులు మనోహరంబు లగు శ్రీరామపుత్రుల ముఖంబులం గాంచి జానకీపాతివ్రత్యంబు సాఫల్యంబునొందె నని సంతోషాంబునిధి నోలలాడుచుండి రనుటయు వాత్స్యాయన మునీంద్రుండు భుజంగవల్లభుం గాంచి సకలధర్మయుక్తంబగు శ్రీమద్రామాయణంబు విను తలంపున నిట్లనియె. ౩౮౬
క॥ ఫణికుల భూషణ రామా, యణ మే కాలమున నెందు ♦ కయి చెప్పఁబడెన్
బ్రణయంబునఁ జెపు మఘహర, చణ మం దే వర్ణనంబు ♦ సల్పఁగఁబడియెన్. ౩౮౭
వ॥ అని యడిగిన వాత్స్యాయన మునితల్లజునకు ఫణికులావతంసుం డిట్లనియె. ౩౮౮

—♦ శేషుండు వాత్స్యాయనునకు రామాయణమును సంగ్రహముగా నెఱింగించుట. ♦—

సీ॥ వినుమయ్య మునివర్య ♦ వినిపింతు నీ కది, తాలతమాలాది♦తరుయుతంబు
కేతకచంపక ♦ కింశుకమల్లికా, వ్రతతీసుమరజస్సు♦వాసితంబు
శారికాభ్రమరమ♦యూరశుకౌఘప,రభృతసత్కుల రావ♦రావితంబు
సర్వతోరమ్యంబు ♦ సకలమనోహ్లాద, కరవిహంగమజాల ♦ కలితమగుచుఁ
తే॥ బరగు వనమున కొకనాఁడు ♦ వామలూరు, భవుఁడు సనుదెంచి మన్మథ♦బాణవశతఁ
జొక్కి యన్యోన్యమునఁ బ్రేమ♦నుక్కుమిగిలి, కలసి క్రీడించుఁ గ్రౌంచయు♦గంబుఁ గనియె

ఆ॥ అంతనొక్క యెరుక ♦ యరుదెంచి యదయుఁడై, పలలభక్షణేచ్ఛ♦పక్షియుగము
నందుఁజూడ నంద♦మైన పోతుపులుంగు, బాణమునను నేలఁ ♦ బడఁగ నేసె. ౩౫౦

ఉ॥ అప్పుడుఁ గ్రౌంచి వ్యాధహత♦మైన పతిం గని పే రెలుంగునన్
దెప్పరమైన దుఃఖమునఁ ♦ దేకువచే విలపింపుచుండ లో
నుప్పతిలంగఁ గ్రోధము మ♦హోగ్రిత వల్మికసంభవుండు వే
యప్పుల నాచమించి మృగ♦హంతను గన్గొని తిట్టె నిట్టులన్. ౩౫౧

శ్లో॥ మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితం.

వ॥ ఇట్లు శపించుటయు, ౩౫౨

తే॥ ధాతృ లపుడు మాని ♦ శాపాక్షరంబులు, శ్లోకరూప మగుటఁ ♦ జూచి మదిని
విస్మయంబు నొంది ♦ వేయివిధాల న,య్యారె యనుచుఁ బొగడి ♦ రంద రతని.

మత్తకోకిల॥ స్వామి నీదగు శాపవాక్యము ♦ వాణి శ్లోకముఁ జేసె హా
యేమి దీని పసందు వహ్వారె ♦ యెల్లవారికి మోహనం
బై ముదంబును గొల్పుచున్న ద♦టంచు శిష్యులుఁ బల్కఁగా
వామలూరుభవుండు సమ్ముద♦వార్ధి మున్గెఁ దపోధనా. ౩౫౪

తే॥ అట్టియెడ నాత్మజులతోడ♦నబ్జభవుఁడు, వచ్చి వాల్మీకిఁగని యిచ్చ♦మెచ్చియనియె
ధన్యుఁడవు నీవ జటిలమూ♦ర్ధన్య నుతుల, వెలఁది నీ నోట శ్లోకంబు♦వెడలఁజేసె.

క॥ కావున రామాయణమును, నీ వతిమృదుమధుర వర్ణ♦నికరంబులకున్
దావలమై రమ్యం బగు, భావంబులుఁ గలుగునటుల ♦ వచియింపు మికన్. ౩౫౬

సీ॥ అందుచే నీ యశం ♦బమలమై కల్పాంత, మలరు నా వాణి నీ ♦ యాననంబు
నందున రామనా♦మాన్వితమై కడు,ధన్యత్వమును బొందుఁ♦దథ్య మిదియ
కామసంబంధాన్య♦కథ మనుజుల కతి, పాతకహేతువై ♦ పరగుచుండు
నక్షరాక్షరమున ♦ నఘుచుండు దేనిచే, దోషుల కెప్పుడు ♦ దోషహాని

తే॥ అట్టి రాముని చారిత్రి ♦ మఖిలలోక, విశ్రుతంబుగఁ జెప్పు మో ♦ విమలచరిత
యనుచు సకలామరులతోడ♦నబ్జభవుఁడు, జనియెఁబొగడుచుమునినిస్వ♦స్థానమునకు ౩౫౭

వ॥ అంత వాల్మీకిమహామునియు.

తే॥ అబ్జజుఁడు సెప్పినట్టి రా♦మాయణంబు, నెట్లు వచియింపనే స్తు ని♦ష్ఠమి సేతు
నంచుఁ జింతించి యాపగా♦ప్రాంతమందు, ధ్యానపరవశుఁ డై యుండు♦నవసరమున.

క॥ ఇందీవరదళ తనుఁ డర,విందాభాక్షుండు రామ♦విభుఁడు జటిల సం
క్రందను నిర్మలమానస, మందునఁ బొడసూపె లోన ♦ ననుకంపమెయిన్. ౩౬౦

వ॥ అప్పుడు. ౩౬౧

తే॥ భూతభవ్య భవత్కథ ♦ బుద్ధిదోచె, నధిక సంతోషభావంబు ♦ నధిగమించె
నతిమధురవృత్తపదముల♦నాశ్రయించె, యమికులాగ్రణి రామాయ♦ణమురచించె.

వ॥ అది బాలారణ్య కిష్కింధా సుందర యుద్ధోత్తరంబులను నారుకాండలచే నొప్పు నందలి కథాభాగంబు సంగ్రహంబుగ నెరిగింతు విను మని శేషుండు వాత్స్యాయనున కిట్లనియె. ౩౬౩

సీ॥ పుత్రేష్టి దశరథ♦భూనాథుఁ డొనరించి, పుత్రుల నలువురఁ ♦ బొందుటయును
గౌశికయాగంబుఁ ♦ గాచి రాముఁడు విల్లు, విఱిచి వైదేహినిఁ ♦ బెండ్లియగుట
పట్టాభిషేకక♦ల్పనమందఁ గైకచే, జనకజా లక్ష్మణ ♦ సహితుఁ డగుచు
వనికి రాముఁడు బంపఁ ♦ బడుటయు దశరథ, క్షితినేత స్వర్గంబుఁ ♦ జేరుటయును
తే॥ నన్నఁ బ్రార్థించి విఫలేష్టుఁ♦డగుచు నంది, గ్రామమున భరతుఁ డెయుంట♦కల్గియొప్పు
చుండెఁ శ్రావ్యంబుగా బాల♦కాండమనఘ, కడకవినుమయ్య యారణ్య♦కాండమింక.

వ॥ శ్రీరాముండు మున్యాశ్రమంబుల నివసింపుచుఁ గొంత కాలంబునకుఁ బంచవటినిఁ జేరుటయు నందు శూర్పణఖా నాసాకర్ణచ్ఛేదనంబు, ఖరదూషణ మథనంబును మారీచ నిధనంబును, రావణకృత సీతాపహరణంబును, సీతాన్వేషణంబును, గబంధ ప్రేక్షణంబును, బంపాగమనంబును, హనుమత్సంగమంబును గల్గి యరణ్యాకాండ తనరెఁ - దర్వాత సప్తతాళ ప్రభేదనంబును, వాలిహరణంబును, సుగ్రీవ రాజ్య ప్రదానంబును, వానరకృత సీతాన్వేషణంబును, సంపాతి దర్శనంబును, హనుమత్కృతాంబుధి లంఘనంబును గల్గి కిష్కింధాకాండ చెన్నుమీరె - సుందరకాండ సంగ్రహంబుగఁ జెప్పెద వినుము - పావనికృత ప్రతి గృహాన్వేషణంబును, సీతా దర్శన సంభాషణంబులును, వనభంగంబును మారుతి బంధనంబును, లంకా దహనంబును, వానర సంగతియు, రామాభిజ్ఞానదానంబును, సైన్య ప్రస్థానంబును, సముద్ర బంధనంబును, శుకసారణ సమాగమంబును, గల్గి సుందరంబై యుండు - యుద్ధకాండయందు సీతా సమాగమాదులు వర్ణితంబులు - నింక నుత్తరకాండంబున రామాగస్త్య సంవాదంబును, యజ్ఞ ప్రారంభంబును, సవనతురంగ పర్యటనంబును, బాపనాశన కరానేకరామ కథావర్ణనంబులుగల్గిచెన్నొందు నీషట్కాండ పరిమిత రామాయణంబు బ్రహ్మహత్యాదోషంబుల నడఁచు. దీని సంక్షేపంబుగ నీ కెరింగించితిఁ గాని యిదియిరువదినాల్గువేల శ్లోకంబులు గల్గి వినువారి మహాపాపంబుల నడఁపఁ జాలియుండు నని చెప్పుటయు వాత్స్యాయనుండు సంతుష్టాంతరంగుండై యావలివృత్తాంతంబు వచియింపు మన శేషుం డిట్లను. మునీంద్రా రాముండు బాలుర గానమాధుర్యంబునకు సంతసించి, సీతను స్మరింపుచు వారలఁ గౌఁగిలించుకొని యుత్సంగంబునఁ జేర్చి యానందంబునఁ జొక్కుచుండె వినుము. ౩౬౫

తే॥ అంత సౌమిత్రివచ్చి ధ♦రాత్మజాత, పాదములమీఁదఁ బడి రాఘ♦వప్రణోది
తంబు సర్వంబుఁ బ్రేమగ♦ద్గదవచస్సు, లలర వినయాన్వితుండయి♦పలుకుటయును.
ఆ॥ సీత మరదివలన ♦ శ్రీరాము సందేశ, మంతయును నెరింగి ♦ యనియె నిట్లు
రాముఁ డడవినుంచె♦రాఁదగదే రాము,స్మరణసేయు చాశ్ర♦మమున నుందు. ౩౬౭

వ॥ ఇట్లు నుడువు సీతనుడులు విని లక్ష్మణుం డిట్లనియె. 318

శా॥ అమ్మా సీత పతివ్రతామణివి నీ ♦ వన్యాంగనల్వోలె హా
యిమ్మార్గంబున వచియించెదే జగతిలో ♦ నెందైన సాధ్వీల్ పతుల్
త మ్మేమన్నను దప్పుగాఁ దలఁతురే ♦ తద్దుష్కృతం బెంతురే
రమ్మంచుం బలుమారు చెప్పె నిను వే ♦ రావమ్మ మా రాడకన్. 319

మ॥ ఇదిగో స్యందన మిందుఁగూర్చొనుము నీ ♦ వే సందియం బాత్మలోఁ
బొదలన్ జేయకు మంచుఁ బల్కఁ గ్రిధముం ♦ బోనాడి లోనం దగ్రియా
విమలా మానులకున్ సతీమణులకున్ ♦ బ్రేమంబునన్ మ్రొక్కి పో
యెద నే వీటి కటంచుఁ దా మరదితో ♦ నేగెన్ రథారూఢయై. 320

తే॥ అర్హ్యజాంబూనదాభర♦ణాంచిత యగు, సీత గ్రమముగ నిట్లు సా♦కేతపురముఁ
జేరి శ్రీరామపదసర♦సీరుహముల, వ్రాలె లజ్జయు దుఃఖంబుఁ ♦ గ్రాల మదిని.

ఆ॥ ప్రేమవిహ్వలాత్మఁ ♦ బ్రేయసిఁ గన్గొని, హర్షమునను రాముఁ♦డనియె నిట్లు
సాధ్వి వినుము యజ్ఞ♦సంపూర్తి సీతోడఁ, జేతు నిపుడుఁ గనక♦సీత విడచి. 321

క॥ అంతట వాల్మీకికి న,త్యంత ముదంబునను మ్రొక్కి ♦ యవనీసుత దా
నెంతయు భక్తిని మునులకుఁ, గాంతల కెల్లరకు నోలిఁ♦గావించె నతుల్. 323

సీ॥ అత్త కౌసల్యకు ♦ నభివందనముఁ జేసి, యామెచే నాశీస్సు ♦ లంది కైక
పాదంబులకు మ్రొక్కి ♦ భర్త్రాసహా సుచిరం, జీవ యటంచు నా♦శీస్సు వడసి
మ్రొక్కి సుమిత్రకుఁ ♦ బుత్రపౌత్రులతోడ, మను మని యామెదీ♦వెనలఁగాంచి
యత్తలకెల్లర ♦ కతిభక్తిమ్రొక్కి యా,శీర్వచనంబులఁ♦ జెంది మోద

తే॥ మలర రాముని సన్నిధి♦ నిలచియున్న, కుంభిసీసుతఁ గని కుంభ♦సంభవుండు,
స్వర్ణమయసీత నెడఁద్రోసి♦జనకసుతను,బీఠమునఁజేర్చె నందఱుఁ♦బ్రియముఁజెంద.

క॥ అప్పుడు రఘుకుల తిలకుం,డొప్పె సతారాహిమాంశు, ♦ నోజ మునీంద్రుల్,
దప్పక సకాలమందునఁ, జొప్పడఁ గ్రతుకృత్యమునకుఁ ♦ జొచ్చిరి పెలుచన్.

తే॥ ధర్మచారిణి యగు భూమి♦తనయతోడ, యజ్ఞ మొనరించు శ్రీరాము ♦ నఖిలజనులు
గన్నులకుఁ బండు వగునట్లు ♦గాంచుచెలమి, మోదవారిధిలోపల♦ మునిఁగి రపుడు.

వ॥ అట్టియెడ రామచంద్రుండు వసిష్ఠుం గాంచి యిట్లనియె. 328

ఆ॥ మునికులావతంస ♦ మఁ యిం ంచుఁ జేయం దగు, కృత్యమెదియొ దాని ♦ నెరుఁగఁజేయు
మయ్య యనినఁదాప♦సాగ్రగణ్యుండౌ వ,సిష్ఠుడనియె నృపవ♦రిష్ఠుఁడలర. 329

సీ॥ వినుమయ్య రాఘువ ♦ ముని మరుత్తక్షితి, పాలుఁడు జన్నంబుఁ♦ బరగఁజేసి
విప్రుల కిచ్చిన ♦ విత్తంబు వార్మోయఁ, జాలక నీహార ♦ శైలసవిధ
భూమిరాసులు గాగఁ♦బోసి మోసినయంత, మూటలఁ గట్టక ♦ మురువుమీరఁ
బోయి రా తీరున ♦ భూదేవుల సపర్యఁ, దన్పి యనంత వి♦త్తములవారు

తే॥ సంతసము నొంద నిమ్ము ర♦సాతలేశ, నీవు శ్రీమంతుఁడవు కాన ♦ నిఖిలదాన
ములనొసంగు మటంచు నా♦మునివచింప, విని నృపాగ్రణి హర్షసం♦వీతుఁడగుచు.
వ॥ మునివర్యుండు వసిష్ఠుఁడే ప్రథమ సం♦పూజ్యుం డటం చా తపో
ధను రత్నంబుల స్వర్ణభారముల చే♦తన్ హర్షపాత్రంబులై
జనసంవీతములైన దేశములఁ ద♦జ్జాయా సమేతంబుగాఁ
దనియం జేసి యగస్త్యు నాతనిసతిన్ ♦ దన్పెన్ నృపుం డట్టులన్. ౩౮౦
కల్యాణి॥ వ్యాసుని సత్యవతీసుతు నట్ల స♦పర్యల సంతసమొందు నటుల్
చేసి సభార్యునిఁ జ్యవన మునీంద్రునిఁ ♦ జిత్తము రంజిల రత్నములన్
జేసి ముదాత్ముని ఋత్విజుల న్గడు ♦ శిష్టుల మానుల స్వర్ణములన్
భాసుర రత్నము లర్పణఁజే♦యుచు, భక్తినిఁ జేసె నమస్కృతులన్. ౩౮౧
వ॥ మఱియును. ౩౮౨

—♦ సీతారాములు రాజ దంపతులతో సరయూనదికిఁ బోవుట ♦—

సీ॥ ఒక్కొక్క విప్రున ♦ కొక్కొకలక్ష చొ,ప్పున సువర్ణంబుల ♦ భూరిదక్షి
ణలొసంగి కృపణదీ♦నజన పంగ్వంధుల, కెల్లర కర్థంబుఁ ♦ గొల్లవెట్టి
పసమించు చేలంబు♦ లొసఁగి వారల నెల్ల, భోజనంబులఁ దృప్తి ♦ నొందఁజేసి
దానంబులెల్ల య♦థాశాస్త్రముగఁజేసి, పురజనములఁదుష్టి ♦ నొందఁ జేసి
తే॥ ఇట్లు సర్వస్వమును దాన♦మిచ్చు రామ,భద్రుఁ బొడగాంచి కుంభసం♦భవుఁడు సంత
సించి మధురోదకం బభి♦షేకమునకుఁ, దెండటంచును నృపులకుఁ♦ దెల్పెనంత.
వ॥ అరుంధతీవిభుని యానతి శాతకుంభమయ కుంభంబులఁ గైకొని సీతతో రాముం
డును, నూర్మిళాయుతుండై లక్ష్మణుండును, మాండవీ సహితుండై భరతుండును,
శ్రుతకీర్తిసనాథుండై శత్రుఘ్నుండును, గోమలాయుక్తుండై లక్ష్మీనిధియు, సనంగసేన
తో రిపుతాపుండును, మహామూర్తితో విభీషణుండును, బ్రీతితోఁ బ్రతాపాగ్ర్యుం
డును, గామగమతో సుగ్రీవుండును, సధిరమ్యతో నీలరత్న నృపాలుండును, సుమ
నోహారిణితో సురథుండును, మోహనతోఁ గపియును నిట్లిరువది నల్గురు దంపతులు
సరయూనదికిం జని రప్పుడు వసిష్ఠుండు వేదమంత్రంబులచే జలం బభిమంత్రించి
యిట్లనియె. ౩౮౪
తే॥ అఖిలలోకైకరక్షకుఁ ♦ డైన రఘువ,రాన్వయేశుని యజ్ఞార్థ ♦ మై తురంగ
రత్నముఁ బవిత్రముగను నీ♦రంబు సేయు, మా మనోహరమా సర్వ♦తోముఖమున.
క॥ ఈ విధమునఁ బల్కుచు నా, పావనజీవనముఁ గుంభ♦భవుఁడు స్పృశింపన్
భూవరులెల్లరుఁ బట్టపు, దేవులతో జలము వట్టి ♦ తెచ్చిరి వరుసన్. ౩౮౬
వ॥ అప్పుడు రామచంద్రుండును సీతాసమేతుండై సువర్ణకలశంబుతో నుదకంబు
గ్రహించి యజ్ఞశాలకేతెంచి యగస్త్యప్రేరితుండై హయంబును శయంబున
స్పృశింపుచు నిట్లనియె. ౩౮౭

తే॥ బ్రహ్మబ్రహ్మండాధ్యక్షా నీ సవనమునందు, నో తురంగమ నన్నుఁబునీతుఁగాఁగఁ
జేయుమా నీదు మేధంబుచే సమస్త, దేవతలు దృప్తి ముదము నొందెదరుగాక.

వ॥ అని పల్కుచుండ.

ఉ॥ బాడబులెల్ల దాని విని ♦ బాపురె యద్భుత మిద్ది పాపముల్
బాడగు నే రఘూద్వహుని ♦ పావననామముఁ బల్కినంతలో
నే డిటుచూడు డిట్టి యవనీతన ♦ యాధవుఁ డెట్లు వల్కుచు
న్నాఁడని పల్కి రప్డు ముని ♦ నాథ పరస్పర మద్భుతాత్ములై. ౩౯౦

—♦ సవనహయ పూర్వజన్మ వృత్తాంతము. ♦—

వ॥ అప్పుడు.

సీ॥ వీతిని గూర్చి భూ ♦ నేత యీరీతినిఁ, బల్కుచుండఁగఁ గుంభ ♦ భవుఁడుఁ గత్తి
మంత్రించి యిచ్చిన ♦ మనుకులోత్తముఁ డది, కరమున ధరియించి ♦ హరి స్పృశించె
నంతలోఁదురగంబు ♦ వింతగఁ దన పశు, త్వము వీడి దివ్యరూ ♦ పము వహించె
నప్పు డొక్క విమాన ♦ మఖిలమణిప్రభా, భాసురంబగుచు న ♦ భ్రమునఁ దోఁచె

తే॥ నంత నతఁ డా విమాన మం ♦ దధివసించెఁ, దనగళంబున వైజయం ♦ తిని ధరించె
నచ్చరలపిండు చామర ♦ లంది వీచె, నందరికి నది యద్భుతం ♦ బగుచుఁదోఁచె.

ఉ॥ అంతట దివ్యరూపధరుఁ ♦ డైన జను న్గని యా సభాసదుల్
స్వాంతమునందు విస్మయము ♦ నందుచు నుండ రఘూద్వహుండు వృ
త్తాంతముఁ దా నెరింగియును ♦ దద్దయు నెల్ల రెరుంగునట్టు లా
కంతునిఁబోలు సుందరుని ♦ గాంచి వచించె మృదూక్తు లిట్టులన్. ౩౯౧

చ॥ ఎవఁడవు నీవు పూర్వమున ♦ నెట్టి యఘంబున వీతి రూపమా
భవమును గాంచి తీ విపుడు ♦ భవ్యశరీరముఁ బొందినా వహో
వివరముగాగ నీ విధము ♦ వే వచియింపు మటంచుఁ బల్క నా
దివిజుఁడు రామచంద్రనృప ♦ తిన్ గని పల్కె స్మితంబొనర్చుచున్. ౩౯౨

క॥ వెలుపల లోపల నంతట, మెలఁగెడి పరమాత్మ నీవు ♦ మేదినిలోనన్
దెలియనిది కలదె యయినన్, దెలిపెదఁ దెలుపుమని కోరితివి కావున నేన్. ౩౯౩

సీ॥ జనవర వినుము నే ♦ మునుపటిభవమునఁ, బరమధార్మికుఁడనౌ ♦ బ్రాహ్మణుండఁ
బ్రతికూలతను జరిం ♦ చితి శ్రుతులకు నొక, ప్పుడు సహకారాది ♦ భూరుహముల
చేత నొప్పుచు నున్న ♦ ధూతపాపానదీ, తీరంబుఁజేరి త ♦ త్తీర్థమందు
విధ్యుక్తముగ మున్గి ♦ పితృతర్పణములను, దానాల విప్రులఁ ♦ దనియఁజేసి

తే॥ వేదసమ్మతమైనట్టి ♦ నీదు ధ్యాన, మేనుజేయుచు నుంటి నో ♦ యినకులేశ
యప్పుడు గణింపఁగా రాని ♦ యఖిలజనులు, వచ్చిరెల్లర వంచింప ♦ నిచ్చ నెంచి.

మ॥ క్రతుసంభారము లెల్లఁ గూర్చితిని యం♦గంబందునన్ బూదిఁ బూ
సితి బొల్లెన్నియొ పెట్టితిన్ చషకముల్ ♦ చిత్రాంబరా లందు నుం
చితిఁ గృష్ణాజిన మందు నుండి యట శో♦చిష్కేశు స్థాపించి యో
క్షితిపా కృత్రిమ సోమయాజి నయితిన్ ♦ జితాక్రృతిం దాల్చుచున్. ౩౯౭

వ॥ ఇట్లు దంభంబు మూర్తీభవించిన చందంబునఁ గన్నులు మూసి, యెదియో గొణిగి
కొనుచు నుంటి నగ్నిహోత్రధూమం బాకసంబంతయుం గప్పుచుండె నప్పుడు.

క॥ ధరణీ తలమున స్వేచ్ఛగఁ, దిరుఁగుచు దూర్వాసుఁ డమిత♦తేజుఁడు నదికిన్
బరతెంచి డాంబికుని ముని, వరువిధమున నున్న నన్నుఁ ♦ బరికించి యనెన్. ౪౦౦

తే॥ అర్ఘ్య మీయక మదముచే♦స్వాగతం బ, నాకయుంటివి కనులఁగా♦నవుర మూఢ
యనుచుఁ బర్వాబ్ధి వడువున♦నాగ్రహంబు, గదుర యిట్లని శపియించెఁ♦గడక నన్ను.

ఉ॥ ఓరి దురాత్మ నీ విచట ♦ నోమిన దంతయు దంభమయ్యెనే
న్యోరన చీ పశుత్వమును ♦ బొందు మటంచు శపించె నంతనే
నో రఘువర్య యారటము ♦ నొందుచు వే మునిఁ జేరి మ్రొక్కి నే
నేరక తప్పొనర్చితిని ♦ నేరము లెంచకు మంచు వేడితిన్. ౪౦౨

తే॥ అంత దూర్వాసుఁడాగ్రహం♦బడచి యిట్లు,పలికె నో ద్విజ శ్రీరామ♦భద్రసవన
మందుఁ దురగంబ వగుము త♦ద్ధస్తసంగ,మునను సురదుర్లభంబైన♦ముక్తిఁ గనుము.

వ॥ ఇట్లు వలికి దూర్వాసుండు యథేచ్ఛం జనియె. ౪౦౪

సీ॥ రామ నేటికి సుదు♦ర్లభమైన నీ కర, స్పర్శచేఁ దురగభ♦వంబు దొలఁగె
నినవంశపావన ♦ నినుఁ గనుంగొనుటచే, బహుభవార్జిత మగు♦పాప మడఁగె
నీ ప్రసాదంబున ♦ నిఖిల మోహనమైన, యీ దివ్యమౌ రూప♦మెలమిఁబరగెఁ
బుట్టువుఁ జావును ♦ ముదిమి వ్యాధులు లేని, శాశ్వత స్థానంబుఁ ♦ జనగఁగలిగె

తే॥ ననుచు వచియించి రాఘవు♦నాజ్ఞఁ గాంచి,మానులకు రాఘవునకు న♦మస్కరించి
యందరును జూడఁ బుష్పక♦మధివసించి, చనియెఁ బరమపదంబు తో♦షమున మించి.

క॥ మునులెల్లరుఁ దద్వాక్యము,ల, విని రఘుకులతిలకుఁ డాది♦విష్ణు వటంచున్,
మనమున నెరుఁగుచు హర్షం,బునఁ బొంగుచు విస్మయంబుఁ ♦ బొందిరి మదిలోన్.

క॥ ఓ వసుధానిర్జరవర, యే వడువున దంభమునను ♦ నెద దైత్యద్వి
ట్పావనరూపముఁ దలఁచినఁ, బావనుఁడై జనుఁడు ముక్తిఁ ♦ బడయును వింటే.

ఆ॥ దంభరహితభక్తి ♦ జంభఘ్ననుతు రాము, స్వాంతమునఁ దలంచు ♦ సజ్జనుండు,
మోక్షమొందు ననుచు ♦ మునివర్య వేరుగఁ,జెప్పనేల ముక్తి ♦ చేత నుండు. ౪౦౮

క॥ సురలకు మునులకు నేరికి, దొరకని కైవల్యపదము ♦ దొరికెను హరికిన్
ధరణీసుర యెట్లయినను బరమును, గోర్వాఁడు హరిని ♦ భజియింపవలెన్. ౪౦౯

వ॥ ఇట్లు శ్రీరామ కరస్పర్శంబున హయరూపుం డగు భూసురుం డమరావతిం జేరునంత రాముండు వేదవిద్వర్యుం డగు నరుంధతీవల్లభుం గాంచి యిట్లనియె. ౪౧౦

క॥ తాపసకుల భూషణ హరి, గోపురమును జేరెఁ గ్రతువు ♦ కొనసాగుట యె
ట్లే పగిదిఁ దృప్తిఁజేయఁగ నోపుదు దేవతల,హోమ ♦ మొనరించు టెటో. ౪౧౧

తే॥ విధియుతంబుగ నిది నెర♦వేరునట్లు, చేయుఁ డయలార యన సునా♦సీర ముఖ్య
దేవహృదయ పరిజ్ఞాన ♦ కోవిదుం డ,రుంధతీనాథుఁ డనె భూవ♦రుండు వినఁగ.

ఆ॥ కప్పురంబు వేగఁ♦దెప్పింపు మనఘ సం,తృప్తిఁగందు రఖిల ♦ దివిషదులు మ
దాజ్ఞ దానిచేత ♦ ననిన రామాజ్ఞచేఁ, గప్పురంబు నిడిరి ♦ కుప్పగాఁగ. ౪౧౩

క॥ అంత వసిష్ఠ మునీంద్రుఁడు, స్వాంతంబునఁ బొంగి సురల ♦ నాహ్వానింపన్
సంతసమున వారందరు, బంతులుఁ దీరిచిరి వచ్చి♦పరివారముతోన్. ౪౧౪

సీ॥ పురుహూతుఁ డా రామ ♦ భూపతి విధిని నర్పించు కర్పూరహ♦విస్సుఁ బ్రేమ
భుజియించి తృప్తిని♦బొందియు మఱలఁ గో,రుచునుండె బల్దాని♦రుచిని మఱిగి
నారాయణుఁడు మహా♦నటుఁడు విరించియు,వైవస్వతాదిది♦క్పాలకులును
స్నిగ్ధమై ముని పరి♦ష్కృతమైన హవిని క్షు,ధార్తులు వోలెఁ దా♦మనుభవించి,

తే॥ తృప్తినొందుచు ముదమున ♦ దివురఁజేసి, ఘటభవప్రేరకుండయి ♦ హ్మాధినేత
చేయఁదగు కృత్యముల నెల్లఁ♦జేసి దాన,ముల హవిస్సుల ద్విజుల బు♦ధులను దన్పె.

ఆ॥ స్వీయభాగములను ♦ స్వీకరించి సుపర్వు, లలరి స్వాలయముల ♦ కరిగి రంత
ఋత్విజులకు రాముఁ♦డిచ్చె రాజ్యము నలు,దిశల నిడిరి వారు ♦ దీవెనలను.

—•♦ శ్రీరాముఁ డవభృథ స్నానం బొనర్చుట ♦—

మ॥ మునివర్యుం డగు నా వసిష్ఠుఁడు విధిన్♦బూర్ణాహుతిన్ జేసి శ్రీ
జనముం జూచి వచించెఁ బూర్తిఁగనె నీ♦జన్నంబు మీ రిప్డు డీ
యినవంశోత్తము మంగళాస్పదములౌ ♦ కృత్యంబులన్ వృద్ధిఁ గాం
చునటుల్ సేయుఁ డటన్న శోభనమటం♦చు న్వారు స్మేరాస్యలై. ౪౧౬

క॥ శోభనము రామ విభునకు, శోభన మఖిలైక వినుత ♦ శుభచరితునకున్
శోభనము కలుష హరునకు, శోభనము విదేహరాజ♦సుత కజనుతకున్. ౪౧౭

వ॥ ఇట్లు పాడుచు కర్పూరహారతు లిచ్చి. ౪౧౮

క॥ సౌందర్యాతితిరస్కృత, కందర్పుని రామచంద్రుఁ ♦ గౌస్తుభ భూషున్
సుందరు లందరు లాజలు, *చందముగ శుభాక్షతలను ♦ జల్లిరి వరుసన్. ౪౨౦

సీ॥ అంత రాముఁడు వసి♦ష్ఠానుమతిన్ స్వీయ,జనములతోఁ బద♦చారులైన
రాజకోటులు గొల్వ♦ రాణితో నవభృథ,స్నానార్థమై పుణ్య♦సరయువునకుఁ
జనుచుండ నక్షత్ర ♦ సహితుఁడైన తుషార,కిరణుఁడు వోలె బ♦ల్మెరయుచుండె
నా యుత్సవ మెఱింగి ♦ యఖిలలోకులు సత్వ,రంబుగ వచ్చి భా♦ర్యాసమేతు

* చందముగ = ఒప్పుగ.

తే॥ రామచంద్రుని ముఖతామ♦రసముఁగనుల, పండువుగఁగాంచి జన్మ సా♦ఫల్యమయ్యె
నంచు మదినెంచి పులకించి♦యనుగమించి, మంచిసమయంబటంచుఁద♦లంచిరపుడు.

ఆ॥ అఖిలలోకవంద్యుఁ♦డైన శ్రీరాముని, స్వాంత మలర వేశ్య ♦ లభినయించు
చాడు చరిగి రప్పు ♦ డఖిల గంధర్వులు, బాడుచరిగి రా స్త్రి♦వంతిఁ జేర. ౮౨౨

క॥ కొమ్మలు కొందరు వేడుకఁ, జిమ్మనగొ్రవులను నీరు ♦ సిందూరంబుల్
*బమ్మెచు శ్రీరామునిపైఁ, జిమ్మిరి యానవములందుఁ ♦ జిరునవ్వొలయన్.

క॥ కొందరు కుంకుమ పసుపు న, లందిరి దంపతుల మేను♦ల న్మెచ్చటగా
నందరుఁ బరస్పరము మేల్, చెందిరమును బూసికొనుచుఁ ♦ జెలఁగిరి పెలుచన్.

తే॥ కర్ణములఁ గుండలంబులు♦గదలుచుండ, సరులుఁ జన్నుల నాట్యంబు♦సలుపుచుండ
హాయిఁ బాడుచుఁ గప్రింపుటారతులను, రామలొసఁగిరి జానకీ♦రాఘవులకు.

క॥ నరనారులచే భూతల, మరుదుగ సంకీర్ణమగుచు ♦ నలరుచునుండెన్
సురనారులచే ఖతలం, బరుదుగ సంకీర్ణమగుచు ♦ నలరుచు నుండెన్. ౮౨౬

క॥ చరు లతి కఠినంబుగ భూ, చరులను నెడఁజేయుచుండ ♦ సంతోషమునన్
గురువరు నానతి రాముఁడు, బరమశుభోదకముఁ జేరె ♦ బరమర్షులతోన్. ౮౨౭

ఆ॥ రామవిభునితోడ ♦ రాజులందరు జనుల్ జానకీశపథర♦జః పవిత్ర
మై జనాభివినుత♦మగు సరయూనదీ, జలమునందు దిగిరి ♦ సతులతోడ. ౮౨౮

క॥ జలయంత్రింబులఁ గుంకుమ, గలపిన పన్నీరుఁ జేర్చి ♦ కౌతుకమున నా
రులుఁ బురుషులు వేర్వేరుగ, నలయింపుచుఁ జల్లులాడి ♦ రన్యోన్యంబున్. ౮౨౯

ఆ॥ భూమినాథుఁ డేటి ♦ పున్నెంపు తరఁగల, సీతతోడఁ దెప్పఁ♦జేరి క్రీడ
జేసి తరలెఁ దరికి ♦ జయ్యరు నాజ్ఞచే, నరుణనేత్రులైన ♦ నరులతోడ. ౮౩౦

సీ॥ కుండలమండిత ♦ గండతలుండు ర, త్నాంచిత వరకంక♦ణాన్వితుండు
కేయూర కనక కౌ♦శేయాంబరధరుండు, పంచేషుకోటిలా♦వణ్యమూర్తి
సకల రాజశ్రేష్ఠ♦సంస్తవనీయుఁడౌ, రామచంద్రుఁడు నదీ♦ప్రాంతమునను
కనకమయం బయి ♦ కాంతిచే మించు న, ధ్వరయూపమొక్కటి ♦ పరగ నుంచి

తే॥ భూపవరనిజబాహుదు♦రాపమైన యఖిలలోకాశ్రియశ్రీని♦నందె మఱియు
మిథిలసుతతోడ మూడశ్వ♦మేధములను, జేసి లోకాల వ్యాపింపఁ♦జేసె యశము.

వ॥ ఓ వాత్స్యాయన మునీంద్రా! నీ వడిగిన రామచంద్ర చరిత్రంబు సవిస్తరంబుగ
నెరింగించితి నింక నెది వినఁగోరి ప్రశ్నించెద వని యిట్లనియె. ౮౩౨

తే॥ భక్తిచే నెవ్వఁడీ రామ♦భద్రభద్ర, సచ్చరితామృతముఁ దన ♦ శ్రవణములను
ద్రావునో వాఁడుబ్రహ్మహ♦త్యలనడంచి, శాశ్వతబ్రహ్మపద మొందు♦క్షణములోన.

* బమ్మెచు = ఉంచుచు.

ఆ॥ నిర్ధనుండు పొందు ♦ నిఖిలసంపదల న,పుత్రకుండుఁ బడయుఁ ♦ బుత్త్రకులను,
రోగము క్తిఁజెందు ♦ రోగి,బద్ధుఁడు బంధ,ములను బాయు శ్రవణ♦మున మునీంద్ర.
తే॥ రామచంద్రుని సత్కథా♦శ్రవణమునను, శ్వపచుఁడైనను గాంచును♦బరమపదము,
భక్తిచే రాముని స్మరించు ♦ పరమపుణ్యు, క్షితిసురోత్తము నుడి వేర♦చెప్ప నేల.
క॥ ఇనకులతిలకుని నామము, మనమున స్మరియించునట్టి ♦ మనుజులు ధన్యుల్,
జని మృతి నెరుగని హరిపద,మును బొందఁగలార్గు వింటె ♦ మునికులవర్యా.
క॥ నిక్కము చరిత్ర నొక్కక్క, యక్కరమే బ్రహ్మహత్య ♦ నడఁగించును దా,
నొక్కపరి దీనిఁ బూర్తిగ, నెక్కువభక్తిని బఠింప ♦ నేగును దివికిన్. ౪౩౭
సీ॥ రాఘవుండు 'వనేచ♦రా మో' 'నదీ స్తరా,మో' 'వసు చాహరా♦మో' యటంచు
మఱి 'నభయంస్మరా♦మ' యటంచు నడవి కి,రాతులు పల్కుమా♦త్రమున విస్మ
యముదోప రామశ♦బ్దానుషంగంబున, వారలు సాలోక్య ♦ పదవినొందఁ
జేసెను, భక్తిచేఁ ♦ జిత్తంబులోన నె,రింగి యెప్పుడును స్మ♦రించువారి
తే॥ కరయ సాయుజ్య మిచ్చుట♦కరుదె మనుజ,మాత్రుఁడందురు మూఢులౌ♦మనుజులతని
తత్త్వమిసుమంతఁ దెలియరు♦ధరణిలోన, వినుమిఁకొక్కటిఁ దెలిపెద ♦ విబుధవర్య.
తే॥ రామ యను రెండువర్ణముల్♦రాగమెసఁగ, నెప్డుస్మరియించు మానవు♦లెంతపాపు
లైన ముక్తినిఁజెందెద♦రంతకన్న, వేరు ధర్మంబులను జేయ ♦ లేరు భువిని.
సీ॥ ప్రాజ్ఞుని వలన నీ♦పరమ పావనమైన, జనకజాధవుకథ ♦ విసఁగవలయు
విని సభార్యుని వాచ♦కుని గంధ తాంబూల,ముల భక్తితోఁ బూజ♦సలుపవలయుఁ
బూజించి తగ పాడి♦మొదవుల రెంటిని, హేమాంబరములతో ♦ నీయవలయు
నిచ్చి గాంగేయమ♦యోధ్యసీతా రామ, ప్రతిమలఁ బూజఁ దే♦ర్పంగవలయు
తే॥ తేర్చి యవి వారి కే యిచ్చి ♦ తీరవలయు, నిచ్చి భోజనముల వెల♦యింపవలయు
నిట్లు వెలయించి పదముల♦కెఱఁగవలయు, నెఱిగి తదనుమతిన్ భుజి♦యింపవలయు.
క॥ ఈ విధముగ నొనరింపఁగ, దేవతలెల్లరును బితృ♦దేవతలంద
ఱ్ఱావరు పరలోకంబే, తావలముగ నుందు రెపుడు ♦ తాపసవర్యా. ౪౪౧
క॥ మును నీ వడిగిన దంతయు, వినిపించితిఁ గాదె నీకు ♦ వివరము గాగన్
వినఁదగిన దింక నేమై, నను గలదే తెల్పుమయ్య ♦ నాకు మునీంద్రా. ౪౪౨
ఉ॥ తాపస బ్రహ్మహత్య దురి♦తంబును రూపరఁజేయు నీకథన్
వాపిరి విన్న మానవులు ♦ స్వఃపురవాసులుఁ జెంద రాని యా
శ్రీపతి లోక మొందుట వి♦చిత్రమె గోఘ్నులు మద్యపు ల్మహా
పాపులు పుత్రహంతకులు ♦ పావనతన్ గని ముక్తిఁ బొందెదర్. ౪౪౩
వ॥ ఇట్లు శేషుండు వాత్స్యాయనమునీంద్రునకు రామాశ్వమేధ కథ సర్వంబు సవిస్త
రంబుగ నెరిగించె. ౪౪౪

శా॥ కాండావిర్భవసంభవాదిసుమనః♦కాండార్చితా శాక్వరే
ట్కాండా కాండజనాథ కాండ యమరా♦ట్కాండాపహా తారకా
కాండాధీశ్వరశేఖరా భవ మహా♦కాండేశకాండా దినే
ట్కాండపోద్భవ కాండయోనినయనా ♦ కాకోదరేడ్భూషణా. ౪౪౫

మానినీ వృత్తము

కైరవ బాంధవశేఖర శ్రీకర ♦ కాలమదాపహ కాలగళా
శారద నీరద పారద నారద ♦ సారసతుల్య శరీరధరా
వారణ దానవకృత్తి ధరా పరి♦పాలితభక్త జనౌఘభవా
భూరి కృపాకర వైరివిభీకర♦భోగి విభూషణ మారహరా. ౪౪౬

మంగళమహాశ్రీ వృత్తము

నీలఘనదేహనుత ♦ నిత్యశుభమంగళము ♦ నీరధినిషంగ సురవంద్యా
హాలహాలకాలగళ ♦ హారిశుభమంగళము ♦ హాటకధరాధరసుచాపా
బాలహరిణాంకధర ♦ భవ్యశుభమంగళము ♦ భద్రిజుహురాణ భవభంగా
కాలహరదుష్టజన ♦ కాలశుభమంగళము ♦ గ్రావకులనాయక సుతేశా. ౪౪౭

గద్యము

ఇది శ్రీమద్గోర్త్యన్వయ పవిత్ర లక్ష్మీనారాయణార్యౌరసపుత్ర శ్రీ చింతలపాటి వంశ
క్షీరపారావారరాకాసుధాకరాయమాణ శ్రీ సూర్యనారాయణార్య దత్త
పుత్ర శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షాసమాసాదితానవద్యోభయ
కవిత్వ విద్యావధాన రామమూర్తిశాస్త్రి కవ్యభిధానప్రణీతంబైన
రామాశ్వమేధంబునందు
సర్వ మష్టమాశ్వాసము.

శ్రీరామాయ నమః.

# తప్పొప్పుల పట్టిక



## ప్రథమాశ్వాసము

| పుట | పఙ్క్తి | సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౨ | ౯ | ౯ | వాల్మకి | వాల్మీకి |
| ౪ | ౧౦ | ౨౬ | లోనఁగిదుఱ్ఱ | లోనకదుఱ్ఱ } దృతము కాదు ఏవకారార్థము |
| ౭ | ౧౭ | ౬౩ | హారహార | హారహీర |
| ౮ | ౧౮ | ౭౩ | లేదనుట | లేసనుట |
| ౯ | ౨౩ | ౮౩ | జూడు ననుచు | జూచుననుచు |
| ౧౨ | ౨ | ౧౦౪ | ఎల్లరికి | అల్లరికి |
| ౧౪ | ౫ | ౧౨౨ | దగ్గద | గద్దద |
| ౧౭ | ౧౪ | ౧౫౬ | బలిశాలి | బలశాలి |
| ౧౭ | ౩౦ | ౧౫౯ | కృరణాచంద్ర | కరణాచంద్రద |
| ౨౨ | ౨౪ | ౨౦౭ | సోదరులనుబలె | సోదరులనువలె |
| ౨౪ | ౧౪ | ౨౨౪ | స్మత్ప్రథమున | స్మత్ప్రదమున |

## ద్వితీయాశ్వాసము

| పుట | పఙ్క్తి | సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౩౦ | ౧౫ | ౩౧ | సుమ్మ్ము | సుమ్మ్రు |
| ౩౨ | ౧౪ | ౪౭ | పడఁతుల | పడంతుల |
| ౩౭ | ౧౫ | ౯౪ | స్తంభమిఁదు | స్తంభమిందు |
| ౩౯ | ౨౬ | ౧౧౭ | నిఱ | నిర |
| ౪౪ | ౬ | ౧౬౨ | యనుజ | యనుజు |
| ౪౭ | ౨౯ | ౧౯౭ | మాతఁడేఁగ్గె | మాతఁడేఁగ్గె |
| ౫౦ | ౨౫ | ౨౨౪ | నెనుచు | నెన్నుచు |
| ౫౨ | ౪ | ౨౩౫ | మెలఁగగా | మెలగంగ |
| ౫౩ | ౧౫ | ౨౪౭ | వెరపున | వెరపునను |
| ౫౮ | ౨౪ | ౩౦౨ | నిభాస్యమేలు | నిభాస్యయేలు |
| ౬౧ | ౧౭ | ౩౨౭ | కాఘూఘు | కాఘూఘు |
| ౬౩ | ౭ | ౩౪౭ | త త్రరంబున | త త్రీరంబున |
| ౬౩ | ౨౦ | ౩౫౧ | రాయమాణ | రాయమాన |

# తృతీయాశ్వాసము

| పుట | పఙ్క్తి | సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౬౫ | ౧౪ | ౧౩ | గలవె | గలమె |
| ౬౫ | ౨౨ | ౧౫ | నీలక్రియంబు | నీలీక్రియంబు |
| ౬౫ | ౨౪ | ౧౫ | పత్ని | స్త్రీని |
| ౭౪ | ౬ | ౧౦౩ | అన్నిట జక్కగ | అన్నిఁటిఁజక్కఁగ |
| ౭౫ | ౫ | ౧౧౨ | శిలాతులును | శిలాతతులు |
| ౭౫ | ౧౯ | ౧౧౬ | కువలయాక్షు | కువలయాక్షీ |
| ౭౬ | ౧ | ౧౨౦ | శాంతతా | శాంతులా |
| ౭౬ | ౮ | ౧౨౩ | యుండుబూర్తి | యుండుఁబూర్తి |
| ౭౬ | ౧౯ | ౧౨౭ | పుణాత్మ | పుణ్యాత్మ |
| ౭౬ | ౨౨ | ౧౨౮ | నెవాఁడుఁ | నెవ్వఁడుఁ |
| ౭౯ | ౧౮ | ౧౫౫ | బడిసి | బడసి |
| ౮౧ | ౧౮ | ౧౭౩ | దనుం | దనుఁ |
| ౮౧ | ౨౨ | ౧౯౩ | గన్నపట్టి | గన్నపట్టిఁ |
| ౮౧ | ౫౩ | ౧౭౩ | బూతులుం | బూతులఁ |
| ౮౫ | ౪ | ౨౨౦ | మత్థ్యబవై | మత్స్యంబవై |
| ౮౬ | ౧౦ | ౨౨౧ | ముల్ పాపుచుఁ | ముల్పాపుచుఁ |
| ౮౭ | ౧౯ | ౨౨౫ | వృతిని | వృతుని |
| ౮౯ | ౨౯ | ౨౪౮ | పగల్చు | పగుల్చు |
| ౯౦ | ౮ | ౨౫౦ | సన్మదురుచాప | నంబకాసన |
| ౯౦ | ౧౨ | ౨౫౧ | గూచిఁ | గూల్చి |
| ౯౧ | ౧౭ | ౨౬౨ | ననుఁడుక | ననుడుఁగ |
| ౯౧ | ౧౮ | ౨౬౨ | మడువులం | మడువుల |
| ౯౧ | ౧౯ | ౨౬౩ | రక్తంబు | రక్తంపు |
| ౯౧ | ౨౦ | ౨౬౩ | కనుపట్టె | కనుబట్టె |
| ౯౩ | ౨౦ | ౨౮౧ | బరగ | బగర |
| ౯౩ | ౨౨ | ౨౮౨ | వాతుమువాఁడ | వాతము లాఁడ |
| ౯౩ | ౨౬ | ౨౮౪ | బేతాళు | భేతాళు |
| ౯౫ | ౩ | ౨౯౯ | డాయుఁ | దాయుఁ |
| ౯౭ | ౨౩ | ౩౨౨ | తెలిపిజేసి | తెలిపిఁజేసి |
| ౯౭ | ౨౪ | ౩౨౩ | నదిఁ | నది |

| పుట | పఙ్క్తి | సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౧౦౦ | ౨౩ | ౩౫౧ | భామకాస్త్ర | భ్రామకాస్త్ర |
| ౧౦౧ | ౧ | ౩౫౩ | మస్పుత్ప | మాసాప |
| ౧౦౧ | ౫ | ౩౫౫ | భారతితో | భారతియుఁ |
| ౧౦౧ | ౨౧ | ౩౬౦ | దద్వ్యథాశ్రమం | ద్వ్యథాశ్రయం |
| ౧౦౩ | ౨౬ | ౩౭౦ | కెడలోని | కెదలోని |
| ౧౦౮ | ౫ | ౪౧౦ | మంతువు | మంతును |

## చతుర్థాశ్వాసము

| పుట | పఙ్క్తి | సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౧౦౭ | ౭ | ౬౪ | నేర్చిని | నేర్చిన |
| ౧౧౧ | ౧౭ | ౬ | అహిత | అవహిత |
| ౧౧౨ | ౨౪ | ౧౫ | పృచ్ఛ | పుచ్ఛ |
| ౧౧౫ | ౧౮ | ౩౮ | మొప్ప | మేమొ |
| ౧౩౩ | ౧౦ | ౨౧౫ | ముక్కుఁజె | ముక్కుంజె |
| ౧౪౦ | ౨౧ | ౨౭౨ | పుణ్యుఁడోక్కొ | పుణ్యుఁడొక్కొ |
| ౧౪౧ | ౨ | ౨౭౬ | పృదాకు | పృథాకు |
| ౧౪౧ | ౪ | ౨౭౬ | గన | గనె |
| ౧౪౩ | ౧౩ | ౩౧౦ | నాడు | నాదు |

## పంచమాశ్వాసము

| పుట | పఙ్క్తి | సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౧౪౬ | ౩౦ | ౧౩ | గాఁగ | గాఁక |
| ౧౫౭ | ౧౪ | ౧౩౧ | డపు | డపుడు |
| ౧౬౨ | ౮ | ౧౮౦ | డెపునా | డెప్డునా |
| ౧౮౨ | ౧౫ | ౨౮౮ | చరణా | శరణా |
| ౧౮౨ | ౨౨ | ౨౮౯ | మాణ | మాన |

## షష్ఠాశ్వాసము

| పుట | పఙ్క్తి | సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౧ | ౧౫ | ౪ | యుద్యానంబు | యుద్యానవనంబు |
| ౧౮౪ | ౨౫ | ౧౮ | దీవర | తీవర |
| ౧౭౩ | ౧ | ౯౫ | తులుగారు | తులుగాము |
| ౧౭౩ | ౧౮ | ౯౮ | నెరగుచు | నెఱగుచు |
| ౧౭౩ | ౩౧ | ౧౦౨ | జేయున దేది | జేయన దేది |

| పుట | పఙ్క్తి | సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౧౭౬ | ౧౩ | ౧౩౧ | రూఢిగ | రూడిగ |
| ౧౯౩ | ౩ | ౧౯౩ | పేరొ్గాన్న | పేర్గొన్న |
| ౧౯౬ | ౮ | ౨౨౮ | శరమున | శరమును |

## సప్తమాశ్వాసము

| | | | | |
|---|---|---|---|---|
| ౨౦౪ | ౧౮ | ౩౫ | బొందిి | బొంగి |
| ౨౧౨ | ౧౬ | ౧౩౦ | దలంగ | గలంగ |
| ౨౧౬ | ౨౨ | ౧౭౨ | వచు | వచ్చు |
| ౨౧౬ | ౨౨ | ౧౭౨ | నుడ్చి | నుడి |
| ౨౨౦ | ౫ | ౨౨౬ | గలదెప్డు | గలవెడ్డు |
| ౨౨౦ | ౧౩ | ౨౨౯ | యన్నను గాంచి | యన్నన్గాంచి |
| ౨౨౧ | ౨౯ | ౨౪౭ | దగ్ధ | దుగ్ధ |
| ౨౨౩ | ౨ | ౨౫౭ | విడచునె | విడచునే |
| ౨౨౩ | ౨౪ | ౨౬౭ | రాధ్యంబు | రాజ్యంబు |
| ౨౨౪ | ౩ | ౨౮౦ | సౌభద్రింబు | నౌభద్రింబు |
| ౨౨౪ | ౧౨ | ౨౮౩ | నినిట్లు | నిన్నిట్లు |
| ౨౨౪ | ౨౭ | ౨౮౭ | డుకా | డకా |

## అష్టమాశ్వాసము

| | | | | |
|---|---|---|---|---|
| ౨౩౨ | ౧౯ | ౪౪ | బైరవారి | భైరవారి |
| ౨౩౩ | ౧౭ | ౫౪ | నడుగడుగుల బరులె | నడగడుల బరుల్ |
| ౨౪౪ | ౧౯ | ౧౬౯ | డపు | డప్డు |
| ౨౪౪ | ౨౧ | ౧౮౦ | పృథ్వి | పృథ్విని |
| ౨౫౦ | ౧౪ | ౨౪౦ | లక్ష్మీనిధి | లక్ష్మీనిధి |
| ౨౬౨ | ౭ | ౩౬౪ | భరతుఁడె యుండుట | భరతుఁడుండుట |
| ౨౬౪ | ౨౮ | ౩౭౫ | నీరంబు | నీరంబ |
| ౨౬౭ | ౧౫ | ౪౨౭ | పథరజః | పదరజః |
| ౨౬౯ | ౨౨ | ౪౪౦ | నెఱిగి | నెఱగి |

